

# మహాభారతం

నైమిశారణ్యంలో ఋషిగణా లుండేవి. ఆ ఋషులకు కులపతి శౌనకమహాముని. ఆయన ఒకప్పుడు పన్నెండేళ్ళ పాటు జరిగే సత్రయాగం చేశాడు. అనేకమంది మహాఋషులు కలిసి ఆ యాగం చేస్తూండగా అక్కడికి రోమహర్షుడి కొడుకు ఉగ్రశ్రవసు డనే సూతుడు వచ్చాడు. సూతుడికి తెలియని పురాణగాథలు లేవు.

సూతుణ్ణి చూడగానే మునులందరూ అతని చుట్టూ మూగి, "నువు ఎక్కడి నుంచి వస్తున్నావు? నువు రావటం మా కెంతో సంతోషమయింది. నీ నుంచి మేము ఎన్నో పుణ్య కథలు వినవచ్చు," అన్నారు.

సూతుడు వారితో, "మహర్షులారా, పరీక్షితుడి కొడుకు జనమేజయుడు సర్పయాగం చేశాడు. ఆ సమయంలో వైశంపాయనుడు జనమేజయుడికి భారతకథలను చెప్పాడు. ఆ కథలను రాసినవాడు వైశంపాయనుడి గురువైన వేదవ్యాసుడే. నేనా కథలన్నీ విని, అనేక తీర్థాలు సేవించి, కౌరవ పాండవులు యుద్ధం చేసిన శమంతకపంచక మనే పుణ్యక్షేత్రానికి వెళ్ళి, అటు నుంచి ఇలా వచ్చాను," అన్నాడు

ఇంకేముందీ? వ్యాసుడు రచించిన భారతకథలను తమకు చెప్పమని సూతుణ్ణి శౌనకాది మహామునులు కోరారు.

సూతుడు వారితో ఇలా చెప్పాడు:

భారతరచన ఎలా జరిగిందనుకున్నారు? కృష్ణద్వైపాయను డనే పేరుగల వ్యాసుడు వేదాలను నాలుగుగా విభజించిన అనంతరం

## 1. పరీక్షిత్తు శాపం



హిమాలయాల మీద తపస్సు చేశాడు. ధృతరాష్ట్రుడితరం వారంతా చనిపోయాక భారతం ఆలోచించాడు. అది లోకానికంతకూ పఠనీయంగా ఉండేటట్టు చేసే మార్గ మేమిటా అని ఆలోచిస్తూండగా ఆయనను చూడటానికి బ్రహ్మ వచ్చాడు. వ్యాసుడు బ్రహ్మకు ప్రణామం చేసి, కూర్చోబెట్టి, "దేవా, నేను వేదవేదాంగాల సారమంతా ఇమిడ్చి, భారతమనే ఇతిహాసాన్ని రచించాను. ప్రజలు దాన్ని చదివి ఆనందించేటట్టుగా లిఖించేవాడెవడూ కనబడడు," అన్నాడు.

"నాయనా, విఘ్నేశ్వరుణ్ణి ప్రార్థించి, అతని ద్వారా నీ భారత ఇతిహాసాన్ని



రాయించు," అని బ్రహ్మ వ్యాసుడికి సలహా ఇచ్చాడు.

వ్యాసుడు ధ్యానించగా విఘ్నేశ్వరుడు వచ్చాడు. వ్యాసుడు కోరిన ప్రకారం, ఆయన చెబుతూ ఉంటే విఘ్నేశ్వరుడు మహాభారతాన్ని లిఖించాడు. దాన్ని దేవలోకంలో నారదుడూ, పితృలోకంలో దేవలు డనే అసితుడూ, గంధర్వాది లోకాలలో శుకుడూ ప్రచారం చేశారు. జనమేజయుడు సర్పయాగం చేసినప్పుడు వైశంపాయనుడు దానినే పఠించి, భూలోకంలో ప్రచారంలోకి తెచ్చాడు.

శౌనకాది మునులు ఈ విషయాలు విని సంతోషించి, "కౌరవపాండవులు యుద్ధం చేసిన శమంతకపంచకం అనే క్షేత్రానికి ఆ పేరు ఎలా వచ్చింది?" అని సూతుణ్ణి అడిగారు.

సూతుడు వారికి ఇలా చెప్పాడు:

త్రేతా ద్వాపరయుగ సంధిలో రాజులు మదించి, అధర్మమార్గాన సంచరిస్తూ ఉంటే పరశురాముడు వారిని ఇరవైఒక్క సారి వెతికి వెతికి చంపి, వారి రక్తంతో అయిదు మడుగులు కల్పించి, ఆ మడుగులలో పితృదేవతలకు తర్పణా లిచ్చాడు. పితృదేవతలు, ఆ మడుగులైదూ పుణ్యతీర్థ



ఘయేటట్టు పరశురాముడికి వరమిచ్చారు. ఆ ప్రదేశంలోనే అతి ఘోరమైన భారత యుద్ధం జరిగింది. ఆ కారణంగా శమంతక పంచకక్షేత్రానికి కురుక్షేత్ర మనే పేరు వచ్చింది.

పరీక్షితుడి కొడుకైన జనమేజయుడు ఆ కురుక్షేత్రంలో, తన తమ్ములైన శ్రుత సేన, ఉగ్రసేన, భీమసేనుల సహాయంతో దీర్ఘమైన సత్రయాగం చేశాడు. ఆ సమయంలో, సరమ అనే దేవతాశునకం కొడుకు సారమేయం అనేది యజ్ఞవాటికలో తిరుగుతూంటే, జనమేజయుడి తమ్ములు ఆ కుక్కను కొట్టారు. అది వెళ్ళి తన తల్లి అయిన సరమతో చెప్పింది. "సాధువులూ, పేదలూ అయిన వారికి కీడుచేస్తే కట్టికుడపకపోదు," అని సరమ తిట్టింది.

సరమ తిట్టు శాపమై తగులుతుందేమో నని భయపడి జనమేజయుడు హస్తినాపురానికి తిరిగి వచ్చి, శాంతికర్మలు చేయించటానికి పురోహితు డెవడైనా దొరుకుతాడా అని చూడసాగాడు. ఒకసారి అతను అరణ్యంలో వేటాడబోగా, అక్కడ శ్రుతశ్రవుడి ఆశ్రమం కనబడింది. శ్రుతశ్రవుడికి సోమశ్రవు డనే కొడుకున్నట్టు తెలిసి, జనమేజయుడు, "మీ కుమారుణ్ణి నాకు పురోహి



తుడుగా ఇవ్వగలరా?" అని శ్రుతశ్రవుణ్ణి అడిగాడు.

"నా కొడుకుకు ఒక నియమమున్నది. బ్రాహ్మణుడైనవాడు ఏది అడిగినా నా కొడుకు ఇచ్చేస్తాడు. అతని ఈ నియమానికి భంగం రాకుండా నువు చూసే పక్షంలో, అతను నీకు పురోహితుడుగా ఉంటాడు," అన్నాడు శ్రుతశ్రవుడు. జనమేజయుడు అందుకు సమ్మతించి, సోమశ్రవుణ్ణి హస్తినాపురానికి తీసుకుపోయి, అతని సహాయంతో అనేక యజ్ఞాలు చేశాడు.

ఇలా ఉండగా ఒకనాడు జనమేజయుడి వద్దకు ఉదంకు డనే మహర్షి వచ్చి, "రాజా,







నిజానికి ఉదంకుడికి కూడా తక్షకుడి పైన పగ ఉన్నది. దానికి కారణం ఇది:

ఈ ఉదంకుడు వేదు డనే ఋషి దగ్గిర చదువుకుని గృహస్థాశ్రమంలో ప్రవేశించ బోతూ, తన గురువును గురుదక్షిణ ఏమి ఇవ్వ మంటారని అడిగాడు. "నా భార్య ఏమి కోరుతుందో అడిగి చూడు," అన్నాడు వేదుడు. ఉదంకుడు గురుపత్నిని ఏమి కావాలని అడిగాడు.

"ఇవాళకు నాలుగో రోజున నేను పుణ్యకవ్రతం చేసుకుంటాను. అప్పుడు కుండలాలు పెట్టుకోవాలని ఉన్నది. నేను కోరే కుండలాలు పౌష్యు డనే రాజు భార్య వద్ద ఉన్నాయి. చాతనయితే వాటిని తెచ్చి ఇయ్యి," అన్నది గురుపత్ని.

ఉదంకుడు పౌష్యరాజు భార్య వద్దకు పోయి సంగతి చెప్పాడు. ఆమె తన కుండలాలు ఇవ్వటానికి ఒప్పుకున్నది, కాని వాటిని తస్కరించటానికి తక్షకుడు ఎల్లప్పుడూ ఎదురు చూస్తున్నాడని హెచ్చరించింది.

ఆమె అన్నట్టే జరిగింది. ఉదంకుడు ఆ కుండలాలు తీసుకుని అరణ్య మార్గాన పోతూ, ఒక చోట మడుగు చూసి, కుండలాలను ఒక చోట పెట్టి, ఆచమించటానికి మడుగు దగ్గిరికి పోయేసరికి, అప్పటిదాకా

చెయ్యవలిసిన పని ఉపేక్షించి, చేతులు కట్టుకు కూర్చున్నావేమిటి?" అన్నాడు.

"స్వామీ, క్షత్రియ ధర్మాలన్నీ తప్ప కుండా ఆచరిస్తున్నానే? ఏమిటి నేను చెయ్యక మానినది?" అని జనమేజయుడు ఉదంకుణ్ణి అడిగాడు.

"సర్పయాగం చెయ్యి! ఆ దుర్మార్గుడు తక్షకుణ్ణి బూడిద చెయ్యి. మీ తండ్రి అయిన పరీక్షిత్తును కాటు వేసి చంపింది ఆ తక్షకుడుకాడూ? మీ తండ్రి ప్రాణాలను రక్షించటానికి వచ్చే కాశ్యపుడికి అంతులేని ధనాన్ని లంచం పెట్టి, తిప్పి పంపేసినదీ వాడేగా?" అన్నాడు ఉదంకుడు.







ఉదంకుణ్ణి దూరదూరంగా వెన్నాడుతూ వచ్చిన తక్షకుడు ఆ కుండలాలను హరించి పారిపోసాగాడు. నగ్నమానవ రూపంలో ఉన్న తక్షకుణ్ణి ఉదంకుడు తరిమి పట్టుకున్నాడు. వెంటనే తక్షకుడు పాముగా మారి ఒక బిలంలో దూరాడు.

ఉదంకుడు ఆ బిలాన్ని ఒక కర్రతో తవ్వి పెద్దదిచేస్తూ, ఆ మార్గాన పాతాళానికి చేరుకున్నాడు. అక్కడ ఉన్న నాగులను ఉదంకుడు ఎంత స్తోత్రం చేసినా లాభం లేకపోయింది. చివరకు అతనికి ఒక గుర్రం మీద కూర్చుని ఉన్న ఒక మనిషి కనిపించాడు. ఆ గుర్రం అగ్ని, దాని మీద ఉన్న వాడు ఇంద్రుడు. ఆ సంగతి ఉదంకుడికి తెలియదు. అయినా, ఆ మనిషి తనను, "నీకేం కావాలి?" అని అడిగితే, ఉదంకుడు నాగలోకాన్ని తనకు అధీనం చెయ్యమన్నాడు. వెంటనే ఆ గుర్రం నుంచి భయంకరమైన అగ్ని జ్వాలలు వెలువడ్డాయి. నాగలోకమంతా బూడిద అయిపోతుందని భయపడి, తక్షకుడు కుండలాలను తెచ్చి ఉదంకుడికిచ్చాడు. అతను వాటిని సకాలంలో గురుపత్నికి అందజేశాడు.

ఉదంకుడి ద్వారా తన తండ్రిని చంపినది తక్షకుడని తెలియగానే జనమేజయుడు తన మంత్రులను, "అలా జరగటానికి కారణమేమిటి?" అని అడిగాడు. వాళ్ళు పరీక్షిత్తు మరణవృత్తాంతం ఇలా చెప్పారు:

భారత యుద్ధంలో చనిపోయిన అభిమన్యుడికీ, ఉత్తరకూ పుట్టిన పరీక్షిత్తు కృపాచార్యుడి వద్ద విలువిద్య నేర్చి, పాండవుల అనంతరం రాజ్యపాలన చేస్తూ వచ్చాడు. ఆయనకు వేట అంటే చాలా ఇష్టం. ఒకనాడాయన వేట తమకంలో అరణ్యంలో తన చేత దెబ్బతిని పారిపోయే జంతువును తరుముకుంటూ, శమీకు డనే మహాముని తపస్సు చేసుకుంటున్న చోటికి వచ్చి, "బాణంతగిలిన మృగం ఇటుగా







పరిగెత్తుకుంటూ వచ్చింది. అది ఎటుగా పోయింది?" అని అడిగాడు.

మౌనంగా తపస్సు చేసుకునే శమీకుడు సమాధానం చెప్పలేదు. పరీక్షిత్తుకు కోపం వచ్చింది. అతను ఒక చచ్చిన పామును బాణం ములికితో ఎత్తి శమీకుడి మెడలో వేసి వెళ్ళిపోయాడు. శమీకుడి కొడుకైన శృంగికి ఒక మిత్రుడి ద్వారా పరీక్షిత్తు చేసిన పని గురించి తెలిసింది. ముక్కోపి అయిన శృంగి, "ఇవాళకు ఏడోరోజున పరీక్షిత్తు తక్షకుడి విషంతో చచ్చిపోవుగాక!" అని శాపం ఇచ్చాడు.

తన కొడుకు పరీక్షిత్తులాటి మంచి రాజుకు ఇంత దారుణమైన శాపం ఇచ్చాడని తెలిసి శమీకుడు చాలా నొచ్చుకుని, గౌరముఖుడనే తన శిష్యుణ్ణి పిలిచి, "నువు పరీక్షిత్తు వద్దకు వెళ్ళి, శాపం సంగతిచెప్పి, తక్షకుడి వల్ల అపాయం రాకుండా జాగ్రత్త పడమని చెప్పు," అన్నాడు. గౌరముఖుడు పరీక్షిత్తు వద్దకు వెళ్ళి, గురువుగారు చెప్పమన్నట్టే చెప్పాడు.

పరీక్షిత్తు తాను చేసిన పనికి నొచ్చుకుని, శృంగి ఇచ్చిన శాపానికి భయపడి, శాపం తగలకుండా ఏదైనా ఉపాయం చూడమని మంత్రులను కోరాడు. వాళ్ళు ఒక ఒంటి



స్తంభం మేడ కట్టించారు. అందులోకి బయటి గాలి కూడా పోవటానికి లేదు. మేడ నిండా విషాలకు విరుగుడుగా పనిచేసే ఔషధాలను ఉంచారు. విషవైద్యులనూ, మంత్రసిద్ధులనూ పిలిపించారు. రాజుతో సహా మంత్రులందరూ ఆ మేడలోనే చేరారు.

ఆరు రోజులు ఏ ప్రమాదమూ లేకుండా గడిచాయి. ఏడో రోజున కాశ్యపుడనే బ్రాహ్మణుడు, పరీక్షిత్తుకు కలిగిన శాపం గురించి విని, తక్షకుడు కరిచిన పక్షంలో రాజు ప్రాణాలను కాపాడటానికి బయలు దేరి వస్తున్నాడు. తక్షకుడు కూడా రాజును కరవటానికి మార్గమేదా అని ఆలోచిస్తూ,

బ్రాహ్మణ వేషంలో వస్తూ కాశ్యపుణ్ణి కలుసుకుని, అతను వెళ్ళే పని తెలుసుకున్నాడు.

కాశ్యపుడు తక్షకుడితో, "నాకు పాముల విషానికి విరుగుడు తెలుసును. నా మంత్ర శక్తితో, పాములచేత చచ్చినవారిని బతికించగలను. రాజును తక్షకుడు కరిచే పక్షంలో ఆయనను బతికించితే, నాకు బోలెడంత ధనమూ, కీర్తీ కూడా లభిస్తుంది," అన్నాడు.

"అయ్యా, నేనే తక్షకుణ్ణి. నా విషంతో చచ్చినవారు బూడిద అయిపోతారు. నీ మంత్రాలతో తిరిగి బతకరు. నువు తిరిగి వెళ్ళు," అన్నాడు తక్షకుడు.

కాశ్యపుడు ఒప్పుకో లేదు. తక్షకుడు సమీపంలో ఉన్న మర్రిచెట్టును కాటువేసి, తన విషాగ్నితో దాన్ని బూడిద చేసేశాడు. వెంటనే కాశ్యపుడు తన మంత్రంతో దాన్ని ఎప్పటిలాగా చేశాడు.

"నా విషానికి విరుగుడు వెయ్యగలవేమోగాని, శాపానికి విరుగుడు వెయ్యగలవా? రాజు ఇచ్చే ధనం కంటె చాలా హెచ్చు ధన మిస్తాను. వెళ్ళిపో," అని తక్షకుడు కాశ్యపుణ్ణి లోభ పెట్టి, డబ్బిచ్చి పంపేశాడు.

తరవాత తక్షకుడు కొందరు నాగులను మునికుమారుల రూపంలో పరీక్షిత్తు వద్దకు పంపాడు. వాళ్ళు ఫలాలూ, పుష్పాలతో పరీక్షిత్తు వద్దకు వెళ్ళారు. వాళ్ళిచ్చిన ఫలాలలో ఒకదాన్ని పరీక్షిత్తు పగల దీశాడు. అందులో ఒక చిన్న పురుగు కనబడింది.

పరీక్షిత్తు తన చుట్టూ ఉన్నవారితో, "శాపకాలం ముగుస్తున్నది. సూర్యాస్తమయం కావస్తున్నది. నన్ను కరిస్తే ఈ పురుగు కరవాలిగాని, సర్ప భయం లేదు," అన్నాడు. అంతలోనే ఆ పురుగు తక్షకుడై పరీక్షిత్తును కరిచాడు. అందరూ చెల్లా చెదరుగా పారిపోయారు. తక్షకుడి కాటుకు పరీక్షిత్తు తగలబడి పోవటమేగాక, ఒంటి స్తంభం మేడ నిలువునా మండింది!






తన తండ్రి అయిన పరీక్షిత్తు ఎలా మరణించిందీ జనమేజయుడు ఇప్పుడే తెలుసుకున్నాడు. పసితనంలోనే అతన్ని మంత్రులు రాజుగా అభిషేకించి, యుక్త వయసు వచ్చాక అతనికి కాశీరాజు కూతురైన వపుష్టను తెచ్చి పెళ్ళి చేశారు.

"పరీక్షిత్తు మహారాజు పాము కరిచి మరణించాడు గనక, ఈ ఉదంకమహాముని హెచ్చరించినట్టుగా సర్పయాగం చెయ్యటం ఉచితంగానే ఉంటుంది," అని మంత్రులు జనమేజయుడితో అన్నారు.

జనమేజయుడు సర్పయాగం చెయ్యటానికీ, అందులో తక్షకుడు మొదలైన సర్పాలను యాగాగ్నికి ఆహుతి చేసి బూడిద చెయ్యటానికి తీర్మానించుకుని, రాజపురోహితులనూ, ఋత్విక్కులనూ పిలిచి, సర్పయాగం చేసే విధానమేమిటని అడిగాడు. సర్పయాగమన్నది జనమేజయు డొక్కడి కోసమే ఏర్పడిందనీ, దాన్ని మరెవ్వరూ చెయ్యరనీ ఋత్విక్కులు చెప్పారు.

యాగసంభారాలన్నీ సేకరించబడ్డాయి. యజ్ఞశాలలు నిర్మించారు. ఒక వంక యాగానికి ఏర్పాట్లు జరుగుతూ ఉంటే, లోహితాక్షుడు అనే సూతుడు, భవిష్యత్తు తెలిసినవాడు కావటంచేత, "ఈ యాగం పూర్తి కాకుండా ఒక బ్రాహ్మణుడు అడ్డు పడతాడు," అని చెప్పాడు.

జనమేజయుడు అతని హెచ్చరికను పాటించక పోగా, యాగం జరిగేటంత కాలమూ లోహితాక్షుణ్ణి యజ్ఞశాలలోకి రానివ్వ

2. యయాతి కథ



వద్దని ఉత్తరువు చేసి, వపుష్టమహాదేవితో సహా తాను యజ్ఞదీక్ష తీసుకుని, యజ్ఞశాలా ప్రవేశం చేశాడు. సర్పయాగానికి చండభార్గవు డనేవాడు హోత, పింగళుడు అధ్వర్యుడు, కౌత్సుడు ఉద్గాత. యాగం ఆరంభమయింది. ఎక్కడెక్కడి సర్పాలూ అగ్నిగుండంలో పడిపోతున్నాయి. వాటి సంఖ్య వేలకూ, లక్షలకూ పాకింది.

తక్షకుడు బెదిరిపోయి ఇంద్రుణ్ణి శరణు జొచ్చాడు. "ఈ సర్పయాగంలో కొన్ని మేటి సర్పాలకు భయం ఉండదని బ్రహ్మ ముందే చెప్పాడు. భయపడకు. నా వద్దనే ఉండు," అన్నాడు ఇంద్రుడు.



సర్ప వినాశనం చూసి వాసుకి చాలా దిగులు పడ్డాడు. అతను తన చెల్లెలైన జరత్కారువు వద్దకు వెళ్ళి, "ఇలా జరగకుండా ఉండాలనే కదా నిన్ను జరత్కారుడనే మునికిచ్చి పెళ్ళి చేశాం! నీ కొడుకైన అస్తీకుణ్ణి పంపి ఈ యాగం అపు చేయించు," అన్నాడు.

తల్లి చెప్పిన మీదట అస్తీకుడు సర్పయాగం జరిగే చోటికి వెళ్ళి, స్వస్తివాచకం చెప్పి, రాజునూ, ఋత్విక్కులనూ, అగ్నినీ స్తోత్రం చేశాడు. జనమేజయుడు అస్తీకుణ్ణి చూసి ముచ్చటపడి, "చూస్తే కుర్రవాడు, ఎంత జ్ఞానం కనబరిచాడు! ఇతను కోరిన వరం ఇవ్వదలిచాను," అని సదస్యులతో అన్నాడు.

వెంటనే అస్తీకుడు సర్పయాగం నిలపమని కోరాడు. జనమేజయుడు యాగం ఆపటం తప్ప ఇంకేమి కోరినా ఇస్తానన్నాడు. కాని అస్తీకుడు అందుకు ఒప్పలేదు. మిగిలిన వాళ్ళు కూడా జనమేజయుణ్ణి ఇచ్చిన మాట నిలబెట్టుకోమన్నారు. సర్పయాగం నిలిచిపోయింది.

అప్పుడు జనమేజయుడు అందరికీ దక్షిణ సత్కారాలు జరిపి, వేదవ్యాసుడు శిష్య సహితంగా రాగా, తన పూర్వీకులైన పాండ





వుల వృత్తాంతాలన్నింటినీ వైశంపాయనుడి నోట విన్నాడు.

భారతవంశానికి మూల పురుషుడు వైవస్వతమనువు. ఆయన అదితికి మన మడు. వైవస్వతుడి కూతురైన ఇళకు పురూరవుడు పుట్టాడు. పురూరవుడికీ, ఊర్వశికీ కలిగిన అరుగురు కొడుకులలో ఆయువు అనే వాడికి నహుషుడు మొద లుగా నలుగురు కొడుకులు పుట్టారు. నూరు యజ్ఞాలు చేసి ఇంద్రత్వం కూడా కొంత కాలం అనుభవించిన నహుషుడు అరుగురు కొడుకులను కన్నాడు. వారిలో యయాతి రెండవవాడు. పెద్దవాడైన యతి తపస్సుకు పోగా, యయాతి రాజ్యపాలన చేశాడు.



యయాతి రాజ్యపాలన చేసే కాలంలో శుక్రుడు దానవులకు పురోహితుడుగా ఉండే వాడు. దేవదానవ యుద్ధాలలో చనిపోయిన దానవులను ఆయన మృతసంజీవని అనే మంత్రంతో బతికించేవాడు. దేవతల గురు వైన బృహస్పతికి ఆ విద్య రాదు. అందు చేత దేవతలు బృహస్పతి కొడుకైన కచు డనే వాణ్ణి, మృతసంజీవనీ మంత్రం నేర్చుకు రమ్మని శుక్రుడి వద్దకు పంపారు.

కచుడు వచ్చి శుక్రుడికి శుశ్రూష చేస్తూ, శుక్రుడి కుమార్తె అయిన దేవయానికి సంతోషం కలిగిస్తూ కొంతకాలం గడిపాడు. కచుడు బృహస్పతి కొడుకని దానవులకు తెలియ వచ్చింది. అతను అరణ్యంలో గురువుగారి గోవులను కాసేటప్పుడు దాన వులు అతన్ని చంపి, ముక్కలు చేసి, తోడేళ్ళకు వేశారు. ఈ సంగతి తెలియగానే శుక్రుడు తన మృతసంజీవనితో కచుణ్ణి మళ్ళీ బతికించాడు. ఇంకోసారి కచుడు దేవయాని కోసం పూలు తేవటానికి పోతే, దానవులు అతన్ని మళ్ళీ చంపి, సము ద్రంలో కలిపేశారు. కచుడి కోసం దేవ యాని ఏడవ సాగింది. శుక్రుడు అతన్ని మళ్ళీ బతికించాడు.



దానవులు మూడోసారి కచుణ్ణి చంపి నప్పు డతన్ని బూడిద చేసి, ఆ బూడిదను కల్లులో కలిపి, శుక్రుడికి తాగటానికి ఇచ్చారు. ఈసారి శుక్రుడు బతికించి నప్పుడు కచుడు శుక్రుడి పొట్టలో ఉన్నాడు. శుక్రుడు విధిలేక అతనికి మృతసంజీవనీ మంత్రం చెప్పి, తన పొట్ట చీల్చుకుని బయటికి రమ్మనీ, ఆ తరవాత ఆ మంత్రంతో తనను తిరిగి బతికించమనీ అన్నాడు. కచుడు అలాగే చేశాడు.

కచుడు వచ్చిన పని అయిపోయింది. అతను సమయం చూసుకుని, వెళ్ళి వస్తా నన్నాడు గురువుతో. అప్పుడు దేవయాని, "నీ మీది మోహంతో నిన్ను ఎన్నోసార్లు బతికించుకున్నాను. నన్ను పెళ్లాడు," అన్నది.

"అమ్మమ్మా, నువు గురుపుత్రివి. నా చెల్లెలులాటి దానివి," అన్నాడు కచుడు.

"అలా అయితే నీకు మృతసంజీవని ఫలించకుండుగాక!" అని దేవయాని కచుడికి శాపం పెట్టింది.

"నిన్ను బ్రాహ్మణు డెవడూ పెళ్ళాడకుండుగాక," అని ఎదురుశాపం పెట్టి కచుడు తిరిగి వెళ్ళిపోయాడు.

దానవులకు రాజైన వృషపర్వుడికి శర్మిష్ఠ అని కూతురున్నది. ఒకనా డామె దేవయానినీ, అనేకమంది చెలికత్తెలనూ వెంట







బెట్టుకుని వనవిహారానికి బయలుదేరింది. ఒక చోట వాళ్ళు కొక సరస్సు కనబడింది. యువతు లందరూ తమ బట్టలు విప్పేసి, ఒడ్డున పెట్టి, సరస్సులో కొంతసేపు జలకా లాడారు. ఆ సమయంలో గాలికొట్టి వాళ్ళ చీరలు లుంగచుట్టుకు పోయాయి. జల క్రీడలు ముగించి యువతులు ఒడ్డుకు వచ్చి చీరలు కట్టుకోవటంలో, తొందరలో శర్మిష్ఠ దేవయాని చీరె కట్టేసుకున్నది. దేవయానికి శర్మిష్ఠ చీర మిగిలింది.

దే వ యా ని అహంకారంతో, "ఓసి రాకాసీ, నేను బ్రాహ్మణ స్త్రీని. నీ చీర నేను కట్టను. నాకు ఆచారం వున్నది. నా చీర నువ్వెందుకు కట్టుకున్నావు?" అని నిలదీసి అడిగింది.

"పోవే, బిచ్చగత్తె! నీ తండ్రి నా తండ్రి ఇచ్చినది స్వీకరించి, మమ్మల్ని ఆశ్రయించి బతుకుతున్నాడు. నా చీర కట్టడానికి నీకు అకేపణ వచ్చిందా?" అని శర్మిష్ఠ అన్నది. అంతటితో ఊరుకోక శర్మిష్ఠ కోపావేశంలో దేవయానిని ఆ పక్కనే వున్న బావిలోకి తోసి, తన చెలికత్తెలతో వెళ్ళిపోయింది.

కొంచెం సేపటికి య యా తి అటుగా వచ్చాడు. అయన వేటాడుతూ, అలిసి పోయి, దప్పికతో బావి సమీపించి లోపలికి తొంగి చూశాడు. దేవయాని కనిపించింది. "ఎవరు నువ్వు? బావిలోకెలా వచ్చావు?" అని యయాతి అడిగాడు.

"నేను దానవగురువైన శుక్రాచార్యుల కుమార్తెను. నా పేరు దేవయాని. కారణాంతరం చేత నేను బావిలో పడ్డాను. నన్ను బయటికి తియ్యి," అంటూ దేవయాని తన చేతిని పైకి చాచింది. యయాతి తన కుడి చేత్తో ఆమె కుడిచెయ్యి అందుకుని, ఆమెను పైకి లాగి, తన దారిన తాను వెళ్ళాడు.

ఈలోపల ఘూర్ణిక అనే దాసీది దేవ యానిని వెతుక్కుంటూ అటు వచ్చింది. దేవయాని దానితో, "ఒసే, నే నిక వృష



పర్వుడి నగరులో అడుగుపెట్టను. శర్మిష్ఠ నాకు చేసిన అపచారం గురించి నా తండ్రికి చెప్పు, పో," అన్నది.

కబురందగానే శుక్రుడు దేవయాని వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చి, "శర్మిష్ఠకు నువ్వేం అపకారం చేశావు, తల్లీ?" అని అడిగాడు.

దేవయాని తండ్రితో జరిగినదంతా చెప్పి, శర్మిష్ఠ ఆయనను అన్న మాటలు కూడా చెప్పింది. అంతా విని శుక్రుడు, "అమ్మా, నువు తప్ప నా కెవరున్నారు? నువు రాకపోతే వృషపర్వుడి నగరానికి నేనూ వెళ్ళను," అన్నాడు.

ఇంతలో సంగతంతా తెలుసుకుని వృషపర్వుడు స్వయంగా బయలుదేరి వచ్చి, "మీ రిద్దరూ ఈ వనంలో ఉన్నారేమిటి? నగరానికి పోదాం పదండి," అన్నాడు.

"మీ వరస నా కేమీ బాగాలేదు. మీ వాళ్ళు నా శిష్యుడైన కచుణ్ణి మాటిమాటికీ చంపారు. ఇప్పుడేమో నీ కూతురు నా కూతుర్ని నూతిలోకి తోసి, చంపాలని చూసింది. నాకు మీ సేవ వద్దు," అన్నాడు శుక్రుడు కోపంగా.

వృషపర్వుడు కాళ్ళావేళ్ళా పడ్డాడు. దేవయానిని ఒప్పించమనీ, ఆమె ఇష్టమే తన ఇష్టమనీ శుక్రుడు చెప్పాడు. శర్మిష్ఠా, ఆమె దాసీజనమూ తనకు దాసీలుగా ఉండేటట్టయితే తాను నగరుకు వస్తానన్నది దేవయాని. వృషపర్వుడు సరేనన్నాడు. శర్మిష్ఠ దేవయానికి దాసిగా వచ్చింది; దేవయాని అనే సూటిపోటి మాటలన్నీ సహించింది. ఎందుకంటే శుక్రాచార్యులు మూలంగా దానవలోకం ఎంతో మేలు పొందింది.

ఒకనాడు దేవయాని శర్మిష్ఠనూ, మిగిలిన దాసీలనూ వెంటబెట్టుకుని, పూర్వం వెళ్ళిన చోటికే వెళ్ళింది. మళ్ళీ యయాతి వేటాడుతూ అటుగా వచ్చాడు; శర్మిష్ఠనూ,



దేవయానిని చూసి, "మీ రెవరు?" అని అడిగాడు.

దేవయాని అతని పేరూ, కులమూ తెలుసుకుని "ఇంతకు పూర్వం నాకు చెయ్యి ఇచ్చి నూతిలో నుంచి నువే కాదా పైకి లాగావు? ఆ రోజు మనకు పాణి గ్రహణం జరిగింది. అది మొదలు నిన్నే నా భర్తగా భావిస్తున్నాను," అన్నది.

బ్రాహ్మణుడి కూతుర్ని తాను ఎలా పెళ్ళాడటమా అని యయాతి జంకాడు. కాని శుక్రుడు వారిద్దరి పెళ్ళినీ ఆమోదిం చాడు. ఇద్దరికీ వైభవంగా పెళ్ళి అయింది. శుక్రుడూ, దానవప్రముఖులూ యయాతికి ఘనంగా కట్నాలు ఇచ్చారు. దేవయాని శర్మిష్ఠనూ, మరి రెండువేలమంది దాసీ లనూ వెంటబెట్టుకుని కాపరానికి వచ్చింది. శర్మిష్ఠా, దాసీలూ ఉండటానికి అశోకవనానికి సమీపంగా ఒక పెద్ద భవనాన్ని యయాతి ఏర్పాటు చేశాడు.

దేవయాని యయాతికి యదుడూ, తుర్వ సుడూ అనే కొడుకులను కన్నది.

కొంత కాలం గడిచాక శర్మిష్ఠ తన స్థితి తలుచుకుని విచారించింది. ఇంత కాలమైనా తనకు పెళ్ళి లేదు. దేవయాని అప్పుడే పిల్లలతల్లి కూడా అయింది. "దేవయాని



వరించినట్టుగానే నేను కూడా యయాతిని ఎందుకు వరించరాదు?" అని ఆమె అనుకున్నది.

ఒకనాడు యయాతి అశోకవనం కేసి రాగా, శర్మిష్ఠ ఆయనను కలుసుకుని, "రాజా, నా యజమానురాలికి భర్తవైన నువు నాకూ భర్తవే. నన్ను భార్యగా పరిగ్ర హించు. ఇందులో అధర్మం లేదు," అన్నది.

శుక్రు డేమంటాడో నని యయాతి భయ పడ్డాడు. అయినా ఆమె కోరికను నిరాక రించలేక, ఆమెతో రహస్యంగా కాపరం చేస్తూ, ఆమె ద్వారా ద్రుహ్యుడు, అనుడు, పూరుడు అనే కొడుకులను కన్నాడు.



శర్మిష్ఠ పిల్లలతల్లి అయిన మాట దేవయానికి తెలియవచ్చింది. ఆమె శర్మిష్ఠను చూడబోయి, "నీవు ఉత్తమశీలవనీ, నీతి పరురాలివనీ, గొప్ప వంశంలో పుట్టినదానవనీ అంటున్నారే, పెళ్ళి కాకుండానే నీ కి పిల్లలు ఎలా కలిగారు?" అని అడిగింది.

శర్మిష్ఠ సిగ్గుతో తల వంచుకుని, "నేను ఋతుస్నానం చేసిన తరుణంలో ఒక మహాముని వచ్చి నాకు పుత్రదానం చేశాడు," అన్నది.

"ఎవరా ముని? ఏం పేరు? ఏం కులం?" అని దేవయాని మళ్ళీ అడిగింది.

"ఆ మహానుభావుడి దివ్యతేజస్సు చూస్తూ నాకు ఆ వివరాలు అడగ బుద్ధి కాలేదు," అన్నది శర్మిష్ఠ.

దేవయాని తృప్తిపడింది.

మరొకసారి యయాతీ, దేవయానీ కలిసి శర్మిష్ఠ ఉండే చోటికి విహారంగా వచ్చారు. అప్పుడు దేవయాని నిజం తెలుసుకున్నది. శర్మిష్ఠ బిడ్డలలో యయాతి పోలికలున్నాయి. "మీ తండ్రి ఎవరు? నిజం చెప్పండి," అని ఆమె ఆ పిల్లల నడిగితే వాళ్ళు యయాతిని చూపారు.

వెంటనే దేవయాని శర్మిష్ఠ పైన విరుచుకు పడుతూ, "ఓసి రాకాసీ, నాకే ద్రోహం తల పెట్టావా?" అన్నది.

శర్మిష్ఠ తొణకకుండా, "నేను అధర్మం చెయ్యలేదు. ఈ రాజును నువు వరించినట్టే నేను వరించాను. నువు నా కన్నా పెద్దదానవు, బ్రాహ్మణ స్త్రీవి. అందుకని నిన్ను గౌరవిస్తాను. కాని ఈయన రాజర్షి. అందుకే, ఒక ఋషికి పిల్లలను కన్నానని నీతో చెప్పాను," అన్నది.

దేవయాని యయాతితో, "నాకు ద్రోహం చేశావు. నేను నీ వద్ద ఉండను," అని, తిన్నగా తన తండ్రి వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పింది. శుక్రుడు యయాతిని, ముసలివాడవు కమ్మని శపించాడు.






శుక్రుడు తనను ముసలివాడు కమ్మని శపించగానే యయాతి శుక్రుడి కాళ్ళావేళ్ళా పడి, "నన్ను శపించటం న్యాయ్యం కాదు. శర్మిష్ఠ పుత్రభిక్ష వేడింది. ఆమె కోరిక తీర్చకపోతే నాకు భ్రూణహత్య చేసిన పాపం చుట్టుకుంటుంది. అందుకని ఆమె కోర్కె తీర్చాను. అంతేగాని దేవయానికి అన్యాయం చేసే ఉద్దేశం నాకు లేదు. నన్ను మన్నించండి," అన్నాడు.

"నా శాపం వ్యర్థం కావటం ఎన్నటికీ జరగదు. అయితే నువ్వింకా కొంతకాలం యౌవనం అనుభవించగోరినట్టయితే, నీ ముసలితనం ఎవరైనా యువకుడికిచ్చి, వాడి యౌవనం నువు పుచ్చుకునేటందుకు అవకాశం ఇస్తాను," అన్నాడు శుక్రుడు.

తన ముసలితనం తీసుకుని యౌవనం ఇవ్వమని పరాయివాళ్ళను అడిగేకన్న తన కొడుకులనే అడిగి, అందుకు సమ్మతించే వాడికే తన అనంతరం రాజ్యాభిషేకం జరిగేటట్టు చేస్తే బాగుంటుందని యయాతి ఆలోచించాడు. అందుకు శుక్రుడు సమ్మతించాడు.

యయాతికి వెంటనే ముసలితనం వచ్చేసింది. తల వణికింది. కీళ్ళు పట్టు తప్పాయి. జుట్టు నెరిసింది. ముఖమంతా ముడతలు పడింది. ఉబ్బసరోగం పట్టుకున్నది. ఆ స్థితిలో ఆయన తన పెద్ద కొడుకైన యదువును పిలిచి, అతనికి తన శాపం గురించి చెప్పి, "నాయనా, కొంత కాలం నా ముసలితనం నువు పుచ్చుకుని,

3. శకుంతల కథ



నీ యౌవనం నా కిస్తావా? ఆ తరవాత నీ యౌవనం నీ కిచ్చి నా ముసలితనం నేను తీసుకుంటాను,'' అన్నాడు.

యదువు ఈ ఏర్పాటుకు ఎంత మాత్రమూ ఒప్పుకో లేదు. యయాతి మండిపడి, యదువుకూ, అతని సంతతి అయిన యాదవులకూ రాజ్యార్హత లేకుండా చేశాడు. యదువు ఒకడేగాదు, యయాతి కొడుకులు మిగిలిన వాళ్ళుకూడా తండ్రి ముసలితనాన్ని స్వీకరించటానికి ఒప్పుకో లేదు. శర్మిష్ఠ కొడుకులలో చిన్నవాడైన పూరు డొక్కడే తండ్రి చేసే ఏర్పాటుకు సమ్మతించాడు. శుక్రుడి దయవల్ల యయాతి తన ముసలితానాన్ని పూరుడి కిచ్చి, పూరుడి యౌవనాన్ని తాను పొంది, విశ్వాచి అనే అప్సరసను వెంట బెట్టుకుని అందమైన స్థలాలలో విహరించుతూ, యథేచ్ఛగా సుఖించాడు. ఇలా కొంతకాలం జరిగాక ఆయన పూరుడికి తన యౌవనాన్ని ఇచ్చి, ముసలివాడై, పూరుడికి రాజ్యాభిషేకం చేశాడు.

పూరుడికి పౌష్టి, కౌసల్యా అని ఇద్దరు భార్యలు. ఇద్దరికీ పుత్రులు జన్మించారు. కౌసల్యకు పుట్టిన కొడుకుల సంతతిలో, జనమేజయు డనేవాడి పరంపరలో పదహారో తరం వాడుగా దుష్యంతు డనేవాడు పుట్టాడు. దుష్యంతుడికీ, విశ్వామిత్రుడి కుమార్తె అయిన శకుంతలకూ భరతు డనే అతి చక్కని కొడుకు కలిగాడు.

విశ్వామిత్రుడికి కుమార్తె ఎలా కలిగిందంటే—

ఒకప్పుడు విశ్వామిత్రుడు అతి తీక్ష్ణమైన తపస్సు చేశాడు. ఆ తపస్సు చూసి ఇంద్రుడు భయపడి, మేనక అనే అప్సరను పిలిచి, ''విశ్వామిత్రుడు ఘోరమైన తపస్సు చేస్తున్నాడు. ఆ తపస్సు పూర్తి అయితే దేవతలకు అపాయం కలుగుతుందని నాకు భయంగా ఉన్నది. అందు



చేత నువు వెళ్ళి, నీ చాతుర్యమంతా వినియోగించి విశ్వామిత్రుడి తపస్సు భంగం చెయ్యి," అన్నాడు.

విశ్వామిత్రుడు సామాన్యుడు కాడు. ఆయన రాజవంశంలో పుట్టి, తన తపశ్శక్తి చేత బ్రాహ్మణుడయాడు. మహా ముక్కోపి. వశిష్ఠుడంతటివాడికే పుత్రశోకం కలిగించాడు. శాపంచేత చండాలుడైపోయిన త్రిశంకు చేత ఆయన యజ్ఞం చేయిస్తే, ఆయనకు భయపడి ఇంద్రుడే వెళ్ళి హవిర్భాగం పుచ్చుకున్నాడు. ఆ త్రిశంకుణ్ణి విశ్వామిత్రుడు తన శక్తిచేత స్వర్గానికి పంపి, దేవతలు తోసెయ్యగా కిందపడిపోతున్న త్రిశంకుడికి అంతరిక్షంలో ఒక స్వర్గం సృష్టించి అందులో అతన్ని నిలిపాడు. ఇదంతా తెలిసి కూడా మేనక విశ్వామిత్రుడి తపస్సు భంగం చెయ్యటానికి బయలుదేరి విశ్వామిత్రుడున్న ఆశ్రమానికి వచ్చింది.

మేనక విశ్వామిత్రుడికి కనబడి నమస్కారం చేసి, ఆ ఆశ్రమంలో విహరించ సాగింది. గాలికి చెదిరిపోయే చీరను సరి చేసుకుంటూ తిరుగుతున్న మేనకను చూడగా చూడగా, దాని అందానికి విశ్వామిత్రుడి మనస్సు చెదిరిపోయింది. ఆయనలో కలిగిన వికారాన్ని గమనించి మేనక తాను వచ్చిన పని నెరవేరుతున్నదనుకుని, ఆయనకు వశురాలయింది. వారి దాంపత్య ఫలితంగా మేనకకు ఒక అందమైన కూతురు పుట్టింది. ఆ పసిగుడ్డును మాలినీనదీ తీరాన నిర్జనారణ్యం మధ్య ఉంచి, తన మానాన తాను దేవలోకానికి మేనక తిరిగి వెళ్ళిపోయింది.

క్రూరమృగాలు స్వేచ్ఛగా తిరిగే ఆ ప్రాంతంలో ఆ పసిబిడ్డను శకుంతపక్షులు తమ రెక్కలతో కప్పి కాపాడాయి. మధ్యాన్నం వేళ కణ్వమహాముని స్నానం చెయ్యటానికి వచ్చి, శకుంతపక్షుల రెక్కల

నీడన సురక్షితంగా ఉన్న ఆ బిడ్డను చూసి, చుట్టుపక్కల ఆ బిడ్డ తాలూకు మనుషులెవ్వరూ లేకపోవటం చేత, ఆ బిడ్డను దగ్గిరలోనే ఉన్న తన ఆశ్రమానికి తీసుకుపోయి, శకుంతల అనే పేరు పెట్టి, తన కూతురిలాగే పెంచ నారంభించాడు. శకుంతల కూడా నానాటికీ పెరుగుతూ, కణ్వమహామునినే తన తండ్రిగా భావించి, ఆశ్రమంలో పనులన్నీ చేస్తూ వస్తున్నది.

ఒకనాడు దుష్యంతుడు మాలినీనదీ తీరానికి సపరివారంగా వేటకు వచ్చి, అక్కడ కణ్వమహాముని ఆశ్రమాన్ని చూశాడు. అది చాలా గొప్ప ఆశ్రమంగా అతనికి తోచింది. మునికుమారులు వేదపఠనం చేస్తున్నారు. కొందరు అగ్నిలో హవిస్సులు వేల్చుతున్నారు. ఒకచోట అధ్యయనమూ, చర్చా జరుగుతున్నది. సామగానం వినిపిస్తున్నది.

దుష్యంతుడు తన పరివారాన్ని ఆగమని చెప్పి, తాను ఒక్కడే ఆశ్రమం ప్రవేశించి కణ్వుడి కుటీరానికి వచ్చాడు. కుటీరంలో కణ్వుడు లేడు. లోపల ఎవరని దుష్యంతుడు గట్టిగా పిలిచేసరికి, తాపస స్త్రీ వేషంలో ఉన్న శకుంతల లోపలి నుంచి వచ్చింది. ఆమె దుష్యంతుణ్ణి చూస్తూనే రాజని గ్రహించి, అతనికి అర్ఘ్యపాద్యా



లిచ్చి, అతిథి సత్కారాలు చేసి, "మీకేం కావాలి?" అని అడిగింది.

ఎంతో అందంగానూ, సుకుమారంగానూ ఉన్న శకుంతలను చూసి దుష్యంతుడు ఆమె అతిథిమర్యాదకు చాలా ఆశ్చర్య పడుతూ, "అమ్మాయీ, నే నిక్కడి అర ణ్యాలలో వేటాడ వచ్చి, కణ్వమహాముని దర్శనం చేసుకుని పోదా మనుకున్నాను. ఆయన కుటీరంలో లేరా? ఎటువెళ్ళారు?" అని అడిగాడు.

"ఆయన నా తండ్రి. ఫలాలూ, సమిధలూ తీసుకు రావటానికి వెళ్ళారు. ఒక్క క్షణం ఆగితే వచ్చేస్తారు," అన్నది శకుంతల.

శకుంతల మాట్లాడే సొంపు చూస్తున్న కొద్దీ దుష్యంతుడికి ఆమె మీద మోహం జాస్తి కాసాగింది. ఆమె కన్య అని తెలుస్తూనే ఉన్నది. అతను శకుంతలతో, "కణ్వమహాముని బ్రహ్మచర్య వ్రతం పూనినవాడని విన్నాను. ఆయన నీకు తండ్రి ఎలా అయారు? అసలు నువ్వెవరి బిడ్డవు? ఈ ఆశ్రమంలోకి ఎలా వచ్చావు? నిన్ను చూసిన మాత్రం చేతనే నా మనసు నీ కేసి ఆకర్షించబడుతున్నది. నిజం సంగతి చెప్పు," అన్నాడు.

తన జన్మవృత్తాంతాన్ని శకుంతల అదివరకే, కణ్వమహాముని మరొక మునికి





చెప్పుతుండగా విని ఉన్నది కావటంచేత, దుష్యంతుడికి చెప్పేసింది.

"అయితే, నువు రాజకన్యకవే నన్న మాట. ఇంత చక్కని దానివి, ఇంత సుగుణవతివి, ఇలా నారబట్టలు కట్టి, అడవి పళ్లు తింటూ ఈ ఆశ్రమ కుటీరంలో నివసించటం నా కేమీ నచ్చలేదు. నాకు భార్యవై నా రాజభవనంలో సమస్త సుఖాలూ అనుభవించు. నా రాజ్యానికి నువే రాణివిగా ఉండు," అన్నాడు దుష్యంతుడు.

"అడవికి వెళ్ళిన మా నాన్నగారు రాగానే ఆయన అనుమతి పొంది, మీరు నన్ను పెళ్ళాడండి," అని శకుంతల అన్నది.



తనకు భార్య కావాలని ఆమెకు కోరిక ఉన్నట్టు దుష్యంతుడికి స్పష్టమయింది. అతను శకుంతలతో, "చూడు, నా మనస్సు నీ కోసం పరితపిస్తున్నది. గాంధర్వ వివాహం క్షత్రియులకు చెల్లుతుంది. గాంధర్వ వివాహానికి మంత్ర తంత్రాలు అవసరం లేదు. వధూవరుల ఇష్టమే తప్ప పై వాళ్ళ అనుమతితో అవసరం లేదు. అది రహస్య వివాహం," అన్నాడు.

తనకు అతనివల్ల కొడుకు పుట్టే పక్షంలో ఆ కొడుకును దుష్యంతుడు యువరాజును చేసే షరతు మీద శకుంతల అతనితో గాంధర్వ వివాహానికి ఒప్పుకున్నది. వారిద్దరూ అప్పుడే భార్యాభర్త లయారు. దుష్యంతుడు శకుంతలకు వీడ్కోలు చెప్పి వెళ్ళిపోతూ, "నేను మా నగరానికి వెళ్ళి, నిన్ను తీసుకు రావటానికి మనుషులను పంపుతాను," అని శకుంతలకు నచ్చ చెప్పాడు. ఈ సంగతి కణ్వమహామునికి తెలిస్తే ఆయన కోపించి ఏం చేస్తాడో నని దుష్యంతుడికి మనసులో భయంగానే ఉన్నది. శకుంతలకు కూడా అలాటి భయమే ఉన్నది.

తరవాత కణ్వమహాముని కందమూల ఫలాలు తెచ్చి పడేసి, కాళ్ళూ, చేతులూ







కడుక్కుని వచ్చి కూచున్నాడు. శకుంతల సిగ్గు పడుతూ, భయపడుతూ వచ్చి దగ్గిర నిలబడింది. ఆయన దివ్యదృష్టితో జరిగినది గ్రహించి, "అమ్మా, నువు తగిన భర్తనే పెళ్ళాడావు. ఈ గాంధర్వ వివాహం ఫలితంగా నీకు మహా చక్రవర్తి కాదగిన కొడుకు పుడతాడు. నీకేమన్నా కోరిక ఉంటే చెప్పు," అన్నాడు.

"నాకు పుట్టబోయే కొడుకు దీర్ఘాయు రైశ్వర్య బలాలు కలవాడేగాక వంశకర్తగా కూడా ఉండాలని నా కోరిక," అన్నది శకుంతల. అలాగే అవుతుందన్నాడు కణ్వుడు. శకుంతల మనస్సు ఊరట చెందింది.

కాలక్రమాన శకుంతల ఒక కొడుకును కన్నది. కణ్వమహాముని ఆ కుర్రవాడికి శాస్త్రోక్తంగానూ, క్షత్రియోచితంగానూ జాత కర్మ మొదలైనవి చేశాడు. ఆ కుర్రవాడు శుక్లపక్ష చంద్రుడిలాగా పెరుగుతూ, ఆరేళ్ళు వచ్చేసరికే సింహాలనూ, పులులనూ, ఏనుగు లనూ ఎక్కి తిరగటమూ, వాటిని ఆశ్రమంలో ఉండే చెట్లకు కట్టెయ్యటమూ మొదలైన పనులు చేసి, ఆశ్రమంలో ఉండే ముసు లను హడలగొట్టసాగాడు. వాణ్ణి ఆశ్రమంలో అందరూ సర్వదమను డని పిలిచేవారు.

ఒకనాడు కణ్వమహాముని శకుంతలతో, "అమ్మా, నీ కొడుకు ఇప్పుడే యువరాజు కాదగినట్టుగా ఉన్నాడు. వాడు వాడి తండ్రి దగ్గిర ఉండటం మంచిది. నువ్వయినా, భర్త ఉండగా ఎంత కాలమని పుట్టింట ఉంటావు? నిన్ను నీ భర్త వద్దకు పంపు తాను," అన్నాడు.

కణ్వుడి శిష్యులు కొందరు శకుంతలనూ ఆమె కొడుకునూ వెంట బెట్టుకుని దుష్యంతుడి నగరానికి వెళ్ళి, ఆమె వద్ద అనుమతిపొంది ఆశ్రమానికి తిరిగి వెళ్ళారు.

ద్వారపాలకుడు శకుంతలనూ, ఆమె కొడుకునూ దుష్యంతుడి వద్దకు వెళ్ళ





69

నిచ్చాడు. కాని శకుంతలను చూసి దుష్యంతుడు గుర్తుపట్టినట్టు కనిపించ లేదు. శకుంతలకు గుండెలో గుబులు పుట్టుకొచ్చింది. ఆమె అతనితో, "రాజా, నువ్వొకసారి వేటాడుతూ కణ్వాశ్రమానికి వచ్చిన మాట మరిచావా? వీడు నీ కొడుకు. వీణ్ణి యువరాజు చేస్తానని మాట ఇచ్చావు. నన్ను వశపరచుకోవటానికి ఇచ్చిన మాటను మీరవద్దు," అన్నది.

దుష్యంతుడు అంతా ఎరిగి ఉండి కూడా, ఎరగనట్టు నటిస్తూ, "దుర్మార్గు రాలా, అసలు నువ్వెవరు? నిన్ను నేనెరగను. అసందర్భాలు మాట్లాడక, వచ్చిన దారే వెళ్ళు," అన్నాడు.

శకుంతలకు దుఃఖంతోబాటు కోపం కూడా వచ్చింది. ఆమె దుష్యంతుడితో, "రాజా, నీకేమీ తెలియదంటావా? ఇతరు లెరగరుగదా అని అబద్ధ మాడతావా? జరిగినదానికి నువే సాక్షివి. నీ అంతరాత్మ సాక్షి. నిజాన్ని కప్పుపుచ్చటం మహా పాతకం. ఏ సద్బుద్ధితో ఆనాడు నన్ను నీదాన్ని చేసుకున్నావో, ఆ సద్బుద్ధితోనే ఇవాళ నన్ను ఏలుకో. పశుపక్ష్యాదులు కూడా తమ సంతానాన్ని ప్రేమిస్తాయి. వీడు నీ కొడుకు. కన్న కొడుకును కాదనకు," అన్నది.

అప్పటికీ దుష్యంతుడి వైఖరిలో మార్పులేదు.

ఆ సమయంలో ఆకాశం నుండి అశరీర వాణి ఇలా అన్నది: "రాజా, ఈ పిల్లవాడు నీకు శకుంతల యందు పుట్టినవాడు. ఈ కొడుకును ప్రేమతో భరించు. వాడు భరతుడని పేరు పొందుతాడు."

దుష్యంతుడి భయం తీరిపోయింది. శకుంతల తన భార్యేననీ, ఆమె కుమారుడు తన కుమారుడేననీ లోకానికి వెల్లడయింది. అందుచేత అతను ధైర్యంగా వారిని చేరదీశాడు.






దుష్యంతుడి అనంతరం భరతుడు రాజై, కణ్వమహామునిని పురోహితుడుగా పెట్టుకుని మహా వైభవంగా రాజ్యపాలన చేశాడు. భరతుడి మునిమనమడు హస్తి అనేవాడు. ఇతని పేరనే హస్తినాపురం ఏర్పడింది. ఆ హస్తికి అయిదోతరం వాడు కురువు; అతని పేరనే కురుక్షేత్రం ప్రసిద్ధమయింది. కురుడికి ఏడోతరం వాడు ప్రతీపుడు. ఇతని భార్య శిబి కూతురైన సునంద. వీ రిద్దరికీ దేవాపీ, శంతనుడూ, బాహ్లికుడూ అనే ముగ్గురు కొడుకులు కలిగారు. వారిలో పెద్ద వాడైన దేవాపి తపస్సు చేసుకుంటానని వెళ్ళిపోవటం చేత శంతనుడు రాజయాడు.

ఒకనాడు శంతనుడు అరణ్యంలో వేటాడి గంగాతీరాన విశ్రాంతి తీసుకుంటూండగా అక్కడ అతని కొక చక్కని స్త్రీ కనిపించింది. ఆమె రూపలావణ్యాలు చూస్తే శంతనుడికి దేవకాంత అనిపించింది. ఆమె కూడా శంతనుణ్ణి చూసి ఆకర్షించబడిన దానిలాగా అతన్ని రెప్ప వేయకుండా చూడసాగింది. ఇద్దరికీ ఒకరి మీద ఒకరికి మోహం ఏర్పడ్డట్టు గ్రహించి శంతనుడు ఆమెను పలకరించి, "సుందరీ, నువ్వెవరు? ఒంటరిగా ఈ గంగాతీరాన ఎందుకు తిరుగుతున్నావు?" అని అడిగాడు.

"నీకు నన్ను పెళ్ళాడాలని మనసయినట్టయితే నా కేమీ అభ్యంతరం లేదు. కాని ఒక్క నియమం ఉన్నది: నేను చేసే పనులకు అభ్యంతరం చెప్పినా, నన్ను నిందించినా, నేను నిన్ను విడిచి వెళ్ళిపోతాను,"

## 4. భీష్మ ప్రతిజ్ఞ



అన్నది ఆ స్త్రీ. అందుకు సమ్మతించి శంతను డామెను భార్యగా పరిగ్రహించాడు.

వారి దాంపత్యంలో ఆమెకు వరసగా మగపిల్లలు కలుగుతూ వచ్చారు. పుట్టిన పిల్లలను పుట్టినట్టే ఆమె గంగలో పడేస్తూ వచ్చింది. ఇది శంతనుడికి చాలా బాధ కలిగించింది. కాని తాను ఇందుకు అభ్యంతరం చెబితే ఆమె తనను విడిచి పోతుందని భయపడి, ఏడుగురు కొడుకులను గంగ పాలు కానిచ్చాడు.

కాని ఆమె ఎనిమిదవసారి మళ్ళీ కొడుకును కన్నప్పుడు, ఆ బిడ్డను చావనివ్వటం ఇష్టంలేక ఆమెను తూలనాడుతూ, "పుట్టిన కొడుకు లందరినీ గంగలో వేశావు గదా. ఏ ఆడదైనా ఇలా సొంత బిడ్డలను చేతులారా చంపుకుంటుందా? ఇకనైనా ఈ పుట్టిన వాణ్ణి బతికి ఉండనీ. ఇంతకూ నువ్వెవరు? బిడ్డలందరినీ ఎందు కిలా చంపుతున్నావు?" అని అడిగాడు శంతనుడు.

"నీకు కొడుకు కావాలని ఉంటే వీణ్ణి చంపకుండా నీ కిస్తాను. నాకు అడ్డు చెప్పావు గనక నే నిక నిన్ను విడిచి వెళ్ళి పోతాను. నే నెవరిననీ, నా పిల్లలను ఎందుకు చంపాననీ అడిగావు. చెబుతాను విను. నేను గంగను. వసిష్ఠుడు అష్టవసువులను మనుషులుగా పుట్టమని శపించగా, వారు నన్నూ, నిన్నూ తల్లిదండ్రులుగా కోరుకున్నారు. వారి కోసమే నేను స్త్రీరూపం ధరించి ఇన్నాళ్ళూ నీకు భార్యగా ఉన్నాను. నా గర్భాన పుట్టిన వసువులను త్వరలోనే వారి లోకానికి పంపగలందులకు, పుట్టగానే చంపేస్తూ వచ్చాను. నీకు కొడుకు లేకుండా పోతాడేమో నని వీణ్ణి బతకనిస్తున్నాను," అన్నది గంగ.

అయితే గంగ ఆ కొడుకును శంతనుడి కివ్వక, వాడితో సహా అంతర్ధాన మయింది. భార్యాపుత్రు లిద్దరినీ పోగొట్టుకున్న విచారంతో శంతనుడు హస్తినాపురానికి తిరిగి



వచ్చాడు. కొంత కాలం గడిచింది. ఒకనాడు అతను వేటాడుతూ గంగా తీరానికి వచ్చి, గంగా ప్రవాహం చాలా సన్ననిపాయగా ఉండటం చూసి ఆశ్చర్యపడ్డాడు. ఒక యువకుడు బాణాలు వేసి గంగా ప్రవాహానికి ఆనకట్ట కడుతూండటం శంతనుడి కంటపడింది.

అప్పుడు గంగ తన పూర్వ రూపంలో శంతనుడి ముందు కనబడి, ఆ కుర్రవాణ్ణి చూపి, "వీడు నీ ఎనిమిదో కొడుకు. ఇంత కాలమూ నేను వీణ్ణి పెంచి పెద్దచేశాను. వీడు వసిష్ఠుడి వద్ద వేదవేదాంగాలు నేర్చుకున్నాడు, పరశరాముడి వద్ద ధనుర్విద్య నేర్చుకున్నాడు. వీడి పేరు దేవవ్రతుడు. ఇక నువు వీణ్ణి తీసుకుపో," అన్నది.

శంతనుడు దేవవ్రతుణ్ణి తన వెంట హస్తినాపురానికి తీసుకుపోయి, యువరాజును చేసి చాలా సంతోషించాడు.

నాలుగు సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు శంతనుడు యమునాతీరానికి విహరించబోయాడు. అక్కడ అతనికి అపూర్వమైన సువాసన తగిలింది. ఆ వాసన వచ్చిన దిక్కుగా వెళ్ళి, ఒక అపురూప సుందరి శరీరం నుంచి ఆ సుగంధం వస్తున్నట్టు తెలుసుకుని, శంతను డామెను పలకరించి,



"నువ్వెవరు? ఎవరి కూతురువు?" అని అడిగాడు.

"నేను దాశరాజు కూతుర్ని. నా పేరు మత్స్యగంధి. నన్ను యోజనగంధి అని కూడా పిలుస్తారు. నా తండ్రి ఆజ్ఞాపించగా నే నిక్కడ తెప్ప నడుపుతూ, మనుషులను నది దాటిస్తాను," అన్న దామె.

వెంటనే శంతనుడు దాశరా జున్న చోటికి వెళ్ళి, "నీ కూతుర్ని నా కిచ్చి పెళ్ళి చెయ్యి," అని అడిగాడు,

"నీ వంటి అల్లుడు దొరికితే అంత కన్న నా కేం కావాలి? అయితే, నా కూతురుకి పుట్టబోయే కొడుకు నీ అనంతరం రాజయే





టట్టుంటే నా కూతురి నిచ్చి నీకు చేస్తాను," అన్నాడు దాశరాజు.

దేవవ్రతుడు అదివరకే యువరాజై ఉండగా ముందు పుట్టబోయేవాడు తన అనంతరం రాజు కావటం పొసగదు. అందు చేత శంతనుడు దాశరాజు చెప్పినదానికి ఒప్పుకోక ఇంటికి తిరిగి వచ్చి, మత్స్య గంధిని పెళ్ళాడలేక పోయినందుకు పుట్టెడు విచారంలో మునిగిపోయాడు.

దేవవ్రతుడు తండ్రి విచారం గమనించి కారణ మడిగాడు. శంతనుడు దాశరాజు కూతురు మాట చెప్పాడు. వెంటనే దేవ వ్రతుడు పెద్ద పరివారాన్ని వెంటబెట్టుకుని దాశరాజు వద్దకు వెళ్ళి, "నా తండ్రికి నీ కుమార్తెను భార్యగా ఇయ్యి," అని అడిగాడు.

దానికి దాశరాజు, "బాబూ, ఈ పిల్ల ఉపరిచరవసువు కూతురు. ఈ పిల్లను ఆయన నా కిస్తూ, దీనిని తగిన వరుడి కిచ్చి చెయ్యమన్నాడు. దీని పేరు సత్యవతి. అసితుడైన దేవలుడు పెళ్ళాడతా నన్నప్పుడు కూడా నేను ఒప్పుకోలేదు. నీ తండ్రి చేసు కుంటానంటే తప్పక ఇస్తాను. కాని నాకు ఒకటే భయం. నువు చూడబోతే మహా యోధుడివి, వీరాగ్రేసరుడివి. సత్యవతికి పుట్టబోయే వాడు నీ ముందు ప్రాణాలతో నిలవటం కల్ల. ఆ భయంతోనే వెనకాడు తున్నాను," అన్నాడు.

అప్పుడు దేవవ్రతుడు దాశరాజుతో, "అలా అయితే నా ప్రతిజ్ఞ విను. నాకు నా తండ్రి రాజ్యం అక్కర్లేదు. సత్యవతికి పుట్టబోయే వాడే అందరితోబాటు నాకూ రాజుగా ఉంటాడు. అందరి ఎదటా నే నీ శపథం చేస్తున్నాను," అన్నాడు.

దాశరాజు దేవవ్రతుడితో, "ఇలాటి ప్రతిజ్ఞ అందరూ చెయ్యగలరా? నువు రాజ్యత్యాగం చేసినా నీ సంతతి ఊరుకో వద్దా?" అన్నాడు.







కాలక్రమాన విచిత్రవీర్యుడికి వివాహయోగ్యమైన వయసు వచ్చింది. అదే సమయంలో కాశీరాజు తన కుమార్తెలైన అంబ, అంబిక, అంబాలికలకు స్వయంవరం జరుపుతున్నానని చాటింపు వేశాడు. ఈ సంగతి తెలిసి భీష్ముడు సత్యవతితో చెప్పి, రథం మీద కాశీనగరానికి బయలుదేరి వెళ్ళాడు. స్వయంవరానికి అనేకమంది వచ్చి స్వయంవర మందిరంలో చేరారు. భీష్ముడు కూడా అక్కడికి చేరాడు. కాశీరాజు కుమార్తెలకు వచ్చిన వారి వివరాలు చెబుతున్నాడు. భీష్ముడు, "నేనీ కన్యలను నా తమ్ముడికిచ్చి చెయ్యటానికి తీసుకుపోతున్నాను," అని ప్రకటించి, అంబనూ, అంబికనూ, అంబాలికనూ తన రథంలోకి ఎక్కించుకుని, అక్కడ చేరిన రాజులతో, "ఈ కన్యలను విడిపించటానికి శక్తిగలవారు నాతో యుద్ధం చేసి నన్ను జయించండి," అని సవాలు చేశాడు.

అందరూ యుద్ధసన్నద్ధులై ఒక్కసారిగా అతని పైకి వచ్చారు. భీష్ముడు అంత మంది నుంచీ తనను రక్షించుకోవటమే గాక, కొందరిని చంపి, కొందరిని గాయపరిచి భీభత్సం కలిగించి, కాశీరాజుకూతుళ్ళతో సహా హస్తినాపురానికి బయలుదేరాడు. అందరూ ఓడిపోయాక సాళ్వుడు అతన్ని ఎదిరించి, ప్రాణాలతో తప్పించుకు పోయాడు.

హస్తినాపురం చేరగానే భీష్ముడు సత్యవతితో సంప్రతించి, కాశీరాజు కుమార్తెలను ముగ్గురినీ విచిత్రవీర్యుడికిచ్చి పెళ్ళి చేయ నిశ్చయించాడు.

అప్పుడు వారిలో పెద్దదైన అంబ, "నేను అదివరకే సాళ్వుణ్ణి వరించాను. అతను కూడా నాపై ప్రేమగా ఉన్నాడు. స్వయంవరం సక్రమంగా జరిగినట్టయితే నేనతన్ని వరించి ఉండే దాన్ని. నన్ను అసహాయురాలిని చేసి తీసుకు వచ్చావు. ఇప్పటికైనా



నా కోరిక చెల్లించటం నీకు ధర్మం,'' అని భీష్ముడితో అన్నది.

భీష్ముడు మంత్రులతోనూ, పురోహితుల తోనూ, బంధువర్గంతోనూ ఆలోచించి, వారు అనుమతించగా అంబను సాళ్వుడి వద్దకు పంపేసి, అంబికనూ, అంబాలికనూ విచిత్ర వీర్యుడి కిచ్చి పెళ్ళి చేశాడు.

అంబికనూ, అంబాలికనూ పెళ్ళి చేసుకున్నాక విచిత్రవీర్యుడు బొత్తిగా స్త్రీలోలుడైపోయి, రాజ్యకార్యాలను విడిచిపుచ్చి, తన భార్యలతోనే కాలం గడపసాగాడు. అతనికి కాలక్రమాన క్షయవ్యాధి సంప్రాప్తమై, దానితోనే అతను మరణించాడు. భీష్ముడు మరొకసారి తన తమ్ముడికి ఉత్తరక్రియలు చేసి, పుత్రశోకంతో విలపించే సత్యవతిని ఓదార్చాడు,

కొంతకాలమయాక సత్యవతి భీష్ముడితో, "నాయనా, మీ తండ్రి వంశాన్ని నిలబెట్టటానికీ, ఆయనకు పిండాలు పెయ్యటానికీ నువు ఒక్కడివే మిగిలావు. ఆపద్ధర్మంగా, అంబికా అంబాలికల యందు నువు సంతానంకను. అది సమ్మతం కాకపోతే తగిన కన్యను పెళ్ళాడి వంశంనిలబెట్టు,'' అన్నది.

భీష్ముడిందుకు సమ్మతించలేదు. "నేను చేసిన ప్రతిజ్ఞ తప్పను. ఇంద్రపదవి ఇస్తామన్నా నా నిర్ణయం మారదు. నువు ఆపద్ధర్మమని చెప్పేది అక్షరాలా అధర్మం. ఇంకొక ఆపద్ధర్మం ఉన్నది. దాన్నయినా పెద్దలనూ, ఆప్తులనూ, మంత్రులనూ విచారించి మరీ అమలుచెయ్యాలి. ఆ ఆపద్ధర్మమేమిటంటే, వంశం నిలబెట్టటానికి నీ కోడళ్ళు ఉత్తమ బ్రాహ్మణుల ద్వారా సంతానం పొందవచ్చు. పూర్వం పరశురాముడు ప్రపంచంలోని క్షత్రియులందరినీ చంపినప్పుడు, చనిపోయినవారి భార్యలు బ్రాహ్మణోత్తముల ద్వారా సంతానం పొంది క్షత్రియవంశాలు నిలబెట్టారు. మనంకూడా అలాగే చేయవచ్చు,'' అన్నాడతను.





# మహాభారతం

అప్పుడు సత్యవతి సిగ్గుపడుతూ తాను పడవ నడిపే రోజులలో పరాశరమహర్షికి కృష్ణద్వైపాయనుణ్ణి కన్న వృత్తాంతం చెప్పి, "అతను నా కొడుకు. గొప్ప తపస్సు చేసినవాడు. వేదాలను విభజించినవాడు. అతని ద్వారా భరతవంశాన్ని నిలబెట్టుదాం," అన్నది.

అందుకు భీష్ముడు సమ్మతించాడు. సత్యవతి తలుచుకోగానే కృష్ణద్వైపాయనుడనే వ్యాసుడు వచ్చి, "అమ్మా, నన్నెందుకు తలుచుకున్నావు?" అని అడిగాడు. సత్యవతి ఆయనకు తన ఉద్దేశం చెప్పింది. వ్యాసుడు సమ్మతించాడు.

తరవాత సత్యవతి అంబికను ఆ రాత్రి అలంకరించుకుని పడుకోమనీ, ఆమె వద్దకు ఆమె "బావ" వస్తాడనీ, అతనికి సంతానం కని వంశం నిలబెట్టమనీ చెప్పింది. "బావ" అంటే భీష్ముడే కాబోలునని అంబిక అనుకున్నది. కాని ఆ రాత్రి ఆమె గదిలోకి వ్యాసుడు వచ్చాడు. వ్యాసుడి గడ్డమూ, నల్లని ఆకారమూ, ఎర్రని కళ్ళూ చూసి అంబిక భయపడి కళ్ళు గట్టిగా మూసుకున్నది. ఆమె వ్యాసుణ్ణి అంతకు పూర్వం చూసి ఉండలేదు. ఆమె కళ్ళు మూసుకున్న దోషం చేత ఆమెకు పుట్టిన ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డి అయాడు.

ఇది చూసి సత్యవతి హతాశురాలై మళ్ళా వ్యాసుణ్ణి తలచుకున్నది. ఈ సారి ఆమె అంబాలికతో, "ఈ రాత్రి నీ వద్దకు ఒక ముని వస్తాడు. అతని ద్వారా ఒక

## 5. దుర్యోధనాదుల జననం



ఉత్తముడైన కొడుకును కని వంశం నిల బెట్టు," అన్నది.

ఆ రాత్రి అంబాలిక వ్యాసుడి అవతారం చూసి, కళ్ళు మూసుకోలేదు గాని, వెలవెల పోయింది. దాని ఫలితంగా తెల్లని శరీరంతో పాండుడు పుట్టాడు.

సత్యవతికి తృప్తి కలగలేదు. ఆమె మరొకసారి అంబికను హెచ్చరిస్తూ, "ఈసారయినా మునికి తగిన కొడుకును కను," అన్నది. కాని వ్యాసుణ్ణి తలుచుకుంటే కంపరం పుట్టుకొచ్చి, ఆమె ఆ రాత్రి తన దాసీని తన పడక గదిలో ఉంచింది. ఆ దాసీ దానికి వ్యాసుడి వల్ల విదురుడు పుట్టాడు.



ఈ విధంగా పుట్టిన ధృతరాష్ట్రుడూ, పాండుడూ, విదురుడూ పెరిగి పెద్దవారవుతూంటే భీష్ముడు రాజ్యభారం వహించి, దేశం సుభిక్షంగానూ, ప్రజలు సుఖశాంతులు కలిగి ఉండేటట్టూ రాజ్యపాలన చేశాడు. భీష్ముడు వారికి క్షత్రియోచిత విద్యలూ, వేదవేదాంగాలూ, నీతిశాస్త్రాలూ, నేర్పించాడు.

వారిలో ధృతరాష్ట్రుడు అమిత బలశాలి, పాండుడు ధనుర్విద్యలో ప్రవీణుడు, విదురుడు ధర్మపరుడు.

కాలక్రమాన భీష్ముడు ఆ ముగ్గురిలోనూ ఒకరికి రాజ్యాభిషేకం చెయ్యవలసి వచ్చింది. ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డి. విదురుడు దాసీ పుత్రుడు. అందుచేత వారిద్దరికీ కాక పాండుడికి భీష్ముడు రాజ్యాభిషేకం చేశాడు.

కురువాళ్ళకు వివాహయోగ్యమైన వయసు వచ్చింది. వాళ్ళకు తగిన కన్యలు ఎక్కడ ఉన్నారా అని భీష్ముడు ఆలోచించాడు. గాంధార రాజైన సుబలుడికి గాంధారి అనే కూతురున్నది. ఆమె తనకు నూరుగురు కొడుకులు కలిగేటట్టుగా శివుడి వల్ల వరం పొందినట్టు తెలిసింది. భీష్ముడు కొందరు బ్రాహ్మణులను సుబలుడి దగ్గిరికి







పంపి, గాంధారిని ధృతరాష్ట్రుడి కిచ్చి వివాహం చెయ్యమని అడిగించాడు. ధృత రాష్ట్రుడు గుడ్డివాడని తెలిసి కూడా అతని వంశం గొప్ప దనుకుని సుబలుడు ఒప్పు కున్నాడు. తనకు కానున్న భర్త గుడ్డి వాడని తెలియగానే గాంధారి తన కళ్ళకు గంతలు కట్టేసుకుని, తాను కూడా గుడ్డి దిగా ఉండిపోవ నిశ్చయించింది. ఆమె అన్న శకుని ఆమెను హస్తినాపురానికి తీసుకువచ్చి పెళ్ళి జరిపించాడు. తర వాత శకుని భీష్ము డిచ్చిన సత్కారాలన్నీ పొంది, గాంధారిని హస్తినాపురంలో వదిలి, తాను స్వదేశానికి తిరిగిపోయాడు.

ఇక పాండురాజుకు వివాహం కావలసి ఉన్నది. భీష్ముడికి కుంతి అనే యాదవ కన్యను గురించి తెలియ వచ్చింది.

యాదవ ప్రముఖులలో ఒకడైన శూరు డనేవాడు వసుదేవుడి తండ్రి. ఆయనకు పృథ అనే కూతురున్నది. శూరుడి మేనత్త కొడుకు కుంతిభోజు డనేవాడికి పిల్లలు లేక పోగా అతను ఈ పృథను తన కూతురుగా పెంచుకున్నాడు. కుంతిభోజుడి ఇంటికి వచ్చేపోయేవారి కందరికీ పృథ అతిథి సత్కారాలు చేస్తూ ఉండేది. అలాగే ఒక సారి దూర్వాసుడు వచ్చి, ఆమె చేసిన సత్కారాలకు సంతోషించి, ఆమెకు ఒక మంత్రం చెప్పి, "అమ్మాయీ, ఈ మంత్రాన్ని పునశ్చరణ చేసి జపించా వంటే నువు ఏ దేవుణ్ణి కోరితే ఆ దేవుడు వచ్చి నీకు ఒక గొప్ప కొడుకును ప్రసా దిస్తాడు," అని చెప్పాడు.

ముని మాట నిజమో కాదో చూతామని ఆ కుంతి ఒకనాడు సూర్యుణ్ణి మనసులో పెట్టుకుని మంత్రం జపించింది. వెంటనే సూర్యుడు ఆమె ఎదట ప్రత్యక్షమయాడు. ఆమె కొడుకును కోరలేదు. అయినా సూర్యుడి వల్ల గర్భవతి కావటం తప్పలేదు. సకాలంలో ఆమెకు కవచకుండలాలు గల



కొడుకు పుట్టాడు. ఏం చెయ్యాలో తెలి యక వాణ్ణి ఒక పెట్టెలో పెట్టి, ఆ పెట్టెను ఒక తెప్పకు కట్టి నదీ ప్రవాహంలో వది లింది. అది ఒక సూతుడికి దొరికింది. సూతుడు ఆ పెట్టెలో చిన్న సూర్యుడిలాటి పిల్లవాడుండటం గమనించి, ఆ పిల్లవాణ్ణి తన భార్య అయిన రాధ అనే ఆమె కిచ్చాడు. ఆమె ఆ కుర్రవాణ్ణి పెంచింది. అతనే కర్ణుడు.

ఇది జరిగాక కుంతిభోజుడు తన కుమా ర్తెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు. దానికి పాండుడు కూడా వెళ్ళాడు. కురు వంశంలో పుట్టి, ఎంతో అందంగానూ, వైభవోపేతుడుగానూ కనిపించిన పాండుడి మెడలో కుంతి వరమాల వేసింది. కుంతి భోజుడూ యిద్దరికీ ఘనంగా పెళ్ళిచేసి, అంతులేని కానుకలతో హస్తినాపురానికి పంపాడు. కుంతి కోసం ఒక ప్రత్యేకమైన అంతఃపురం ఏర్పాటయింది. అందులో కుంతీ పాండులు సమస్త సుఖాలూ అనుభ వించసాగారు.

పాండుడికి మరొక భార్యను కూడా పెళ్ళిచేయాలని భీష్ముడు నిశ్చయించాడు. మద్రరాజైన శల్యుడికి ఒక చెల్లెలున్నది. భీష్ముడు పెద్ద పరివారంతో శల్యుడి రాజ ధానికి బయలుదేరి వెళ్ళాడు.

శల్యుడు భీష్ముడికి ఎదురువచ్చి, స్వాగతం తెలిపి తీసుకుపోయి, ఆయన వచ్చిన పని అడిగాడు.

"నీ చెల్లెలు మాద్రిని మా పాండురాజు కిచ్చి పెళ్ళిచెయ్యి," అన్నాడు భీష్ముడు.

"అంతకంటె నాకైనా కావలిసినదేము న్నది? అయితే కన్యాశుల్కం పుచ్చుకోవటం మా వంశాచారం. కన్యాశుల్కం ఇచ్చి మా చెల్లెలిని తీసుకుపోయి మీ ఇంట వివాహం చేసుకోండి," అన్నాడు శల్యుడు.

వంశాచారాలను పాటించక తప్పదు గనక భీష్ముడు మద్రరాజుకు బంగారమూ,



రత్నాభరణాలూ, వస్త్రవాహనాలూ పుష్కలంగా ఇచ్చి, మాద్రిని హస్తినాపురానికి తెచ్చి, ఒక శుభముహూర్తాన పాండురాజు కిచ్చి వివాహం చేశాడు. పాండురాజు తన ఇద్దరు భార్యలతోనూ సుఖంగా కాలం గడపసాగాడు.

భార్యలతో ఒకనెల పాటు సుఖంగా గడిపిన తరవాత పాండురాజుకు దిగ్విజయం చెయ్యాలన్న కోరిక కలిగింది. అతను చతురంగ బలాలను సమకూర్చుకుని, ప్రయాణభేరి మోగించి, భీష్ముడు మొదలైన వారికీ, బ్రాహ్మణులకూ మొక్కి, మొదటగా దశార్ణదేశాలను జయించాడు. తరవాత మగధదేశం మీద దండెత్తి, మగధ రాజును చంపాడు. మగధ, కాశీ, పుండ్ర మొదలైన దేశాలు జయించి, అంతులేని కానుకలనూ, కప్పాలనూ పుచ్చుకుని పాండురాజు హస్తినాపురానికి తిరిగి వచ్చాడు. భీష్ముడు మొదలైన పెద్దలు పాండుడికి ఎదురువచ్చి గొప్పగా సన్మానించారు. పాండురాజు తాను వివిధ దేశాలలో కొల్లగొట్టిన సంపదను భీష్ముడికీ, సత్యవతికీ, విదురుడికీ, తమ తల్లులకూ పంచాడు. అందరూ సంతోషించారు. ఆ ధనంతోనే ధృతరాష్ట్రుడు అనేక అశ్వమేధాలు చేశాడు.

తరవాత పాండురాజు తన యిద్దరు భార్యలనూ వెంట బెట్టుకుని విహారం చెయ్యటానికి హిమవత్ప్రాంతంలోని అరణ్యాలకు వెళ్ళాడు. అక్కడ అతను చాలా కాలం ఉన్నాడు. అతనికి అవసరమైన వస్తువులను ధృతరాష్ట్రుడు పంపుతూ వచ్చాడు.

అక్కడ హస్తినాపురంలో భీష్ముడు విదురుడికి దేవకు డనే రాజుయొక్క కుమార్తె నిచ్చి పెళ్ళి చేశాడు.

ఒకనాడు ధృతరాష్ట్రుడి ఇంటికి వ్యాసుడు చాలా ఆకలితో వచ్చాడు. గాంధారి అయు

నకు సకలోపచారాలు చేసి సంతోష పెట్టింది. వ్యాసు డామెను వర మేదన్నా కోరుకో మన్నాడు. గాంధారి తన భర్తకు తీసిపోని కొడుకులను నూరుమందిని కోరింది.

తరవాత కొంత కాలానికి గాంధారి గర్భ వతి అయింది. అమె రెండేళ్ళపాటు గర్భాన్ని మోసింది. ఈ లోపుగానే కుంతికి యుధిష్ఠిరుడు పుట్టినట్టు వార్త వచ్చింది. వ్యాసుడు వరమిచ్చినా కూడా తన కింకా ప్రసవం కాలేదని బాధపడి, గాంధారి తన భర్తతోనైనా సంప్రతించకుండా, తన గర్భాన్ని గట్టిగా కొట్టుకున్నది. అందువల్ల ఆమెకు గర్భ స్రావమయింది. రెండేళ్ళు కష్టపడి మోసిన ఆ పిండం తాలూకు ఖండా లను అమె పారేద్దామనుకున్నది. ధృత రాష్ట్రుణ్ణి చూడవచ్చిన వ్యాసుడి కీ సంగతి తెలిసింది.

"ఏమిటి నువు చేస్తున్న పని?" అని అయన గాంధారి నడిగాడు.

గాంధారి ఏడుస్తూ, "మీరు నాకు నూరుగురు కొడుకులు కలిగేటట్టు వర మిచ్చారు. నేను రెండేళ్ళు గర్భవతిగా ఉండి కూడా పిల్లలను కనలేదు. ఇంతలో పాండురాజు భార్య అయిన కుంతికి చక్కని కొడుకు పుట్టినట్లు తెలిసింది. ఆ విచారంతో



నా పొట్టను నేనే కొట్టుకుని గర్భస్రావం చేసుకున్నాను. మీ వరం మాట ఏమో గాని ఈ గర్భం ఇలా ముక్కలు చెక్కల యింది," అన్నది.

"నా వరం ఎన్నటికీ వ్యర్థం కాదు," అంటూ వ్యాసుడు, గాంధారీ గర్భం నుంచి పడిన మాంస ఖండాలను నూరింటినీ చక్కగా చన్నీట కడిగించి, ఒక్కొక్క ఖండాన్ని ఒక్కొక్క నేతికుండలో పెట్టించ సాగాడు. అప్పుడు గాంధారి అయనతో, "ఈ నూరు ఖండాలూ నూరుగురు పిల్ల లవుతారు కాబోలు. వారితోబాటు ఒక అడ పిల్ల కూడా కలిగేటట్టు అనుగ్రహించండి.



దౌహిత్రుల వల్ల కూడా పుణ్యలోకాలు కలుగుతాయి," అన్నది.

ఆమె కోరిక సిద్ధించాలని వ్యాసుడు దీవించాడు. స్రావమైన గర్భాన్ని నూట ఒక్క ముక్క చేసి కుండలలో పెట్టించి వ్యాసుడు వెళ్ళిపోయాడు.

తరవాత ఒక్క సంవత్సరం గడిచే సరికి ఒక కుండ నుంచి మొదటి పిల్లవాడు పుట్టాడు. వాడు పుట్టగానే అనేక దుశ్శకునాలు కనబడ్డాయి. వాటిని చూసి ధృతరాష్ట్రుడు భయపడి, భీష్ముణ్ణీ, విదురుణ్ణీ, మంత్రులనూ, పురోహితులనూ పిలిపించి, "ఇదివరకే మా వంశంలో యుధిష్ఠిరుడు పుట్టాడుగదా, ఇప్పుడు పుట్టినవాడికి రాజ్యార్హత ఉంటుందా? కొంచెం ఆలోచించి చెప్పండి," అని అడిగాడు.

దానికి వాళ్ళు, "మహారాజా, వీడు పుట్టగానే దుశ్శకునాలు కనిపిస్తున్నాయి. వీడు వంశనాశకుడు. వీణ్ణి వదిలెయ్యి. నూరుమంది కొడుకులలో ఒకడు లేకపోతే నేం?" అని అన్నారు. విదురుడు కూడా ఆ మాటే చెప్పాడు. కాని పుత్రప్రేమ కొద్దీ ధృతరాష్ట్రుడు వాళ్ళ మాటలు విని పించుకోలేదు.

ఆ విధంగా మొట్టమొదట దుర్యోధనుడు పుట్టాడు. తరవాత క్రమంగా దుశ్శాసనుడూ, దుస్సహుడూ మొదలుగాగల కొడుకులూ, దుశ్శల అనే కూతురూ పుట్టారు.

గాంధారి గర్భవతిగా ఉన్న కాలంలో ఆమెకు బదులుగా తనకు పరిచర్యలు చెయ్యటానికి ధృతరాష్ట్రుడు ఒక వైశ్య స్త్రీని చేరదీశాడు. దుర్యోధనాదులు పుట్టిన యేడే ఆ స్త్రీ ధృతరాష్ట్రుడికి యుయుత్సుడనేవాణ్ణి కన్నది.

ధృతరాష్ట్రుడు తన కొడుకుల కందరికీ రాజోచిత విద్యలు నేర్పించి, వారి కందరికీ తగిన కన్యలను తెచ్చి వైభవంగా పెళ్ళిళ్ళు కూడా చేశాడు.






తన భార్యలైన కుంతినీ, మాద్రినీ వెంట బెట్టుకుని అరణ్యాలలో విహరిస్తూ, మృగాలను వేటాడటంలో పొద్దు పుచ్చుతున్న పాండురాజు ఒకనాడు కలిసి ఉన్న లేళ్ళ మిధునాన్ని కొట్టాడు. అవి నిజానికి లేళ్ళు కావు; కిందము డనే మునీ, ఆయన భార్యా లేళ్ళరూపం ధరించి కామసుఖం అనుభవిస్తున్నారు. చచ్చిపోతూ ఆ ముని, "నీవు నీ భార్యలతో కూడినప్పుడు నీకు కూడా మరణం సంభవించును గాక," అని శపించాడు.

ఆ మునిదంపతులను చంపినందుకు పాండురాజు చాలా విచారించాడు. అప్పటికింకా అతనికి సంతానం లేదు. ఇక ముందు మునిశాపం వల్ల సంతానం కలిగే అవకాశం కూడా లేకుండా పోయింది. ఆయన తన భార్యలతో, తాను సన్యాసం పుచ్చుకుని అరణ్యవాసం చేస్తాననీ, వాళ్ళు హస్తినాపురానికి తిరిగి వెళ్ళి, భీష్మ ధృతరాష్ట్ర విదురులకూ, మిగిలిన వారికీ ఈ విషయం చెప్పవలిసిందనీ అన్నాడు.

"నీ భార్యలమైన మేము ఎక్కడికి పోతాం? ఎక్కడ ఉంటాం? అందరమూ కలిసే తపస్సు చేసి, ఆయువు తీరినాక పుణ్యలోకాలకు పోదాం," అన్నారు కుంతీ మాద్రిలు. అందుకు పాండురాజు ఒప్పని పక్షంలో అప్పటికప్పుడే దేహత్యాగం చెయ్యటానికి కూడా వాళ్ళు సిద్ధపడ్డారు.

వాళ్ళ మాట కాదనలేక పాండురాజు, వారిద్దరినీ తన వెంటనే ఉండనిచ్చి వాన





అయితే అతని కొక అనుమానం కలిగింది. పుత్రులు లేనివాడికి, ఎంత తపస్సు చేసినా, పుణ్యలోకాలు లభించవు. తనకు సంతానప్రాప్తి లేదు. తనతో సమానులు గాని, తన కన్న ఉత్తములు గాని అయిన వాళ్ళకు తన భార్యలు కొడుకులను కంటే, వాళ్ళు తనకు క్షేత్రజులైన కొడుకులు అవుతారు. తాను కూడా క్షేత్రజుడే గద. ఈ విధంగా అనుకుని పాండురాజు తన అభిప్రాయాన్ని కుంతికి చెప్పాడు. ఇతరుల వల్ల కొడుకును కనటానికి ఆమె మొదట సమ్మతించలేదు. కాని పాండురాజు ఆమెను చివరకు ఒప్పించాడు.

కుంతి తన భర్తతో, "నాకు చిన్నతనంలో దుర్వాసమహాముని ఒక మంత్రం ఉపదేశించాడు. దాన్ని జపించినట్టయితే నేను తలచిన ఏ దేవత అయినా సరే వచ్చి నాకు పుత్రప్రాప్తి కలిగించగలడు. నేను ఏ దేవతను స్మరించను?" అన్నది.

"మరీ మంచిది. కౌరవవంశానికి రాజు కాబోయేవాడు గొప్ప ధర్మజ్ఞుడై ఉండటం అవసరం. అందుచేత నువు ధర్మదేవతను స్మరించు," అన్నాడు పాండురాజు.

ఆమె అలాగే చేసి, యముణ్ణి ప్రత్యక్షం చేసుకుని, అతని అనుగ్రహం వల్ల గర్భవతి

ప్రస్థం చెయ్యా నిశ్చయించాడు. ముగ్గురూ విలువగల తమ వస్త్రాలనూ, ఆభరణాలనూ విసర్జించి నారబట్టలు కట్టుకున్నారు. తమ వెంట ఉన్న పరిచారకులను హస్తినాపురానికి పంపేశారు. వాళ్ళు దేశాటన చేస్తూ నాగశతపర్వతమూ, చైత్రరథమూ, కాలకూటమూ, హిమవంతమూ, గంథమాదనమూ, ఇంద్రద్యుమ్నహ్రదమూ, హంసకూటమూ తిరిగి, అక్కడక్కడా కొద్ది కొద్ది రోజులుండి, శతశృంగపర్వతం చేరారు. అక్కడ అనేకమంది మునులున్నారు. పాండురాజు వారితో కలిసి తాను కూడా తపస్సు చేయసాగాడు.





అయింది. గాంధారి అప్పటికే ఒక సంవత్సరం నుంచీ గర్భవతిగా ఉంటున్నది. కాని గాంధారి ఇంకా గర్భిణిగా ఉండగానే కుంతికి కొడుకు కలిగాడు. ఆశ్రమంలో ఉంటున్న మునులు ఆ పిల్లవాడికి యుధిష్ఠిరు డని నామకరణం చేశారు.

తరవాత కుంతి, బలశాలి అయిన కొడుకు కావాలని భర్త కోరిన మీదట, వాయుదేవుడికి భీముణ్ణి కన్నది. భీముడు పుట్టుతూనే ఒక వింత జరిగింది. కుంతి ఆ బిడ్డను తన ఒడిలో పెట్టుకుని కూర్చుని వుండగా, ఆ ప్రాంతాలకు ఒక పెద్దపులి వచ్చింది. దాన్ని చూసి కుంతి భయపడి, తన ఒడిలో బిడ్డ ఉన్న సంగతి కూడా మరిచిపోయి, చివాలున లేచింది. బిడ్డ ఒక రాతి మీద పడ్డాడు. వెంటనే ఆ రాయి నాలుగుగా పగిలింది. అది చూసి అక్కడి వాళ్ళంతా దిగ్భ్రమ చెందారు. ఇది జరిగాకనే ఆ బిడ్డకు మునులు భీమసేను డన్న పేరు పెట్టారు.

పాండురాజుకు లోకోత్తరుడైన మరొక కొడుకుని కూడా కనాలనిపించింది. ఆయన కోరికపై ఇంద్రుడి ద్వారా కుంతి అర్జునుణ్ణి కన్నది. హస్తినాపురంలో గాంధారి నూరుగురు కొడుకులను కంటే, శతశృంగంలో కుంతి ముగ్గురు కొడుకులను కన్నది.





పాండురాజుకు కుంతి చేత ఇంకా కొడు
కులను కనిపించాలని ఉన్నది. కాని ఆమె
అందు కెంతమాత్రమూ ఒప్పుకోలేదు.

అయితే మాద్రి ఆయనతో, 'కుంతి
మంత్ర ప్రభావంతో కొడుకులను కన్నది
కదా, కుంతితో సమానురాలనైన నేను
సంతానం లేకుండా ఎందుకుండాలి? కుంతి
నా కా మంత్రం ఉపదేశించినట్టయితే నేను
కూడా పుత్రవతి నౌతాను గదా," అన్నది.

ఆమె కోరికను పాండురాజు కుంతికి
తెలిపాడు. కుంతి మాద్రికి మంత్రం ఉప
దేశించింది. మాద్రి అశ్వనీదేవతల నారా
ధించి, వారి ద్వారా నకుల సహదేవు లనే
కవల పిల్లలను కన్నది. మాద్రి మంత్ర
ప్రభావంతో ఇంకా పిల్లలను కనేదే, కాని
ఆమె ఒకేసారి ఇద్దరు దేవతలను ఆహ్వా
నించిందని అలిగి, కుంతి ఆ మంత్రాన్ని
మాద్రికి మరి ఉపదేశించ నన్నది.

ఒక్కొక్క యేడాది తేడాగా పుట్టిన
బిడ్డల ముద్దు ముచ్చట్లు చూసుకుంటూ
పాండురాజు కొంతకాలం గడిపాడు. ఆశ్రమ
వాసులందరూ ఆ పిల్లల పెంపకంలో శ్రద్ధ
చూపారు. వసుదేవుడు తన పురోహితుడైన
కశ్యపు డనే బ్రాహ్మణుడి ద్వారా తన
మేనల్లుళ్ళకు బంగారు నగలూ, పట్టు
బట్టలూ, ఆటబొమ్మలూ, ఇతర వస్తువులూ
పంపాడు. పాండురాజు తన పిల్లలకు
చౌలమూ, ఉపనయనమూ మొదలైనవి
చేయించి, అక్కడి ఋషుల చేత వేదా
ధ్యయనం చేయించాడు.

ఇలా కొంతకాలం జరిగినాక ఒక వసంత
కాలంలో, కుంతి బ్రాహ్మణ సమారాధనలో
మునిగి ఉన్న సమయంలో పాండురాజు,
ఒంటరిగా ఉన్న మాద్రిని చూసి కామ
మోహితుడై, ఆమెను కలిసి, కిందముడి
శాపం తగిలి చనిపోయాడు.

చచ్చిపోయిన తన భర్తను కౌగలించు
కుని మాద్రి ఏడుస్తూండటం విని కుంతీ,





పాండవులూ, శతశృంగంలో ఉండే మునులూ వచ్చి, జరిగినదానికి ఆశ్చర్యపోయారు. మాద్రి కుంతిని దగ్గిరికి పిలిచి, పాండురాజు మరణానికి కారణం చెప్పింది.

"అయ్యో, మాద్రీ! రాజుకు ముని శాపం ఉందని తెలిసి, నే నెంతో జాగ్రత్త పడుతూ వచ్చాను గదా, ఇలా ఎందుకు జరగనిచ్చావు? ఇప్పుడు చేసేదేముంది? పెద్ద భార్యను గనక నేను సహగమనం చేస్తాను. నువు పిల్లలను దగ్గిర పెట్టుకుని పెంచు," అన్నది కుంతి.

మాద్రి ఏడుస్తూ, "నేను ఎంత ప్రయత్నించి కూడా భర్తను నిరోధించలేకపోయాను. భర్త ప్రాణాలు కాపాడుకోలేని దాన్ని, ఈ పిల్లలను నేనేం కాపాడగలను? ఈ లోకంలో భర్తను సుఖపెట్టలేక పోయినందుకు, మరో లోకంలో నైనా సుఖపెట్ట గలనేమో, భర్త వెంట నేనే పోతాను," అని కుంతి వద్ద సెలవు పుచ్చుకుని, భర్త చితి మీద తాను కూడా కాలిపోయింది.

తరవాత శతశృంగంలో ఉండే మునులు కుంతినీ, పాండవులనూ వెంటబెట్టుకుని, మాద్రీ పాండురాజుల అస్థికలను తీసుకుని హస్తినాపురం చేరి, జరిగినదంతా భీష్ముడు, ధృతరాష్ట్రుడు మొదలైన కౌరవముఖ్యులందరికీ చెప్పారు.

పాండురాజు పోయాడని విని భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ చాలా దుఃఖించారు. ధృతరాష్ట్రుడు విదురుడితో, చనిపోయినవారికి యథావిధిగా పరలోక క్రియలు జరిపించమని చెప్పాడు. మాద్రీ పాండురాజుల అస్థికలను పల్లకిలో ఉంచి, ఛత్రచామర లాంఛనాలతో ఊరేగించి, గంగలో కలిపారు. నగరంలో నుంచి అసంఖ్యాకులు వాటివెంట గంగాతీరం చేరారు. పన్నెండు రోజులపాటు అపరక్రియలు జరిగిన మీదట అందరూ నగరానికి తిరిగి వచ్చారు.



సత్యవతి వ్యాసుడి సలహా ననుసరించి, తన కోడళ్ళయిన అంబికా, అంబాలికలను వెంటబెట్టుకుని, తపస్సు చెయ్యటానికి అరణ్యాలకు బయలుదేరి పోయింది. అక్కడే తపస్సు చేసుకుంటూ ఆ ముగ్గురూ జీవితాలు ముగించారు.

అది మొదలు పాండవులూ, కౌరవులూ ధృతరాష్ట్రుడి వద్దనే పెరిగారు. అందరూ కలిసి ఆడుకునేవారు, ఒకరితో ఒకరు పందాలు పడేవారు. అన్ని ఆటలలోనూ భీముడిదే పై చెయ్యిగా ఉండేది. అతను తన బలం చూపటానికి ఒక్కసారిగా పది మందిని ఎత్తుకుని పరుగులు తీసేవాడు;



కోపం వస్తే అవతలివాళ్ళ జుట్టు పట్టుకుని, వదిలేవాడు కాడు; ఈతలు కొట్టేటప్పుడు పది పన్నెండు మందిని ఒకేసారి నీటిలో అదిమి పెట్టేవాడు; పిల్లలు పళ్ళ కోసం చెట్లెక్కితే మాను పట్టి ఊపి, వేళ్ళతో సహా చెట్టును కూలదోయ జూసేవాడు; కింద పడిపోతామని చెట్టు మీది పిల్లలు హడిలి చచ్చేవాళ్ళు. భీముడి కిలా చెయ్యాటంలో దుర్బుద్ధి ఏమీ లేకపోయినా, అతని చెలగాటం మిగిలిన వాళ్ళకు ప్రాణసంకటంగా ఉండేది. భీముడి అపారబలం చూస్తే దుర్యోధనుడికి మహా ఈర్ష్యగా ఉండేది. ఆ భీముడు ఒక్కడూ చస్తే, మిగిలిన వాళ్ళంతా తాను చెప్పినట్టు వింటారన్న దురాలోచన అతనికి కలిగింది. అందుకు తగిన అవకాశమే త్వరగా చిక్కలేదు.

గంగాతీరాన ప్రమాణకోటిస్థల మనే చోటున్నది. అక్కడ జలక్రీడలు జరపటానికి అనుకూలంగా, నాలుగువైపులా మెట్లుగల క్రీడా సరస్సులూ, ఉద్యానవనాలూ, ఎత్తయిన మేడలూ మొదలైనవి దుర్యోధనుడు కట్టించుకుని ఉన్నాడు. ఒక రోజు రాజకుమారు లందరూ అక్కడికి వెళ్ళి విహరించటానికి నిర్ణయం జరిగింది. రకరకాల భక్ష్యాలూ, భోజ్యాలూ, పానీ

యాలూ మొదలైనవి తయారయాయి. వాటిని సేవకులు ప్రమాణకోటిస్థలానికి తీసుకుపోయారు.

రాజకుమారులతో కలిసి పాండవులు కూడా విహారానికి వెళ్ళారు. తెచ్చిన ఆహార పదార్థాలను అందరితోబాటు పాండవులు కూడా తిన్నారు. అయితే దుర్యోధనుడు భీముడి పక్కన చేరి, ఎంతో ప్రేమగా కబుర్లు చెబుతూ అతని చేత విషం కలిపిన భక్ష్యాలు తినిపించాడు. భీముడికి ఏ మాత్రమూ అనుమానం కలగలేదు. అతను మిగిలిన వాళ్ళతోబాటు జలక్రీడలాడి, విషం పనిచెయ్యనారంభించేసరికి వికారం పుట్టి, గంగాతీరాన చల్లగాలి కొట్టే చోట పడుకుని, స్పృహ తప్పిపోయాడు.

తన ఎత్తు పారినందుకు సంతోషించి దుర్యోధనుడు, భీముడి కాళ్ళూ, చేతులూ గట్టిగా తీగెలతో బంధించి, గంగలోని లోతైన మడుగులో అతన్ని పారేశాడు. ఇవేవీ భీముడికి తెలియదు. అతను తిన్నగా పాతాళలోకానికి దిగిపోయాడు.

అక్కడ అతన్ని విషపుపాములు కాటు వేశాయి. వాటి విషంతో దుర్యోధనుడు పెట్టిన విషం విరిగిపోయి, భీముడికి స్పృహ వచ్చింది. తన చేతులూ, కాళ్ళూ కట్టివేసి ఉన్నట్టు తెలుసుకుని అతను గట్టిగా ఒళ్ళు విరుచుకుని, బంధాలన్నిటినీ తెంపేసి, తనను కరిచే పాములను పట్టుకుని చంప నారంభించాడు.

ఈ సంగతి వాసుకికి తెలిసింది. వాసుకి వచ్చి, భీముణ్ణి చూసి, అతను తన బంధువేనని గ్రహించాడు. ఎందుకంటే, కుంతి తండ్రి అయిన శూరుడు వాసుకి చెల్లెలి కొడుకు. అందుచేత వాసుకి భీముణ్ణి తీసుకుపోయి, వెయ్యి ఏనుగుల బలాన్ని ఇవ్వగల రసాన్ని తాగించాడు. భీముడు ఆ రసాన్ని ఎనిమిది కుండలు తాగి, సుఖంగా నిద్రపోయాడు.






ఈ లోపల ధర్మరాజు భీముడి కోసం అంతటా వెతికాడు. భీముడి జాడ లేదు. దుర్యోధనుణ్ణి అడిగితే, "అప్పుడే నగరానికి వెళ్ళిపోయాడు," అన్నాడు. ధర్మరాజు వెంటనే నగరానికి తిరిగి వెళ్ళి, కుంతిని కలుసుకుని, భీముడు వచ్చాడా అని అడిగితే ఆమె రాలేదన్నది.

"వాడు ఒకచోట పడుకుని నిద్రపోవటం చూశాను. మళ్లీ చూస్తే అక్కడ లేడు. అంతటా వెతికాను. ఎక్కడా కనబడడు. నా ప్రయాస అంతా వృధా. ఏమైపోయాడో?" అన్నాడు ధర్మరాజు.

కుంతికి దుఃఖం వచ్చింది. "నువూ, నీ తమ్ములూ నాలుగు దిక్కులా వాడికోసం వెతకండి, నాయనా," అని ఆమె ధర్మరాజును పంపేసి, విదురుణ్ణి పిలిపించి, "మిగిలినవాళ్ళతో ప్రమాణకోటిస్థలానికి వెళ్ళిన భీముడు తిరిగి రాలేదు. ధర్మరాజు ఎంత వెతికినా వాడు కనిపించలేదుట. దుర్యోధనుడికి వాడంటే అమిత ఈర్ష్య; వాడి ప్రాణాలు తీశాడో ఏమోనని భయంగా ఉన్నది," అన్నది.

"నాతో అంటే అన్నావు, ఈ మాట మరెక్కడా అనకు. దుర్యోధనుడు పరమ దుర్మార్గుడు. ఈ మాట వింటే వాడు నీ మిగిలిన కొడుకులను బతకనివ్వడు. అది చూసుకో. అయినా భీముడి ప్రాణాల కేమీ భయం ఉండదులే. నీ కొడుకు లందరూ దీర్ఘాయువులు," అని విదురుడు కుంతిని ఊరడించి వెళ్ళిపోయాడు.

7. ద్రోణుడి కథ



అక్కడ నాగలోకంలో భీముడు ఎనిమిది రోజులు నిద్రపోయి, మేలుకున్నాడు. అప్పుడు నాగులు అతనితో, "నువు తాగిన దివ్యరసం ఇప్పుడు జీర్ణమయింది. నీ కిక వెయ్యి ఏనుగుల బలం ఉన్నది. గంగలో స్నానం చేసి, నీ తల్లినీ, తోబుట్టువులనూ చేరుకో," అన్నారు.

వాళ్ళు భీముడి చేత గంగలో స్నానం చేయించి, కట్టుకోవటానికి పట్టుబట్ట లిచ్చి, అనేక ఓషదులు చేర్చి తయారుచేసిన పరమాన్నం పెట్టి, అనేక నగలతో అలంకరించారు. తరవాత ఒక నాగుడు భీముణ్ణి ప్రమాణకోటిస్థలంలో ఒక వనానికి



మోసుకు వచ్చాడు. భీముడు తనను సాగనంప వచ్చిన నాగుల వద్ద సెలవు పుచ్చుకుని, హస్తినాపురం చేరి, తల్లికీ, అన్నకూ నమస్కరించి, తమ్ముళ్ళను కౌగలించుకున్నాడు. అతని రాకతో అందరి విచారమూ తొలగిపోయింది.

భీముడు తల్లితో తనను దుర్యోధనుడు చంపాలని విషాహారం పెట్టటమూ, కాళ్ళు చేతులు కట్టి నదిలోకి తొయ్యటమూ, నాగలోకంలో తన అనుభవాలూ చెప్పాడు.

అది మొదలు పాండవులు ఒకరి నొకరు వెయ్యి కళ్ళతో కాపాడుకుంటూ వచ్చారు. దుర్యోధనుడు పాండవులకు ద్రోహం చెయ్యటానికి చేసిన ఆలోచనలను విదురుడు భగ్నం చేస్తూ వచ్చాడు.

కౌరవ పాండవ కుమారులు కృపాచార్యుల వద్ద విలువిద్య నేర్చుకునేటట్టు భీష్ముడు ఏర్పాటు చేశాడు. కుర్రవాళ్ళు కొంత కాలం కృపాచార్యుల వద్ద శిక్షణ పొందిన పిమ్మట భీష్ముడు వారికి గురువుగా ద్రోణాచార్యుణ్ణి ఏర్పాటు చేశాడు.

ఈ ద్రోణుడు భరద్వాజు డనే ఋషికి కొడుకు. అతను పెరిగి పెద్దవాడై వేద వేదాంగాలను పూర్తిగా చదివి, అస్త్రవిద్యలు నేర్చుకోవటానికి అగ్నివేశు డనే వాడివద్ద

శిష్యుడుగా చేరి, ఆగ్నేయాది అస్త్రాలను సంపాదించాడు. అగ్నివేశుడి వద్దనే మరొక శిష్యుడు కూడా ఉండేవాడు. అతను వృషతుడి కొడుకు, ద్రుపదు డనేవాడు. ఇద్దరూ ఒక గురువు దగ్గిర శిష్యులు కావటంచేత ఇద్దరికీ స్నేహం కుదిరింది.

కొంత కాలానికి పాంచాల రాజైన వృషతుడు చనిపోగా, ద్రుపదుడు పాంచాల దేశానికి రాజ్యాభిషేకం చేసుకున్నాడు. ద్రోణుడి తండ్రి అయిన భరద్వాజుడు కూడా పోయాడు. తరవాత ద్రోణుడు కృపాచార్యుడి చెల్లెలయిన కృపి అనే ఆమెను పెళ్ళాడాడు. వారిద్దరికీ అశ్వత్థామ అనే కొడుకు కలిగాడు.

ద్రోణుడు సంసారం ఈదే ప్రయత్నంలో సంపాదన మార్గం చూసుకోవలిసి వచ్చింది. పరశురాముడు బ్రాహ్మణులకు అడిగినంతగా దానాలు చేస్తున్నాడని విని ద్రోణుడు అక్కడకు వెళ్ళాడు. పరశురాముడు ద్రోణుడితో, "నాయనా, నా కున్నదంతా బ్రాహ్మణులకు ఇచ్చేశాను. భూమి అంతా కశ్యపుడి కిచ్చాను. ఇక నా వద్ద అస్త్రాలు తప్ప మరేమీ లేవు," అన్నాడు.

"ఆ అస్త్రాలనే నాకు దయచేయించండి," అన్నాడు ద్రోణుడు.



"పరశురాముడు ద్రోణుడికి తన వద్ద ఉన్న అస్త్రాలన్నీ ఇచ్చేస్తూ, వాటిని ఎలా ప్రయోగించాలో, ఎలా ఉపసంహరించాలో శాస్త్రోక్తంగా చెప్పాడు.

తరవాత ద్రోణుడు, తన పూర్వ స్నేహితుడైన ద్రుపదుడు తనకు సహాయపడతాడనే ఉద్దేశంతో, అతని వద్దకు వెళ్ళాడు. రాజయాక ద్రుపదుడికి కళ్ళు నెత్తి కొచ్చాయి. అతను ద్రోణుణ్ణి చూసి, "నువ్వెవరో నే నెరగను. వెళ్ళు, వెళ్ళు," అన్నాడు.

అవమానం పొందిన ద్రోణుడు హస్తినాపురానికి తిరిగి వచ్చి, తన బావమరిది చాటున అజ్ఞాతంగా ఉంటూ వచ్చాడు.



ఇలా ఉండగా ఒకనాడు కౌరవకుమారులు నగరం వెలపల బంతి ఆడుతూండగా బంతి ఒక బావిలో పడింది. దానిని పైకి తీయటం వారికి సాధ్యం కాలేదు. ఆ సమయంలో ద్రోణుడు వాహ్యాళికి అటుగా వచ్చాడు. కుర్రవాళ్ళు అతని చుట్టూ మూగి, ఎలాగైన బావిలో నుంచి బంతిని పైకి తీసి పెట్టమని బతిమాలారు.

"అబ్బాయిలూ, మీ రందరూ భరత వంశాంకురాలు, అందులోనూ కృపాచార్యుడి శిష్యులు; బావిలో నుంచి బంతిని తీయలేకపోతున్నారా? ఈ నా ఉంగరాన్ని బావిలో వేసి, దాన్నీ, మీ బంతినీ కూడా తీస్తాను, చూసుకోండి," అంటూ ద్రోణుడు తన ఉంగరాన్ని బావిలో వేశాడు.

ధర్మరాజు ద్రోణుడితో, "ముసలి బ్రాహ్మడా, ఈ పని చేశావంటే కృపాచార్యులుగారు నీకు యావజ్జీవం భోజనం ఏర్పాటు చేస్తాడు," అన్నాడు.

"చూస్తూ ఉండండి," అంటూ ద్రోణుడు ధనుర్బాణాలు తీసుకుని, ఒక బాణాన్ని బంతిలో ఇరుక్కునేటట్టు కొట్టాడు; తరవాత వరసగా బాణానికి బాణం తగులుకునేటట్టు చేసి, ఆ బాణాల తాడుతో బంతిని పైకి తీశాడు. పిల్లలందరూ ఆశ్చర్యపోయి, "ఉంగరాన్ని కూడా తియ్యి," అన్నారు.

ద్రోణుడొక బాణాన్ని మంత్రించి కొట్టి ఉంగరానికి తగులుకునేటట్టు చేశాడు. తరవాత, బంతిని లాగినట్టే ఉంగరాన్ని కూడా పైకి లాగాడు.

పిల్లలందరూ ఈ అద్భుతం చూసి దిగ్భ్రమ చెంది, ఒక్కసారిగా అయనకు నమస్కారాలు చేసి, "స్వామీ, ఇటువంటి శక్తి మే మెక్కడా చూడలేదు. మీ రెవరు? మా వల్ల మీకేం ఉపకారం కావాలి?" అని అడిగారు.

"మీరు పిల్లలు. నా గొడవ మీ కెందుకు? ఈ సంగతి మీ తాతగారైన భీష్ముడికి



చెప్పండి. నా సంగతి ఆయనే విచారిస్తాడు," అన్నాడు ద్రోణుడు.

పిల్లల ద్వారా భీష్ముడు సంగతంతా తెలుసుకుని, ద్రోణుణ్ణి సాదరంగా నగరానికి ఆహ్వానించి, "మీరు హస్తినాపురానికి రావటానికి కారణమేమిటి?" అని అడిగాడు.

ద్రోణుడు తన పుట్టుపూర్వోత్తరాలు చెప్పి, "మా తండ్రి నన్ను కృపాచార్యుడి చెల్లెలిని పెళ్ళాడమని ఆదేశించి చనిపోయాడు. నేనలాగే చేసి అశ్వత్థామను కన్నాను. తన తోటి వాళ్ళు ఆవుపాలు తాగుతుంటే నా కొడుకు తనకు కూడా ఆవుపాలు కావాలని ఏడ్చాడు. ఆవును సంపాదించటం నాకు సాధ్యం కాక, నీటిలో పిండి కలిపి, అవే ఆవుపాలని ఇస్తే, నా కొడుకు సంతోషంతో తాగుతూ వచ్చాడు. మా ఆశ్రమంలో వాళ్ళు నా బీద స్థితిని చూసి నిందించారు. నాకు నా సహపాఠి అయిన ద్రుపదుడు గుర్తు వచ్చాడు. చిన్నతనంలో అతను తనకు రాజ్యం వస్తే దాన్ని నా కిస్తాననేవాడు. అతని సహాయం ఆశించి పాంచాలదేశం వెళ్ళి, అతనికి మా పాత స్నేహం గుర్తు చేశాను. రాజ్యమదాంధుడై అతను, రాజైన తనకూ, పేద బ్రాహ్మడినైన నాకూ స్నేహమేమిటన్నాడు; నన్ను ఎరగనే ఎరగనన్నాడు; కావలిస్తే ఒక పూట భోజనం పెడతానన్నాడు. నాకు మండిపోయింది. భార్యనూ, కొడుకునూ వెంట బెట్టుకుని ఈ కురుదేశం వచ్చాను. మీరు పిలవనంపగా వచ్చాను. ఏమిటి తమ ఆజ్ఞ?" అన్నాడు.

"మీరు కురుదేశం రావటం మా పిల్లల సుకృతం. మీకు కావలిసిన సుఖాలన్నీ అమరుస్తాను. మిమ్మల్నే రాజుగా భావించి, మీ ఆజ్ఞలు శిరసావహిస్తాము," అని భీష్ముడు కొద్ది రోజుల అనంతరం ఒక నాడు కౌరవ, పాండవ కుమారులందరినీ ద్రోణుడికి శిష్యులుగా సమర్పించాడు.

ద్రోణుడు కుర్రవాళ్ళనందరినీ చేర్చి, "మీకు నేను విలువిద్య చెప్పటం పూర్తి అయినాక నా పని ఒకటి చేసి పెట్టవలిసి ఉంటుంది," అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. అర్జునుడు మాత్రం, "గురుదేవా, మీరేం చెప్పినా చేస్తాను," అన్నాడు.

ద్రోణుడికి చాలా ఆనందమయింది. ఆయన అర్జునుణ్ణి కౌగలించుకుని, చాలా సార్లు ముద్దాడాడు.

ద్రోణుడి దగ్గిర ధృతరాష్ట్రుడి కొడుకులూ, పాండురాజు కొడుకులూ మాత్రమే గాక, హస్తినాపురానికి వచ్చి ఉన్న యాదవ కుమారులు కూడా శిష్యులుగా చేరి విలు విద్య నేర్చుకున్నారు.

సూతుడి ఇంట పెరిగిన కర్ణుడు కూడా ద్రోణశిష్యుడయాడు.

అప్పటి నుంచి కూడా కర్ణుడికి దుర్యోధను డంటే అభిమానం; అవకాశం దొరికినప్పుడల్లా పాండవులను హేళన చేసేవాడు, అవమానించేవాడు.

ద్రోణుడు చెప్పిన విధంగా అస్త్రప్రయోగాలను సామర్థ్యంతో చేస్తూ వచ్చినవాడు ఒక్క అర్జునుడే. అందుచేత ద్రోణుడు, అర్జునుడు తనంతవాడు కాగలడని అనుకుంటూ ఉండేవాడు.





ద్రోణుడు ఒకపని చేసేవాడు. శిష్యులందరికీ చెంబులిచ్చి నీరు తెమ్మనేవాడు; తన కొడుకైన అశ్వత్థామకు పెద్ద మూతిగల చెంబు ఇచ్చి, మిగిలినవారికి చిన్న మూతి గల చెంబు లిచ్చేవాడు; ముందు వచ్చిన వారికి అనేక అస్త్రరహస్యాలు చెబుతూండేవాడు. పెద్ద మూతిగల చెంబు తీసుకున్న అశ్వత్థామ తన చెంబును శీఘ్రంగా నించుకుని ముందు వచ్చేవాడు. అర్జునుడు, తన చెంబుమూతి చిన్నదైనా, వారుణాస్త్ర ప్రభావంతో దాన్ని శీఘ్రంగా నించుకుని, అశ్వత్థామతోపాటే తిరిగి వచ్చి, అశ్వత్థామ నేర్చుకున్న రహస్యవిద్యలన్నీ తాను కూడా నేర్చుకునేవాడు. ఈ కారణంగా అశ్వత్థామకు అర్జునుడంటే చాలా అసూయ ఉండేది.

ద్రోణుడి ఇంట ఒక రాత్రి శిష్యులంతా భోజనం చేస్తూండగా గాలికొట్టి దీపం ఆరిపోయింది. అందువల్ల భోజనంచెయ్యటానికేమీ ఇబ్బంది కలగకపోవటం గ్రహించి అర్జునుడు, "అభ్యాసం వల్లగదా చీకటిలో కూడా అన్నం తినగలుగుతున్నాను. చీకటిలోనే విలువిద్య ఎందుకు అభ్యసించగూడదు?" అనుకుని, అలాచెయ్యనారంభించాడు.

ఒకరాత్రి ద్రోణుడికి ధనుష్టంకారం విని నిద్రాభంగమయింది. ఆయన లేచి వచ్చి, అర్జునుడు చీకట్లో విలువిద్యాభ్యాసం చేస్తూ ఉండటం గమనించి, కౌగలించుకుని, "నాయనా, నీతో సమానమైన విలుకాడు మరొకడు లేడనిపించేలాగా నిన్ను తయారు చేస్తాను," అన్నాడు. అన్నవిధంగానే ఆయన అర్జునుడికి దొమ్మియుద్ధం ఎలా చేయాలో, రథాలమధ్యా, ఏనుగులమధ్యా నేలపై నిలబడి ఎలా యుద్ధంచెయ్యాలో, గదలూ మొదలైనవాటితో యుద్ధం ఎలా చెయ్యాలో, వాటిలోని రహస్యాలన్నిటితో సహా నేర్పాడు.






హస్తినాపురానికి సమీపంలో ఉండే అరణ్యాలలో హిరణ్యధన్వుడు అనే యెరుకల రాజు ఒక డుండేవాడు. ఏకలవ్యుడు అతని కుమారుడు. ద్రోణుడనే ఆయన వద్ద దేశంలోని రాజకుమారులందరూ విలువిద్య నేర్చుతున్నారనీ, ఎక్కడెక్కడి నుంచో రాజకుమారులు వచ్చి ద్రోణుడికి శిష్యులై సమస్త అస్త్రశస్త్ర విద్యలూ అభ్యసిస్తున్నట్టూ ఏకలవ్యుడు విన్నాడు. అతను ద్రోణుడి వద్దకు వచ్చి, తనను కూడా ఒక శిష్యుడుగా చేర్చుకోమన్నాడు. ఆ కుర్రవాడు ఎరుకలవాడని తెలిసి, ద్రోణుడు అతన్ని శిష్యుడుగా చేర్చుకొన నిరాకరించాడు.

ఏకలవ్యుడు ఎంతో వినయంతో ద్రోణుడికి మొక్కి సెలవు పుచ్చుకుని, తన అరణ్యానికి తిరిగివెళ్ళి, ఒకచోట ద్రోణుడి బొమ్మ ఒకటి చేసిపెట్టి, బాణాలు ప్రయోగించటం అభ్యాసం చేయసాగాడు. ఈ అభ్యాసం ఫలితంగా ఏకలవ్యుడు విలువిద్యలో ద్రోణుడి శిష్యులందరినీ మించి పోయాడు.

ఒకనాడు ద్రోణుడి శిష్యులు వేటాడటానికి ఏకలవ్యుడుండే వనానికే వచ్చారు. వేటకుక్కలలో ఒకటి మిగిలిన కుక్కల నుంచి వేరై, జింకతోలు కట్టుకుని, మట్టి కొట్టుకుని, జుట్టంతా జడలు కట్టుకుపోయి ఉన్న ఏకలవ్యుణ్ణి చూసి మొరిగింది. ఏకలవ్యుడు కుక్క చేసిన ధ్వనినిబట్టి ఒకే సారి ఏడు బాణాలు వేసేసరికి, ఆ ఏడూ కుక్క ముఖంలో గుచ్చుకున్నాయి. అలా

## 8. ఏకలవ్యుడు



గుచ్చుకున్న బాణాలతోనే ఆ కుక్క మరింత గట్టిగా మొరుగుతూ, రాజకుమారుల వద్దకు తిరిగి వచ్చేసింది.

వాళ్ళు కుక్క ముఖంలో నాటిన బాణాలు చూసి, వాటిని వేసినవాడు చాలా గొప్ప విలుకాడై ఉండాలని గ్రహించి అతన్ని వెతుక్కుంటూ బయలుదేరారు. చివరకు వాళ్ళకు ఏకలవ్యుడు కనబడ్డాడు గాని వాళ్ళు అతన్ని గుర్తించక, "ఎవరు నువు? మీ తండ్రి ఎవరు? నీకు గురు వెవరు?" అని అడిగారు.

ఏకలవ్యుడు వారితో, "నేను ఎరుకల రాజు కొడుకును. నా పేరు ఏకలవ్యుడు. నేను ద్రోణాచార్యులవారిని నా గురువుగా భావించి విలువిద్యాభ్యాసం చేస్తున్నాను," అని చెప్పాడు.

రాజకుమారులు హస్తినాపురానికి తిరిగి వచ్చి, ఏకలవ్యుడి సంగతి ద్రోణుడికి చెప్పారు. ఏకలవ్యుడు తన కన్న విలువిద్యలో గొప్పవాడై ఉంటాడని అర్జునుడికి బెంగపట్టుకున్నది. అతను ద్రోణుడితో, "నా కన్న గొప్ప విలుకాడు లోకంలో మరొకడు ఉండటానికి వీలులేకుండా నాకు శిక్షణ ఇస్తామన్నారు. కాని ఈ ఏకలవ్యుడికి నా కన్న హెచ్చు విలువిద్య నేర్పినట్టున్నారే?" అన్నాడు.

అర్జునుడీ మాట అన్నమీదట ద్రోణుడు మిగిలిన శిష్యుల కెవరికీ తెలియకుండా అర్జునుణ్ణి మాత్రం వెంటబెట్టుకుని, అరణ్యంలో ఏకలవ్యుడుండే చోటికివెళ్ళాడు.

విలువిద్యాభ్యాసంలో మునిగి ఉన్న ఏకలవ్యుడు ద్రోణాచార్యుడికి ఎదురువచ్చి నమస్కరించి, కూర్చోబెట్టి అతిథి మర్యాదలు చేసి, ఎదురుగా నిలబడి, "నేను తమ శిష్యుణ్ణి!" అన్నాడు.

"నువు నా శిష్యుడవే అయితే గురుదక్షిణ ఏమిచ్చుకుంటావు?" అని ద్రోణుడు ఏకలవ్యుణ్ణి అడిగాడు.



"గురుదక్షిణగా ఇవ్వరానిదంటూ ఏముంటుంది? నా ఈ శరీరమంతా తమదే," అన్నాడు ఏకలవ్యుడు.

"అలా అయితే నీ కుడి బొటనవేలు కోసి ఇయ్యి," అన్నాడు ద్రోణుడు.

ఏకలవ్యుడు ఏ మాత్రమూ సంకోచించక తన కుడి బొటనవేలు నరికి ద్రోణుడి కిచ్చాడు. అటు తరవాత అతను విల్లును ఎడమచేత పట్టుకుని, కుడిచేతి మిగిలిన వేళ్ళతో బాణాలు సంధించటం అభ్యాసం చేశాడు. కాని అతను విలువిద్యలో మొదట ఉండిన ప్రావీణ్యాన్ని పోగొట్టుకున్నాడు.



ఈ విధంగా అర్జునుడి భయాన్ని తీర్చి, ద్రోణుడు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అతనితో సహా హస్తినాపురానికి తిరిగి వచ్చాడు.

ద్రోణుడి దగ్గిర అన్ని విద్యలూ నేర్చుకున్నప్పటికీ కూడా పాండవులు వేరువేరు విద్యలలో ప్రవీణులయారు. ధర్మరాజు రథికుడుగా గొప్ప ప్రావీణ్యం సంపాదించాడు. గదాయుద్ధంలో భీముడూ, దుర్యోధనుడూ బాగా రాణించారు. అర్జునుడు విలువిద్యలో సాటిలేనివాడయాడు; ఈ విద్యలో అతని బుద్ధి బలమూ, శరసంధానంలో వేగమూ, శస్త్రాస్త్రప్రయోగ నైపుణ్యమూ మరెవరికీ రాలేదు. అశ్వత్థామకు తెలిసిన యుద్ధరహస్యాలు మరెవరికీ తెలియవు. నకులసహదేవులు కత్తి యుద్ధంలో హెచ్చుగా రాణించారు.

భీముడి గదాయుద్ధ కౌశలమూ, అర్జునుడి విలువిద్యాతిశయమూ చూసి దుర్యోధనుడు మొదలైనవాళ్ళు చాలా బాధపడుతుండేవారు.

ఒకనాడు ద్రోణుడు తన శిష్యులలో ఎవరి కెంత గురి ఉన్నదీ తెలుసుకోగోరి, ఒక బొమ్మగద్దను చేయించి, దానిని కనపడీ కనపడకుండా ఒక చెట్టు మీద పెట్టించి, శిష్యులందరినీ చెట్టు వద్దకు





తీసుకుపోయి, "ఈ చెట్టు మీద ఉన్న పక్షి ఆకుల సందుగా జాగ్రత్తగా చూస్తే కనబడుతుంది. మీరందరూ విళ్ళకు బాణాలు సంధించి, నేను చెప్పగానే దాని తల తెగేటట్టు కొట్టాలి," అన్నాడు.

ఈ పరీక్షలో మొట్టమొదటి వంతు ధర్మరాజుది.

"బాగా చూడు. పక్షి కనిపిస్తున్నదా?" అని ద్రోణుడు అడిగాడు.

"కనిపిస్తున్నది," అన్నాడు ధర్మరాజు.

"పక్షితోబాటు నీకు నేనూ, మిగిలిన వాళ్ళూ కూడా కనిపిస్తున్నామా?" అని ద్రోణుడు మళ్ళీ అడిగాడు.

"మీ రందరూ కనిపిస్తున్నారు," అన్నాడు ధర్మరాజు.

"నీ దృష్టి గురి పైన లేదు. నువు ఆ పక్షి తల తెగవెయ్యలేవు," అన్నాడు ద్రోణుడు. ఆయన మిగిలినవారిని ఒక్కొక్కరినీ ఇదేవిధంగా ప్రశ్నించాడు. అందరూ ధర్మరాజులాగే జవాబు చెప్పారు.

చివరకు అర్జునుడు వచ్చి పక్షి కేసి చూశాడు. మిగిలినవాళ్ళంతా కనిపిస్తున్నారా అని ద్రోణు డడిగితే, తనకు పక్షి తప్ప ఇంకేమీ కనబడటం లేదన్నాడు.

"బాణం వదులు," అన్నాడు ద్రోణుడు.

మరుక్షణం బొమ్మపక్షి తల తెగి కింద పడింది. ద్రోణుడు అర్జునుణ్ణి మెచ్చుకుని, ద్రుపదుణ్ణి యుద్ధంలో గెలవగలవాడు అర్జునుడేనని తన మనసులో అనుకున్నాడు.

ఒకనాడు ద్రోణుడు తన శిష్యులనందరినీ వెంటపెట్టుకుని యమునకు స్నానానికి వెళ్ళాడు. ద్రోణుడు నదిలో స్నానం చేస్తూ ఉండగా ఒక మొసలి ఆయన తొడను పట్టుకున్నది. మొసలిని బాణాలతో కొట్టమని ఆయన తన శిష్యులకు కేకపెట్టాడు. అందరూ బాణాలు వేశారు గాని ఒక్కరి బాణమూ మొసలికి గురిగా తగలలేదు. బాణాలు ఆయనకు తగులుతాయని వాళ్ళు

భయపడ్డారు. ఒక్క అర్జునుడు మాత్రం అయిదు బాణాలు, గురువుగారి తొడకు తగలకుండా మొసలికే తగిలేటట్టు వేసి, మొసలిని చంపేశాడు.

ద్రోణుడు అర్జునుణ్ణి మెచ్చుకుంటూ, "అర్జునా, నీ నేర్పు చాలా గొప్పది. నీకు బ్రహ్మశిరోనామకాస్త్రం మంత్రసహితంగా ఉపదేశిస్తాను. దానిని మానవాతీతుడిపై ఉపయోగించవలిసిందే గాని సామాన్యుని పై ప్రయోగిస్తే లోకాలు దగ్ధమైపోతాయి," అన్నాడు.

అర్జునుడు అప్పటికప్పుడే స్నానం చేసి, శుచి అయి, ఆ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ద్రోణుడి నుంచి ఉపదేశం పొందాడు.

ఒకనాడు ద్రోణుడు ధృతరాష్ట్రుడి సభకు వెళ్ళాడు. అక్కడ వ్యాసుడూ, భీష్ముడూ, విదురుడూ, కృపుడూ, బాహ్లికుడూ, సోమదత్తుడూ మొదలైన పెద్దలందరూ ఉన్నారు.

ద్రోణుడు ధృతరాష్ట్రుడితో, "మహారాజా, కుమారులందరూ ఇంతకాలంగా నా వద్ద విలువిద్య నేర్చుకున్నారు. వారి ప్రావీణ్యం పరీక్షించండి," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ద్రోణుడితో, "మీరు మాకు మహోపకారం చేశారు. పిల్లవాళ్ళ విద్యాప్రదర్శనం ఎక్కడ జరిగేదీ, ఎప్పుడు



జరిగేదీ మీరే నిర్ణయించండి. మిగిలిన ఏర్పాట్లు నేను చేయిస్తాను," అన్నాడు.

ఆ ఏర్పాట్లు చేసే పని విదురుడికి అప్పగించారు. అవి బ్రహ్మాండంగా జరిగాయి. అస్త్రవిద్యాప్రదర్శనకు తగిన విశాలమైన ప్రదేశాన్ని శుభ్రంచేసి, రాళ్ళూ, పొదలూ తీసిపారేసి చదునుచేసి, ప్రేక్షకులు కూర్చునేటందుకు చుట్టూ ఇల్లులాగా కట్టి, ఉత్తరపు దిక్కున ప్రవేశద్వారం ఏర్పాటుచేశారు.

ఒక మంచి రోజున ప్రదర్శనకు ఏర్పాటు జరిగింది. ప్రదర్శన చూడటానికి పెద్దలందరూ బయలుదేరి వచ్చారు.



గాంధారి కుంతీ మొదలైన అంతఃపుర స్త్రీలు పల్లకీలలోనూ, డోలీలలోనూ వచ్చారు. అందరూ ఎవరి స్థానాలలో వారు కూర్చున్నాక ద్రోణుడు అశ్వత్థామను వెంటబెట్టుకుని వచ్చి, రంగస్థలం మధ్య నిలబడ్డాడు. ఆయన శిష్యులందరూ కవచాలూ, విల్లులూ, బాణతూణీరాలూ ధరించి, చేతుల్లో రకరకాల ఆయుధాలు పట్టుకుని రంగం మీదికి వచ్చారు. అందరిలోకీ పెద్దవాడైన ధర్మరాజు ముందూ, మిగిలినవారు అతని వెనకా రంగప్రవేశం చేశారు.

అందరూ రథాల మీదా, ఏనుగుల మీదా, గుర్రాల మీదా రంగస్థలంలో అనేక విన్యాసాలు చేసి తమ అస్త్రకౌశలాలు ప్రదర్శించారు; విలువిద్యలో తమ సామర్థ్యాలు చూపారు. బాణాలు తమ కెక్కడ తగులుతాయోనని ప్రేక్షకులు భయపడ్డారు. రంగస్థలంలో జరుగుతున్నదంతా ధృతరాష్ట్రుడికి విదురుడూ, గాంధారికి కుంతీ వివరిస్తూ వచ్చారు.

కొంతసేపయాక భీమదుర్యోధనులు గదలతో రంగంలోకి దిగి యుద్ధం ఆరంభించారు. అది ప్రదర్శన కొరకు ఏర్పాటు చేసిన యుద్ధమే అయినా ప్రేక్షకులు కొందరు భీముణ్ణీ, కొందరు దుర్యోధనుణ్ణీ రెచ్చగొట్టటం ప్రారంభించే సరికి ద్రోణుడు గదా యుద్ధం నిలుపు చేయించమని అశ్వత్థామను హెచ్చరించాడు.

చివరకు అర్జునుడు రంగస్థలం మీదికి వచ్చాడు. అతన్ని చూడగానే ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు. ధృతరాష్ట్రుడు విదురుణ్ణి, "ఆ కలకలం ఏమిటి?" అని అడిగితే విదురుడు చెప్పాడు.

అర్జునుడి ప్రదర్శనం ఊహించరానంత అద్భుతమనిపించింది. అతను దివ్యాస్త్రాలను ప్రయోగించి గాలీ, నిప్పూ, మేఘాలూ మొదలైనవి సృష్టించాడు. ఒక అస్త్రంతో అంతర్ధానమయాడు. అతని లక్ష్యసిద్ధి

అమోఘం. గుండ్రగా తిరిగే పందిబొమ్మ ముఖాన ఒకేసారి అయిదు బాణాలు కొట్టాడు. ఒక్క అవుకొమ్ములో ఇరవై ఒక్క బాణాలు గురి తప్పకుండా గుచ్చుకునేటట్టు వేశాడు.

కురవాళ్ళందరూ తమతమ విద్యలు ప్రదర్శించి, రంగస్థలం నుంచి నిష్క్రమించిన తరవాత అక్కడికి, సహజ కవచ కుండలాలతో బాల సూర్యుడిలాగా వెలిగిపోతూ, కర్ణుడు ధనుర్బాణాలు ధరించి వచ్చాడు. అతను ద్రోణాచార్యుడికీ, కృపాచార్యుడికీ నమస్కరించి, గంభీరమైన స్వరంతో, "ఓరీ, అర్జునా! ధనుర్విద్యలో నువే మొనగాడవనుకోకు. నువు ప్రదర్శించిన విద్యలన్నిటినీ నేను కూడా ప్రదర్శిస్తాను," అన్నాడు.

ఈ మాటతో అర్జునుడికి కోపమూ, అవమానమూ కలిగాయి; ప్రేక్షకులలో ఆసక్తి కలిగింది. నిజంగానే కర్ణుడు అర్జునుడు ప్రదర్శించిన విద్యలన్నీ తానూ ప్రదర్శించాడు. వెంటనే దుర్యోధనుడూ, అతని తమ్ములూ వచ్చి కర్ణుణ్ణి కౌగలించుకుని, అభినందించి, "ఈనాటి నుంచీ నువు మాకు ఆప్తుడివిగానూ, మాలో ఒకడివిగానూ ఉండు. మా శత్రువులను నాశనం చేసి, మాకు మేలుచెయ్యి," అన్నారు.

కర్ణుడు అందుకు సమ్మతించి, తనను అర్జునుడితో ద్వంద్వయుద్ధం చెయ్యనివ్వమని ద్రోణాచార్యుణ్ణి అడిగాడు. అర్జునుడు అందుకు సిద్ధమయాడు. తన కొడుకులు యుద్ధానికి తలపడటం చూసి కుంతి మూర్ఛపోయింది. చెలికత్తెలు ఆమెను సేదదీర్చారు.

అప్పుడు కృపుడు కర్ణుడితో, "నాయనా, నీ కులమేది? తల్లిదండ్రు లెవరు? నువు సుక్షత్రియుడివైతే తప్ప అర్జునుడు నీతో ద్వంద్వయుద్ధం చేయగూడదు," అన్నాడు.

కర్ణుడు తనను పెంచినవారి పేర్లు చెప్పటానికి సిగ్గుపడిపోయాడు.





# మహాభారతం

"అర్జునుడితో ద్వంద్వయుద్ధం చెయ్యాలంటే నువు కూడా రాజువై ఉండాలి," అని కృపాచార్యులు అనటమూ కర్ణుడు తన తల్లిదండ్రుల పేర్లు చెప్పటానికి బిడియపడటమూ గమనించి దుర్యోధనుడు కృపాచార్యులుతో ఇలా అన్నాడు:

"సుక్షత్రియ వంశంలో పుట్టినవారినీ, మహా శూరులనూ, పెద్ద సేనలు గలవారినీ రాజు లనవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి. అయినా కర్ణుడు అర్జునుడితో ద్వంద్వయుద్ధం చెయ్యటానికి అతడు రాజు కాదన్నదే అభ్యంతరమైతే అతన్ని ఈ క్షణాన్నే అంగరాజ్యానికి రాజుగా అభిషేకిస్తాను."

దుర్యోధనుడు ఆజ్ఞాపించగా మంత్రవేత్తలైన పురోహితులు వచ్చారు. బంగారు సింహాసనం వచ్చింది. బంగారు కలశాలతో నీరు వచ్చింది. పుష్పాక్షతలు వచ్చాయి. దుర్యోధనుడు కర్ణుణ్ణి సింహాసనంలో కూర్చోబెట్టి, రాజుగా అభిషేకించాడు.

ఈ కర్మకాండ ముగియగానే కర్ణుడు దుర్యోధనుడితో, "మహారాజా, నేను నీ నుండి రాజ్యదానం పొందినందుకు ప్రత్యుపకారం ఏమి చెయ్యను?" అన్నాడు.

"నీ వంటి పరాక్రమశాలి మైత్రి నాకు కావాలి," అన్నాడు దుర్యోధనుడు.

ఇదంతా చూస్తున్న కర్ణుడి పెంపుడు తండ్రి సూతుడు తాను తోలే రథం మీది

## 9. అంగరాజ్యాభిషేకం







నుంచి దిగివచ్చి, అంగరాజైన కర్ణుణ్ణి అభినందించాడు. కర్ణుడు సూతుడికి పుత్రభావంతో నమస్కరించాడు. సూతుడు కర్ణుణ్ణి లేవనెత్తి కౌగలించుకున్నాడు. ఇద్దరూ ఆనందబాష్పాలు రాల్చారు.

కర్ణుడు సూతుడి కొడుకన్నది బయటపడిపోయింది. భీముడు కర్ణుడితో, "సూతపుత్రా, రథాలు తోలుకోక అర్జునుడితో ద్వంద్వయుద్ధం చేస్తానంటావే? ఇదేమైనా బాగుందా? నీకీ అంగరాజ్య సింహాసనం మటుకు దేనికి?" అన్నాడు.

కర్ణుడికి మండిపోయింది. కాని ఏమీ అనలేక, కోపంగా బుసలు కొడుతూ ఆకాశంలో సూర్యుడి కేసి చూస్తూ ఉండిపోయాడు. తమ్ములమధ్య కూర్చుని ఉన్న దుర్యోధనుడు భీముడితో, "భీమసేనా, నీ మాటలు ఉచితంగా లేవు. రాజైనవాడు బలంగల ప్రతివాడితోనూ యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా ఉండాలి. అర్జునుడైనా అంతే. శూరుల పుటకా, ఏరుల పుటకా ఎవరూ చెప్పలేరు. దివ్యలక్షణాలూ, సహజకవచకుండలాలూగల ఈ కర్ణుడు సాధారణజన్ముడు కాడు. అతను ఒక్క అంగరాజ్యాన్నే కాదు, భూమినంతా ఏలదగినంతటి పరాక్రమవంతుడు. నేనితనికి చేసిన అంగరాజ్యాభిషేకం ఎవరికైనా సమ్మతం కాకపోతే వాళ్ళు నాతో ద్వంద్వయుద్ధం చేసి జయాపజయాలు తేల్చుకోవచ్చు," అన్నాడు.

ఈ మాటకు ప్రేక్షకులందరూ హాహాకారాలు చేశారు.

ఇంతకూ ఏ ద్వంద్వయుద్ధంగాని జరిగే లోపలనే సూర్యుడస్తమించాడు. కొందరు అర్జునుణ్ణీ, కొందరు కర్ణుణ్ణీ, కొందరు దుర్యోధనుణ్ణీ మెచ్చుకుంటూ అందరూ తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. దుర్యోధనుడికి మాత్రం ఆ రోజు పర్వదినం. ఈ నాటిదాకా అతనికి అర్జునుడు పక్కలో



బల్లెంలాగుండి బాధిస్తూ వచ్చాడు. ఈ రోజు నుంచీ దుర్యోధనుడికి అర్జునుడి భయం పోయింది. అతను గుండె మీద చెయ్యి వేసుకుని నిశ్చింతగా నిద్రపోయాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాటి ఉదయం ద్రోణుడు తన శిష్యులందరినీ పిలిపించి, "నాకు గురుదక్షిణ ఇవ్వండి," అని అడిగాడు. అందరూ ఆయనకు నమస్కారాలు చేసి, "ఏమిటి తమ ఉత్తరువు?" అని అడిగారు.

"ఐశ్వర్య మదంతో కొట్టుకుంటున్న అవివేకి ద్రుపదుడు. అతన్ని పట్టి తీసుకు రండి," అన్నాడు ద్రోణుడు.

గురువుగారి ఆజ్ఞ నిర్వర్తించటానికి కుమారులందరూ సిద్ధపడి, రథాలు సిద్ధం చేశారు; కవచాలు ధరించారు; ఖడ్గాలనూ, విల్లంబులనూ తీసుకున్నారు; ద్రుపదుడి పైకి యుద్ధానికి పోవటానికి సన్నాహాలు పూర్తిచేసి, అందరూ ద్రోణుడి వెంట బయలుదేరారు.

పాంచాలపురం కనుచూపు మేరలో ఉన్నదనగా అర్జునుడు ద్రోణుడితో, "వీరిలో ఒక్కరుకూడా ద్రుపదుణ్ణి తీసుకు రాలేరు. వీరు విఫలులై తిరిగి వచ్చేదాకా మా పాండవులం ఇక్కడే ఉండి, ఆ తరవాత ద్రుపదుణ్ణి పట్టితెస్తాం," అన్నాడు.





దుర్యోధనుడి ముఠా కర్ణుణ్ణి వెంటబెట్టుకుని రాచనగరు ప్రవేశించి, ద్రుపదుణ్ణి పట్టుకుంటామని వీరాలాపాలాడుకుంటూ రాజమార్గాన వస్తున్న సంగతి ద్రుపదుడికి తెలిసింది. ఆయన వెంటనే తన సేనలనూ, తమ్ములనూ వెంటబెట్టుకుని వాళ్ళతో యుద్ధానికి వచ్చాడు. కౌరవులూ, కర్ణుడూ కొంతసేపు దర్పంగానే పోట్లాడారు గాని, ద్రుపదుడి ధాటికీ, ద్రుపదుడి సేనల విజృంభణకూ తట్టుకోలేక, చావు తప్పి కన్ను లొట్టపోయిన విధంగా అయి, యుద్ధరంగం వదిలి పాండవులున్న చోటికి పారిపోయి వచ్చారు.

అప్పు డర్జునుడు ద్రోణుడికి ప్రణామం చేసి, ధర్మరాజు అనుమతి పొంది, భీముణ్ణి తన సేనకు నాయకుడుగానూ, నకుల సహదేవులను తన రథానికి చక్రరక్షకులుగానూ పెట్టుకుని, ద్రుపదుణ్ణి పట్టి తెస్తానని బయలుదేరాడు.

భీమార్జునులు ద్రుపదుడి సేనమీద పడి అల్లకల్లోలం చేసేశారు. అర్జునుడు భయంకరంగా యుద్ధం చేస్తూ తన రథాన్ని ద్రుపదుడి రథం ఉన్నవేపు పోనిచ్చాడు. ద్రుపదుడు రోషంతో అర్జునుడి మీద దారుణమైన దాడి చేశాడు. ఒక దశలో ద్రుపదుడు కనబడక ఆయన సైన్యం హాహాకారాలు చేసింది. అర్జునుడు ద్రుపదుడి రథాన్నీ, అశ్వాలనూ ధ్వంసం చేసి, కత్తి దూసి ద్రుపదుడి రథం కాడిపైకి దూకి ద్రుపదుణ్ణి పట్టుకున్నాడు.

ఈ లోపల భీమ నకుల సహదేవులు పారిపోయే ద్రుపదుడి సేనలను ఊచకోత కొయ్యటం అతని కంట పడింది. అర్జునుడు గట్టిగా కేక వేసి, "ద్రుపదుడు చిక్కాడు. మనం వచ్చిన పని పూర్తి అయింది. ఈయన మనకు బంధువు. అనవసరంగా ద్రుపదుడి సేనను హతమార్చకండి," అని వారిని హెచ్చరించాడు.

తరవాత అర్జునుడు ద్రుపదుణ్ణి కట్టి తీసుకువచ్చి ద్రోణుడికి గురుదక్షిణగా సమర్పించాడు. ద్రోణుడు ద్రుపదుణ్ణి చూసి, "పాంచాలరాజా, ఇప్పుడు నీ కాంపిల్య నగరం మాకు చిక్కింది. ఇప్పటికైనా నన్ను నీ బాల్యస్నేహితుడిగా గుర్తిస్తావా? భయపడకు. నేను బ్రాహ్మణ్ణి. పరమ శాంతమూర్తిని. మన బాల్యస్నేహాన్ని నేను మరవలేదు. నీ స్నేహం కోసమే నిన్ను తెప్పించాను. నాకు రాజ్యాలు ఏలేవాళ్ళ స్నేహమంటే చాలా ఇష్టం. కాని ఇప్పుడు నీకు రాజ్యం లేదు. నీ స్నేహం కోసమై అర్ధరాజ్యం ఇస్తాను తీసుకో. గంగకు దక్షిణంగా ఉండేదంతా నీ రాజ్యం. ఉత్తరంగా ఉండేది నా రాజ్యం. ఇద్దరమూ హాయిగా రాజ్యాలు ఏలుకుందాం," అన్నాడు.

ద్రుపదుడు ద్రోణుడితో శాశ్వత మైత్రికి ఒప్పుకున్నాడు. ద్రోణు డాయన కట్లు విప్పించి, వెళ్ళిపోనిచ్చాడు.

అదిమొదలు ద్రుపదుడు దక్షిణ పాంచాలానికి మాత్రమే రాజుగా ఉంటూ వచ్చాడు. మాకందీ, కాంపిల్య నగరాలు ఆయన రాజధానులు. సైనిక బలంతో ద్రోణుణ్ణి సాధించటం తనకు అసాధ్యమని ద్రుపదుడు గ్రహించాడు. అదీగాక ఆయనకు సంతాన కాంక్ష తీరలేదు. ఈ రెండు కారణాలచేతా





ఆయన దేశసంచారం చేస్తూ, గొప్ప తపస్సు చేసిన మునులను ఆశ్రయించ సాగాడు.

అహిచ్ఛత్రం రాజధానిగా చేసుకుని ఉత్తర పాంచాలాన్ని ద్రోణుడు పాలించాడు.

ఒక సంవత్సరం గడిచింది. ధృతరాష్ట్రుడు ధర్మరాజును యువరాజుగా అభిషేకించ నిశ్చయించాడు. ధర్మరాజు ధైర్యమూ, ఓర్పు గలవాడు; వక్ర స్వభావుడు కాడు; భృత్యులను ఆదరిస్తాడు.

యువరాజుగా ధర్మరాజు రాజ్యపాలనలో సమర్థుడనిపించుకున్నాడు. అతను పాండురాజు కన్న కూడా మేటి అని అందరూ మెచ్చుకున్నారు.

భీముడు బలరాముడికి శిష్యుడై గదా యుద్ధంలోనూ, ఖడ్గయుద్ధంలోనూ నైపుణ్యం సంపాదించాడు.

అర్జునుడు విల్లును దృఢంగా పట్టుకుని, ఆ చేతికి ఎంత దెబ్బ తగిలినా సరే విల్లు వదలకుండా ఉండటం అభ్యాసం చేశాడు. ద్రోణుడికి నచ్చిన అంశాలలో ఒకటి ఏమంటే అర్జునుడు అతి వేగంగానూ, లాఘవంగానూ బాణాలు వేయగలడు; అన్నిరకాల ఆయుధ ప్రయోగాలలోనూ మంచి చాతుర్యం గలవాడు.

"ఎంతటివాళ్ళు నీతో యుద్ధానికి వచ్చినా సరే వారిపట్ల గౌరవంకొద్దీ మానవద్దు; యుద్ధం విధిగా చెయ్యి," అని ద్రోణుడు అర్జునుడికి సలహా ఇచ్చాడు.

అర్జునుడు ద్రోణుడి అభిమానానికి పాత్రుడై, కౌరవ రాజ్యానికి శత్రువులుగా ఉండి తన తండ్రికి కూడా లొంగని సౌవీర రాజు విమలు డనేవాణ్ణీ, దత్తామిత్రు డనే వాణ్ణీ, అతడి తమ్ముణ్ణీ చంపాడు. తాను ఒక్కడే రథంమీద బయలుదేరి వెళ్ళి, తూర్పు దేశపు రాజులను పదివేల మందిని ఒక్కసారే జయించాడు; ఇంకా అనేక మంది పరిసర రాజులను కౌరవరాజ్యానికి సామంతులుగా చేసి, వారి నుంచి కప్పాలు

గానూ, కానుకలుగానూ అంతులేని ధన రాసులను సంపాదించి, వాటిని హస్తినా పురానికి చేర్చాడు.

నకుల సహదేవులు కూడా కౌరవ రాజ్యానికి శత్రువులైన రాజులను అనేక మందిని జయించి, అంతులేని ధనాన్ని తెచ్చి బొక్కసం నింపారు.

పాండవుల ఖ్యాతి ఈ రూపంగా నాలుగు దిక్కులా వ్యాపించటం చూసి ధృతరాష్ట్రుడు సహించలేక పోయాడు. వారిని అలాగే పైకి రానివ్వటమా, లేక నిగ్రహించటమా అన్నది తేల్చుకోలేక, కణికు డనే ముసలి బ్రాహ్మణ మంత్రిని సలహా అడిగాడు. శత్రువైన వాణ్ణి ఏ మాయోపాయంచేత నిర్మూలించినా తప్పు లేదన్నాడు కణికుడు.

ధృతరాష్ట్రుడిలాగే దుర్యోధనుడు కూడా కర్ణ శకుని దుశ్శాసనులతో ఆలోచించి పాండవులను నిర్మూలించాలన్న నిశ్చయానికి వచ్చి, తండ్రితో చెబితే, తండ్రి అలాగే చెయ్యమన్నాడు. పాండవులను వారణావత పురానికి (కాశీకి) పంపి, అక్కడ లక్క ఇంట దహించటానికి పథకం తయారయింది.

ధృతరాష్ట్రుడి ఆజ్ఞను అనుసరించి ఆయన మంత్రులు ఒకరొకరే పాండవుల వద్దకు వచ్చి వారణావతపురం ఎంత అందంగా ఉంటుందో వర్ణించసాగారు;



ఆ నగరాన్ని ఒక్కసారి చూడమని ప్రోత్స హించారు.

తరవాత ధృతరాష్ట్రుడే పాండవులను పిలిపించి, "నాయనలారా, వారణావత పురం చూడటానికి వెయ్యి కళ్ళు చాలవని అందరూ అంటున్నారు. త్వరలో అక్కడ శివుడికి ఉత్సవం కూడా జరగబోతున్నది. కావాలంటే, మీరు మీ అమ్మను వెంట బెట్టుకుని అక్కడికి వెళ్ళి, కొంతకాలం అక్కడ సరదాగా గడిపి, ఆ తరవాత హస్తినాపురానికి తిరిగి రండి," అని అన్నాడు. ఇది దేశ బహిష్కరణ అని ధర్మరాజు గ్రహించి, ధృతరాష్ట్రుడి మాట లకు పెద్దగా ఆనందం ప్రదర్శించ లేదు.

ఈలోగా దుర్యోధనుడు పురోచను డనే శిల్పిని ఏకాంతంగా తీసుకుపోయి అతనితో ఇలా అన్నాడు:

"మా తండ్రి పాండవులను వారణావత పురానికి పంపేస్తున్నాడు. నువ్వు ముందు గానే రథం మీద అక్కడికి వెళ్ళి, లక్క మొదలుగాగల వస్తువులతో, తగల బెడితే దివిటీలాగా మండే ఇంటిని అందంగా తయారు చెయ్యి. అందులో సామగ్రి అంతా ఏర్పాటు చేసి, చూసిన వాళ్ళు ఎంతో బాగున్నదనేటట్టుగా చూడు. పాండవులా యింట ఏ అనుమానమూ లేకుండా కొన్నా ళ్ళున్న తరవాత, అర్ధరాత్రివేళ వారు నిద్రలో ఉన్న సమయంలో ఇంటికి నిప్పు పెట్టి వచ్చెయ్యి. వాళ్ళందులో కాలి చచ్చి పోతే నేను నిశ్చింతగా ఉంటాను. నేను తరవాత రాజునై నీకు ఎంత ఉపకారం చేస్తానో చూసుకో."

ఇందుకు పురోచనుడు సమ్మతించాడు. అతనికోసం వేగవంతమైన గుర్రాలను పూన్చిన రథం సిద్ధం చేయించి, దానిమీద అతన్ని వారణావతపురానికి పంపేశాడు. పురోచనుడు అక్కడికి చేరుతూనే శ్రద్ధగా తన పనిలో నిమగ్నుడయాడు.





# మహాభారతం

పాండవులు తమ తల్లితో సహా వారణావతానికి పోవటానికి సిద్ధమయారు. వారి కోసం గుర్రాలు పూన్చిన రథాలు సిద్ధంగా ఉన్నాయి. వాళ్ళు భీష్ముడికీ, ధృతరాష్ట్రుడికీ, విదురుడికీ, ద్రోణకృపులకూ, బాహ్లిక సోమదత్తుల వంటి ఇతర పెద్దలకూ నమస్కారాలు చేసి, వారి ఆశీర్వాదాలు పొంది, దీనవదనాలతో బయలుదేరారు.

అప్పుడు కొందరు సాహసికులైన బ్రాహ్మణులు పాండవుల వెంబడి పోతూ, రాజ భయం ఏ మాత్రమూ లేక, "అయ్యో, ఈ గుడ్డిరాజు ఎంత పాపాత్ముడు! పాండవులు పాపం, ఎవరికేమి అపకారం చేశారు? వాళ్ల తండ్రి పాలించిన రాజ్యం వాళ్ళది కాదా? ఇలా వెళ్ళిపోవటానికి ధర్మరాజు మాత్రం ఎలా ఒప్పుకున్నాడు? ఈ పాపిష్టి రాజ్యంలో మనం ఎందుకుండాలి? ధర్మరాజు ఎక్కడికి పోతే మనమూ అక్కడికే పోదాం," అని గట్టిగా మాట్లాడుకున్నారు.

ఈ మాటలు విని ధర్మరాజు వాళ్ళతో, "అయ్యా, ధృతరాష్ట్రుడు మాకు పెద్ద దిక్కు. ఆయన ఎక్కడికి పొమ్మంటే మేము అక్కడికి పోతాము. మీరు మా మేలు కోరేవారు గనక మాకు ఎదురుగా వచ్చి దీవించి, మీ మీ ఇళ్ళకు తిరిగి వెళ్లండి," అని చెప్పి, వారిని పంపేశాడు.

సాగనంపటానికి వచ్చినవాళ్ళు కూడా వెనక్కు తగ్గినాక, విదురుడు ధర్మరాజు వెంట కొంతదూరం వెళ్ళి, వారి కోసం లక్క ఇల్లు నిర్మాణమై సిద్ధంగా ఉన్నదనీ

## 10. లక్క ఇంటి దహనం



శత్రువుల మనిషి ఒకడు ఆ యింట వారి వెంట ఉంటాడనీ, వారిని ఆ లక్క ఇంటితో పాటు కాల్చేసే ప్రయత్నం జరుగుతుందనీ ఏమరుపాటు ఏ మాత్రమూ లేక వారు ఆ ఇంటి నుంచి బయటపడి ప్రాణాలు దక్కించుకోవాలనీ, తన మనిషి ఒకడు లక్క ఇంటి నుంచి అరణ్యంలోకి సొరంగం తవ్వి ఉంచుతాడనీ, పాండవులు ప్రాణాలు దక్కించుకుని అరణ్యం చేరుకున్నాక నక్షత్రాలను బట్టి దిక్కు తెలుసుకుంటూ ఎటైనా వెళ్ళిపోవాలనీ, లక్క ఇంట ప్రవేశించటం మాత్రం మానవద్దనీ రహస్యంగా చెప్పి, తాను కూడా వెనక్కు మళ్ళాడు.



తరవాత కుంతీదేవి ధర్మరాజుతో, "నాయనా, విదురుడు నీతో ఏదో రహస్యంగా చెప్పాడు, దాన్ని మేము కూడా వినవచ్చునా?" అన్నది. ధర్మరాజు తల్లికీ, తమ్ములకూ, "అగ్ని వగైరా భయాలు కలిగితే నేర్పుగా తప్పించుకోమనీ, నేర్పుగా జీవిస్తూ, రాజ్యం సాధించుకోమనీ విదురుడు హెచ్చరించాడు. నేను సరేనన్నాను" అని చెప్పాడు.

ఫాల్గుణ శుద్ధ అష్టమీ రోహిణీ నక్షత్రం నాడు పాండవులు వారణావతం చేరారు. వారి రాక ముందుగానే తెలిసి వంది మాగధులూ, బ్రాహ్మణులూ మేళతాళాలతో ఎదురు వచ్చారు. వారికోసం ఊరంతా తోరణాలతోనూ, ముగ్గులతోనూ, పుష్పమాలలతోనూ అలంకరించారు. పాండవులు పురప్రవేశం చేసి, అక్కడి బ్రాహ్మణ; వైశ్య, శూద్ర గృహాలకు వెళ్ళి, అందరికీ బహుమతులిచ్చారు.

తరవాత పురోచనుడు వారిని వారికోసం ఏర్పాటు చేసిన ఇంటికి తీసుకుపోయి, అక్కడ వారికి భోజనంకూడా తానే ఏర్పాటు చేశాడు. అక్కడ వారు పదిరోజులున్న అనంతరం పురోచనుడు ధర్మరాజుతో, "అయ్యా, మీ కోసం కొత్తగా కట్టించిన





ఈ ఇంట్లో మీరు ప్రవేశించండి," అని ఆ ఇంటి గొప్పతనమంతా వివరించి చెప్పాడు. ఆ ఇంటి రహస్యం అదివరకే తెలుసుకుని ఉన్న ధర్మరాజు పురోచనుడితో ఆ ఇంటి అందచందాలు మెచ్చుకుంటున్నట్టుగా మాట్లాడి, తల్లితోనూ, తమ్ములతోనూ ఆ ఇంట ప్రవేశించాడు.

తరవాత ధర్మరాజు భీముడితో రహస్యంగా విదురుడు చెప్పినదంతా చెప్పి, "భీమసేనా, ఈ ఇంటి సువాసన చూడు. అంటిస్తే ఇది క్షణంలో అంటుకుంటుంది. మనని ఈ ఇంట దహనం చెయ్యటానికి ఏర్పాటయినవాడే ఈ పురోచనుడు. అందుచేత మనం జాగ్రత్తగా ఉండాలి," అన్నాడు.

ఆ మాట విని భీముడు, "అయితే, మనం ఈ ఇంట్లో ఉండనే వద్దు. మొదట ఉన్న బసకే పోదాం," అన్నాడు.

"అది పెద్ద పొరపాటు. మనం ఈ ఇంట్లో కాలిపోయే అవకాశం లేకపోతే ఈ పురోచనుడు మనని మరొక విధంగా చంపే ప్రయత్నం చేస్తాడు. మనం ఈ ఇంటితో పాటు కాలిపోయామనే భ్రమ కలిగించి తప్పించుకు పారిపోవటం ఒకటే ఉపాయం. పారిపోవటానికి గాను మనకు అరణ్యమార్గాలు బాగా తెలియటం అవ



సరం. వేట నెపంతో రోజూ అరణ్య మార్గాలన్నీ అన్వేషింతాం," అన్నాడు ధర్మరాజు.

ఆ ప్రకారమే పాండవులు పగలంతా వేటాడుతూ అరణ్యంలో తిరిగి, రాత్రి తెల్లవార్లూ జాగ్రత్తమీద ఉంటూ వచ్చారు.

ఈ లోపుగా హస్తినాపురంలో విదురుడు సొరంగాలు తవ్వటంలో నిపుణుడైనవాణ్ణి ఒకణ్ణి పిలిపించి, వాడికి చెప్పవలసినదంతా చెప్పి, వాడు తన మనిషి అని తెలియగలందులకు కొన్ని సంకేతాలు చెప్పి వారణావతంలో ఉన్న పాండవుల వద్దకు పంపాడు.

వాడు పాండవులను చేరుకుని, "దుష్టచతుష్టయం నియోగించి పంపిన ఈ దుర్మా





ర్గుడు పురోచనుడు వచ్చే కృష్ణచతుర్దశి రాత్రి ఈ లక్క ఇంటికి నిప్పు పెట్ట బోతున్నాడు. ఆ రాత్రి మీరు తప్పించుకు పోవటానికి ఈ ఇంటి మధ్యనుంచి ఊరి బయటి వనంలోకి సొరంగం తవ్వమనీ, దాని ద్వారా బయటపడి మీరు ఎటైనా వెళ్ళి పోవలసిందనీ విదురుడు హెచ్చరించాడు. నేను సొరంగం తవ్వటానికే వచ్చాను," అన్నాడు.

ఆ మనిషి ఇంటి మధ్యనుంచి ఒక బిలం తవ్వి, దాని ద్వారాన్ని ఎంతో నేర్పుగా కప్పిపెట్టి పాండవులకు చూపాడు. పాండవులు తామున్న ఇంటిని గురించిగాని, దానిని తగల బెట్టటానికి నియోగించబడిన పురోచనుణ్ణి గురించిగాని తమకు ఏ మాత్రమూ అనుమానం లేనట్టే ప్రవర్తించి, పురోచనుడికి నమ్మకం కలిగించారు.

కృష్ణచతుర్దశి వచ్చింది. ఆ రోజు కుంతీదేవి పురంలోని బ్రాహ్మణులకూ, బ్రాహ్మణ స్త్రీలకూ అన్నసంతర్పణ చేసింది. పురోచనుడు ఒక ఆటవిక స్త్రీనీ, ఆమె పిల్లలనూ పాండవులకు సేవ చెయ్యటానికి నియోగించాడు. ఆ ఆటవిక కుటుంబం వాళ్ళు వన్యఫలాలు తెచ్చేవాళ్ళు, ప్రతి పనిలోనూ కుంతీదేవికి సాయపడేవాళ్ళు. ఆ రోజు ఉత్సవం గనక ఆ స్త్రీతోబాటు, ఆమె కొడుకులు అయిదుగురూ జాస్తిగా కల్లు తాగి, ఆ రాత్రికి ఆ ఇంటనే పడుకున్నారు.

అర్ధరాత్రివేళ భీముడు వెళ్ళి, పురోచనుడు పడుకునే గది వాకిలికి నిప్పు అంటించి, తల్లినీ, అన్నలనూ సొరంగం గుండా పంపేసి, ఇంటి నాలుగు మూలలా నిప్పు పెట్టి, తాను కూడా బిలం ప్రవేశించి, సొరంగం తవ్వినవాడికి తమ క్షేమం తెలిపాడు. అందరూ సొరంగ మార్గాన అరణ్యం చేరారు.

వారు అరణ్య మార్గాన పోయేటప్పుడు కుంతి నడవలేకపోయింది. ఆమెను భీముడు

తన భుజాలమీది కెత్తుకున్నాడు. అతను మిగిలినవాళ్ళను కూడా పట్టుకుని నడిపించ వలిసి వచ్చింది. ఈ విధంగా వాళ్ళు కటిక చీకటిలో పడి అరణ్య మార్గాన వెళ్ళి గంగా నదిని చేరుకున్నారు.

అక్కడ వారిని గంగ దాటించటానికి ఒక పడవ సిద్ధంగా ఉన్నది. ఆ పడవను విదురుడే ఏర్పాటుచేశాడు. పడవవాడు చెప్పిన మాటలనుబట్టి వాడు విదురుడి మనిషేనని రూఢి అయాక పాండవులు తల్లితో సహా వాడి పడవ ఎక్కి గంగ దాటారు. పడవవాడు పాండవులు చెప్పిన సంకేతపు మాటలు గ్రహించి, వాటిని విదురుడికి చేర్చటానికి హస్తినాపురానికి పడవ నడుపుకుంటూ వెళ్ళిపోయాడు.

ఇంకా రాత్రి కొంత మిగిలి ఉన్నది. పాండవులు నక్షత్రాలనుబట్టి దిక్కులు తెలుసుకుని, దక్షిణంగా నడవ నారంభించారు. కొంతదూరం వెళ్ళాక భీముడు తప్ప మిగిలినవాళ్ళు ఒక్క అడుగైనా నడవలేకపోయారు. రాత్రంతా నిద్ర లేదు, దారీ తెన్నూలేని అరణ్య మార్గాన నడక! అందరూ చతికిలబడటం చూసి భీముడు అందరినీ ఒక్కసారే ఎత్తుకుని కొంతదూరం నడిచి, ఒక చోట దించి, కూర్చున్నాడు.



కొంచెం సేపయాక కుంతి భీముడితో, "నాయనా, దాహంతో ప్రాణం పోయేటట్టున్నది," అన్నది. భీముడు మళ్ళీ అందరినీ ఎత్తుకుని పోయి ఒక మర్రిచెట్టు కింద దించి, "మీరందరూ ఇక్కడే పడుకుని ఉండండి. నేను వెళ్లి మీ అందరికీ నీరు తెస్తాను," అని బయలుదేరాడు. కొంతదూరం పోగా అతనికి నీటిపక్షుల కలకలం వినిపించింది. ఆ దిక్కుగా పోగా ఒక కొలను కనిపించింది. భీము డందులో స్నానం చేసి, తల్లికీ మిగిలినవారికీ కావలిసిన నీరు తీసుకుని తిరిగి వచ్చేసరికి, అందరూ గాఢనిద్రలో ఉండటం కనిపించింది.



"ఇంత ఆపదలో కూడా వీళ్ళు ఇంత నిద్ర పోతున్నారంటే ఎంతగా అలసి పోయారోగదా!" అనుకుని భీముడు, వాళ్ళను లేపటానికి మనసొప్పక, వారు ఎప్పుడు లేస్తారా, నీరిద్దామని వేచి కూర్చున్నాడు.

అక్కడ వారణావతంలో పాండవు లుండిన ఇల్లు కాలిన సంగతి ఊరు ఊరంతా తెలిసింది. జనం పోగయారు. ఇంకా మంటలు అంతో ఇంతో మండుతూనే ఉన్నాయి. సొరంగం తవ్వినవాడు ఆ మంట లను ఆర్పేవాడిలాగా బూడిదను అటూ ఇటూ తోస్తూ బిలద్వారాన్ని అతి నేర్పుగా కప్పేశాడు. పురోచనుడి శవమూ, ఆటవిక స్త్రీ శవమూ, ఆమె అయిదుగురు కొడుకుల శవాలూ కాలి గుర్తించ రాకుండా ఉన్నాయి. కుంతితో సహా పాండవులూ, వారివెంట ఉన్న పురోచనుడూ ఆ ఇంట కాలి పోయా రని జనం అనుకున్నారు.

ఈ వార్త హస్తినాపురం చేరింది. కుంతీ పాండవులు ఇంటితో సహా కాలి పోయారని వినగానే ధృతరాష్ట్రుడు గుండె లవిసి మూర్ఛ పోయాడు. విదురుడు కూడా నలుగురితో బాటు తాను కూడా దొంగ కన్నీరు కార్చాడు.

అక్కడ పాండవులు అలిసి నిద్ర పోతున్న వనంలో హిడింబు డనే రాక్షసు డుండేవాడు. వాడిది నల్లగా, అతి బలిష్ఠంగా ఉండే దేహం, పసుపుపచ్చ కళ్ళు, భయం కరమైన ఆకారం, వేల్లాడే పెద్ద కడుపు, మొనతేలిన ఎర్రని మీసాలు. వాడు నర భక్షకుడు. ఆకలి దహించుకుపోతూ హిడింబుడు ఆహారం కోసం అరణ్యమంతా తిరుగుతూ, ఒక మద్దిచెట్టెక్కాడు. దాని మీద కూర్చుని వాడు జుట్టు విదిలించు కుంటూ, బుర్ర గోక్కుంటూ, పెద్ద పెట్టున ఆవలిస్తూ, చుట్టూ చూస్తుండగా వాడికి దూరాన మర్రిచెట్టు కింద పడుకుని కొందరు మనుషులు కనిపించారు.

హిడింబుడు తన చెల్లెలైన హిడింబను పిలిచి, "చెల్లీ, చాలా కాలానికి మనిషి మాంసం దొరికింది. నువు వెళ్లి, ఆ మర్రి చెట్టు కింద ఎంత మంది ఉంటే అంత మందినీ చంపి తీసుకురా. మనం కడుపు నిండా తిని నృత్యం చేద్దాం," అన్నాడు.

హిడింబ అలాగే నని బయలుదేరి, పాండవులున్న చోటికి వచ్చి, నిద్రపోతున్న కుంతినీ, ధర్మరాజునూ, అర్జున నకుల సహదేవులనూ, వారికి కాపలా కాస్తున్న భీముణ్ణీ చూసింది. హిడింబి కంటికి భీముడు ఎంతో నాజూకుగానూ, నవమన్మ ధుడుగానూ కనిపించాడు. ఆమెకు అతనిపై మోహం పుట్టుకొచ్చింది. ఆ మోహావేశంలో ఆమెకు అన్న చాలా దూరంగా ఉన్నట్టు తోచాడు. ఆ మనుషులను చంపేకన్న బతికి ఉండనిస్తే తాను ఆ నవమన్మధుడితో ఎంతోకాలం సుఖంగా ఉండవచ్చు నను కున్నది హిడింబ.

ఆమె అందమైన రూపం ధరించి చక్కని బట్టలు కట్టుకుని సిగ్గుతో కూడిన చిరు నవ్వులను భీముడి మీద ప్రసరింపజేస్తూ, దగ్గిరికి వచ్చి, "మహానుభావా, నువ్వెవరు? మీ దే దేశం? ఈ నిద్రపోయేవారెవరు? ఎంతో సుకుమారి లాగా ఉన్న ఈ ముసలావిడ ఎవరు? ఈ అరణ్యంలో నా అన్న హిడింబు డుంటాడనీ, అతను మహాబలుడైన రాక్షసు డనీ, అమిత క్రూరుడనీ తెలీదా? వీళ్ళు నిశ్చింతగా ఎలా నిద్రపోతున్నారు? మిమ్మ ల్నందరినీ చంపి ఆహారంగా తెమ్మని మా అన్న నన్ను పంపాడు. కాని నీ అందం చూస్తుంటే నాలో మోహం పుట్టుకొచ్చి, మిమ్మల్ని చంప బుద్ధి కావటంలేదు. నా కోరిక తీర్చావంటే, మీకు మా అన్న భయం లేకుండా మిమల్ని కామగమనం ద్వారా సురక్షిత ప్రాంతానికి చేర్చుతాను. అక్కడ మన మిద్దరమూ సుఖంగా ఉండగలం. నా మాట కాదనకు," అన్నది.






తమకు ఆశ్రయం ఇచ్చిన బ్రాహ్మణుడి కుటుంబంవారు ఎందు కేడుస్తున్నారో తెలుసుకుందామని కుంతీదేవి వచ్చినాక బ్రాహ్మణుడు దుఃఖంతో ఇలా పెద్దగా విలపించసాగాడు :

" ఈ ప్రపంచంలో పెళ్ళాం, బిడ్డలతో సుఖంగా జీవించే మార్గం లేదుగద! ఈ దిక్కుమాలిన ఊరు వదిలిపోదామని నా భార్యతో ఎన్నడో అన్నాను. తాను ఇక్కడే పుట్టాననీ, ఇక్కడే పెరిగాననీ, తన కన్న వారికి దూరంగా పోలేననీ అన్నది. వాళ్ళా, ఏ నాడో చనిపోయారు. ఈ ఊళ్ళోనా, బంధువన్నవాళ్ళు ఒక్కరూ లేరు. అయినా ఈ వూరు వదిలిపెట్టాము కాము! అప్పుడే నా మాట విన్నట్టయితే ఇప్పుడీ ఆపద వచ్చిపడేది కాదు. ఇప్పుడు మనం ఏం చేసేటట్టు? ఆ రాక్షసుడి వాత ఎవరిని వెయ్యను? ఇంతకాలమూ నాకు అనుకూలవతివిగా ఉండి, నా వల్ల సంతానం కన్న నిన్ను రాక్షసుడి పొట్టన పెట్టనా? లేక వంశాంకురంగా పుట్టి పెరుగుతున్న మన కొడుకును పంపనా? కన్యాదానం చెయ్యవలిసిన కూతురిని పంపనా? అందు చేత రాక్షసుడికి అహారంగా నేనే పోతాను. అంతకన్న మార్గం లేదు."

బ్రాహ్మణుడి భార్య ఇందుకు ఒప్పుకో లేదు. తన భర్త చనిపోతే తనకూ, పిల్లలకూ రక్షణ ఉండదనీ, తాము లోకులకు లోకువై పోతామనీ, పిల్లల భవిష్యత్తు తీర్చిదిదే శక్తిసామర్థ్యాలు తనకు లేవనీ, అందు



చేత తానే రాక్షసుడికి ఆహారమవుతాననీ ఆమె అన్నది. ఆమె ఒక ఆశ కూడా కన బరిచింది. అదేమిటంటే, తాను ఆహారంగా వెళ్ళితే, స్త్రీ హత్యకు జంకి రాక్షసుడు తనను విడిచిపుచ్చ వచ్చునని!

ఈ మాట విని బ్రాహ్మణుడు తన భార్యను కౌగలించుకున్నాడు. ఇద్దరూ పెద్ద పెట్టున ఏడవ నారంభించారు.

వాళ్ళను చూసి కూతురు, "మీ రిద్దరూ ఎందుకు వృథాగా ఏడుస్తారు? రాక్షసుడికి నన్ను ఆహారంగా పంపెయ్యండి. నే నెలాగూ ఎప్పటికైనా మీకు దూరంగా వెళ్లేదా న్నే గద! అందుచేత నన్ను పంపేస్తే మీకు కలిగే నష్టమేమీ లేదు. పైపెచ్చు మీకు ప్రమాదం తప్పిపోతుంది," అన్నది.

అప్పుడు అయిదేళ్ళ వయసుగల కుర్ర వాడు చిన్నపుల్ల తీసుకుని, అటూ ఇటూ ఉత్సాహంగా తిరుగుతూ, వచ్చీరాని మాట లతో, "ఆ రాక్షసుణ్ణి నేను చంపేస్తానుగా! ఏడవకండి," అన్నాడు. వాడి మాటలకు పెద్దవాళ్ళు అంత దుఃఖంలోనూ నవ్వారు.

ఇదంతా వింటున్న కుంతి వారికి మరింత దగ్గరగా వచ్చి బ్రాహ్మణుడితో, "అయ్యా, మీ కిప్పుడు వచ్చిన ఆపద ఏమిటి? నాకు వివరంగా చెప్పినట్టయితే చెయ్యదగిన సహాయం చేస్తాను," అన్నది.

దానికి బ్రాహ్మణుడు కుంతితో, "అమ్మా, మీ మంచితనం కొద్దీ మీరలా అన్నారు గాని, మాకు వచ్చిన విపత్తు మానవమాత్రులు తీర్చేది కాదు. ఈ నగరానికి సమీపంలో బకు డనే నరభక్షకు డొక డున్నాడు. వాడు రోజూ నరమాంసం తింటూ మదించి ఉన్నాడు. ఈ ఊరికి వాడు రక్షకుడుగా ఉంటున్నందుకు గాను, ఊరివాళ్ళు రోజు కొక ఇంటి వంతున ఆ రాక్షసుడికి ఇరవై బారువల అన్నమూ, రెండు ఎనుబోతులూ, ఒక మనిషినీ పంపాలి. ఎవరన్నా అలా చెయ్యని రోజున ఆ రాక్షసుడు ఊరి మీద



పడి ప్రజను చెండుకు తింటాడు. ఈ దేశపు రాజు వేత్రకీయగృహ మనేచోట ఉంటున్నాడు. ఈ రాక్షసుడి బెడద నుంచి ప్రజలను కాపాడే ప్రయత్నమేదీ ఆయన చేయడు. ఆయన అసమర్థుడు. అసమర్థుడి పాలనలో ఉన్న మాకు రోజూ ఈ ఆపద ఉంటూనే ఉన్నది. ఇవాళ మా ఇంటి వంతు వచ్చింది. మాకే రాజాశ్రయం ఉండి, ధనవంతులమై ఉంటే ఎవడినన్నా మనిషిని కొని, వాణ్ణి రాక్షసుడికి ఆహారంగా పంపి ఉందుము. అందుచేత మా కుటుంబానికి ఈ ఆపద తప్పదు. ఒకరిని విడిచి ఒకరం బతకలేము. నలుగురమూ ఒక్కసారే వెళ్ళి ఆ రాక్షసుడికి ఆహారమవుతాం," అన్నాడు.

కుంతి ఈ కథ అంతా విని, "అయ్యా, మీరు నిశ్చింతగా ఉండండి. ఇవాళ ఆ రాక్షసుడికి ఆహారంగా నా కొడుకును పంపుతాను. వాణ్ణి రాక్షసుడు చంపలేడు. వాడే ఆ రాక్షసుణ్ణి చంపేస్తాడు. వాడు చాలా బలవంతుడు. అదీగాక వాడి దగ్గిర మంత్రశక్తులున్నాయి. అందుకే పంపిస్తున్నానుగాని, నిజంగా నా కొడుకును రాక్షసుడు తినాలని ఎంతమాత్రమూ కాదు. ఏ తల్లి అయినా, నూరుగురు కొడుకు లున్నప్పటికీ, తన కొడుకును మృత్యుదేవతకు చేజేతులా



బలిచేస్తుందా? అందుచేత మీరు ఈ ఏర్పాటుకు ఒప్పుకోండి. ఈ సంగతి మాత్రం ఊళ్ళో ఎవరికీ తెలియనివ్వకండి. వాడి గురువుగారికి తెలిసి, ఆయన వీలు లేదన్నాడంటే, నా కొడుకు రాక్షసుణ్ణి చంపే అవకాశం కూడా పోతుంది," అన్నది.

కుంతి మాటలలో బ్రాహ్మణుడికి గురి కుదిరింది. ఆయనకు ఆపద తప్పిందన్న ఆనందమూ, కుంతి తనకు మహోపకారం చేసినందుకు కృతజ్ఞతా కూడా కలిగాయి. కుంతి భీముడితో సంగతంతా చెప్పింది. భీముడు తల్లి చేసిన ఏర్పాటుకు సమ్మతించాడు.







ఉన్న సంగతి అతనికి తెలుసు. రేపు వారు కౌరవులను జయించి తమ రాజ్యం తాము తీసుకోదలిస్తే భీముడు లేకుండా ఎలా సాధ్యం? దుర్యోధనుడు కుట్రతో తమ నందరినీ లక్క యింట కాల్చి చంపటానికి యత్నించినప్పుడు అందరినీ ఆపద నుంచి తప్పించటం ఒక్క భీముడి వల్ల గనక అయింది గాని మరొకరి వల్ల సాధ్యమా?

ధర్మరాజు ఈ ధోరణిలో మాట్లాడుతూ ఉంటే కుంతీదేవి వ్యతిరేకించింది. అర్తులను రక్షించటం ఉత్తమ క్షత్రియధర్మం. ఈ బ్రాహ్మణ కుటుంబానికి ప్రత్యుపకారం చెయ్యకపోతే అది మహాపాతకం. భీముడికి వచ్చిన భయమేమీ లేదు. అతను ఎలాటి రాక్షసుడినైనా చంపగలడు. తాను చేసిన ఆలోచన ఇహానికీ, పరానికీ కూడా పనికి వచ్చేదని ఆమె అన్నది. ధర్మరాజు తల్లి అభిప్రాయంతో చివరకు ఏకీభవించక తప్పలేదు.

ఆ రాత్రి గడిచి తెల్లవారగానే భీముడు ఇల్లుగల బ్రాహ్మణుడితో, "అయ్యా, తెల్లవార్లూ నాకు నిద్రలేదు. ఆకలి దహిస్తున్నది. నాకు మంచి ఆహారం కడుపునిండా పెట్టించారంటే రాక్షసుడితో ఉత్సాహంగా పోరాడ తాను," అన్నాడు. బ్రాహ్మణుడు అతనికి

ఇంతలో మిగిలిన నలుగురు పాండవులూ భిక్ష తీసుకుని ఇంటికి తిరిగివచ్చారు. భీముడు మహా ఆనందంలో ఉండటం గమనించి ధర్మరాజు కుంతిని రహస్యంగా, భీముడి ఆనందానికి కారణమేమిటని అడిగాడు. కుంతి అతనితో సంగతంతా చెప్పి, "ఇన్నాళ్ళకు మనం ఇల్లుగల బ్రాహ్మణ కుటుంబానికి ప్రత్యుపకారం చేసే అవకాశం దొరికింది," అన్నది.

ఈ మాట విని ధర్మరాజు చాలా బాధపడ్డాడు; తమ తల్లి తొందరపడిందనుకున్నాడు. పాండవుల ఆశలన్నీ భవిష్యత్తు అంతా భీముడి భుజబలం మీదే ఆధారపడి

తిన్నంతగా భక్ష్యభోజ్యాలూ, పానీయాలూ, నెయ్యా, పెరుగూ పెట్టించాడు.

తరవాత భీముడు ఒక బండికి రెండు దున్నలను కట్టి, బండి నిండా అన్నపు రాసులు పోసుకుని, నగరానికి దక్షిణంగా వెళ్ళి, బకు డుండే చోటికి చాలాదూరంగా, యమునానది ఒడ్డున బండి నిలిపి, తన దగ్గిరికి రమ్మని బకుణ్ణి కేకలుపెట్టి, వాడు వచ్చేలోగా ఊరికే ఉండటం దేనికని బండిలో ఉన్న ఆహారాన్ని తింటూ కూర్చున్నాడు.

ఒక సామాన్య మానవుడు తనను పిలుస్తూ ఉండటం చూసి బకుడు మండి పడి పరిగెత్తుకుంటూ వచ్చి, తన కోసం ఏకచక్రపురం వాళ్ళు పంపిన అన్నాన్ని భీముడు పెద్ద పెద్ద ముద్దలు చేసి మింగుతూండటం చూసి, "ఎవడురా వీడు? చావబోతూ కూడా నిశ్చింతగా మెక్కుతున్నాడు!" అన్నాడు.

భీముడు బకుడి కేసి చూసి ఒక నవ్వు నవ్వి తిరిగి యథాప్రకారం తన తిండిలో నిమగ్నుడయాడు. బకుడు పెద్ద పెడబొబ్బ పెట్టి, భీముణ్ణి చంపేవాడల్లే రెండు చేతులూ ఎత్తి భీముడి మీదికి వచ్చాడు. దానికి కూడా భీముడు చలించక, బండిలోని అన్నం తింటున్నాడు. తన పెడబొబ్బకు





కూడా ఆ మనుష్యమాత్రుడు చలించక పోవటం చూసి బకుడు భీముడి వీపును తన రెండు చేతులతోనూ చరిచాడు. దాన్ని కూడా భీముడు లక్ష్యపెట్టక, తిండి పూర్తి చేసి, వెళ్ళి నదిలో చేతులూ, కాళ్ళూ కడు క్కొంటున్నాడు. బకుడు ఆగ్రహావేశంతో ఒక చెట్టు పీకి, భీముడి కేసి విసిరాడు.

భీముడు కడుపునిండా నీరుతాగి బకుడితో యుద్ధానికి సన్నద్ధుడై వచ్చాడు. బకుడు విసిరిన చెట్టు భీముడి చేతిలోనే ఉన్నది. వాడు మరో చెట్టు పీకి విసిరేసరికి భీముడు తన చేతిలో ఉన్న చెట్టును దానికి అడ్డం పెట్టి ఆపాడు. చుట్టుపక్కల ఉన్న చెట్లన్నీ అయిపోయే దాకా ఇద్దరూ ఈ విధంగా చెట్లతో యుద్ధం చేసుకున్నారు.

తరవాత బకాసురుడు తన చేతులతో భీముణ్ణి పట్టుకున్నాడు. ఇద్దరూ మల్ల యుద్ధం చేస్తూ ఒకరినొకరు విసిరివేశారు, జరజరా ఈడ్చారు. చివరకు భీముడు బకాసురుణ్ణి పడదోసి, మీద ఎక్కి కూర్చుని, భూమికి అదిమిపెట్టి, మోకాళ్ళతోనూ, చేతులతోనూ కుమ్ముతూ, మెడా, నడుమూ, వీపూ విరగ బొడిచాడు. బకాసురుడు భయంకరంగా నెత్తురు కక్కుతూ చచ్చాడు.

వాడు పెట్టిన చావుకేక విని వాడి బంధువులు వచ్చారు. భీముడు వాళ్ళను చూసి, "ఇకముందు మీలో ఎవరన్నా తిండి కోసం మనుషులను చంపారంటే, వాళ్ళకు కూడా ఈ బకుడికి పట్టిన గతే పట్టుతుంది, జాగ్రత్త!" అని హెచ్చరించాడు. వాళ్ళు వణికిపోతూ తమ తమ చోట్లకు వెళ్ళిపోయారు.

భీముడు బకుడి శవాన్ని ఈడ్చుకు వచ్చి నగరద్వారం దగ్గిర పెట్టి, నదిలో స్నానం చేసి, ఇంటికి తిరిగి వెళ్ళిపోయి, జరిగిన సంగతి ధర్మరాజుకు తెలిపాడు.

బకుడి శవం ఊరివారి కంట పడింది. రాక్షసుడు చచ్చాడన్న వార్త ఊరంతా



పోక్కింది. వాణ్ణి చంపినదెవరో ప్రజలకు తెలియదు. కాని ఆ పుణ్యాత్ముణ్ణి తెగ మెచ్చుకుని, తమ ఇష్టదేవతలకు దణ్ణాలు పెట్టుకున్నారు. బకుడు చచ్చిననాడు వంతు బ్రాహ్మణుడి ఇంటిదని తెలియగానే అందరూ బ్రాహ్మణుడి వద్దకు వెళ్లి, బకుణ్ణి ఎవరు చంపారని అడిగారు.

తన ఇంట తలదాచుకునేవారిని గురించి బయట పెట్టటానికి వీలులేని కారణంచేత బ్రాహ్మణుడు నగర పౌరులతో, "నిన్న మా ఇంటి వంతు వచ్చింది. నేను పుత్రైడు విచారంలో మునిగి ఉండగా ఒక యోగ సిద్ధుడు వచ్చి, సంగతి విని రాక్షసుడికి ఆహారం తాను తీసుకుపోతాననీ, తనను రాక్షసు డేమీ చేయలేడనీ అన్నాడు. మరి రాక్షసుడు చచ్చాడంటే ఆ మహాత్ముడే ఆ పుణ్యం కట్టుకుని ఉండాలి," అన్నాడు.

ఊరి ప్రజలు పరమానందంతో బ్రాహ్మణోత్సవం చేశారు. కుంతీ, పాండవులూ కూడా ఆ వేడుక చూశారు. వాళ్ళు ఆ బ్రాహ్మణుడి ఇంటనే, అలాగే అజ్ఞాత జీవితం గడుపుతూ వచ్చారు. వారు మధుకరంతోనే జీవించారు.

ఇలా ఉండగా పాండవు లుంటున్న బ్రాహ్మణ గృహానికి ఒక దేశ సంచారి అయిన బ్రాహ్మణుడు అతిథిగా వచ్చి, గృహస్థు ఇచ్చిన ఆతిథ్యం స్వీకరించి, తాను తిరిగిన దేశాలను గురించీ, అక్కడి రాజులను గురించీ అనేక వార్తలు సరదాగా చెప్పుకు పోయాడు. అతను ఒక సందర్భంలో, పాంచాలదేశపు రాజైన ద్రుపదుణ్ణి గురించీ, ఆయనకు శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపదీ పుట్టటం గురించీ, ద్రౌపదీ స్వయంవరానికి జరిగిన ఏర్పాట్లను గురించీ క్లుప్తంగా చెప్పాడు. అప్పుడు కుంతీదేవీ, పాండవులూ కూడా ఆ వృత్తాంతాలను వివరంగా వినగోరారు. అందుచేత బ్రాహ్మణుడు ఇలా చెప్పసాగాడు:






సంతానాపేక్షతో ముని ఆశ్రమాల చుట్టూ తిరిగిన ద్రుపదుడు ఒక కొడుకునూ, ఒక కూతురినీ కోరాడు. కొడుకెందుకంటే, ద్రోణుణ్ణి చంపటానికి; కూతురు అర్జునుడికి భార్య కాగలందులకు. ఈ కోరికతో ఆయన వివిధ ఆశ్రమాలు తిరుగుతూ గంగా యమునా సంగమం వద్ద గల ఒక ఆశ్రమాన్ని చేరాడు. అక్కడ యాజుడూ, ఉపయాజుడూ అనే ఇద్దరు అన్నదమ్ములు, కాశ్యపగోత్రం వాళ్ళు, రోజల్లా వేదపారాయణం చేస్తూ, సూర్యారాధన జరుపుతూ ఉంటున్నారు. వారిలో తమ్ముడైన ఉపయాజుడే ఎక్కువ తపోబల సంపన్నుడుగా ద్రుపదుడికి కనిపించాడు. అందుచేత ద్రుపదుడు ఆయన దగ్గిర చేరి ఎంతో భక్తిశ్రద్ధలతో సేవలు చేయసాగాడు.

ఒకనాడు ద్రుపదుడు ఏకాంతంలో ఉపయాజుడికి కాళ్ళు పట్టుతూ, "మునీశ్వరా, ద్రోణుడు నాకు తీరని అవమానం చేశాడు. నేనుగాని, మరో రాజుగాని ఆయనను చంపే శక్తిగలవాళ్ళం కాము. ఆ ద్రోణాచార్యుణ్ణి చంపగల కుమారుడు నాకు కలిగేటట్టుగా తమరు అనుగ్రహించే పక్షంలో తమకు అసంఖ్యాకంగా గోవులనూ, తాము కోరే ఇతర వస్తువులనూ ఇవ్వగలను," అన్నాడు.

దానికి ఉపయాజుడు, "నా కిలాటి కోరికలేమీలేవు. అదీగాక నేను ఇటువంటి పనులకు సహాయంచెయ్యను," అని ఆ ప్రసంగం అంతటితో కట్టిపెట్టేశాడు.

13. ద్రుపదుడి సంతానం





తిన్నాడు. మేము గురుకులవాసం చేసే టప్పుడుకూడా శుచీ, అశుచీ అన్న విచక్షణ లేకుండా జిహ్వకు రుచి అయినదెల్లా తినే వాడు," అన్నాడు.

ఉపయాజుడీ మాట చెప్పగానే ద్రుప దుడు యాజుడి ఆశ్రమానికి వెళ్లి, అయనకు నమస్కారం చేసి, ఎనభైవేల గోవులను కానుకగా సమర్పించి, తన కోరిక తెలు పుకున్నాడు.

యాజు డిందుకు సమ్మతించాడు. అయన ఉపయాజుణ్ణి తనకు సహాయం ఉంచుకుని, అవసరమైన సంభారాలన్నీ సేకరించి, పుత్రకామేష్టి ప్రారంభించాడు. అయన హోమం చేసి, అనంతరం హవిస్సు చేతిలోకి తీసుకుని, ద్రుపదుడి భార్య అయిన కోకిలాదేవిని పిలిచి, "ఈ హవిస్సు పుచ్చుకో. నీ గర్భాన ఒక కొడుకూ, కూతురూ జన్మి స్తారు," అన్నాడు.

అయినా ద్రుపదుడు నిరాశచెందక ఉప యాజుణ్ణి మరింత శ్రద్ధగా సేవించసాగాడు. ఒక ఏడాది గడిచింది. ఒకనాడు ఉపయా జుడు ద్రుపదుడితో, "రాజా, నాకు అంతు లేని సేవలు చేస్తున్నావు. కాని నీ కోరిక అనుచితమైనది, అందుచేత అది నెరవేర టానికి నేను సహాయపడను. అయినా ఒక ఉపాయం చెబుతాను. నువు నా అన్న అయిన యాజుణ్ణి ఆశ్రయించు. అతన్ని మెప్పించు. అంతులేని గోవులను ఇస్తానని ఆశపెట్టు, అతను నీ కోరిక తీర్చవచ్చు. అతను మొదటినుంచీ కొంచెం ఆశాపరుడు. ఒకసారి అశుభ్రమైనచోట రాలిన పండు

అప్పుడు కోకిలాదేవి, "అయ్యా, అశుచిగా ఉన్నాను. కొంచెం ఆగండి, స్నానం చేసి వస్తాను," అన్నది.

"నేనూ, నా తమ్ముడూ కలిసి తయారు చేసిన హవిస్సు నీ కోరిక తీర్చక పోతుందా? వస్తేరా, లేకపోతే మానెయ్యి," అంటూ యాజుడు హవిస్సును అగ్నిలో వేశాడు.





ఆ అగ్నికుండంలో నుంచి ఒక యోధుడు ఒక చేత కత్తీ, ఒక చేత విల్లూ ధరించి, నెత్తిన మణిమయమైన కిరీటంతో సహా, రథారూఢుడై వెలువడి, సింహనాదం చేస్తూ ఎటో వెళ్ళిపోయాడు.

తరవాత ఆ అగ్నికుండం నుంచే ఒక తేజస్విని అయిన స్త్రీ పుట్టింది. ఈ విధంగా ద్రుపదుడు ఒక కొడుకునూ, కూతురినీ పొందినవాడయాడు. పాంచాలు లందరూ పరమానంద భరితులయారు.

ఇంతలో కోకిలాదేవి స్నానం చేసి వచ్చి, అగ్నికుండంలో పుట్టిన బిడ్డలిద్దరికీ తాను తల్లి అయేటట్టుగా యాజుడి వద్దా, ఉప యాజుడి వద్దా వరం పొందింది.

బ్రాహ్మణులు ద్రుపదుడి కొడుకుకు ధృష్టద్యుమ్నుడు అనీ, కుమార్తె నల్లనిది కావటంచేత కృష్ణ అనీ పేర్లు పెట్టారు. ద్రుపదుడు యాజుడికి అంతులేని గోవు లనూ, బ్రాహ్మణులకు అంతులేని ధనాన్నీ ఇచ్చి, కాంపిల్యనగరానికి తిరిగి వచ్చాడు.

కొంతకాలమయాక ద్రుపదుడు ధృష్ట ద్యుమ్నుణ్ణి ద్రోణుడి వద్ద అస్త్రవిద్యా భ్యాసం కోసం పంపాడు. విద్య నేర్ప నంటే తనకు అపకీర్తి వస్తుందని ద్రోణుడు ఆ కుర్రవాడికి విలువిద్యలన్నీ నేర్పాడు.

ద్రుపదుడి కూతురు ద్రౌపది వివాహ యోగ్యురాలయింది. ఆమెను అర్జునుడి కిచ్చి చేద్దామని మొదటి నుంచీ ద్రుపదుడి ఉద్దేశం. అయితే పాండవులు లక్క ఇంట కాలిపోయారని వార్త తెలిసింది. ద్రుప దుడు హతాశుడై తన బంధుమిత్ర మంత్రి పురోహితులను సమావేశపరిచి కర్తవ్యం గురించి వారి సలహా అడిగాడు.

అప్పుడు ద్రుపదుడికి ఆప్తుడైన పురో హితు డొకడు, "మహారాజా, పాండవులకు అపాయం జరిగిందని తోచదు. అనేక శకు నాలను బట్టి వారు సుఖంగానే ఉన్నట్టు కనబడుతుంది. నీ కెందుకు? నువు



స్వయంవరం ప్రకటించు, వారు తప్పక వస్తారు. రాజకన్యలకు స్వయంవరం పరిపాటే గదా!" అన్నాడు.

మూడున్నరమాసాల అవతల స్వయంవరానికి ముహూర్తం ఏర్పాటయింది. ఎక్కుపెట్టటానికి ఒకంతట సాధ్యంకాని విల్లు ఒకటి సిద్ధం చేయబడింది. ఒకచోట, ఆకాశాన తిరిగే బంగారు మత్స్యయంత్రం అమర్చబడింది.

ఏకచక్రపురంలో కుంతీ పాండవులుంటున్న బ్రాహ్మణుడి ఇంటికి అతిథిగా వచ్చిన బ్రాహ్మణుడీ వివరాలన్నీ చెప్పి, "ఎక్కడెక్కడి రాజులూ ద్రౌపదీ స్వయంవరానికై కాంపిల్యనగరానికి పోతున్నారు," అని ముగించాడు.

తమ గురువైన ద్రోణాచార్యుణ్ణి చంపేవాడొకడు పుట్టాడని విని పాండవులు విచారించారు, కాని కానున్నది అయేతీరుతుందనుకుని సమాధానపడ్డారు. వారికి కూడా ద్రౌపదీ స్వయంవరానికి వెళ్ళాలని ఉన్నది. ఈ సంగతి గ్రహించి కుంతీదేవి ధర్మరాజుతో, "నాయనా, మనం చాలా కాలంగా ఈ ఏకచక్రపురంలో ఉంటున్నాం. ఇంక కొన్నాళ్ళుపోతే మన కిక్కడ భిక్ష దొరకదేమో కూడానూ! మనం పాంచాల దేశం పోదామా ఏం? అది సుభిక్షమైన దేశమట. కాంపిల్యనగరం మహా అందంగా ఉంటుందట. రాజైన ద్రుపదుడికి బ్రాహ్మణులంటే ఎంతో అభిమానం అని అందరూ అంటున్నారు," అన్నది.

ధర్మరాజు తన తమ్ములతో కూడా సంప్రతించి తల్లి ఆలోచనకు అందరినీ ఒప్పించాడు. వాళ్ళు ఇల్లు గల బ్రాహ్మణుడితో తాము వెళ్ళిపోతున్నట్టు చెప్పి, ఏకచక్రపురం నుంచి బయలుదేరారు.

వాళ్ళు రాత్రీ పగలూ కూడా ప్రయాణం చేస్తూ ఒకనాడు అర్ధరాత్రివేళకు గంగానదీ తీరాన ఉన్న సోమశ్రవం అనే తీర్థాన్ని

చేరుకున్నారు. చీకటిగా ఉన్నది. అందరి కన్న ముందు అర్జునుడు ఒక కొరవి పట్టు కుని నడుస్తున్నాడు. గంగలో స్నానం చేయ సంకల్పించి వాళ్ళు నదిని చేర వస్తుండగా, ఆ సమయంలో గంగలో తన భార్యలతో జలక్రీడలాడుతున్న అంగారపర్ణు డనే గంధర్వుడు మనుషుల అలికిడి విని, "ఎవరా వచ్చేది? దూరంగా పొండి. ఈ చుట్టుపక్కల ఉన్న వనమంతా నాది. నేను అంగారపర్ణు డనే గంధర్వుణ్ణి. ఇది యక్ష రాక్షస గంధర్వులు సంచరించేవేళ. మనుషులు సంచరించరాదు," అన్నాడు.



ఆ మాట విని అర్జునుడు, "దుర్మా ర్గుడా, హిమాలయప్రాంతమూ, గంగానదీ ఒకరి సొత్తు ఎలా అవుతాయి? అవి అందరి వీనూ. గంగను చూసినప్పుడు, అర్ధరాత్రి అయేది, భోజనానంతరమయేది, విధిగా స్నానం చెయ్యాలి. అందుచేత మేము నదిలో స్నానం చెయ్యకుండా ముందుకు పోము," అన్నాడు.

అంగారపర్ణుడికి కోపం వచ్చి బాణాలు వెయ్యసాగాడు. అర్జునుడు తన చేతిలో ఉన్న కొరవితో ఆ బాణాలను అడ్డుతూ, "ఒరే గంధర్వుడా, మమ్మల్ని నీ ముష్టి బాణాలతో బెదిరించటానికి మే మెవరమను కుంటున్నావు? నీ మాయలేవీ మా ముందు సాగవు," అంటూ ఆగ్నేయాస్త్రం మంత్రించి ప్రయోగించాడు. దానితో గంధర్వుడి రథం మండి బూడిద అయిపోయింది. గంధ ర్వుడు కింద పడి మూర్ఛపోయాడు.

ఈ సమయంలో గంధర్వుడి భార్య కుంభీనసి ధర్మరాజును ఆశ్రయించి, తనకు పతిభిక్ష పెట్టమని వేడుకున్నది. ధర్మరాజు అర్జునుడితో, "ఈమె మనని శరణుజొచ్చి పతిభిక్ష కోరుతున్నది. అందు చేత నువు గంధర్వుణ్ణి చంపకు," అన్నాడు.

అన్న మాట విని అర్జునుడు గంధర్వుణ్ణి ప్రాణాలతో వదిలేశాడు.

గంధర్వుడు అర్జునుడితో, "నీతో ఓడి పోయాను గనక నేను అంగారపర్ణు డనే పేరు వదిలేస్తాను. నువు తగలబెట్టిన రథానికి బదులు మరొక చిత్రరథం సృష్టించుకుని, చిత్రరథు డనే పేరు పెట్టుకుంటాను. మహావీరుడివైన నీకు చాక్షుషి అనే విద్యను ఇస్తాను. దాని సహాయంతో నీకు మూడు లోకాలలో ఎక్కడ ఏది జరిగేదీ కనిపిస్తుంది. ఈ విద్య మా వద్ద ఉండటం చేతనే దేవతలు సైతం మమ్మల్ని ఏమీ చేయలేకుండా ఉన్నారు. చాక్షుషితో బాటు నీకు కొన్ని దివ్యాశ్వాలను కూడా ఇస్తాను. మీ అన్నదమ్ములు ఒక్కొక్కరికీ ఒక్కొక్క వంద అశ్వాలనిస్తాను," అన్నాడు.

దానికి అర్జునుడు, "ఎంత సన్నిహితుడి వద్ద నుంచి అయినా నేను ఏమీ తీసుకోను," అన్నాడు.

"అలా అయితే నాకు ఏదన్నా ఇచ్చి, దానికి బదులుగా నా నుంచి బహుమానం పుచ్చుకో," అన్నాడు గంధర్వుడు.

గంధర్వుడికి ఆగ్నేయాస్త్రం ఇచ్చి, అతని నుంచి అశ్వాలను పుచ్చుకోవటానికి అర్జునుడు సమ్మతించాడు.

గంధర్వుడు అతనితో, "మీరు క్షత్రియులు. అందుచేత మీరు తగిన పురోహి



తుణ్ణి ఏర్పాటు చేసుకుని, అతని సలహా ప్రకారం నడుచుకుంటే తప్ప మీకు శుభాలు చేకూరవు," అన్నాడు.

అర్జునుడు అతనికి ఆగ్నేయాస్త్రాన్ని సమంత్రకంగా ఉపదేశించి, "ప్రస్తుతం నీ గుర్రాలు నీ వద్దనే ఉండనీ. అవసరం వచ్చినప్పుడు తెప్పించుకుంటాను," అని చెప్పి, అతని వద్ద సెలవు తీసుకున్నాడు. పాండవులూ, కుంతీ తమ ప్రయాణం కొనసాగించారు.

పాండవులు గంగాతీరం నుంచి బయలుదేరి ఉత్కోచతీర్థానికి చేరుకున్నారు. అక్కడే ధౌమ్యుడు తపస్సు చేసుకుంటు

న్నాడు. పాండవులు ఆయనకు నమస్కారం చేసి తమకు పురోహితుడుగా ఉండమని ప్రార్థించారు. ధౌమ్యుడు పాండవుల ప్రజ్ఞా, పరాక్రమమూ, బలమూ, ఉత్సాహమూ గురించి సరిగా గ్రహించి, తన పౌరోహిత్యానికి వారు అర్హులని భావించి, వారికి అతిథి మర్యాదలు చేసి, వారి కోరిక తీర్చటానికి తన సమ్మతి తెలిపాడు. ఆయన తమకు పురోహితుడుగా ఉండటానికి ఒప్పుకోగానే పాండవులు భూమండలాని కంతకూ తామే రాజులయినంతగా ఆనందోత్సాహంతో పొంగిపోయారు.

అదే సమయంలో కొందరు ద్రౌపదీ స్వయంవరం చూడటానికి కాంపిల్యనగ రానికిపోతూ ధౌమ్యుడుండే ఆశ్రమానికి వచ్చారు. వారిని చూసి పాండవులు, తాము కూడా తల్లినీ, ధౌమ్యుణ్ణీ వెంట పెట్టుకుని ద్రౌపదీ స్వయంవరోత్సవాన్ని చూసి ఆనం దించాలన్న కోరిక వెలిబుచ్చారు.

బ్రాహ్మణ వేషాలు ధరించి ఉన్న పాండవులను చూసి ఆ బ్రాహ్మణులు, "మీరు ఎక్కడి నుంచి వచ్చారు? ఎక్కడికి పోతున్నారు?" అని అడిగారు.

"మేము ఏకచక్రపురం నుంచి కాంపిల్య నగరానికి ప్రయాణమై వెళుతున్నాం," అన్నాడు ధర్మరాజు.

"మేమూ అక్కడికే పోతున్నాం. అక్కడ ద్రుపదుడి కుమార్తెకు స్వయం వరం జరుగుతున్నది. ఆమె చాలా చక్కని దట. స్వయంవరానికి ఎందరో రాజులు వస్తున్నారట. అది చూడ వచ్చే బ్రాహ్మణు లకు ఆ మహారాజు గోదానమూ, సువర్ణ దానమూ, అన్నదానమూ చేస్తున్నాడు. పెళ్ళి వేడుక చూసి మళ్ళీ తిరిగి వస్తాం," అన్నారు బ్రాహ్మణులు.

పాండవులూ, కుంతీ కూడా వారి వెంట దక్షిణ పాంచాలంలోని కాంపిల్యనగరానికి బయలుదేరారు.





# మహాభారతం

ద్రౌపదీస్వయంవరం గురించి విని అనేక దేశాల రాజులు కాంపిల్య నగరానికి వచ్చారు. వారికి వేరు వేరు ప్రదేశాలలో విడుదులు ఏర్పాటయాయి. పాండవులు ఒక కుమ్మరి ఇంట బసచేసి, మాధుకరం తెచ్చుకుని తింటూ వచ్చారు.

ద్రుపదుడు కూడా తన కుమార్తెను అర్జునుడికిచ్చి చెయ్యాలన్న కోరికను ఎవరికీ తెలుపక, ఎక్కుపెట్టటానికి అసాధ్యమైన విల్లొకటి ఏర్పాటుచేసి, ఆకాశంలో అమర్చిన మత్స్యయంత్రాన్ని ఆ వింటితో కొట్టినవాడికి తన కుమార్తెనిచ్చి పెళ్ళి చేస్తానని చాటింపు వేశాడు.

ఈ చాటింపు విని కర్ణుడూ, ధృతరాష్ట్రుడి కొడుకులూ, ఇంకా అనేకమంది రాజులూ, స్వయంవర వేడుకలు చూసే ఉద్దేశంతో అనేకమంది ఋషులూ వచ్చి, ద్రుపదుడి స్వాగతమూ, ఆతిథ్యమూ స్వీకరించారు.

నగరానికి ఈశాన్యదిక్కుగా స్వయంవర మంటపం నిర్మించి, చక్కగా అలంకరించారు. అందరూ కూర్చోవటానికి వీలుగా మంచెలు అమర్చారు. అక్కడికి క్షత్రియులూ, బ్రాహ్మణులూ వచ్చి, తమకు అనువైన స్థానాలలో కూర్చున్నారు. బ్రాహ్మణులతో కలిసి కూర్చున్న పాండవులు ద్రుపదుడి వైభవాన్ని చూసి ఎంతో సంతోషించారు. అతిథులకు చాలారోజులపాటు నృత్యగాన వినోదాలతో కాలక్షేపం జరిగింది.

చివరి రోజున ద్రౌపది మంగళస్నానం చేసి, సర్వాభరణాలూ ధరించి, మంచి



బట్టలు కట్టుకుని, చేత బంగారుపువ్వుల మాల ధరించి స్వయంవర మంటపం మధ్యకు వచ్చింది. ద్రుపదుడి పురోహితుడైన సోమకుడు అంతకుముందే అగ్ని చుట్టూ దర్భలు పరిచి, అగ్నిహోత్రం చేసి ద్రౌపదిని దీవించాడు. ద్రౌపది రాగానే మంగళ వాద్యాలు మోగాయి.

అప్పుడు ధృష్టద్యుమ్నుడు మంటపం మధ్యకు వచ్చి, వాద్యాలను ఆపించి, చుట్టూ కూర్చుని ఉన్న రాజులకు వింటినీ, అయిదు బాణాలనూ, పైన అమర్చిన మత్స్యయంత్రాన్నీ చూపి, "ఈ అయిదు బాణాలనూ ఈ వింటికి ఎక్కుపెట్టి, ఆ మత్స్యయంత్రాన్ని కొట్టినవానిని మా చెల్లెలు పెళ్ళాడుతుంది. కనుక మీలో విలువిద్యా ప్రావీణ్యం గలవారు వచ్చి శక్తి కొద్దీ ప్రయత్నించండి," అన్నాడు. తరవాత అతను ద్రౌపదికి వేరువేరు రాజులను చూపి, వారి పేర్లు చెప్పి, పరిచయం చేశాడు. వారిలో దుర్యోధనాదులతో బాటు శల్యుడూ, విరాటుడూ, శకునీ, అశ్వత్థామా, అక్రూరుడూ, సాంబుడూ, ప్రద్యుమ్నుడూ, కృష్ణుడూ, కృతవర్మా, అనిరుద్ధుడూ, సుశర్మా, శిశుపాలుడూ, చిత్రాంగదుడూ, భగదత్తుడూ, పౌండ్రకవాసుదేవుడూ మొదలైనవారు అనేకులున్నారు.

మన్మథుడి అరవబాణం లాగా ఉన్న ద్రౌపదిని వచ్చినవారంతా తదేక దృష్టితో చూస్తూ ఉండిపోయారు. కృష్ణుడు బ్రాహ్మణుల మధ్యనున్న పాండవులను గుర్తించి బలరాముడికి చెప్పాడు.

మత్స్యయంత్రాన్ని కొట్టే ప్రయత్నం ఆరంభమయింది. ఒక్కొక్క రాజకుమారుడే వచ్చి, వింటిని ఎక్కుపెట్టటం కూడా సాధ్యం కాక, అవమానంతో అవతలికి వెళ్ళిపోసాగారు. అనేకమందికి శృంగభంగమయాక కర్ణుడు వచ్చి, విల్లు ఎక్కుపెట్టి, బాణాన్ని సంధించసాగాడు. ద్రౌపదిని నిశ్చ



యంగా అతనే గెల్చుకుంటాడని అందరూ అనుకున్నారు. భట్రాజులు కర్ణుడి స్తోత్రాలు ఆరంభించారు. అది విని ద్రౌపది, "నేను సూతుడి కొడుకును వరించను," అని పెద్దగా, అందరికీ వినిపించేలాగా కేక పెట్టింది. కర్ణుడు కోపంతో పాటు నవ్వుతూ, సూర్యుడి కేసి చూసి, తిరిగి వెళ్ళాడు. కర్ణుడి తరవాత శిశుపాలుడూ, జరాసంధుడూ, శల్యుడూ వింటిని సంధించలేక విఫలులయారు.

ఇక రాజు లెవరూ ముందుకు రాలేదు. ప్రేక్షకులలో కలకలం సాగింది. ఆ సమయంలో బ్రాహ్మణుల మధ్యనుంచి అర్జునుడు లేచి వచ్చి, వింటిని సమీపించాడు. అది చూసి బ్రాహ్మణులు ఆశ్చర్యపోయి, "మహా పరాక్రమవంతులైన శల్యుడూ, జరాసంధుడూ, శిశుపాలుడూ లాటి వాళ్ళకి అలవిగాని విల్లును ఈ బ్రాహ్మణ కుమారుడు పట్టుకోబోతున్నాడు గదా. వీడు నిశ్చయంగా బ్రాహ్మణులకు అవమానం తెస్తాడు!" అని తమలో తాము అనుకున్నారు. కొందరు మాత్రం, "వీడికి బలం, అస్త్ర విద్యా నైపుణ్యం ఉంటే ఉంటుంది. లేకపోతే ఆ వింటి జోలికి ఎందుకు పోతాడు?" అనుకున్నారు.

అర్జునుడు వింటిని సమీపించి, సభకు నమస్కారం చేసి, వింటికి నమస్కరించి, తన గురువుకు ఆత్మనమస్కారం చేసి, కృష్ణుణ్ణి తలుచుకుని, తాను రోజూ వాడే వింటిని సంధించినంత సునాయాసంగా ఆ వింటికి అయిదు బాణాలూ సంధించి, మత్స్యయంత్రాన్ని ఒక్క దెబ్బతో కింద పడగొట్టాడు. అందరూ ఒక్క క్షణం దిగ్భ్రమ చెందారు. తరవాత హస్తనాదాలు మిన్ను ముట్టాయి. బ్రాహ్మణులు సంతోషంతో పై బట్టలు ఎగరవేశారు. ఆ క్షణంలోనే ధర్మరాజు నకులసహదేవులను తీసుకుని తమ విడిదికి వెళ్ళిపోయాడు. ద్రుపదుడు

మాత్రం సంతోషాశ్చర్యాలతో దూరం నుంచి అర్జునుణ్ణి చూస్తూ ఉండిపోయారు.

స్వయంవరానికి వచ్చిన రాజులకు గొప్ప అవమానం జరిగినట్టు తోచింది. "ఈ ద్రుపదుడు మనని చెట్టెక్కించి, పండు కోసుకునే లోపల కిందికి తోసేశాడు. తన కూతుర్ని ఒక్క రాజకుమారుడికీ ఇవ్వక బ్రాహ్మణుడికిస్తాడా? బ్రాహ్మణుల్లో ఎక్కడన్నా స్వయంవరం ఉన్నదా? ఈ పిల్ల బ్రాహ్మణుణ్ణి ఎలా చేసుకుంటుంది? ఇలాటి పని మరొకసారి జరగకుండా ఈ ద్రుపదుడి ప్రాణాలు తియాలి! ఈ పిల్ల ఎవరో ఒక రాజకుమారుణ్ణి వరిస్తుందా సరేసరి, లేకపోతే దీన్ని నిప్పులోకి తొయ్యాలిసిందే. బ్రాహ్మణుడు గనక ఈ వటువును ప్రాణాలతో వదిలేద్దాం," అంటూ రాజులు కత్తులూ, కటార్లూ చేతబట్టి, ద్రుపదుణ్ణి చుట్టుముట్టారు. ద్రుపదుడు భయపడి బ్రాహ్మణుల మధ్యకు వెళ్ళాడు.



ద్రుపదుడి పై కత్తి కట్టిన రాజులకు భీమార్జునులు అడ్డు తగిలారు. రాజులు బాణాలు వెయ్యటం మొదలు పెడితే భీముడు ఒక చెట్టు పెకలించి తెచ్చి, రాజుల బాణాలను దానితో అడ్డుతూ అర్జునుడి పక్కన నిలబడ్డాడు. బ్రాహ్మణులు ద్రుపదుణ్ణి కాపాడటానికి రాజుల మీద రాళ్ళు విసరసాగారు. అర్జునుడు వారిని వారించి, మత్స్యయంత్రాన్ని కొట్టిన విల్లుతోనే రాజులను ఎదుర్కొన్నాడు. శల్యుడు, కర్ణుడు మొదలైనవారు ఇది చూసి, తమను ఎదిరించినవాడు బ్రాహ్మణుడే అయినా చంపదగిన వాడేనని నిశ్చయించారు. అర్జునుడు కర్ణుడికి ఎదురై యుద్ధం చేశాడు. అర్జునుడి ప్రతాపానికి ఆశ్చర్యపడి కర్ణుడు, "ఓ బ్రాహ్మణుడా, నీ అస్త్ర కౌశలానికి మెచ్చాను. నాతో సమంగా పోరాడగలవాడు అర్జునుడు తప్ప మరెవరూ లేరు. నువ్వు నిజంగా ఎవరివో చెప్పు," అన్నాడు. కాని



అర్జునుడు తానెవరినీ బయట పెట్ట లేదు. బ్రహ్మతేజస్సు జయించరానిదను కుని కర్ణుడు యుద్ధం మానేశాడు.

ఈ లోపల శల్యుడికీ భీముడికీ యుద్ధం సాగుతున్నది. చివరకు భీముడు శల్యుణ్ణి పట్టి ఎత్తి, చంపే ఉద్దేశం లేక దూరంగా విసిరి వేశాడు. బ్రాహ్మణులందరూ గొల్లున నవ్వారు. మిగిలిన రాజకుమారులకు కాళ్ళూ, చేతులూ ఆడలేదు.

అయితే ఈ మహావీరులు మామూలు బ్రాహ్మణులు కారని అందరికీ స్పష్టమయింది. వాళ్ళు ఎవరో తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా జాస్తి అయింది. కృష్ణుడు



కూడా రాజులతో, "ఈ బ్రాహ్మణులు న్యాయంగా ద్రౌపదిని గెలుచుకున్నారు. రాజులతో ధర్మయుద్ధం చేశారు. అందుచేత వారిపై కయ్యానికి కాలు దువ్వకండి," అన్నారు. అతని సలహా పాటించి రాజులు ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు.

ఈ లోపల కుమ్మరి ఇంట బస చేసి ఉన్న కుంతి, తన కొడుకులు ఎంతకూ తిరిగి రాకపోయేసరికి, దుర్యోధనాదుల వల్ల వాళ్ళకు ఏమికీడు మూడిందో అని భయపడింది. అంతలో నకులసహదేవులతో ధర్మరాజు వచ్చాడు. తరవాత కొంతసేపటికి భీమార్జునులు ద్రౌపదితో సహా వచ్చి చేరారు. వస్తూనే వాళ్ళు, "అమ్మా, మేము భిక్ష తెచ్చాం," అన్నారు లోపల ఉన్న తమ తల్లితో. కుంతీదేవి, "అందరూ సమంగా పంచుకోండి, నాయనా!" అంటూ అవతలికి వచ్చి, దేదీప్యమానంగా వెలిగిపోతున్న ద్రౌపదిని చూసి బిత్తరపోయింది.

ఆమె ధర్మరాజుతో, "నాయనా, నా వల్ల పెద్ద పొరపాటు జరిగిపోయింది. భీమార్జునులు భిక్ష తెచ్చామంటే, అందరూ సమంగా పంచుకోమని అనేశాను. నేనెన్నడూ అసత్యమాడినదాన్ని కాను. ఈ కన్యను మీ రందరూ అనుభవిస్తే అది



అధర్మమవుతుంది; అనుభవించకపోతే నా మాట అబద్ధమవుతుంది. అందుచేత ధర్మమార్గం ఏదో ఆలోచించి అలా చెయ్యండి," అన్నది.

ధర్మరాజు కొంచెంసేపు ఆలోచించి, కుంతిని విచారించవద్దని, అర్జునుడితో, "అర్జునా, నువ్వీ కన్యను అగ్నిసాక్షిగా వివాహం చేసుకో," అన్నాడు.

దానికి అర్జునుడు, "అది ఎలా సాధ్యమవుతుంది? నాకు అన్నలైన నువ్వూ, భీముడూ వివాహం చేసుకోకుండా నేనెలా చేసుకుంటాను?" అన్నాడు.

కాని ఆ సమయంలో పాండవులైదుగురికీ ద్రౌపది పైన మనసుపోయింది. తల్లి అన్న మాటలూ, అర్జునుడు చెప్పిన మాటా, తనలో ద్రౌపది పైన కలుగుతున్న మోహమూ గ్రహించి, ధర్మరాజు, "మనమందరమూ ఈ కన్యను పెళ్ళాడదాం," అన్నాడు.

అంతలో కృష్ణుడు బలరాముడితో సహా పాండవులున్న బస వెతుక్కుంటూ వచ్చాడు. ఆతను తనకూ, కుంతీదేవికీ మొక్కటం చూసి ధర్మరాజు, "కృష్ణా, మేము బ్రాహ్మణ వేషాలు ధరించి అజ్ఞాతంగా బతుకుతున్నాం కదా, మమ్మల్ని



ఎలా గుర్తు పట్టావు? ఇక్కడికి ఎలా వచ్చావు?" అని అడిగాడు.

కృష్ణుడు నవ్వి, "రాజా, అగ్నిని ఎలా దాస్తావు? ఆవాళ స్వయంవరంలో ప్రదర్శించిన పరాక్రమం పాండవులకు తప్ప మరొకరికి సాధ్యమా? దుర్మార్గుడయిన దుర్యోధనుడి తంత్రం పారకపోవటం మంచిదయింది. మీరు ఎవరికీ తెలియరాకుండా ఉండటమే మంచిది," అని పాండవుల వద్ద సెలవు తీసుకుని, బలరాముడితో సహా వెళ్ళిపోయాడు.

ఈలోపల ధృష్టద్యుమ్నుడొక పని చేశాడు. మత్స్యయంత్రాన్ని కొట్టి ద్రౌపదిని



గెలుచుకున్న బ్రాహ్మణుడెవరో తెలియదు. అతను ఎక్కడ విడిది చేశాడో, ద్రౌపదిని ఎక్కడికి తీసుకుపోతాడో తెలియదు. అందుచేత ధృష్టద్యుమ్నుడు మిగిలిన బ్రాహ్మణుల వెంట గోప్యంగా బయలుదేరి, అర్జునుడి వెంట కుమ్మరి ఇంటికి వచ్చి, ఒక చోట దాక్కున్నాడు.

కృష్ణబలరాములు వెళ్ళిపోయాక భీమార్జున నకుల సహదేవులు వెళ్ళి, మాధుకరాన్నం తెచ్చారు. అందులో కొంత బలులకూ, అతిథులకూ ఉంచి, మిగిలినది రెండు భాగాలు చేసి, ఒక భాగం భీముడికీ, మిగిలినది మిగతా నలుగురికీ పెట్టమని ద్రౌపదికి కుంతి చెప్పింది. ద్రౌపది అలాగే చేసింది.

భోజనాలు అయాక సహదేవుడు దర్భలు పరిచాడు. దాని మీద జింకచర్మాలు పరిచి అందరూ పడుకున్నారు. పాండవుల కాళ్ళ దగ్గిర ద్రౌపది పడుకున్నది.

అప్పుడు పాండవులు యుద్ధవ్యూహ భేదనోపాయాలను గురించీ, వివిధ అస్త్రాల ప్రయోగోప సంహారాలను గురించీ మాట్లాడుకుంటూ, కొంత వితర్కించుకున్నారు. ఇదంతా చాటునే ఉండి విన్న ధృష్టద్యుమ్నుడు, వీళ్లు బ్రాహ్మణ వేషాలు ధరించిన క్షత్రియులేనని రూఢి చేసుకుని, ఇంటికి తిరిగి వెళ్ళి తండ్రితో చెప్పాడు.

"మన కృష్ణను వెంట బెట్టుకుని వెళ్ళినది ఇద్దరేగాని, వాళ్లుండే చోట మరో ముగ్గురున్నారు. వాళ్ళ తల్లి ఉన్నది. వాళ్లు ఉత్తమ క్షత్రియు లనటానికి సందేహమేమీ లేదు. వాళ్ళు పాండవులేనని నా అనుమానం," అన్నాడు ధృష్టద్యుమ్నుడు ద్రుపదుడితో.

ఈ మాట విని ద్రుపదుడు తన కోరిక తీరిందని సంతోషించాడు. వాళ్ళను గురించి మరింత వివరంగా తెలుసుకురమ్మని ఆయన తన పురోహితుణ్ణి పంపాడు.





# మహాభారతం

బ్రాహ్మణుడు పాండవు లున్న చోటికి వచ్చి, " మా రాజుగారు మీ వృత్తాంతమంతా తెలుసుకుని రమ్మని నన్ను పంపాడు. మా రాజుగారు పాండు మహారాజుకు స్నేహితుడు; తన కుమార్తెను అర్జునుడి కిచ్చి పెళ్ళి చెయ్యాలని కలలుగన్నాడు. అందుచేత మీ కులగోత్ర నామాలు తెలిపి, సంతోషం కలిగించండి," అని అడిగాడు.

ధర్మరాజు ఆ బ్రాహ్మణుడికి అతిథి సత్కారాలు జరిపి; కూర్చోబెట్టి, "మీ రాజు గారికి మా కులగోత్రనామాలతో ఏం పని? మత్స్యయంత్రం కొట్టినవారికి తన కుమార్తె నిస్తానన్నాడు. మా వాడు ఆ పని చేసి పిల్లను గెలుచుకున్నాడు. మీ రాజు కోరిక నెరవేరిందని అనుకుంటున్నాను," అన్నాడు.

ఇంతలో ద్రుపదుడు పాండవులను తీసుకురమ్మని పంపిన రథాలు వచ్చాయి. పాండవు లందరూ వేరువేరు రథాలలో ఎక్కారు. కుంతీ ద్రౌపదీ ఒక రథంలో ఎక్కారు. రథాలు రాజనగరు చేరాయి. ద్రుపదుడు వారి కోసం రకరకాల కానుకలు పంపాడు, అయితే పాండవులు క్షత్రియోచిత మైనవే గ్రహించి, మిగిలినవి వదిలేశారు. తరవాత ద్రుపదుడు వారిని కళ్ళారా చూసి, నిశ్చయంగా క్షత్రియులేనని రూఢి చేసుకున్నాడు.

ఒక మంటపంలో సమావేశం జరిగింది. అక్కడ ద్రుపదుడు ధర్మరాజు కేసి తిరిగి, "అయ్యా, మీ రెవరో మాకు తెలియలేదు. మీ రెవరో తెలిస్తేనే గాని మా పిల్లను

15. ద్రౌపదీవివాహం



శాస్త్రోక్తంగా వివాహం చెయ్యటం సాధ్యం కాదు," అన్నాడు.

అప్పుడు ధర్మరాజు నిజం చెప్పేశాడు. ద్రౌపదిని గెలుచుకున్నవాడు అర్జునుడేనని తెలియగానే ద్రుపదుడి కంట ఆనంద బాష్పాలు రాలాయి. "మీరు లక్కయింట చనిపోకుండా తప్పించుకోవటం నా అదృష్టం. మీకు మీ రాజ్యం తిరిగి సంపాదించి పెడతానని ప్రతిజ్ఞ చేస్తున్నాను," అన్నాడాయన.

కుంతీదేవి, పాండవులూ, ద్రౌపదీ ఉండటానికి మంచి భవనం ఒకటి ఏర్పాటయింది. అందులో వాళ్ళకు సుఖంగా జరుగుతున్నది.

కొద్ది రోజులయాక ద్రుపదుడు పాండవులతో, మంచి శుభముహూర్తం చూసి ద్రౌపదికీ, అర్జునుడికీ త్వరలో వివాహం ఏర్పాటు చేస్తానన్నాడు.

"అది ఎలా వీలవుతుంది? అర్జునుడి కన్న పెద్దవాళ్ళం నేనూ, భీముడూ ఇంకా అవివాహితులం," అన్నాడు ధర్మరాజు.

"అలా అయితే మా కృష్ణను నీకే ఇచ్చి చేస్తాను," అన్నాడు ద్రుపదుడు.

"మీ కుమార్తె రత్నం లాంటిది. రత్నాన్ని అందరూ అనుభవించవచ్చును. మా అమ్మ నోట వచ్చిన మాటను బట్టి మేము అయిదుగురమూ ఆమెను పెళ్ళాడతాము," అన్నాడు ధర్మరాజు.

ఈ మాటకు ద్రుపదుడు నివ్వెరపోయి, "ఒక పురుషుడు అనేకమంది భార్యలను పెళ్ళాడవచ్చును గాని, ఒక స్త్రీ అనేకమంది భర్తలను వివాహం చేసుకోవటం ఎక్కడన్నా కద్దా? దీని విషయమై రేపు మనవూ, నేనూ, కుంతీదేవీ, మా ధృష్టద్యుమ్నుడూ కలిసి చర్చించి, ఏదో ఒకటి నిశ్చయించుకుందాం," అని ద్రుపదుడు అప్పటికి చర్చ కట్టిపెట్టాడు.

ఆ సమయానికి నల్లజింకతోలు ధరించి కృష్ణద్వైపాయనుడు అక్కడికి వచ్చాడు.





అందరూ ఆయనకు ఎదురు వెళ్ళి, పూజించి, తీసుకు వచ్చి ఉచితాసనం మీద కూర్చో బెట్టి, తాము కూడా కూర్చున్నారు.

ఆ సభలో ద్రుపదుడు కృష్ణద్వైపాయనుడితో, "మహాత్మా, అన్ని ధర్మాలూ తెలిసినవాడై ఉండి కూడా ఈ ధర్మరాజు, నా కుమార్తెను తాము అన్నదమ్ములు అయిదుగురూ పెళ్ళాడాలంటున్నాడు. మీకు తెలియని విషయాలుండవు. ఏ యుగంలోనైనా అనేకమంది పురుషులు ఒక్కస్త్రీని పెళ్ళాడినది కద్దా? అది ధర్మ విరుద్ధం కాదా?" అన్నాడు.

వెంటనే ధర్మరాజు, "అధర్మం నా నోట ఎన్నడూ రాదు. మేమందరమూ ఈమెను పెళ్ళాడతామన్నప్పుడు మీరు నిశ్చింతగా ఆ పని చెయ్యవచ్చును. మా కందరికీ ఈమె పైన మనసు పోయింది. అదీగాక మా తల్లి అజ్ఞ అయింది. తల్లి అజ్ఞ పాలించటం కన్న ఉత్తమ ధర్మమేమున్నది? పూర్వాచారాల మాటకు వస్తే, గౌతమ వంశంలో పుట్టిన జటిల అనే మునికన్య ఏడుగురికి భార్య అయింది. దాక్షాయణి అనే మునికన్య ప్రచేతసు లనే మునులు పదిమందికి భార్య అయింది. ఇవి పురాణాలలో మనం విన్నవే." అన్నాడు.

ధృష్టద్యుమ్నుడు మరొక రకం అభ్యంతరం లేవదీశాడు: తమ్ముడైన అర్జునుడు స్వశక్తితో గెలుచుకున్న కన్యను అన్న అయిన ధర్మరాజు ఎలా పెళ్ళాడతాడు? కృష్ణ ఇంతమందికి ఎలా భార్య అవుతుంది?

కుంతి తన మాట అబద్ధం కారాదని పట్టుపట్టింది.

కృష్ణద్వైపాయనుడు కుంతికి ధైర్యం చెప్పి, ద్రుపదుడితో, "రాజా, ధర్మరాజు చెప్పినది అధర్మం కాదు. కుంతి కోరికా తప్పు కాదు. ఈ అయిదుగురు అన్నదమ్ములకూ నీ కుమార్తె నిచ్చి వివాహం చెయ్యి." అన్నాడు.





తరవాత ఆయన ద్రుపదుణ్ణి ఏకాంతంగా తీసుకుపోయి, ద్రౌపది పూర్వజన్మల వృత్తాంతం ఈ విధంగా చెప్పాడు:

పూర్వం మౌద్గల్యు డనే మునికి ఇంద్రసేన అనే భార్య ఉండేది. మౌద్గల్యుడికి కుష్ఠవ్యాధి సోకటం చేత ఆమెకు భర్త నుంచి ఎలాటి సుఖమూ లేకుండా పోయింది. ఆమె భర్త కోసం కలవరిస్తూ చనిపోయి, మరొక జన్మలో కాశీరాజు కుమార్తెగా పుట్టింది. ఆ జన్మలో ఆమె ఎంతో సౌందర్యవతి. అయినా ఆమెకు భర్త దొరకలేదు. అందుకామె చాలా దుఃఖించి, పరమేశ్వరుణ్ణి గురించి తీవ్రమైన తపస్సు చేయనారంభించింది. కొంతకాలానికి పరమేశ్వరుడు ఆమె ఎదట ప్రత్యక్షమై, "ఏమి కోరి తపస్సు చేస్తున్నావు? నీ కేమి కావాలో కోరుకో," అన్నాడు.

ఆమె ఆత్రంగా, "పతి, పతి, పతి, పతి, పతి!" అని అయిదుమార్లు అన్నది.

"నీకు వచ్చే జన్మలో అయిదుగురు మహాపురుషులు భర్తలు కాగలరు," అన్నాడు మహేశ్వరుడు.

తనకు అయిదుగురు భర్తలయేటట్టుంటే, తాను అందరికీ సమంగా సేవలు చేస్తూ, అందరినీ సమంగా సుఖపెట్టేటట్టు అనుగ్రహించమని కాశీరాజు కూతురు మహేశ్వరుణ్ణి వేడింది.

ఆమె ఇప్పుడు ద్రౌపదిగా పుట్టి, పూర్వజన్మలో పరమేశ్వరు డిచ్చిన వరాన్ని అనుసరించి పాండవు లయిదుగురికీ భార్య కానున్నది.

ఈ సంగతి చెప్పి, కృష్ణద్వైపాయన ముని ద్రుపదుడికి, పూర్వకాలం ఇలాటి వివాహాలుండే వనటానికి ఒక నిదర్శనం చెప్పాడు. అదేమిటంటే; నితంతు డనే రాజర్షికి సాల్వేయుడూ, శూరసేనుడూ, శ్రుతసేనుడూ, సారుడూ, అతిసారుడూ అనే అయిదుగురు కొడుకులుండేవారు.



ఎంతో అన్యోన్యంగా ఉండే ఆ అయిదు గురూ కలిసి ఉశీనర రాజకుమార్తె అయిన అజితను పెళ్ళాడి, ఆమె యందు ఆ అయిదు గురూ సంతానం కన్నారు. ఇది ఒకప్పుడు ఉండిన ఆచారమే.



వ్యాసుడైన కృష్ణద్వైపాయనుడే ఈ మాట చెప్పాక ద్రుపదుడికి సందేహనివృత్తి అయింది. పాండవులందరూ తన కుమార్తెను పెళ్ళాడటానికి సమ్మతించాడు.

ఆ రోజే మంచి లగ్నం ఉన్నది. చంద్రుడు పుష్యమి నక్షత్రంతో కలిసి ఉన్నాడు. అందుచేత పాండవులకు ద్రౌపదితో ఆ రోజే వివాహం కావటం మంచిదని కృష్ణద్వైపాయనుడన్నాడు. ద్రుపదుడు వెంటనే వివాహ యత్నాలు ప్రారంభించాడు. కాంపిల్య నగర మంతటా అరటిచెట్లూ, పోకగుత్తులూ అమర్చారు. లేత రావిఆకుల తోరణాలు అమర్చారు. అన్ని ఇళ్ళముందూ గంధం కలిపిన నీటితో అలికి, కర్పూరంతోనూ, ముత్యాలతోనూ ముగ్గులు పెట్టారు. నగర మంతా అలంకరించబడి, జనంతో కిటకిట లాడింది. అంతటా పుష్పమాలలు కనిపించాయి, సువాసనలు కొట్టాయి, మంగళాశీర్వచనాలు వినిపించాయి. ద్రుప దుడి భవనానికి ఈశాన్యాన పెళ్ళి పందిరి వేశారు. దానిని చక్కగా అలంక రించారు. దాని స్తంభాలకు ఆకుపచ్చ పట్టుబట్టలు చుట్టారు. రంగురంగుల బట్ట లతో చాందినీ అమర్చి, దానికి ముత్యాల మాలలూ, పుష్పమాలలూ వేళ్ళాడగట్టారు. బంగారు తిన్నె మీద అగ్నికుండం ఏర్పాటు చేశారు. బంగారు పాత్రలతో పుణ్యనదీ జలాలు తెచ్చిపెట్టారు.

అక్కడికి పాండవు లయిదుగురూ మంగళస్నానాలు చేసి, మేలి వస్త్రాలు ధరించి వచ్చారు. చక్కని బట్టలూ, అలం కరణాలూ ధరించి సఖులతో సహా ద్రౌపది కూడా వచ్చింది. ధౌమ్యుడు పుణ్యాహ





వాచన మయాక ముందుగా ద్రౌపదినీ, ధర్మరాజునూ పెళ్ళిపీటల మీద కూర్చోబెట్టి, హోమం చేయించి, శాస్త్రోక్తంగా వారిద్దరికీ పాణిగ్రహణం చేయించాడు. తరవాత భీమార్జున నకుల, సహదేవులు అదే విధంగా ద్రౌపదిని పెళ్ళాడారు.

ద్రుపదుడు తన అల్లుళ్ళందరికీ వేరు వేరుగా వెలలేని ఆభరణాలూ, ధనమూ, ధనేతరాలూ, రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, దాసీలూ, పాడిఆవులూ కానుక ఇచ్చాడు. పాండవులు తన అల్లుళ్ళు అయి ఉండగా దేవతలు కూడా తనను ఏమీ చెయ్యలేరని ద్రుపదుడికి తోచింది.



వివాహ విధి పూర్తి కాగానే ద్రౌపది అంతఃపురంలోకి తిరిగి వచ్చి, ఉత్తమాసనంలో అంతఃపుర స్త్రీల మధ్య కూర్చుని ఉన్న కుంతీదేవి వద్దకు పోయి, సాష్టాంగ వందనం చేసి, చేతులు జోడించి నిలబడింది. కుంతీదేవి తన కోడలిని చూసుకుని ఎంతో ముచ్చటపడి, ఆమెకు నీతులు చెప్పి, ఆశీర్వదించింది.

పాండవులు ద్రౌపదిని పెళ్ళాడినట్లు తెలియగానే కృష్ణుడు ఆ అయిదుగురికీ అంతులేని కానుకలు తీసుకువచ్చాడు. తరవాత పాండవులు కృష్ణుడితో సహా కాంపిల్యనగరం లోనే ఉండి సమస్త భోగాలూ అనుభవించసాగారు.

ద్రౌపదీ స్వయంవరంనాడు మత్స్యయంత్రాన్ని కొట్టి, కర్ణుడితో యుద్ధం చేసినవాడు అర్జునుడేననీ, శల్యుణ్ణి ఓడించినవాడు భీముడనీ, పాండవులు లక్కయింట కాలిపోక సజీవులుగానే ఉన్నారనీ, ఎలాగో వారు కుంతీదేవితో సహా ఆ ఆపద నుంచి బయట పడ్డారనీ రాజలోకానికి ఇప్పుడు తెలిసిపోయింది.

హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోయే దుర్యోధనుడికి కూడా ఈ మాట తెలిసింది. పాండవుల అదృష్టం చూసి దుర్యోధనుడు



కుంగిపోయాడు. అప్పుడు దుశ్శాసనుడు తన అన్నను సమీపించి, "బ్రాహ్మణ వేషం వెయ్యకపోతే ఆ అర్జునుడికి ద్రౌపది దక్కి ఉండునా? వాడు అర్జునుడని తెలిస్తే అంత తేలికగా వదిలిపెట్టేవాళ్ళమా? ఇప్పు డనుకుని ఏం లాభం? బాహుబలం కన్న దైవబలం హెచ్చు కావటం జరిగింది!" అన్నాడు. ఈ విధంగా వాళ్ళు జరిగిన దానికి విచారిస్తూ, లక్కయిల్లు కాల్చటానికి తాము నియోగించిన పురోచనుణ్ణి తిట్టుకుంటూ హస్తినాపురం చేరుకున్నారు.

జరిగినదంతా తెలియగానే సంతోషించిన వాడు విదురుడు. ఆయన ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి ద్రౌపదీ స్వయంవర వార్త లన్నీ తెలిపాడు. ఏ కారణం చేతనో ధృత రాష్ట్రుడు, ద్రౌపది తన కొడుకైన దుర్యోధ నుణ్ణి వరించిం దనుకుని, పరమానందం చెంది, "ఆ ద్రౌపదికి రత్నాభరణాలనూ, చీనాంబరాలనూ పంపించు. వెంటనే ఆమెను హస్తినాపురానికి రప్పించు," అన్నాడు విదురుడితో.

ధృతరాష్ట్రుడు తన మాటలను అపార్థం చేసుకున్నట్టు విదురుడు గ్రహించి, "ద్రుప దుడి కూతురు వరించినది అర్జునుణ్ణి. పాండవులు అయిదుగురున్నూ ఆ ద్రౌపదిని పెళ్ళాడేశారట," అని వివరంగా చెప్పాడు.

అంతా విని ధృతరాష్ట్రుడు, "అయితే ఏమంటావు? నాకు, నిజం చెప్పాలంటే, దుర్యోధనుడూ వాళ్ళకన్న పాండవులంటేనే హెచ్చు ప్రేమ. వాళ్ళు ఎంత పరాక్రమ వంతులు! పెద్దవాళ్ళకు ఎలా సేవలు చేస్తారు! యుక్తాయుక్తాలు వాళ్ళ కెంత బాగా తెలుసు! ద్రుపదుడితో సంబంధం చేసుకుని వాళ్ళిప్పుడు మరింత బలవంతు లయారు. వాళ్ళు బతికి బాగున్నారంటేనే నా కెంతో సంతోషమయింది!" అన్నాడు.

"రాజా, ఎల్లకాలమూ నీ బుద్ధి ఇలాగే ఉండుగాక!" అన్నాడు విదురుడు.





# మహాభారతం

విదురుడు వెళ్ళిపోగానే దుర్యోధనుడు తన తండ్రి వద్దకు వచ్చి, "నాన్నా, అస్తమానమూ ఈ విదురుడు నీ వెంటే ఉంటూ ఉన్నాడు. అందుచేత నా కడుపులో ఉన్న మాట చెప్పుకోవటానికి వీలు లేకుండా ఉన్నది. అతగాడు ఎప్పుడూ నా శత్రువులైన పాండవులను తెగపొగడతాడు. మనకు కావలసినది మన శత్రువుల పతనంగదా? అందు కేదన్నా మార్గంచూద్దాం," అన్నాడు.

ఆ మాటకు ధృతరాష్ట్రుడు, "నీ ఉద్దేశం ఒకటీ, నాది మరొకటీనా, నాయనా? విదురుడు పాండవులను మెచ్చుకుంటూంటే ఎదురు చెప్పలేక ఊకొడతాను, అంతే. నువ్వూ, కర్ణుడూ ఏమైనా ఆలోచించి ఉంటే చెప్పు," అన్నాడు.

"పాండవులు ద్రుపదుడికి అల్లుళ్ళు కావటం చేత చాలా బలవంతులయారు. పాండవులకు ఆ ద్రుపదుడి అండ లేకుండా చెయ్యాలి. నేర్పరులైన తాంత్రికులను ప్రయోగించి, పాండవులకు ద్రుపదుడితోనూ, ధృష్టద్యుమ్నుడితోనూ పడకుండా చేయాలి; పాండవులను పాంచాలం నుంచి వెళ్ళగొట్టించాలి," అన్నాడు దుర్యోధనుడు.

దుర్యోధనుడు ఇంకా పెద్ద ఆలోచనే చేశాడు. ద్రౌపదికి అయిదుగురు భర్తలు గనక ఆమెకూ, పాండవులకూ మధ్య ద్వేషం పుట్టించటానికి సమర్థులైన మోసకత్తెలను ప్రయోగించాలి. ఈ ఎత్తులు పారే పక్షంలో పాండవులకు మళ్ళీ హస్తినాపురం చేరాలని పించవచ్చు: అందుచేత కొందరు మను

16. పాండవులకు రాజ్యప్రాప్తి



షులు వారి వద్దకు వెళ్ళి, హస్తినాపురంలో జీవితం చాలా రోతగా ఉన్నట్టు నమ్మకం కలిగించాలి.

"పాండవులలో నిజంగా పరాక్రమవంతుడు భీముడే. వాణ్ణి రహస్యంగా చంపేద్దాం. భీమార్జునులు ఇద్దరూ కలిస్తే అగ్నికి వాయువు తోడైనట్టే! కాని భీముడు చచ్చాడంటే అర్జునుడు మన కర్ణుడికి చాలడు. ఇంతెందుకు? భీముడు లేకపోతే మిగిలిన పాండవులు నలుగురూ మనకు దాసులే. ఒక ఎత్తు వేసి వాళ్లను ఇక్కడికి రప్పించి మన అధీనంలో ఉంచుకోవచ్చు," అన్నాడు దుర్యోధనుడు.



అక్కడికి వచ్చి దుర్యోధనుడి ఆలోచనలన్నీ విన్న కర్ణుడు, "నువ్వు చెప్పే ఉపాయాలేవీ జరిగేవి కావు. వీటివల్ల పాండవులకు ఏమీ నష్టం రాదు. మహాశూరులైన అల్లుళ్ళను ద్రుపదుడు పంచాలకు అశించి వదులుకుంటాడా? అమిత హీన స్థితిలో ఉన్నప్పుడే పాండవులను వరించిన ద్రౌపది, వారిప్పుడు మంచి దశలో ఉండగా వదిలేస్తుందా? అదీగాక వాళ్లు ఆమెను ఎంతో ప్రేమతో చూసుకుంటున్నారు. అందుచేత ఆ యెత్తు పారదు. పోతే, భీముణ్ణి రహస్యంగా చంపింతామంటున్నావు. ఇది వరకు ఇలాటి యత్నాలు ఎన్ని విఫలం కాలేదు? హస్తినాపురంలో జీవితం రోతగా ఉన్నదని నీ వేగులవాళ్ళు చెబితే నమ్మేటంత వెర్రివాళ్ళనుకుంటున్నావా ఆ పాండవులు? సామదానభేదోపాయాలతో మనం వారిని ఏమీ చెయ్యలేం. ప్రస్తుతం మనం అవలంబించదగినది దండోపాయం ఒక్కటే. వాళ్ళ కన్న మనకిప్పుడు పెద్ద సేన ఉన్నది. యాదవులూ, చైద్యులూ, మాగధులూ వారికి సాయం వచ్చేలోపుగా మనం దండెత్తి వెళ్ళి వారిని నాశనం చెయ్యాలి. ఇందులో అధర్మం, అన్యాయం లాంటిది ఏమీ లేదు," అన్నాడు.





అది విని ధృతరాష్ట్రుడు, "కర్ణుడు చెప్పినది ఉచితంగానే ఉన్నది. మన భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ దీనికి ఏమంటారో కనుక్కుందాం," అన్నాడు.

భీష్మ ద్రోణ విదురులకు కబురు వెళ్ళింది. వాళ్ళు వచ్చి ధృతరాష్ట్రుడి నోట సంగతంతా విన్నారు.

భీష్ముడు తన అభిప్రాయం ఇలా చెప్పాడు: "నా దృష్టిలో పాండవులూ, దుర్యోధనాదులూ సమానమే. పితృపితామహుల నాటి నుంచీ వస్తున్న ఈ రాజ్యంలో పాండవులకు సగం చెందాలి. వారిని పిలిపించి వారి అర్ధరాజ్యం వారి కివ్వటం ధర్మం. అలా చెయ్యకపోతే మీ కందరికీ అపకీర్తి చుట్టుకుంటుంది. రాజులకు అపకీర్తి కన్న మరణం మేలు. దుర్యోధనా, ఇప్పటికే పాండవుల పట్ల చాలా దుర్మార్గాలు చేశావు, కాని వారికి హాని చెయ్యలేక పోయ్యావు. లక్కయింట కాలి చచ్చినవాడు పురోచనుడు మాత్రమే. వాడు కొంపకు నిప్పుపెట్టి, అందులో కాలిపోయాడంటే ఎవరన్నా నమ్ముతారా? కుంతీ, పాండవులూ లక్క ఇంట కాలిపోయారని విన్నాక నాకు ఎవరి ముఖం చూడాలన్నా అసహ్యం వేసింది. వాళ్ళు బతికి ఉన్నారు గనక నీ మానం



దక్కింది. ఇకనైనా కాస్త మంచి పేరు తెచ్చుకుని సుఖంగా ఉండు."

తరవాత ద్రోణుడు ఇలా అన్నాడు:

"భీష్ముడి అభిప్రాయమే నాదీనూ. పాండవులను తీసుకువచ్చి, వారికి అర్ధరాజ్యం ఇవ్వటం అవసరం. ద్రుపదుడికీ, ఆయన కొడుకులకూ, కుంతీదేవికీ, పాండవులకూ, ద్రౌపదికీ వస్త్రాభరణాలను కానుకగా పంపండి. వాటిని తీసుకుని దుశ్శాసనుడుగాని, వికర్ణుడుగాని కాంపిల్యనగరానికి వెళ్లటం మంచిది. అలా వెళ్ళినవాళ్ళు పాండవులతో ఆప్యాయంగా మాట్లాడి, అక్కడ వారితో కొంతకాలం గడిపి, సద్భా





వంతో హస్తినాపురానికి వారిని ఆహ్వానించి, వెంటబెట్టుకు రావాలి. ఇందుకు ద్రుపదుణ్ణి కూడా ఒప్పించాలి."

వెంటనే కర్ణుడు కలిగించుకుని ధృతరాష్ట్రుడితో, "రాజా, ఈ వృద్ధు లిద్దరూ ఎల్లప్పుడూ శత్రువులను మెచ్చుకుని, నీ పురోభివృద్ధికి అడ్డుతగులుతారు. వీరి మాటలు వినవద్దు," అన్నాడు.

ఈ మాటకు ద్రోణుడు ఆగ్రహించి, "నీకు పాండవుల మీద పగ ఉన్నదిగదా అని మా మీద తప్పువేస్తావా? ప్రస్తుతం కౌరవుల మేలు కోరేవాడివి మా కన్న నువే కాబోలు? ఏమైనా, మా సలహా ప్రకారం పనులు జరగకపోతే కౌరవులు నిష్కారణంగా చెడతారు," అన్నాడు.

అప్పుడు విదురుడు, "రాజా, మేము హితం చెప్పేవాళ్ళమే గాని నీ చేత ఏ పనీ చేయించలేం. భీష్మద్రోణులు హితమే చెప్పారు. కాని కర్ణుడు అది హితం కాదంటున్నాడు. ఎవరేమి చెప్పినా, భీష్మద్రోణుల కన్న నీ హితం కోరేవారెవరూ ఉండరు. వీరి వల్ల నీకు కీడు కలగట మన్నది ఊహించటానికైనా లేదు. వారికి పక్షపాత బుద్ధి లేదు. నీకు నీ కొడుకుల మీద పక్షపాతం గనక ఇచ్చకా లాడేవాళ్ళుంటారు. వారి మాటలు విన్నావో నీ వంశానికి ప్రమాదం వున్నది. దుస్సాహసం నాశనకారి. పాండవులను జయించడం మాటలు కాదు. వారికి కృష్ణుడి అండ ఉన్నది, ద్రుపదుడి అండ ఉన్నది. భీమార్జునులు అనన్య పరాక్రమం గలవారు. మంచిగా సాధించదగినది దండంతో సాధ్యంకాదు. హస్తినాపురపౌరు లందరూ పాండవులను చూడాలని ఉవ్విళ్లూరుతున్నారు. అందు చేత వారిని పిలిపించి అందరికీ ఆనందం చేకూర్చు," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఒక నిశ్చయానికి వచ్చి, "భీష్మద్రోణులూ, నువూ చెప్పినదే హితం.



నాకు నా కొడుకులు ఒకటీ, పాండవులు ఒకటీ కాదు. విదురా, నువు వెంటనే వెళ్ళి, పాండవులనూ, వారి తల్లినీ, వారి భార్య అయిన కృష్ణనూ ఇక్కడికి పిలుచుకురా. అదృష్టవశాన వారు లక్కయింట కాలిపోకుండా బతికారు. ద్రుపదుడి కూతురు వారికి భార్య కావటం మరింత అదృష్టం! అందుచేత నా దిగులంతా పోయింది,' అన్నాడు.

అనేక రత్నాభరణాలూ, మేలివస్త్రాలూ, ఇతర కానుకలూ తీసుకుని విదురుడు కాంపిల్యనగరం చేరుకుని, ద్రుపదుణ్ణీ, ధృష్టద్యుమ్నుడు మొదలుగాగల వారినీ, కృష్ణుణ్ణీ, పాండవులనూ కలుసుకుని, క్షేమసమాచారాలు అడిగి, చెప్పి, ఎవరికివ్వవలసిన కానుకలు వారికి అందజేశాడు.

తరవాత విదురుడు సభలో ద్రుపదుణ్ణి చూసి, "మహారాజా, ధృతరాష్ట్ర భీష్ములు తమరితో బంధుత్వం కలిసినందుకు మహదానందం పొంది, తమ క్షేమసమాచారాలు తెలుసుకురమ్మని నన్ను పంపారు. తమ స్నేహితుడైన ద్రోణుడు తనకు మారుగా నన్ను తమను ఆలింగనం చేసుకోవలసినదిగా చెప్పాడు. మీ కుమార్తె భార్య కావటం పాండవులకు రాజ్యప్రాప్తి కన్న కూడా



ఎక్కువైనది. పాండవులు హస్తినాపురాన్ని విడిచిపెట్టి చాలాకాలమయింది. కౌరవులు వారిని మళ్ళీ చూడాలని చాలా ఆత్రంగా ఉన్నారు. అంతఃపుర స్త్రీలు ద్రౌపదిని చూడటానికి తహతహలాడిపోతున్నారు. తమ అనుమతితో పాండవులను కుంతీ ద్రౌపదులతో సహా హస్తినాపురానికి తీసుకురావలసినదిగా ధృతరాష్ట్రుడు నన్ను ఆజ్ఞాపించాడు. అందుచేత తమరు అనుమతి ఇవ్వండి," అన్నాడు.

ఆ మాటలు విని ద్రుపదుడు విదురుడితో, "కౌరవులతో బంధుత్వం కలిసినందుకు నేను ఆనందపారవశ్యం చెందుతున్నాను.







అప్పుడు కృష్ణుడు సభవారితో, "విదురుడు కోరిన ప్రకారం అతని వెంట పాండవులను హస్తినాపురానికి పంపటమే ఉచితమని నాకు తోస్తున్నది. కాని, అన్ని విధాలా పాండవుల మేలు కోరే ద్రుపదుడి అభిప్రాయ మేమిటో?" అన్నాడు.

దానికి ద్రుపదుడు, "పాండవులు ఇవాళ నాకు దగ్గిరవారైనారు, కాని ఈ కృష్ణుడికి వారు చిన్నతనం నుంచీ ఆప్తులు. ఎంత దూరాన ఉండి కూడా అతను వారి మేలు కోరుతూ ఉంటాడు. అందుచేత ఆయన అభిప్రాయమే నాదీనూ," అన్నాడు.

ధృతరాష్ట్రు డంతటివాడు ఆజ్ఞాపించటమూ, నీ వంటి దూరాలోచనాపరుడు రావటమూ— ఇక అభ్యంతరాలకు అవకాశమేదీ? కాని, బలరామకృష్ణు లేమంటారో తెలుసుకోవాలి; పాండవుల శ్రేయస్సును వారెల్లప్పుడూ కోరుతారు. పాండవులు కూడా మహాప్రాజ్ఞులు, ధర్మపరులు, శక్తిమంతులు—వారేమంటారో?" అన్నాడు.

ద్రుపదుడి మాటకు ధర్మరాజు అడ్డువచ్చి, "మహారాజా, మేము మీ అధీనంలో ఉన్న వాళ్ళం. మీరు ఆలోచించి మా కర్తవ్యం ఎలా నిర్ణయిస్తే అలా నడుచుకుంటాం," అన్నాడు.

ద్రుపదుడి అనుమతి లభించింది. పాండవులు ద్రౌపదినీ, కుంతినీ వెంటబెట్టుకుని విదురుడి వెంట హస్తినాపురానికి బయలు దేరారు. కృష్ణబలరాములు వారి వెంట వచ్చారు. విదురుడు పంపిన దూత ముందుగా వెళ్ళి పాండవుల రాకను ధృతరాష్ట్రుడికి తెలిపాడు. ధృతరాష్ట్రుడు సంతోషించి, పాండవులకు ఎదురు వెళ్ళటానికి వికర్ణుణ్ణీ, చిత్రసేనుణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపాచార్యుణ్ణీ పంపాడు.

వారి వెంట పాండవులు హస్తినాపురం ప్రవేశించే సరికి నగరమంతా అలంకరించి ఉన్నది. ప్రజలు వారిని చూసి చాలా ఆనం

దించారు. పౌరుల దీవనలు అందుకుంటూ పాండవులు రాచనగరు చేరి, ధృతరాష్ట్రుడికీ, భీష్ముడికీ, ఇతర పెద్దలకూ మొక్కారు.

కొద్దిరోజులు గడిచాక ధృతరాష్ట్రుడు పాండవులనూ, కృష్ణుణ్ణీ పిలిచి, "నాయనలారా, మీకూ దుర్యోధనాదులకూ వైరం రాకుండా కౌరవరాజ్యంలో సగం మీ కిప్పుడే ఇచ్చేస్తున్నాను. ఈనాటి నుండీ మీరు ఖాండవప్రస్థంలో స్థిరపడి, సుఖంగా మీ వంతు రాజ్యం మీ రేలుకోండి," అన్నాడు.

ధర్మరాజు సరేనని పెద్దల కందరికీ నమస్కరించి, తన తమ్ములనూ, ద్రౌపదినీ, బలరామకృష్ణులనూ వెంటబెట్టుకుని ఖాండవప్రస్థానికి చేరుకున్నాడు. ఆ ఖాండవప్రస్థం అన్నది మహా భయంకరమైన అరణ్యం. ఆ సంగతి గుర్తించి కృష్ణుడు ఇంద్రుణ్ణి తలచుకున్నాడు. కృష్ణుడి ఉద్దేశం గ్రహించి ఇంద్రుడు విశ్వకర్మను అక్కడికి పంపాడు.

విశ్వకర్మ ఒక మంచి ప్రదేశం నిర్ణయించి అక్కడ ఒక చక్కని నగరం నిర్మించాడు. దాని చుట్టూ ఎత్తయిన ప్రాకారాలూ, ప్రాకారం వెలుపల లోతైన అగడ్తా, లోపల తెల్లగా మెరిసే భవనాలూ, గరుడాకారం గల పురద్వారమూ, విశాలమైన వీధులూ, రాజాస్థానాలూ, దేవాలయాలూ, అక్కడక్కడా అందమైన ఉద్యానవనాలూ ఉన్నాయి. దానికి ఇంద్రప్రస్థ మనే పేరు వచ్చింది. నగరం మధ్యలో విశాలమైన స్థలంలో పాండవులు నివసించడానికి భవనా లున్నాయి. నాలుగువర్ణాలవారూ, వివిధ శిల్పాలలో నైపుణ్యం గలవారూ వచ్చి ఇంద్రప్రస్థంలో నివసించారు.

ధర్మరాజు తన తమ్ములతోనూ, భార్యతోనూ అక్కడ సుఖంగా జీవిస్తూ రాజ్యపాలన చేశాడు. కొంతకాలం జరిగాక కృష్ణుడు పాండవుల వద్ద సెలవు తీసుకుని ద్వారకకు తిరిగి వెళ్ళాడు.






విశ్వకర్మ నిర్మించిన ఇంద్రప్రస్థ నగరాన్ని రాజధానిగా పెట్టుకుని పాండవులు తమ అర్ధరాజ్యాన్ని ధర్మంగా పాలించ నారంభించారు. రాజ్యం నానాటికీ అభివృద్ధి చెందుతూ వచ్చింది.

ఈ సమయంలో ఆకస్మికంగా నారద ముని ధర్మరాజును చూసి పోదామని వచ్చాడు. ధర్మరాజు తన తమ్ములతో సహా ఎదురు వెళ్ళి, నారదుణ్ణి తీసుకు వచ్చి, సుఖాసనమూ, అర్ఘ్యపాద్యాలూ ఇచ్చి, సాష్టాంగ నమస్కారం చేశాడు. అంతః పురంలో నుంచి ద్రౌపది కూడా వచ్చి నారదుడికి నమస్కారం చేస్తూ నిలబడింది. నారదుడు ఆమెను ఆశీర్వదించి పంపేసి, భీమార్జున నకుల సహదేవులు వింటూండగా ధర్మరాజుతో, "మీ అయిదుగురికీ ఒక్కతె భార్యగా ఉంటున్నది. ఆమె కారణంగా మీలోమీకు విరోధం కలగకుండానూ, మీ మధ్య సౌహార్దం పెరిగేటట్టూ ఉండాలంటే మీరు కొన్ని నియమాలు పెట్టుకోవాలి. ఇలాటి విషయాలలో ఎంత సన్నిహితులకు కూడా వైరం రావటం సహజం," అంటూ సుందోపసుందుల కథ చెప్పాడు.

హిరణ్యకశిపుడి వంశంలో నికుంభు డనే వాడు పుట్టాడు. అతని కొడుకులే సుందోప సుందులు. వాళ్ళు ఒకరినొకరు క్షణం కూడా విడిచిపెట్టక, ఎప్పుడూ కలిసి తిరుగుతూ, ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. వాళ్ళకు మూడు లోకాలూ జయించాలన్న కోరిక కలిగింది. అందుకోసం తపశ్శక్తి

## 17. అర్జునుడి తీర్థయాత్రలు

సంపాదించుకో గోరి వాళ్ళు వింధ్య ప్రాంతంలో ఒక నిర్జనారణ్యం చేరి, అక్కడ ఘోరమైన తపస్సు ప్రారంభించారు. ఆ వేడికి వింధ్యగుహల యందు అగ్ని పుట్టి, అరణ్యమంతటా గొప్ప జ్వాలలూ, పొగలూ లేచాయి.

వాళ్ళ తపస్సు చూసి దేవతలు భయపడి, తపోభంగం కలిగించాలని ఆ సుందోపసుందుల ఎదట రత్నాలరాసులూ, స్త్రీలూ ఉన్నట్టు భ్రమ కలిగించారు. దానికి సుందోపసుందులు చలించలేదు. తరవాత దేవతలు మరొక భ్రమ కలిగించారు. దాని ఫలితంగా సుందోపసుందుల ఎదట వారి తల్లులనూ, భార్యలనూ, కొడుకులనూ ఎవరో రాక్షసులు పీడిస్తున్నట్టూ, వాళ్ళు రక్షించమని సుందోపసుందులను అడుగుతున్నట్టూ కనపడింది. దానికి కూడా సుందోపసుందులు చలించలేదు. అప్పుడు వారి ఎదట బ్రహ్మ ప్రత్యక్షమై వారికి అన్ని రకాల మాయలూ, అస్త్రాలూ, సాటిలేని బలపరాక్రమాలూ, మూడు లోకాలనూ జయించే శక్తీ వరాలుగా ఇచ్చాడు. వాళ్ళు అమరత్వం కూడా అడిగారు గాని బ్రహ్మ అందుకు సమ్మతించక, వారికి ఇతరు లెవ్వరిచేతా చావు లేకుండా వరమిచ్చాడు. తాము ఒకరినొకరు చంపుకోవటమనేది వాళ్ళకు తట్టనేతట్టదు గనక,



తమకు అమరత్వం లభించినట్టే వాళ్ళు భావించారు.

ఇలా వరం పొందిన సుందోపసుందులు సైన్యాలను సమకూర్చుకుని, ఇంద్రలోకానికి పోయి, దాన్ని జయించి, పాతాళానికి వెళ్ళి, దాన్ని కూడా జయించి, చివరకు భూలోకాన్ని భీభత్సం చేయసాగారు. అప్పుడు బ్రహ్మ విశ్వకర్మను పిలిచి, అతనిచేత తిలోత్తమ అనే త్రిలోక సౌందర్యవతిని సృష్టించి, సుందోపసుందు లుండే చోటికి పంపాడు. ఆమె ఒక నది ఒడ్డున పూలు కోసుకుంటూండగా చూసి, ఆమెను మోహించి సుందోపసుందు లిద్దరూ ఆమె చేతులు రెండూ పట్టుకుని, ఆమెను తమ భార్యను చేసుకునేటందుకు నిశ్చయించుకున్నారు. "మాలో నువు ఎవరికి భార్య వవుతావు?" అని వాళ్ళు అడిగితే, "మీ ఇద్దరిలో ఎక్కువ బలాఢ్యుడికి భార్య నవుతాను," అన్నది తిలోత్తమ. ఎవరు ఎక్కువ బలంగలవారో తేల్చుకోవటానికై వారిద్దరూ గదా యుద్ధం చేసి, ఒకరినొకరు చంపేసుకున్నారు. [అట్ట చివరి బొమ్మ]

నారదుడు పాండవులకు ఈ సుందోపసుందుల వృత్తాంతం చెప్పి, "మీలో అలాటి వైరం రాకుండా ఏదో ఒక నియమం పెట్టుకోండి. ఇదంతా మీ మంచికే చెబుతున్నాను," అన్నాడు.



అప్పుడు పాండవులు నారదుడు సాక్షిగా ఒక నియమం ఏర్పాటు చేసుకున్నారు. దాని ప్రకారం ద్రౌపది ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్క భర్త దగ్గిర ఉంటుంది. ఆమె ఎవరింట ఉంటున్నదో ఆ ఇంటికి మిగిలిన వారెవ్వరూ పోరాదు; ఒకవేళ ఎవరైనా వెళ్ళటం జరిగితే వాళ్ళు పన్నెండు నెలలపాటు బ్రహ్మచర్యంతో వనవాసం జరిపి, తీర్థయాత్రలు చెయ్యాలి.

వారు చేసుకున్న ఈ నియమానికి నారదుడు సంతోషించి, "ఇలాటి ఏర్పాటు





ఉన్నట్టయితే మీ మధ్య ఎవరూ విభేదాలు పెట్టలేరు, మీరు సుఖపడతారు," అని చెప్పి, వెళ్ళిపోయాడు.

ద్రౌపది నియమం ప్రకారం ఏడాదికి ఒక భర్త ఇంట ఉంటున్నది. కాలం గడిచి పోతున్నది.

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు ధర్మరాజు ఇంటి వెలపల నిలబడి ఆక్రందనం చెయ్యటం అర్జునుడు చూసి, "అయ్యా, ఎందుకు ఏడుస్తున్నావు?" అని అడిగాడు.

"నాయనా, మీ వంటి ధర్మాత్ముల రక్షణలో ఉంటున్నా కూడా నా హోమ ధేనువులు దొంగలు తోలుకుపోయినారు. ఎంత ఘోషించినా నా ఏడుపు వినిపించుకునే వారు కనపడటం లేదు. ఆవులు పోవటంతో నా ధర్మకర్మలు నిలిచిపోయాయి. దయచేసి వాటిని నా కిప్పించు," అన్నాడు బ్రాహ్మణుడు దీనంగా.

"నీ ఆవులను నీ కిప్పిస్తాను, ఇక్కడే వుండు. దొంగలు ఎటు వెళ్లారో చూపటానికి నా వెంట వత్తువుగాని," అంటూ అర్జునుడు ధనుర్బాణాలు తీసుకురావటానికి ధర్మరాజు ఇంట్లో ప్రవేశించాడు.

కాని అంతలోనే అర్జునుడికి తమ నియమం గుర్తు వచ్చింది. ద్రౌపది ధర్మరాజుకు భార్యగా ఉంటున్నది. అలాంటప్పుడు తాను వారి ఇంట ప్రవేశిస్తే నియమ భంగ మవుతుంది. నియమభంగ మవుతుందని విల్లుబాణాలు తెచ్చుకోవడంలో ఆలస్యం చేస్తే కార్యభంగం అవుతుంది. నియమ భంగమైతే శిక్ష అనుభవించవచ్చు గాని కార్యభంగం కానివ్వరాదనుకుని అర్జునుడు, ధర్మరాజూ ద్రౌపదీ ఏకాంతంగా ఉన్న మందిరం ప్రవేశించి, ధర్మరాజు అనుమతితో ధనుర్బాణాలు తీసుకుని, బ్రాహ్మణుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళి, దొంగలతో పోరాడి జయించి, వారు ఎత్తుకుపోయిన గోవులను బ్రాహ్మణుడికి తిరిగి ఇప్పించాడు.



అర్జునుడు ఇంటికి తిరిగి వచ్చి పెద్దల ప్రశంస లందుకుని, వారికి నమస్కారాలు చేసి, ధర్మరాజు వద్దకు వెళ్ళి, "నియమాన్ని ఉల్లంఘించి, నువ్వూ, ద్రౌపదీ ఉన్న మందిరం ప్రవేశించాను గనక ఒక ఏడాది పాటు వనవాసమూ, తీర్థయాత్రలూ చేస్తాను, అనుమతి ఇయ్యి," అన్నాడు.

ఈ మాటలకు ధర్మరాజు నొచ్చుకుని, "అర్జునా, పెద్దవాళ్ళు భార్యలతో ఏకాంతంగా ఉన్న చోటికి చిన్నవాళ్ళు రావటం తప్పు కాదు. అంతేకాక, ఆ బ్రాహ్మణుడి అవసరం కొద్దీ నువ్వు రావటం జరిగింది. అందువల్ల మేలే జరిగింది గనక అది తప్పు పని కాదు. నా మాట అంటే నీకు లక్ష్యం ఉన్నట్టయితే ఈ తీర్థయాత్ర ఆలోచన మానుకో," అన్నాడు.

ఆ మాటకు అర్జునుడు, "ఒకరు తప్పు చేస్తే మనం శిక్షిస్తాం. అలాటి మనమే తప్పు చేసి, ఏదో సాకు చెప్పి శిక్ష తప్పించుకోవటం తగని పని. నన్ను ఆపవద్దు, నేను తీర్థయాత్రకు బయలుదేరటానికే నిర్ణయించుకున్నాను," అన్నాడు.

ధర్మరాజు సరేననక తప్పలేదు. అర్జునుడు అరణ్యవాసానికి తగిన విధంగా జుట్టూ, కట్టూ అమర్చుకుని అరణ్యానికి బయలుదేరాడు. అతనితోబాటు అనేకమంది





బ్రాహ్మణులూ, పుణ్య కథలను చెప్పే పౌరాణికులూ బయలుదేరారు. వారందరి తోనూ కలిసి అర్జునుడు అనేక తీర్థాలు సేవించి, కొంత కాలానికి గంగాద్వారం చేరాడు.

అక్కడ అనేకమంది మునులు గంగలో స్నానాలు చేసి, అగ్నిని అర్చించి, అందులో ఆహుతులు వేస్తున్నారు. అది చూసి అర్జునుడు చాలా ఆనందం పొంది, తాను కూడా స్నానం చేసి, దేవతర్పణాలూ, పితృతర్పణాలూ అగ్నిలో వేల్చుదామనుకుని స్నానం చెయ్యటానికి నదిలో దిగాడు.

ఆ సమయంలో ఉలూపి అనే నాగకన్య అర్జునుడి అందం చూసి మోహించి, నీటిలోనే అతన్ని పట్టుకుని, నీటిలోకి లాగి నాగలోకానికి తీసుకుపోయి, ఒక దివ్యమైన భవనం చేర్చింది.

అర్జును డామెను చూసి, "ఏమిటి నీ సాహసం? నువు ఎవతెవు? ఎవరి కూతురివి? ఇది ఏ దేశం?" అని అడిగాడు.

"నాథా, నేను నాగులలో ఐరావత కులానికి చెందిన కౌరవ్యుడు అనే నాగరాజు కుమార్తెను. నా పేరు ఉలూపి. మన్మథుడి లాటి నిన్ను చూసి మోహించి, మా నాగులకుండే శక్తుల ప్రభావంతో నిన్ను ఇక్కడికి తెచ్చాను. నా కోరిక తీర్చి సంతానం పొందు," అన్నది ఉలూపి. [అట్ట మీది బొమ్మ]

"చూడు, ఉలూపీ, కారణాంతరంవల్ల నేను బ్రహ్మచర్యం అవలంబించి, తీర్థయాత్రలతో కాలక్షేపం చేస్తున్నాను. నన్ను వ్రతభంగం చెయ్యమని నువు అడగటం అధర్మం. నీ మాట ఎలా ఉన్నా నాకు మహా పాపం చుట్టుకుంటుంది," అన్నాడు అర్జునుడు.

కాని ఉలూపి ఆ మాటకు ఒప్పుకోక, "ద్రౌపది విషయంలో మీ అన్నదమ్ములు చేసుకున్న నియమం మాట తెలియక పోలేదు. అయినా నువు బ్రహ్మచర్య వ్రతమని చెప్పి లాభం లేదు. నువు నా కోరిక

ఉడేర్చకపోతే మదనతాపంతో నేను మాడి చచ్చిపోతాను. ఆ పాపం నీకు చుట్టు కుంటుంది. ప్రాణం కాపాడటం కన్న గొప్ప పుణ్యం ఉండదు. నాకు అభయం ఇయ్యి." అంటూ అర్జునుడి పాదాలు గట్టిగా పట్టుకున్నది.

అర్జునుడు పరిస్థితి బాగా ఆలోచించి, ఉలూపి కోరిక తీర్చ నిశ్చయించుకున్నాడు. అతనా రాత్రి ఆమెతో గడిపాడు. మర్నాడు ఉదయం ఉలూపి అతనికి దారి చూపుతూ వెంట వచ్చి, గంగాద్వారానికి చేర్చింది. ఆమె అర్జునుడికి ఏ జలప్రాణి నుంచీ ప్రమాదం లేకుండా వర మిచ్చి తన నివాసానికి తిరిగిపోయింది. ఆమె అర్జునుడి వల్ల గర్భవతి అయి, కొంత కాలానికి ఇరావంతు డనే కొడుకును కన్నది.

గంగాద్వారం వదలి అర్జునుడు అనేక తీర్థాలు సేవిస్తూ, అనేక నదుల స్నానాలు చేస్తూ, బయలుదేరిన పదమూడవ నెలలో మణిపుర మనే నగరం చేరాడు. ఆ నగరానికి రాజు చిత్రవాహనుడు. ఆయనకు చిత్రాంగద అనే కుమార్తె ఉన్నది. ఆమెను చూడగానే అర్జునుడికి ఆమెపై మోహం కలిగింది. అతను చిత్రాంగదను తన కిచ్చి వివాహం చెయ్యమని ఆమె తండ్రి నడిగాడు.

దానికి చిత్రాంగదుడు, "అంత కన్న నాకు కావసినదేమిటి? కాని ఒక్క విషయం చెప్పాలి. మా వంశంలో ప్రతి తరానికి ఒక్కడే కొడుకు. అయితే నాకు మాత్రం కూతురు కలిగింది. అందుచేత ఈమెకు కలిగే కొడుకును నేను నా కొడుకుగా పెంచుకుంటాను. దాని కభ్యంతరం లేకపోతే ఇప్పుడే నా కుమార్తెను నీ కిచ్చి వివాహం చేస్తాను," అన్నాడు.

అర్జునుడు అందుకు సమ్మతించి, చిత్రాంగదను పెళ్ళాడి, ఆమెతో మూడు నిద్రలు చేసి, తన వెంట ఉన్న బ్రాహ్మణబృందంతో దక్షిణ సముద్ర తీరానికి చేరుకున్నాడు.





# మహాభారతం

దక్షిణసముద్రతీరప్రాంతంలో సౌభద్రమనే తీర్థం ఉన్నది. అర్జునుడు దానిలో స్నానం చెయ్యటానికి ఉపక్రమిస్తూండగా, అక్కడ ఉండే బ్రాహ్మణులు అతన్ని వారించి, ఈ విషయాలు తెలిపారు :

ఈ సౌభద్రతీర్థంతో బాటు, పౌలోమ, కారండవ, ప్రసన్న, భారద్వాజ తీర్థాలు కూడా ఆ ప్రాంతంలో ఉన్నాయి. నూరేళ్లుగా ఈ అయిదు తీర్థాలలోనూ ఎవరూ స్నానాలు చెయ్యటం లేదు. కావటానికి అవి పుణ్యతీర్థాలేగాని, వాటిలో మొసళ్ళు చేరాయి. వాటిలోకి దిగటం చాలా ప్రమాదకరం.

ఈ సంగతి విని కూడా అర్జునుడు, తాను మొసలికి భయపడి, సౌభద్రతీర్థంలో స్నానం చెయ్యకపోవటం, పౌరుషహీనమనుకున్నాడు. ఇంతవరకూ అతను ఏ ఒక తీర్థాన్నీ విడవకుండా సేవిస్తూ వస్తున్నాడు. అందుచేత ఈ తీర్థంలో కూడా సంకోచించకుండా దిగేశాడు.

నీళ్ళ కదలిక తెలుసుకుని ఆ తీర్థంలో ఉన్న పెద్ద మొసలి గబగబా వచ్చి అర్జునుడి పాదం పట్టుకున్నది. అర్జునుడు దానిని అలాగే ఒడ్డు దాకా ఈడ్చుకు వచ్చి, నీటిలో నుంచి నేల మీదికి విసిరివేశాడు.

వెంటనే దానికి మొసలి రూపం పోయి, కుదురైన అందమైన స్త్రీ రూపం వచ్చింది. ఈ మార్పు చూసి అక్కడ ఉన్న బ్రాహ్మణులతోపాటు అర్జునుడు కూడా దిగ్భ్రమ చెంది, "ఓ సుందరీ, నువు ఎవతెవు? ఏ కారణం చేత మొసలి రూపం ధరించి ఈ మడుగులో

## 18. ద్వారకలో అర్జునుడు

ఉన్నావు? తిరిగి ఎలా మొసలి రూపం పోయింది?" అని అడిగాడు.

ఆమె అర్జునుడితో, "నేనొక అప్సరసను. నా పేరు వర్గ. సౌరభేయి, సమీచి, పస, లత అనే నా నలుగురు చెలికత్తెలూ శాప కారణంగా నాలాగే మొసళ్ళుగా మారారు. నాకు శాపవిమోచనం కలిగించినట్టే వారికి కూడా కలిగించి, పుణ్యం కట్టుకో," అన్నది.

"మీకు ఈ భయంకరమైన శాపం ఎందుకు వచ్చింది?" అని అర్జునుడు అడిగాడు. దానికి వర్గ తమ కథ ఇలా చెప్పింది:

"మేము అయిదుగురమూ దిక్పాలకుల నగరాలు చూడటానికి బయలుదేరి, అవి చూసుకుంటూ భూలోకానికి వచ్చాం. ఒక వనంలో మాకు ఒక బ్రాహ్మణుడు తపస్సు చేసుకుంటూ కనిపించాడు. అతను ఎంతో అందంగా ఉన్నాడు. దారుణమైన తపస్సులో ఉండి, అగ్నిహోత్రుడిలాగా వెలిగిపోతున్నాడు. అతని తపస్సు పాడు చెయ్యాలని మాకు దుర్బుద్ధి పుట్టింది. అతని ఎదట ఉద్రేకం కలిగించే మాటలాడాం; అతనికి మా మీద మోహం కలిగించటానికి గాను పాటలు పాడాం; రకరకాల నాట్యాలు చేశాం. మేము ఏం చేసినా అతను చలించ లేదు. మమ్మల్ని గడ్డిపోచల కన్న హీనంగా చూశాడు. అతనికి కామోద్రేకం కలిగించే







పనులు చేశాం. అతనికి కోపం వచ్చింది. మమ్మల్ని మొసళ్ళు కమ్మని శపించాడు! మేము వెంటనే అతని కాళ్ళమీద పడి, ఆడవాళ్ళ మీద అంతగా ఆగ్రహించటం అన్యాయమన్నాం. ఇలాటి శాపం అనుభవించటం కన్న చావు మేలన్నాం. అంతే, ఆయన మాకు నూరేళ్ళపాటు మొసలి జీవితం తప్పదనీ, ఆ తరవాత ఎవరు మమ్మల్ని పట్టుకుని ఒడ్డున పడవేసినా మా శాపం తీరిపోతుందనీ అన్నాడు. అది మొదలు మేమిక్కడ అయిదు తీర్థాలలోనూ మొసళ్ళ రూపంలో ఉన్నాం. నా వెంట మిగిలిన నాలుగు తీర్థాలకూ వచ్చి నా చెలికత్తెల శాపం కూడా తీర్చి, ఈ తీర్థాలన్నిటినీ పవిత్రం చెయ్యి."

ఆమె కోరిన ప్రకారంగానే అర్జునుడు మిగిలిన నాలుగు తీర్థాలలోనూ దిగి, అందులో ఉన్న అప్సరసలకు శాపవిమోచనం కలిగించాడు. అటు తరవాత ఆ అయిదు తీర్థాలకూ నారీతీర్థా లనే పేరు వచ్చింది.

అర్జునుడు అక్కడి నుండి తిరిగి మణిపురానికి వచ్చి, చిత్రాంగదతో కాపరం చేశాడు. కాలక్రమాన చిత్రాంగదకు బభ్రువాహను డనే కొడుకు కలిగాడు. ఆ పిల్లవాణ్ణి చిత్రాంగద తండ్రికి వంశోద్ధారకుడుగా ఇచ్చేసి, అర్జునుడు, అక్కడికి సమీపంలోనే ఉన్న ప్రభాసతీర్థానికి వెళ్ళి, అందులో స్నానం చేసి, ఆ రాత్రి కొద్దిపాటి వర్షం పడుతూంటే, ఒక మర్రిచెట్టు కింద పడుకున్నాడు.

అక్కడ అర్జునుడికి గదు డనే యాదవుడు తటస్థపడి, కృష్ణుడి చెల్లెలైన సుభద్ర అందచందాలను గురించి మాట్లాడాడు. సుభద్ర తిలోత్తమను మించిన అందగత్తె అని అర్జునుడు ఆదివరకే విన్నాడు. అతనికి ఇప్పుడు ఆ సుభద్రను చూడాలనీ, ఆమెను సాధించుకోవాలనీ ఆలోచన పుట్టింది. ప్రభాసతీర్థానికి





ద్వారక ఏమంత దూరం కాదు. అక్కడికి పోతే కృష్ణుడు కనబడతాడు.

యాదవులకు యతు లంటే చాలా భక్తి. అందుచేత అర్జునుడు యతివేషం వేసుకుని ద్వారకకు వెళ్ళటానికి నిశ్చయించాడు. ఈ లోపల, అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ ప్రభాసతీర్థం చేరిన వార్త వేగులవాళ్ళ ద్వారా ద్వారకకు చేరింది. కృష్ణుడు అతన్ని చూడటానికి ప్రభాసతీర్థానికి వచ్చి, "ఇదేమిటి, అర్జునా? ఈ మారువేషం వేశావు దేనికి?" అని అడిగాడు.

అర్జునుడు తన మనసులో ఉన్న కోరికను కృష్ణుడికి చెప్పుకున్నాడు. కృష్ణుడు దాన్ని



ఆమోదించి, అర్జునుణ్ణి రైవతకాద్రి మీద ఉంచటానికి నిశ్చయించి తనవెంట తీసుకు వచ్చాడు. అక్కడ కృష్ణార్జునులు ఆ పగలూ, రాత్రి కబుర్లతో గడిపారు, సుఖమైన భోజనం చేశారు, నృత్యగాన వినోదాలు అనుభవించారు. మర్నాడు తెల్లవారగానే కృష్ణుడు అర్జునుడికి రైవతకాద్రి మీద అన్ని సదుపాయాలూ ఏర్పాటు చేసి, ద్వారకకు వెళ్ళిపోయాడు.

తరవాత కొద్ది రోజులకే యాదవులు రైవతకాద్రి మీద ఒక గొప్ప ఉత్సవం జరిపారు. ఆ ఉత్సవం చూడటానికి ద్వారక నుంచి వసుదేవుడూ, ఉగ్రసేనుడూ, అక్రూరుడూ, బలరాముడూ, కృష్ణుడూ, ప్రద్యుమ్నుడు మొదలైన యాదవ కుమారులూ, దేవకీదేవీ, రేవతీ, రుక్మిణీ, సత్యభామా, జాంబవతీ మొదలైన అంతఃపుర స్త్రీలూ, సుభద్ర మొదలుగా గల కన్యలూ వచ్చారు. ఆ అందరి మధ్యా తిరిగే సుభద్రను చూసి అర్జునుడు విపరీతంగా మోహపరవశుడై కూడా ఏమీ చేయలేక మథనపడ్డాడు. ఉత్సవం ముగియగానే అందరూ ద్వారకకు తిరిగి వెళ్ళిపోయారు.

కృష్ణుడి అనుమతితో అర్జునుడు రైవతకాద్రిని విడిచిపెట్టి, ద్వారకను అని ఉన్న







ఈ మాట విని బలరాముడు చాలా సంతోషించి, తన వెంట ఉన్న కృష్ణుడితో, "ఈ యతికి సుభద్ర ఇంటి సమీపంలో ఉన్న పొదరింట్లో వసతి ఏర్పాటు చేతాం. ఏమంటావు?" అన్నాడు.

"ఈ యతి చూడబోతే అందగాడుగా ఉన్నాడు. మన సుభద్రకూడా సౌందర్యవతి. అందు చేత చివరకు ఎలా పరిణమిస్తుందోనని నా భయం!" అన్నాడు కృష్ణుడు.

"అలా అందరినీ సంశయించటం తగదు. ఈ యతికి సుభద్ర మందిరమే సరి అయినది," అన్నాడు బలరాముడు.

కృష్ణుడు తన అన్న మాట తోసివెయ్యటం భావ్యం కాదన్న ధోరణిలో బలవంతాన ఒప్పుకున్నట్టు నటించి, అర్జునుణ్ణి సుభద్ర మందిరం ఆవరణలో చేర్చి, అతని రహస్యాన్ని రుక్మిణీ, సత్యభామలకు మాత్రం తెలిపాడు. తరవాత సుభద్రతో, "అమ్మా, యతిని నీ తోటలో విడిదిచేయించాం. నువూ, నీ చెలికత్తెలూ అతను చెప్పినట్టు వింటూ, అతనికి కావలిసిన ఉపచారాలన్నీ చెయ్యాలి. అతని భోజనం, స్నానం విషయంలో ఏమాత్రమూ అజాగ్రత్తగా ఉండకు. యతిసేవ చేసి యాదవ కన్యలు ఎన్నో సుఖాలు పొందారు," అన్నాడు.

ఒక ఉద్యానవనానికి చేరాడు. అక్కడికి వాహ్యాళికి వచ్చే బలరాముడు మొదలైన యాదవులు అర్జునుణ్ణి చూసి, దొంగ యతి అని తెలియక, అతనికి నమస్కారాలు చేసి, "తమరు ఏయే పుణ్యతీర్థాలు చూశారు? ఏయే పుణ్యక్షేత్రాలకు వెళ్ళారు? ఇక్కడ ఎంతకాలం ఉంటారు?" అని భక్తితో అడిగారు. అర్జునుడు వారికి తగిన జవాబు లిచ్చి, "చాతుర్మాస్యం ఇక్కడనే జరుపుదా మనుకుంటున్నాను," అన్నాడు. చాతుర్మాస్యం అంటే ఆషాఢ శుక్లపక్షం నుంచి, కార్తిక శుక్లపక్షం దాకా నాలుగు నెలలు జరిపే నిష్ఠ.





కృష్ణుడు చెప్పినట్టుగానే సుభద్ర అర్జునుడికి సమస్త ఉపచారాలూ లోటులేకుండా చేస్తూ వచ్చింది. సుభద్ర అందం చూసి అర్జునుడు మోహపరవశుడు కావటమేగాక, ద్రౌపది చక్కదనాన్ని కూడా పూర్తిగా మరిచిపోయాడు. అతని తీర్థయాత్రల గడువు ఎప్పుడో దాటిపోయింది. కాని ఇంద్రప్రస్థానికి తిరిగి పోవాలన్న ఆలోచన అతనికి ఏమాత్రమూ లేదు.

అర్జునుడి స్థితి ఇలా ఉంటే, సుభద్ర కూడా అర్జునుడి కోసమే కలవరిస్తున్నది. ఆమెకు అర్జును డంటే గొప్ప భావం కలిగించినవాడు గదు డనే యాదవుడే. అదీగాక, కృష్ణుడు అర్జునుణ్ణి పదిమందిలోనూ మెచ్చుకోగా ఆమె విన్నది. యాదవులు తమ పిల్లలను దీవించేటప్పుడు, "అర్జునుడంత విలుకాడివి కా!" అనటం ఆమెకు తెలుసు. వీటన్నిటి మూలంగా సుభద్ర మనస్సులో అర్జునుడు బాగా స్థిరపడ్డాడు. అందుచేత, ఎవరైనా కురుజాంగలదేశాల నుంచి వచ్చినప్పుడు ఆమె అర్జునుడి వార్తలు అడిగి తెలుసుకునేది, అతని వర్ణనలు ఎంతో శ్రద్ధగా వినేది.

ఒకనాడు అర్జునుడు ఒంటరిగా ఉన్నప్పుడు సుభద్ర అతని సపర్యలన్నీ ముగించి, "మీరు ఏ దేశాలు చూశారు? మీకు ఇంద్రప్రస్థం తెలుసా? మా మేనత్త కుంతీదేవి క్షేమంగా ఉన్నదా? ధర్మరాజు మొదలైనవారు కులాసాగా ఉన్నారా? పెద్ద కళ్ళూ, పొడుగాటి చేతులూ గల అర్జునుడు మీకు తెలుసా? అతను మహాశూరుడు, పరాక్రమవంతుడు," అన్నది.

దానికి అర్జునుడు, "ఇంద్రప్రస్థంలో కుంతీ, పాండవులూ, ద్రౌపదీ సుఖంగా ఉన్నారు. వారికి తెలియకుండా అర్జునుడు మాత్రం యతివేషం వేసుకుని, ద్వారకలో సుభద్ర ఎదట ఉన్నాడు! నేనే అర్జునుణ్ణి. నీకు నా పైనగల ప్రేమ కంటె నాకు నీపైన

ఎన్నోరెట్లు ప్రేమ ఉన్నది. ఒక మంచి రోజున నేను నిన్ను పెళ్ళాడి వైభవంగా ఉంటాను," అన్నాడు.

సుభద్ర చాలా సిగ్గుపడిపోయి, తల ఎత్త లేదు. అర్జునుడు తన లతా గృహానికి వెళ్ళిపోయాడు.

వారిద్దరి మనస్థితి గ్రహించి కృష్ణుడు అర్జునుడి సేవలకు రుక్మిణిని నియోగించాడు. అర్జునుణ్ణి ప్రత్యక్షంగా చూసినది మొదలు సుభద్ర పిచ్చిఎత్తిన దానిలాగా అయిపోయి, నిద్రాహారాలు మానేసింది.

దేవకీదేవి తన కూతురి అవస్థ గ్రహించి, "ఎందుకు కుమిలి పోతావే, పిచ్చిదానా? నీ విషయం మగవాళ్ళతో చెప్పి నీ కోరిక తీరేటట్టు చూస్తాను," అని మాట ఇచ్చింది.

ఆమె సుభద్ర విషయం తన భర్త అయిన వసుదేవుడికి చెప్పింది. ఆయన ఈ సంగతి ఉగ్రసేనుడికీ, అక్రూరుడికీ, మరికొందరు హితులకూ చెప్పి, కృష్ణుడి అనుమతితో, బలరాముడికి తెలియకుండా, పదిరోజుల అనంతరం సుభద్రార్జునుల వివాహానికి ముహూర్తం నిశ్చయించాడు. అందుకోసం అంతర్ద్వీపంలో పన్నెండు రోజులపాటు ఉత్సవం జరపాలని చాటింపు వేయించాడు.

ఈ అంతర్ద్వీపం పది యోజనాల నిడివి గలది. ఈ ఉత్సవం కోసం ద్వారక నుంచి ఆబాలగోపాలమూ ఆ ద్వీపానికి వెళ్ళారు. తన వివాహానికి కృష్ణుడు కూడా దగ్గిర ఉండాలనే ఉద్దేశంతో అర్జునుడు సుభద్రను పురికొల్పి కృష్ణుణ్ణి అడిగించాడు; ఆమె కృష్ణుడితో, "అన్నా, నువు కూడా అంతర్ద్వీపానికి పోతే యతిసేవ సాగదు. అందుచేత నువు ఉండి పో!" అన్నది.

దానికి కృష్ణుడు, "ఈ సమయంలో యతిసేవకు నువు తప్ప ఇంకెవరూ పనికి రారు," అని తాను కూడా అంతర్ద్వీపానికి వెళ్ళిపోయాడు.





# మహాభారతం

## 19. సుభద్రా వివాహం

ద్వారకలో వారందరూ అంతర్ద్వీపంలో మహోత్సవం చూడబోవటం వల్ల అర్జునుడు సుభద్రను నిరాటంకంగా పెళ్ళాడటానికి అవకాశం ఏర్పడింది.

అందుకని అర్జునుడు, తనకు సేవలు చేస్తున్న సుభద్రతో, "తండ్రిగాని, అన్నగాని కన్యాదానం చేయగా అగ్నిసాక్షికంగా జరిగేదే వివాహం. కాని మనం అలా పెళ్ళాడటానికి ఇప్పుడు అవకాశం లేదు. అయితే ప్రేయసీ ప్రియులుగా మనం ఈ రాత్రి గాంధర్వ వివాహం చేసుకోవచ్చు. అది క్షత్రియ ధర్మమే. అందుచేత మనం గాంధర్వ వివాహం చేసుకోవటం గురించి నీ ఉద్దేశమేమిటి?" అన్నాడు. దీనికి సుభద్ర జవాబు చెప్పక, తన అన్న అయిన కృష్ణుణ్ణి తలచుకుంటూ, కంట తడిపెట్టింది.

అర్జునుడి కోరిక తీరేటట్టు కనబడ లేదు. అతను ఇంద్రుణ్ణి స్మరించాడు. దాని ఫలితంగా ఆ రాత్రి ఇంద్రుడు తన భార్య అయిన శచీదేవినీ, అరుంధతినీ, నారదుణ్ణీ, వసిష్ఠుణ్ణీ, మరికొందరు దేవ ఋషులనూ, అప్సరసలనూ వెంట బెట్టుకుని, అర్జునుడున్న చోటికి వచ్చాడు.

అదే సమయానికి కృష్ణుడు, అంతర్ద్వీపంలో బలరాముడు మొదలైన వాళ్ళు నిద్రలో ఉండగా, అక్రూరుణ్ణీ, సాత్యకినీ, గదుణ్ణీ వెంట బెట్టుకుని అక్కడికి చేరాడు. అతని వెంట దేవకీదేవీ, రుక్మిణీ కూడా వచ్చారు.




ఇంద్రుడు కృష్ణుణ్ణి కుశల ప్రశ్నలు చేసి, "నా కొడుకైన అర్జునుడికి నీ చెల్లెలైన సుభద్ర నిచ్చి వివాహం చేయవలసింది," అని లాంఛనంగా అడిగాడు.

"అంతకన్న మాకు కావలిసిందేమిటి?" అన్నారు యాదవులు. కృష్ణుడు ఇంద్రుడికి తన సమ్మతి తెలిపాడు.

ఇంద్రుడు అర్జునుడి చేత మంగళ స్నానం చేయించి, దివ్యమైన పూలదండల తోనూ, బట్టలతోనూ, ఆభరణాలతోనూ అలంకరించి వివాహ మంటపానికి తెచ్చాడు.

ఈలోపుగా అరుంధతీ, శచీ, దేవకీ, రుక్మిణీ కూడా సుభద్రకు స్నానం చేయించి, వెలలేని ఆభరణాలతో అలంకరించి తెచ్చి, అర్జునుడి పక్కన కూర్చో బెట్టారు. దిక్పాలకుల సమక్షంలో, నారద వసిష్ఠాదులు సదస్యులుగా సుభద్రార్జునుల వివాహం శాస్త్రోక్తంగా జరిగింది. దేవతలు తమ లోకానికి వెళ్ళిపోయారు. యాదవులు అంతర్ద్వీపానికి తిరిగి వెళ్ళిపోయేటప్పుడు కృష్ణుడు అర్జునుడితో, "అర్జునా, నువు ఇక్కడ ఇరవై రెండు రోజు లుండు. తరవాత ఈ రథం ఎక్కి సుభద్రతో సహా ఇంద్రప్రస్థానికి తిరిగి వెళ్ళి పో," అంటూ, సైన్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకా లనే నాలుగు గుర్రాలు గల రథాన్ని చూపాడు.

కృష్ణుడు చెప్పినట్టే అర్జునుడు ఇరవై రెండు రోజులూ ద్వారకలో గడిపి, "నా చాతుర్మాస్యవ్రతం ముగిసింది. బ్రాహ్మణ సమారాధన చేస్తాను. ఏర్పాట్లు చేయించు," అని సుభద్రతో అన్నాడు.

ఆ తతంగం ముగిసింది. కృష్ణుడి రథాన్ని ఆయుధాలతో సహా సిద్ధం చేయించమని అర్జునుడు సుభద్రను అడిగాడు. ఆమె అలాగే చేసింది. అర్జునుడు సుభద్రనూ, ఆమె చెలికత్తెలనూ రథంలో ఎక్కించుకుని, అతి వేగంగా ఇంద్రప్రస్థం వెళ్ళే మార్గాన బయలుదేరాడు.





బలరాముడు వారిని వారించి, కృష్ణుడితో, "అర్జునుడు ఎంత ద్రోహం చేశాడో చూశావా? నువ్వేమీ మాట్లాడవేం? ఈ అవమానం కన్న చావు మేలు. నువు సరేనంటే, నేను వెళ్ళి భూమిమీద కౌరవవంశం లేకుండా చేసి వస్తాను!" అని కటువుగా మాట్లాడాడు.

ఆ మాటకు కృష్ణుడు బలరాముడితో, "అర్జునుడు మన కిప్పుడు చేసిన మహాపచార మేమిటి? మనం సుభద్రకు అంతకన్న మంచి భర్తను ఎక్కడి నుంచి తెస్తాం? రాక్షస వివాం ధర్మ విరుద్ధం కాదుగదా! మీరంతా వెళ్ళి అతన్ని యుద్ధంలో ఓడిస్తారా? అది ఇంద్రుడికి కూడా సాధ్యం కాదు. యుద్ధం చేసి అర్జునుడి చేతిలో ఓడి అపకీర్తి తెచ్చుకోవటమో, అతనితో రాజీపడి, మంచిగా సంబంధం కలుపుకోవటమో ఆలోచించండి. రెండవ పద్ధతే అన్ని విధాలా మేలు," అని చెప్పాడు.

కృష్ణుడి సలహాను యాదవు లందరూ మెచ్చుకున్నారు.

అర్జునుడు సుభద్రతో సహా ఇంద్రప్రస్థం చేరి, తల్లికీ, అన్నలకూ నమస్కరించి, ద్రౌపది అంతఃపురానికి వెళ్ళాడు. ద్రౌపది అతన్ని చూసి, "సుభద్రతో సరసాలాడుతూ ద్వారకలోనే ఉండక ఇక్కడి కెందుకు

ఇది యాదవుల కంట పడింది. "ఇదేమిటి? ఈయన సుభద్రను అపహరించుకు పోతున్నాడు. అడ్డపడి, సుభద్రను విడిపించండి!" అంటూ కొందరు యాదవ శూరులు అర్జునుడి పైన బాణాలు వేస్తూ వెంటబడ్డారు. అర్జునుడు వారిని తన బాణాలతో కొట్టి, తప్పించుకుని, రథాన్ని రైవతకాద్రి దాటించాడు. [అట్ట చివరి బొమ్మ.]

ఈ వార్త అంతర్ద్వీపం చేరింది. అర్జునుడే సుభద్రను ఎత్తుకు పోతున్నాడని తేలిపోయింది. అక్కడ ఉన్న యాదవ వీరులు, అర్జునుడి వెనక సేనను పంపి, అతన్ని ఓడించి, సుభద్రను తీసుకువద్దామన్నారు.





వచ్చావు? అసలే రాజులు నూతన ప్రియులు. అదీగాక, ఎంత దృఢమైన బంధాలైనా పాత పడిపోతే తెగిపోతాయి. ప్రేమలు చిరకాలం ఉండవు," అని ఈర్ష్యగా మాట్లాడింది. ఆమెను అర్జునుడు తగిన విధంగా ఓదార్చాడు.

అర్జునుడి సైగ గ్రహించి సుభద్ర కుంతీ దేవికీ, ద్రౌపదికీ నమస్కారం చేసింది. ద్రౌపది ఆమెను ఆపేక్షగా కౌగలించుకుని ఆశీర్వదించింది.

ఇంద్రప్రస్థంలో అందరూ సుఖంగా ఉండగా, కృష్ణుడు బలరామున్నీ, అక్రూరుణ్ణీ, ఉద్ధవుణ్ణీ, సాత్యకీ, కృతవర్మా, సాంబుడూ, ప్రద్యుమ్నుడూ మొదలుగా గల యాదవ ప్రముఖులనూ వెంట బెట్టుకుని, సుభద్రకు సారె తెచ్చాడు. ఈ సంగతి తెలియగానే ధర్మరాజు తన నలుగురు తమ్ములనూ ఎదురు పంపాడు. యాదవులు వైభవంగా ఇంద్రప్రస్థ నగరం ప్రవేశించారు.

యాదవులు తెచ్చిన వేలాది ఏనుగులనూ, రథాలనూ, గుర్రాలనూ, పాడి ఆవులనూ, కనకాభరణాలనూ స్వీకరించి, వచ్చిన వారందరికీ ఎదురు కానుక లిచ్చి, వారిని కొంతకాలం అతిథులుగా ఉంచుకున్నాడు ధర్మరాజు. తరవాత కృష్ణుడు తప్ప



మిగిలిన యాదవు లందరూ ద్వారకకు తిరిగి వెళ్ళిపోయారు.

(కాలక్రమాన సుభద్రకు అర్జునుడి వల్ల ఒక కొడుకు కలిగాడు. అతనికి అభిమన్యుడు అని పేరు పెట్టారు. అభిమన్యు డంటే భయంలేనివాడనీ, కోపంగలవాడనీ అర్థం. ద్రౌపది పాండవు లయిదుగురికీ అయిదుగురు కొడుకులను కన్నది. ప్రతివింద్యుడూ, సుతసోముడూ, శ్రుతసోముడూ, శతానీకుడూ, శ్రుతసేనుడూ అని ఉపపాండవుల పేర్లు. వీరందరికీ అర్జునుడే ధనుర్విద్య నేర్పాడు. విలువిద్యలో అర్జును డంత వాడనిపించుకున్నవాడు అభిమన్యుడు.)





కృష్ణుడు ఇంద్రప్రస్థంలో ఉండగా ఒక భయంకరమైన వేసవి వచ్చింది. అరణ్యాలు అంటుకుని, వాటి మీదుగా వేడిగాడ్పులు వీచాయి. నదులు ఎండిపోయాయి. పడమటి వడగాలికి ప్రాణికోటి తల్లడిల్లి పోయింది.

ఆ వేసవిలో అర్జునుడు కృష్ణుడితో, "ఈ వేసవి దుర్భరంగా ఉన్నది. ఈ సమయంలో యమునాతీరాన గల పర్వతారణ్యాలలో వేటాడుతూ, ఇళ్ళు కట్టుకుని చల్లగా కాలక్షేపం చేస్తే ఎంతో సుఖంగా ఉంటుంది," అన్నాడు.

కృష్ణుడు నిజమేనన్నాడు. కృష్ణార్జునులూ, కొందరు స్నేహితులూ, పరివారమూ బయలు



దేరి చల్లని అరణ్య ప్రాంతంలో విడిసి, అక్కడ సుఖంగా సంచరించసాగారు. ఒక నాడు వాళ్ళు ఖాండవవన సమీపంలో చందనపుచెట్ల కొమ్మల నీడన పొదరిళ్ళలో కూర్చుని సుఖంగా భోజనాలు చేశారు. కృష్ణార్జునుల వెంట ద్రౌపదీ సుభద్రలు కూడా ఉన్నారు. అందరూ శరీరాలకు చందనం పూసుకుని, పూలమాలలు ధరించి ఉన్నారు. అందరూ కథలూ, కబుర్లూ చెప్పుకుంటున్నారు.

ఆ సమయంలో ఒక ముసలి బ్రాహ్మణుడు వారి వద్దకు వచ్చాడు. అతను చాలా ఎత్తున్నాడు. అతని శరీరం కాంతివంతంగా ఉన్నది. నారబట్టలు కట్టి, జడలు ధరించి ఉన్నాడు. అతని మీసాలు గోరోజన వర్ణంగా ఉన్నాయి. అతను వారితో, "అయ్యా, నేను భోజనప్రియుణ్ణి. మంచి జీర్ణశక్తి గలవాణ్ణి. నాకు ఇష్టమైన ఆహారం మీరు పెట్టినట్టయితే తింటాను. తిని తృప్తి చెందుతాను," అన్నాడు. [అట్ట మీది బొమ్మ]

ఈ మాటకు కృష్ణార్జునులు, "బ్రాహ్మణుడా, నీకు ఎలాటి ఆహారం కావాలో కోరుకో," అన్నారు.

"నేను అగ్నిహోత్రుణ్ణి. నాకు వేరే ఆహారం అవసరం లేదు. ఈ ఖాండవ



వనాన్ని భక్షించాలని నా కోరిక. ఎన్నోసార్లు ప్రయత్నించాను. కాని ఇంద్రుడు ధారా పాతంగా వర్షం కురిపించి నా ప్రయత్నాలకు విఘ్నం కలిగిస్తూ వస్తున్నాడు. తక్షకుడు మొదలైన సర్పాల సహాయంతో ఇంద్రుడు ఈ వనాన్ని ఎల్లప్పుడూ కాపాడుతున్నాడు. మీవంటి మహాశూరులు సహాయపడితేగాని నా ప్రయత్నం ఫలించదు. అందుచేత మీరు సహాయపడండి," అని ఆ బ్రాహ్మణుడు అన్నాడు.

అగ్నిహోత్రుడు ఖాండవవనాన్ని దహించటానికి అన్నిసార్లు ప్రయత్నించాడంటే, దానికి కారణం ఉన్నది.

పూర్వం శ్వేతకి అనే రాజు ఒకడుండేవాడు. అతను విడవకుండా యజ్ఞాలు చేస్తూండేవాడు. ఒకసారి అతను అతిదీర్ఘమైన యాగం ఒకటి చేశాడు. అందులో శ్వేతకికి సహాయం చేసిన బ్రాహ్మణులకు పొగమూలాన కంటిజబ్బులు వచ్చాయి. శ్వేతకి వారి స్థానంలో ఇతర బ్రాహ్మణులను తెచ్చి యాగం పూర్తిచేశాడు.

కాని శ్వేతకి మరొకసారి యాగం ప్రారంభించదలిస్తే ఎవరూ రామన్నారు. రాజు ఎంత ప్రాధేయపడినా వారు ఒప్పుకోక, "నువు చేసే యాగాలకు ఋత్విక్కుగా



పని చెయ్యటం మహాశివుడికి మాత్రమే సాధ్యమవుతుంది," అన్నారు.

శ్వేతకి కైలాసానికి వెళ్ళి శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమయాడు.

"దేవా, నా యాగానికి యాజకుడివిగా ఉండు," అని శ్వేతకి శివుణ్ణి ప్రార్థించాడు.

"యాజకులుగా ఉండే పని బ్రాహ్మణులది. అయినా, పన్నెండేళ్ళపాటు అగ్నిని అర్చించావంటే నీ కోరిక తీరుతుంది," అంటూ శివుడు అంతర్ధానమయాడు.

శ్వేతికి శివుడు చెప్పిన ప్రకారం పన్నెండేళ్ళపాటు అగ్నికి నేతులు ఆహుతి పోసి, తిరిగి శివుడి వద్దకు వచ్చాడు.



శివుడు శ్వేతకితో, "యాజకుడు బ్రాహ్మణుడే కావాలని చెప్పాను గద. అందుచేత నేను పనికి రాను. కాని నా అంశన జన్మించిన దుర్వాసుణ్ణి యాజకుడుగా పంపిస్తాను. యజ్ఞానికి అవసరమైన ప్రయత్నాలన్నీ చేసుకో," అన్నాడు.

శ్వేతకి అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాడు. శివుడు దుర్వాసుణ్ణి యజ్ఞం చేయించమని పంపాడు. దుర్వాసుడు యజ్ఞం జరిపించి, తనకు రావలిసిన దక్షిణ తీసుకుని వెళ్ళిపోయాడు.

చివరకు జరిగినదేమంటే అగ్నిహోత్రుడికి, నెయ్యి తెగతాగి, అజీర్తిరోగం పట్టుకున్నది. అతని తేజస్సు క్షీణించింది. అతను బ్రహ్మ వద్దకు వెళ్ళి, తన అజీర్ణం పొయ్యేమార్గం చెప్పమన్నాడు.

బ్రహ్మ అగ్నిని చూసి నవ్వి, "అంతు లేని నెయ్యి తాగి అజీర్తి తెచ్చుకున్నావు. ఖాండవవనాన్ని దహించినట్టయితే నీ వ్యాధి నయమై, నీ తేజస్సు నీకు తిరిగివస్తుంది. ఖాండవవనంలో అనేక రకాల ప్రాణులూ, ఓషధులూ, వనస్పతులూ, మహావృక్షాలూ ఉన్నాయి. అవి నీ వ్యాధి నివారణ చేస్తాయి," అన్నాడు.

అగ్ని బ్రహ్మ మాట విని ఖాండవ వనంలో ప్రవేశించి, దాన్ని దహించటం మొదలుపెట్టాడు. కాని వెంటనే ఏనుగు తొండాలంత ధారలతో వాన వచ్చింది. ఆ వనంలో ఉండే ఏనుగులూ, పాములూ కూడా నోళ్ళతో నీరు తెచ్చి అగ్నిహోత్రుడి మీద పోశాయి. అతని యత్నం విఫలమయింది.

అగ్ని ఖాండవవనాన్ని దహించటానికి ఏడుసార్లు ప్రయత్నించాడు. అతని ఏడు ప్రయత్నాలూ విఫలమయాయి. అగ్ని బ్రహ్మ వద్దకు తిరిగిపోయి, తాను ఖాండవవనాన్ని దహించలేక పోయాననీ, తన రోగం ఇంకా అలాగే ఉన్నదనీ తెలిపాడు.






# మహాభారతం

అగ్నిహోత్రుడు తనపాట్లు చెప్పగా విని బ్రహ్మ ఒక్క క్షణం ఆలోచించి, "నర నారాయణులు కృష్ణార్జునులుగా భూమి మీద అవతరించి ఉన్నారు. వారు ఖాండవ వన ప్రాంతానికి వస్తారు. ఆ సమయం కని పెట్టి వారి సహాయం కోరు. వారు నీకు సహాయ పడినట్టయితే, ఇంద్రుడు కాదు గదా, దేవతలందరూ అడ్డుపడినా, నీ పని నిరాటంకంగా సాగుతుంది," అని చెప్పాడు.

అందుచేత అగ్ని ఈనాడు కృష్ణార్జునుల సహాయం కోరవచ్చాడు.

అగ్నిహోత్రుడు తన సహాయం కోరటం విని అర్జునుడు, "అగ్నిహోత్రుడా, ఇంద్రాది దేవతలతో యుద్ధం చెయ్యటానికి తగిన అస్త్రాలన్నీ నాకు తెలుసు. అయితే నా కిప్పుడు మంచి ధనుస్సూ, మంచి గుర్రాలను పూన్చిన దృఢమైన రథమూ లేవు. నాకూ, కృష్ణుడికీ తగిన ఆయుధాలూ, మమ్మ ల్నిద్దరినీ మోయగల రథమూ సంపాదించా వంటే నీ కోరికతీరుస్తాను," అన్నాడు.

అగ్నిహోత్రుడు వరుణుణ్ణి తలుచు కున్నాడు. వరుణుడు ప్రత్యక్షమయాడు. అగ్ని, వరుణుడితో, "మహానుభావా, చంద్రుడు నీ కిచ్చిన గాండీవ మనే ధనుస్సూ, అక్షయతూణీరాలూ, కపిధ్వజం గల రథమూ, చక్రాయుధమూ నీ వద్ద ఉన్నాయిగదా, వాటితో నా కిప్పుడు అవసరం కలిగింది. బదులియ్యి," అన్నాడు.

వరుణుడు అగ్నిహోత్రుడికి అతను కోరినవియిచ్చి, అంతర్ధానమయాడు. అగ్ని

20. ఖాండవవన దహనం



హోత్రుడు కృష్ణార్జునులకు వాటిని ఇచ్చాడు. చక్రాన్ని కృష్ణుడు తీసుకున్నాడు. గాండీవాన్నీ, అక్షయతూణీరాలనూ అర్జునుడు తీసుకున్నాడు. గాండీవం సామాన్యమైన విల్లు కాదు. అది లక్ష ఆయుధాలకు సమానం. ఆ రథాన్నీ, అక్షయతూణీరాలనూ పూర్వం విశ్వకర్మ నిర్మించాడు. వాటిని చంద్రుడు దేవాసుర యుద్ధాలలో ఉపయోగించాడు.

కృష్ణుడు తీసుకున్న చక్రాయుధం శత్రువులను చంపి తిరిగి వచ్చే శక్తిగలది. వరుణుడు అంతర్ధానమయే ముందు కృష్ణుడికి కౌమోదకి అనే గదను కూడా ఇచ్చాడు.



ఆయుధాలు స్వీకరించి కృష్ణార్జునులు, "ఓ అగ్నిదేవుడా, ఇక నువు ఖాండవ వనాన్ని దహించటం ప్రారంభించు. ఇంద్రుడు వచ్చినా మమ్మల్ని ఏమీ చేయ లేడు," అన్నారు.

అగ్నిహోత్రుడికి ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. అతను ఖాండవవనం ప్రవేశించి, అందులోని మహా వృక్షాలనూ, లతలనూ, ఓషధులనూ, వనస్పతులనూ దహించసాగాడు. కార్చిచ్చు వేడికి తట్టుకోలేక వనంలోని వివిధ ప్రాణులు బయటికి పారిపోతూ ఉంటే, కృష్ణార్జునులు వాటిని పోనివ్వక, అగ్నికి ఆహుతి అయేటట్టు చేశారు. ఆకాశంలోకి ఎగిరిపోవటానికి ప్రయత్నించిన పక్షులు, వేడికి మాడి తిరిగి మంటలలోనే పడిపోయాయి.

ఖాండవవనం అతి దారుణంగా తగలబడుతూ, అకాలప్రళయం అనిపించింది. దాని వేడికి భయపడి దేవతలు ఇంద్రుడి దగ్గిరికి వెళ్ళి, లోకాలన్నీ బూడిద అయిపోతున్నాయని చెప్పారు. ఖాండవవనం మీద భారీగా వర్షం కురిపించమని ఇంద్రుడు పర్జన్యుణ్ణి ఆజ్ఞాపించాడు.

ఎంత పెద్ద ఎత్తున వర్షం కురిసినా, కురిసిన నీరు కురిసినట్టే ఆవిరి అయిపోయి,





అగ్నిని చల్లార్చలేకపోయింది. అది చూసి ఇంద్రుడికి చాలా కోపం వచ్చింది. ఖాండవ వనం మీద ఒక్కసారి వర్షం కురవమని అతను మేఘాలన్నిటినీ ఆజ్ఞాపించాడు.

అర్జునుడు ఖాండవవనం మీదనేగాక, దాన్ని దాటి అన్ని పక్కలా చాలా మేర వానచినుకు అన్నది పడటానికి వీలు లేకుండా బాణాలతో పందిరి నిర్మించాడు. ఖాండవవనం తగలబడి పోవటానికి ఏ అంతరాయమూ లేకపోయింది.

కృష్ణార్జునుల సహాయంతో ఈసారి అగ్నిహోత్రుడు వనాన్ని పూర్తిగా దగ్ధం చేస్తాడని రూఢి కాగానే, ఆ వనానికి ఎంతో కాలంగా రక్షకుడుగా ఉంటూ ఉండిన తక్షకుడు చల్లగా వనాన్ని వదిలిపెట్టి కురుక్షేత్రానికి చేరుకున్నాడు.

తక్షకుడి కొడుకు అశ్వసేనుడు అనేవాడు తన తల్లి చాటున వనం విడిచి పోతూండగా అర్జునుడు గమనించి, అశ్వసేనుడి తల్లి తలనూ, అశ్వసేనుడి తోకనూ బాణాలతో నరికాడు. తోక తెగినా, ప్రాణాలతో అశ్వసేనుడు తప్పించుకున్నాడు.

తరవాత ఇంద్రుడికీ, అర్జునుడికీ ఘోరమైన యుద్ధం జరిగింది. కాని ఇంద్రుడు అర్జునుణ్ణి జయించలేకపోయాడు. ఖాండవ



వనాన్ని ఆశ్రయించుకుని ఉన్న రాక్షసులు కొందరు యుద్ధానికిరాగా, కృష్ణుడు వారిని తన చక్రంతో చంపేశాడు. మయుడనే రాక్షసుడు తప్పించుకు పారిపోతుంటే కృష్ణుడు వాణ్ణి చంపబోతే, మయుడు అర్జునుణ్ణి శరణుజొచ్చాడు.

ఖాండవవనాన్ని అగ్నిహోత్రుడు పదిహేను రోజులపాటు దహించాడు. అందులో ఉన్న ప్రాణికోటి కూడా వనంతోపాటు కాలిపోయింది. అందులో చావకుండా బతికినవారు ఎవరంటే, తక్షకుడూ, అతని కొడుకు అశ్వసేనుడూ, మయుడూ, శార్ఙ్గకులు నలుగురూనూ.





ఈ శార్ఙ్గకులు మందపాలు డనే ముని సంతానం. మందపాలుడు బ్రహ్మచర్య వ్రతం అవలంబించి చాలాకాలం తపస్సు చేసి, తన యోగశక్తితో స్వర్గానికి వెళ్ళాడు. కాని అతనికి స్వర్గంలో సుఖం కలగలేదు. అన్ని సుఖాలూ ఇవ్వదగిన స్వర్గం తనకు సుఖంగా ఎందుకు లేదని మందపాలుడు అక్కడి దేవతలను అడిగాడు.

దానికి దేవతలు, "నువు తపస్సు చేసి దేవ ఋణం తీర్చావుగాని, సంతానం పొంది పితరుల ఋణం తీర్చలేదు. అందుకే ఈ స్వర్గంలో నీకు సుఖం లేకుండా ఉన్నది," అని జవాబు చెప్పారు.



అప్పుడు మందపాలుడు పక్షులకు త్వరగా సంతాన ప్రాప్తి కలుగుతుందిగదా అని, శార్ఙ్గపక్షి రూపం ధరించి, జరిత అనే పెంటి పక్షికి నలుగురు పిల్లలను కన్నాడు. తరవాత అతను తన ఆశ్రమానికి తిరిగి పోయి, లపిత అనే భార్యతో మామూలుగా సంసారం చెయ్యసాగాడు.

అలా ఉండగా ఒకనాడు మందపాలుడికి, ఖాండవవనాన్ని దహించటానికి పోతున్న అగ్ని కనిపించాడు. ఆయన తన శక్తితో అగ్ని ఉద్దేశం గ్రహించి, "అగ్నిహోత్రుడా, ఖాండవవనంలో నా బిడ్డలున్నారు. వారిని మాత్రం చావనీకు," అన్నాడు. దానికి అగ్ని అంగీకరించాడు. ఆ కారణంగా శార్ఙ్గకులు నలుగురూ ప్రాణాలతో బయటపడ్డారు.

ఏమైతేనేం, ఖాండవవనం పూర్తిగా తగలబడిపోయింది, అగ్నిదేవుడి అజీర్తి బాధ నివారణ అయింది. ఆయన, తనకు సహాయపడిన కృష్ణార్జునులను దీవించి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఇంద్రుడు కూడా కృష్ణార్జునుల శక్తి సామర్థ్యాలకు మెచ్చి, దేవతలతో సహా వారి ముందు ప్రత్యక్షమయాడు. వారు ఇంద్రుడికి నమస్కారం చేశారు. ఇంద్రుడు వరం







ప్రాణాలతో బయటపడ్డాను. ఈ కృష్ణుడు గాని, అగ్నిహోత్రుడు గాని నన్ను దహించ టానికి వెనకాడి ఉండరు. నేను మీకు ఏ విధంగా ప్రత్యుపకారం చెయ్యను? నేను రాక్షసుల విశ్వకర్మను. అందుచేత మీరేది కోరితే అది నిర్మించి పోదామనుకుంటు న్నాను. అందుచేత మీ కోరిక ఏమిటో తెలపండి," అన్నాడు.

అర్జునుడు ఏమీ కోరక, "నీ స్నేహభావం మాకు చాలు," అన్నాడు. కాని మయుడు ఏదన్నా నిర్మించి ఇస్తానని పట్టుబట్టాడు. అందుచేత అర్జునుడు కృష్ణుడి సలహా అడిగాడు.

కృష్ణుడు కొంచెం ఆలోచించి మయుడితో, "ధర్మరాజుకు ఒక ప్రశస్తమైన సభ నిర్మించి ఇయ్యి. అది చాలా అందంగా ఉండాలి. దివ్య ప్రభావం గలదిగా ఉండాలి," అన్నాడు.

అందుకు మయుడు సమ్మతించాడు. కృష్ణార్జునులు మయుడితో సహా ఇంద్రప్రస్థా నికి తిరిగి వచ్చి, ధర్మరాజుకు ఖాండవవన దహనం గురించి అంతా చెప్పారు. మయుణ్ణి అర్జునుడు ఏవిధంగా అగ్ని నుంచి కాపాడి నదీ, అందుకు ప్రత్యుపకారంగా మయుడు ఎలా సభను నిర్మిస్తానన్నదీ కూడా ధర్మ

కోరుకోమంటే, అర్జునుడు దివ్యాస్త్రాలు యివ్వమని కోరాడు.

"నీకు మహేశ్వరుడు ప్రత్యక్షమవుతాడు. అప్పుడు నేను నీకు దివ్యాస్త్రాలిస్తాను," అని ఇంద్రుడు అర్జునుడికి చెప్పి, కృష్ణార్జు నుల స్నేహం శాశ్వతంగా ఉండేటట్టు దీవించి, దేవతలతో సహా స్వర్గానికి తిరిగి వెళ్ళిపోయాడు.

తరవాత కృష్ణార్జునులు యమునా తీరాన తమ విహారస్థలానికి తిరిగి వచ్చారు. వారి వెంట మయుడు కూడా వచ్చాడు. మయుడు అర్జునుడికి నమస్కారం చేసి, "మహాత్మా, మీ దయచేతనే నేను ఖాండవవనం నుంచి



రాజు తెలుసుకుని, సంతోషించి, మయుడికి తగిన సత్కారం చేశాడు.

తరవాత మయుడు ఒక శుభదినాన మంగళస్నానం చేసి, బ్రాహ్మణులకు సంతర్పణ చేసి, ఎటు చూసినా పదివేల జానలుండే నలుచదరపు స్థలంలో సభాభవనం నిర్మించటానికి ఉపక్రమించాడు.

ఈ సమయంలోనే కృష్ణుడు ద్వారకకు తిరుగు ప్రయాణమైనాడు. అర్జునుడు ఎక్కివచ్చిన రథం మీదనే అతను తిరిగి వెళ్ళాడు. పాండవులు అతన్ని చాలా దూరం సాగనంపారు.




కొద్దికాలానికి మయుడు సభానిర్మాణం పూర్తిచేశాడు. అతను ఒకప్పుడు వృషపర్వుడనే రాక్షసరాజుకు సభను నిర్మింతామనే ఉద్దేశంతో బిందుసరోవరం తీరాన వివిధ మణిమయ పదార్థాలు దాచి ఉంచాడు. అక్కడనే వృషపర్వుడు తన సాటిలేని గదను కూడా దాచి వుంచాడు. వరుణుడి శంఖం దేవదత్తం కూడా అక్కడ ఉంచిన సామగ్రిలో ఉన్నది. మయుడు ఆ గదను భీముడికీ, శంఖాన్ని అర్జునుడికీ తెచ్చి ఇచ్చాడు.

ఇక సభను మయుడు తయారుచేసిన పద్ధతి అత్యద్భుతమైనది. అందులో మయుడు కొన్ని సరోవరాలు కట్టాడు. వాటి గోడలకు రత్నాలూ, ఆకులకు వైడూర్యాలూ, మెట్లకు స్ఫటికాలూ అమర్చాడు. బంగారంతో చేసిన కమలాలూ, తాబేళ్ళూ, చేపలూ ఏర్పాటుచేశాడు. నీటి భాగానికీ, నేల భాగానికీ తేడా కనపడకుండా చేశాడు. సభ అంతటా దూలాలకూ, స్తంభాలకూ, గోడలకూ, అరుగులకూ మణులు అమర్చాడు. ఆ సభలో అనేక రకాల ఆకర్షణలున్నాయి. చూసేవారికి అనేక రకాల భ్రమలు కలుగుతాయి.

లోకోత్తరమైన ఈ సభను తయారుచేసి ఇచ్చిన మయుడికి ధర్మరాజు తగిన



సన్మానంచేసి పంపేశాడు. తరవాత ఆయన పదివేల మంది బ్రాహ్మణులకు సంతర్పణా, సమారాధనా చేసి, దానా లిచ్చి, వారి ఆశీ ర్వాదాలు పొంది, తన తమ్ములతో సహ మయసభ ప్రవేశించాడు.

అనేక దేశాలరాజులు ధర్మరాజు గొప్ప తనాన్ని ఆమోదించి, అతనికి గుర్రాలూ, బంగారు ఆభరణాలూ, మణులూ, అంద గత్తెలైన స్త్రీలూ, దాసదాసీలూ మొదలైన కానుకలు తెచ్చి సమర్పించారు. ఇలా కానుకలు తెచ్చినవారిలో అంగ, వంగ, కళింగ, ఆంధ్ర, పుండ్రక, కిరాత, మగధ, మత్స్య, మాళవ, కేకయ, కరూశ, కాంభోజ, మద్ర, పాండ్య మొదలైన దేశాల రాజులున్నారు.

అలాగే అనేకమంది ప్రసిద్ధులైన ఋషులు ధర్మరాజు సభకు వచ్చి, అనేక కథలు చెప్పారు. ఆ సమయంలో నార దుడు, పారిజాతుడు, రైవతుడు మొదలైన తన శిష్యులతో ధర్మరాజు సభకు వచ్చాడు. ధర్మరాజు భక్తితో నారదుడికి అర్ఘ్య పాద్యాలూ, ఆసనమూ, మధుపర్కాలూ ఇచ్చి సత్కరించాడు.

నారదముని ధర్మరాజుతో రాజు చేయ వలసిన అనేక పనులను గురించి మాట్లాడి, దిక్పాలకుల సభలను వర్ణించి చెప్పి, రాజ సూయయాగం చేసినవారికి స్వర్గం లభి స్తుందనీ, హరిశ్చంద్రుడి వంటి రాజులు ఆ యాగం చెయ్యటంచేతనే ఇంద్రలోకంలో ఉన్నారనీ చెప్పి, ఒక హెచ్చరిక కూడా చేశాడు. అదేమిటంటే—రాజసూయం నిర్వి ఘ్నంగా చేసినట్టయితే అపారమైన జన నష్టం కలిగించే యుద్ధం వస్తుంది.

ఈ హెచ్చరిక చేసి నారదుడు ధర్మ రాజుతో, ''రాజా, బాగా ఆలోచించి నీకు ఏది మేలని తోస్తే అది చెయ్యి.'' అని, ధర్మరాజు వద్ద సెలవు పుచ్చుకుని ద్వార కకు బయలుదేరి వెళ్ళిపోయాడు.






ద్వారకలో కృష్ణుడు రాచకార్యా లన్నిటినీ వసుదేవుడికి అప్పగించి, ధర్మరాజు చేయబోతున్న రాజసూయానికి అవసరమైన వివిధ వస్తువులూ, రత్నాలూ, ధనమూ, ధాన్యాలూ తీసుకుని, రథం మీద బయలుదేరి ఇంద్రప్రస్థానికి వచ్చాడు.

ధర్మరాజు కృష్ణుడితో, "రాజసూయం చెయ్యటానికి నీ సహాయం ఎంతైనా అవసరం. అందుచేత నేనీ యాగాన్ని చెయ్యటానికి అనుమతి ఇయ్యి, లేదా నువే దీక్ష పూని ఈ యాగాన్ని చెయ్యి," అన్నాడు.

"ధర్మరాజా, సామ్రాజ్యాన్ని భరించటానికి నువే తగినవాడివి. అందుచేత నువే యాగం చెయ్యి. నువు చెయ్యమన్న పనులన్నీ నేను చేస్తాను," అన్నాడు కృష్ణుడు.

ధర్మరాజు సంతోషించి సహదేవుణ్ణి పిలిచి, యాగానికి అన్నీ సిద్ధం చేయమనీ, నాలుగు వర్ణాలవారినీ ఆహ్వానించమనీ చెప్పాడు; నకులుణ్ణి పిలిచి, హస్తినాపురం నుంచి భీష్మ, ధృతరాష్ట్ర విదురులనూ, ద్రోణ కృపాశ్వత్థామలనూ, దుర్యోధనాదులనూ పిలుచుకు రమ్మన్నాడు. సహదేవుడు అన్ని ఏర్పాట్లూ దివ్యంగా చేశాడు. నకులుడు హస్తినాపురం నుంచి కౌరవ ప్రముఖులను తెచ్చాడు. వారితో ధర్మరాజు తాను తలపెట్టిన పని గురించి చెప్పి, దాన ధర్మాలు చేయటానికి కృపాచార్యుణ్ణీ, భోజనాల ఏర్పాట్లు చూడటానికి దుశ్శాసనుణ్ణీ బ్రాహ్మణులను మర్యాద చెయ్యటానికి అశ్వత్థామనూ, రాజులను సత్కరించటానికి

23. శిశుపాలవధ



సంజయుణ్ణీ, వచ్చేవారు తెచ్చే కానుకలు భద్రపరచటానికి దుర్యోధనుణ్ణీ, అన్ని పనులూ సక్రమంగా సాగేటట్టు పైన కనిపెట్టి ఉండటానికి భీష్మ ద్రోణులనూ ఏర్పాటు చేసి, తాను యజ్ఞదీక్ష ధరించాడు.

వచ్చిన వారందరూ రాజసూయ యాగం చూడాలనీ, మయసభ చూడాలనీ అభిలాషతో వచ్చారు. రాజులైనవాళ్ళు అంతులేని కానుకలు తెచ్చారు. యాగం జరిగినంతకాలమూ విరామం అన్నది లేకుండా సంతర్పణ సాగింది. యజ్ఞం మహా వైభవంగా పూర్తి అయింది.

అప్పుడు భీష్ముడు ధర్మరాజుతో, "స్నాతకుడూ, ఋత్విజుడూ, సద్గురుడూ, ఇష్టుడూ, రాజూ, ఇంద్రియాలను సంయమనం చేసిన వాడూ—ఈ ఆరుగురూ పూజార్హులని చెబుతారు. అలాటివారిలో గొప్పవాణ్ణిగా చూసి నువ్విప్పుడు పూజించాలి," అన్నాడు.

"అలాటి వాడెవడో మీరే నిర్ణయించి చెప్పినట్టయితే, నేను అతనికి అర్ఘ్యమిస్తాను," అని ధర్మరాజు భీష్ముడితో అన్నాడు.

భీష్ముడు ఆలోచించి, "ఈ సభలో అగ్రపూజకు తగినవాడు కృష్ణుడు తప్ప మరెవరున్నారు? అందువల్ల అతనికే మొదటి అర్ఘ్యం ఇయ్యి," అన్నాడు.

ధర్మరాజు లౌక్యంగా భీష్ముడి ఆజ్ఞను శిరసావహిస్తూ, సహదేవుణ్ణి పిలిచి, మొదటి అర్ఘ్యాన్ని కృష్ణుడికిఇయ్యమనిఆజ్ఞాపించాడు. సహదేవుడు అర్ఘ్యం ఇస్తే కృష్ణుడు సంతోషంగా పుచ్చుకున్నాడు.

ఇందుకు శిశుపాలుడు సమ్మతించక, కృష్ణుణ్ణి ఆక్షేపిస్తూ, ధర్మరాజుతో, "ధర్మరాజా, ఇందరు రాజులూ, మహనీయులూ ఉండగా యాదవుడైన కృష్ణుడికి ఎలా మొదటి అర్ఘ్యం ఇచ్చావు? ఇతను వృద్ధుడా? మీకు ఆచార్యుడా? గొప్ప ఋత్విజుడా? ఇతనిలో ఏమి చూసి ఇచ్చావు? నీకీ సలహా ఇచ్చిన భీష్ముడికి యుక్తాయుక్తాలు తెలియవు. కృష్ణుడికి తొలిపూజ చేయదలచుకున్నప్పుడు ఈ రాజులందరినీ దేనికి ఆహ్వానించావు? ఇది వీరందరికీ అవమానం

కాదా? నువు ప్రతాపవంతుడివని భయ పడి కాదు మేము నీకు కప్పాలిచ్చింది; ధర్మం తెలిసినవాడవనీ, సత్యవ్రతుడవనీ, సామ్రాజ్యం ఏల దగినవాడవనీ ఇచ్చాం. ఈ ఒక్క పాడుపని చేసి నీకున్న కీర్తి నంతా పోగొట్టుకున్నావు," అని, కృష్ణుడితో, "ఈ పాండవులు నీ కుతంత్రాలకు భయ పడిగాని, నీ మీద అమిత ప్రేమతోనే మొదటి అర్ఘ్యాన్ని ఇస్తే, నీకైనా నీ అంతరం తెలియ వద్దా? రాజువు కాని నీకీ గౌరవం నిష్ఫలం. దీనివల్ల అవమానం నీకేగాని, సభలోనివారికి కాదు. ధర్మరాజు ధర్మబుద్ధీ, భీష్ముడి తెలివీ, నీ వివేకమూ తెలిసిన తరవాత ఈ సభలో ఉండరాదు," అంటూ, తన పరి వారాన్ని లేపుకుని వెళ్ళిపోబోయాడు.

ధర్మరాజు అతని వెనక పరిగెత్తి, "శిశు పాలా, ఆగు! వెళ్ళిపోకు! నువ్విలా మాట్లా డటం అన్యాయం. భీష్ముడులాటి వృద్ధుణ్ణి అవమానించరాదు. కృష్ణుడి సంగతి నీ కన్న ఆయనకు బాగా తెలుసు. నీ కన్న పెద్ద వాళ్ళు సభలో ఉండి కూడా ఏమీ అభ్యం తరం చెప్పనప్పుడు నువ్వెందుకు ఇలా ఆక్షేపిస్తున్నావు?" అని శాంతవచనాలతో శిశుపాలుణ్ణి సమాధానపరిచేందుకు యత్నించాడు.

అప్పుడు భీష్ముడు ధర్మరాజుతో, "దుర్మార్గుడైన ఈ శిశుపాలుణ్ణి బతిమాలు తావేం? ఊరుకో!" అని సభవారితో, "ఈ శిశుపాలుడు మూఢుడు కావటంచేత కృష్ణుడి సంగతి ఎరగడు. కృష్ణుడికి మేం





యిచ్చిన మొదటి అర్ఘ్యం ఆమోదించక ఏం చేస్తాడో చేసుకోనిద్దాం,'' అన్నాడు.

"కృష్ణుణ్ణి మేం పూజించినందుకు ఇంకా అభ్యంతరం ఉన్నవారెవరన్నా ఉంటే వారి నెత్తి మీద నాకాలు పెడతాను,'' అంటూ సహదేవుడు తన కాలు ఎత్తి నిలబడ్డాడు.

సభలో ఎవరూ సహదేవుడికి జవాబు చెప్పలేదు.

అప్పుడు శిశుపాలుడి సేనాపతి సునీధుడనేవాడు లేచి, "రాజులారా, లేవండి. యాదవులూ, పాండవులూ మనకు చాలా అవమానం చేశారు. సైన్యాలను సిద్ధపరిచి వీరి మదం అణచుదాం,'' అని, తమ పక్షపు రాజులనందరినీ ఒక పక్కకు చేర్చాడు. యుద్ధసన్నాహానికి శిశుపాలుడు కూడా అనుమతించాడు.

ఇదంతా చూసి ధర్మరాజు భయపడి, భీష్ముడితో, "తాతగారూ, రాజులు యుద్ధానికి దిగుతున్నారు. యాగానికి విఘ్నం రాకుండానూ, ప్రజలకు హాని కలగకుండానూ ఉపాయం చూడాలి,'' అన్నాడు.

దానికి భీష్ముడు, "కృష్ణుడు నీ యాగాన్ని రక్షిస్తూ ఉండగా దానికి ఎవరు విఘ్నం కలిగించగలరు? శిశుపాలుడికి చేటుకాలం రాబట్టే ఇలాటి దుర్బుద్ధి పుట్టింది,'' అని చెప్పాడు,

శిశుపాలుడు కోపంతో రెచ్చిపోయి భీష్ముణ్ణి అనరాని మాటలన్నాడు, కృష్ణుణ్ణి నిందించాడు. అతని మాటలు వింటూంటే భీముడికి వీరావేశం వచ్చింది. అతను రౌద్రాకారం దాల్చి, పళ్ళు పటపటా కొరుకుతూ శిశుపాలుణ్ణి చంపటానికి మీదికి పోతుంటే, భీష్ముడు వారించాడు.

తరవాత అయన భీముడికి శిశుపాలుడి వృత్తాంతం ఈ విధంగా తెలిపాడు:

శిశుపాలుడు మూడు కళ్ళతోనూ, నాలుగు చేతులతోనూ పుట్టి, గాడిదలాగా ఓండ్ర పెట్టాడు. అది చూసి అతని తల్లిదండ్రులు సాత్వతీ, దమఘోషుడూ అతన్ని పారెయ్యదలిచారు. అప్పుడు అశరీరవాణి, "మీరు వీణ్ణి పారెయ్యకండి. వీడు పరాక్రమవంతు

దవుతాడు. వీడికి ఇప్పుడు చావులేదు. వీణ్ణి చంపేవాడు మరొకచోట పుట్టి పెరుగు తున్నాడు," అన్నది.

అప్పుడు సాత్వతికి పుత్రమోహం పుట్టు కొచ్చి, "వీణ్ణి చంపేవా డెవడో చెప్పు!" అని అశరీరవాణిని అడిగింది.

"ఎవరు వీణ్ణి ఎత్తుకున్నప్పుడు వీడి అదనపు కన్నూ, అదనపు చేతులూ పోతాయో అతని చేతనే వీడికి చావున్నది," అన్నది అశరీరవాణి.

అది మొదలు సాత్వతి తన విడ్డూరపు కొడుకును చూడవచ్చినవారి కందరికీ వాణ్ణి ఎత్తుకోమని ఇస్తూ వచ్చింది. ఇలా ఉండగా ఒకనాడు బలరామకృష్ణులు చేదిపురానికి వచ్చి, దమఘోషుడితో కొంతసేపు మాట్లాడి, అంతఃపురంలో ఉన్న సాత్వతిని చూశారు. ఆమె కుశలప్రశ్నలు చేసి తన కొడుకును ముందు బలరాముడి చేతి కిచ్చింది; తర వాత బలరాముడి దగ్గిర నుంచి పిల్లవాణ్ణి తీసుకుని కృష్ణుడికి ఇచ్చింది. కృష్ణుడు ఎత్తుకోగానే ఆ బిడ్డకున్న మూడో కన్నూ, అదనంగా ఉన్న రెండు చేతులూ పోయాయి.

కృష్ణుడి చేతిలో తన కొడుకు చస్తాడని గ్రహించి దిగులుపడి, సాత్వతి, "వీడు చేసే తప్పులను క్షమించు," అని కృష్ణుణ్ణి బతిమాలింది.



దానికి కృష్ణుడు నూరు తప్పులు క్షమిస్తా నని మాట ఇచ్చాడు.

భీష్ముడు చెప్పిన ఈ విషయాలన్నీ శిశు పాలుడు విని ఆయనను నానా మాటలూ అన్నాడు. తరవాత అతను కృష్ణుడితో, "నాతో యుద్ధానికి రా. నిన్ను నేను చంపే దాకా ఈ భీష్ముడి మదం అణగదు. నిన్ను చంపినాక ఈ పాండవుల సంగతి తేల్చు తాను. నిన్ను పూజించినందున వీళ్ళు కూడా చంపదగినవాళ్ళే," అని నోటి తీటగా మాట్లాడాడు.

అంతా విని కృష్ణుడు అక్కడ చేరిన రాజులతో, "అంతా వినండి. ఈ శిశు పాలుడు మాకు మేనత్త కొడుకై ఉండి



కూడా, అకారణంగా మా యాదవులకు ఎన్నో అపకారాలు చేశాడు. మేము ప్రాగ్జ్యోతిషపురం మీదికి దండెత్తిపోయిన సమయంలో వీడు మా ద్వారక మీదికి వచ్చి, మా పురానికి నిప్పుపెట్టి వెళ్ళాడు. మేము రైవతకపర్వతం మీద విహరిస్తుంటే వీడు అక్కడికి వచ్చి, మాలో కొందరిని చంపి, కొందరు స్త్రీలను చెరపట్టాడు. మా తండ్రి వసుదేవుడు అశ్వమేధం చేసినప్పుడు అశ్వాన్ని అపహరించాడు. బభ్రువాహనుడి భార్యను అపహరించాడు. రుక్మిణిని పెళ్ళాడాలనుకున్నాడుగాని వీడి ఆట సాగలేదు. ఇలా వాడు చేసిన దారుణాలు ఎన్నో ఉన్నాయి. మా మేనత్త కిచ్చిన మాట మూలంగా అన్నిటినీ సహించి ఊరుకున్నాను," అన్నాడు.

శిశుపాలుడు వెటకారంగా నవ్వి, "కృష్ణా, నేను వరించినదాన్ని పెళ్ళాడటమే గాక ఆ సంగతి ఈ సభలో చెప్పుకునేటందుకు నీకు సిగ్గులేదా? నీ దయవల్ల నేను బతికి ఉన్నట్టు చెబుతున్నావు. నిన్ను చూస్తే నాకు భయంలేదు. ఏం చెయ్యగలవో చెయ్యి," అన్నాడు.

వెంటనే కృష్ణుడు తన సుదర్శనచక్రాన్ని చేతబట్టి శిశుపాలుడి పైన విసిరాడు. అది శిశుపాలుడి తల నరికేసింది. శిశుపాలుడు కూలిపోయాడు. అతనిలో నుంచి తేజస్సు బయలుదేరి వచ్చి కృష్ణుడిలో ఐక్యం కావటం చూసి సభలోని వారందరూ ఆశ్చర్యపోయారు.

ధర్మరాజు శిశుపాలుడి కళేబరానికి అంత్యక్రియలు జరపటానికి ఉత్తరువిచ్చి, శిశుపాలుడి కొడుకుకు రాజ్యాభిషేకం చేశాడు.

రాజసూయయాగం పూర్తి అయింది. ధర్మరాజు అవభృధస్నానం చేసి దీక్ష చాలించాడు. రాజులందరూ ఆయనను సమీపించి, సామ్రాజ్యాన్ని సాధించినందుకు అభినందించి, తిరిగిపోతామని చెప్పారు. ధర్మరాజు అందరినీ తగిన విధంగా సత్కరించి, వారిని హస్తినాపురం దాటినదాకా సాగనంపటానికి తన తమ్ములను నియోగిం

చాడు. తరవాత కృష్ణుడు కూడా ద్వారకకు తిరిగివెళ్ళాడు. మయసభ చూడాలన్న కోరికతో దుర్యోధనుడు మటుకు శకునితో సహా ఉండిపోయాడు.

ఒకనాడు ధర్మరాజు సభకు వ్యాసుడు వచ్చాడు. అప్పుడు ధర్మరాజు తనను వేధిస్తున్న అనుమానం ఆయనతో ఇలా చెప్పాడు: "రాజసూయయాగం జరుగుతూండగా శిశుపాలుడి వధ జరిగింది కదా, ఇది ఉత్పాతం కాదా?"

"ఇది ఉత్పాతమే. దీని ఫలితం పదమూడేళ్ళ తరవాత కాని తెలియదు. అప్పుడు క్షత్రియ వినాశం జరుగుతుంది," అన్నాడు వ్యాసుడు. ఈ మాట విని ధర్మరాజు కుంగిపోయాడు. అర్జునుడు ఆయనకు ధైర్యం చెప్పాడు.

మయసభను చూడటానికి ఉండిపోయిన దుర్యోధనుడు పరాభవం పొందాడు. అతను నీరు లేనిచోట నీరున్నదనుకుని బట్టలు ఎగగట్టుకున్నాడు; నీరున్నచోటు నేల అనుకుని అందులోకి నడిచి బట్టలు తడుపుకున్నాడు. ఇది చూసి భీమార్జున నకుల సహదేవులూ, ద్రౌపదీ, సేవకులూ నవ్వారు. అది తెలిసి ధర్మరాజు దుర్యోధనుడి మనసు నొవ్వకుండా ఉండటానికి మంచి బట్టలు కట్టబెట్టాడు.

కాని దుర్యోధనుడి కింకా అవమానాలు జరిగాయి. అతను వాకిలి ఉన్నచోటు గుర్తించక, వాకిలి లేనిచోట ఉన్నదనుకుని ప్రవేశించబోయాడు. నుదురు బొప్పి కట్టింది. నేల సమంగా ఉన్నచోట ఎగుడుగా కనిపించి ఎక్కబోయి, కిందపడ్డాడు. చూసి ఆనందిస్తూవచ్చిన మయసభ అతని మనసుకు కంటకంగా తయారయింది. అతను అసూయతో దహించుకుపోసాగాడు.

ధర్మరాజుకు సామ్రాజ్యం లభించింది. అతను లోకోత్తరమైన మయసభ సంపాదించాడు. ఈ సంగతులు తలుచుకున్నకొద్దీ దుర్యోధనుడి మనస్తాపం హెచ్చిపోయి అతన్ని దహించివేయసాగింది. అతను ధర్మరాజుతో వెళ్ళి వస్తానని చెప్పి, హస్తినాపురానికి బయలుదేరి వెళ్ళిపోయాడు.






దుర్యోధనుడు పాండవులపై గల ఈర్ష్యతో మనోవ్యాధిపడి కృశించసాగాడు. అతని స్థితి చూసి శకుని, "దుర్యోధనా, ఏమిటిలా చిక్కిపోయావు? నీకు పట్టుకున్న విచారమేమిటి?" అని అడిగాడు.

దానికి దుర్యోధనుడు, "మామా, ఏం చెప్పమన్నావు? అర్జునుడి పరాక్రమం ఆధారంగా చేసుకుని ధర్మరాజు భూమండలమంతా గెలిచి, రాజసూయయాగం చేసి సామ్రాజ్యలక్ష్మిని వరించాడు. రాజులందరూ అతనికి వశులైనారు. కృష్ణుడు శిశుపాలుణ్ణి నిండు సభలో వధిస్తే ఒక్కరు కూడా కిక్కురుమనలేదు. రాజులందరూ రత్నరాసులు తెచ్చి పాండవుల కాళ్ళ ముందుపోశారు. వారి వైభవం వర్ణనాతీతం. వాళ్ళ ఐశ్వర్యం చూసి నేను పనికిమాలిన వాణ్ణి అయిపోయాను. మనం మయసభ చూసేటప్పుడు నన్ను చూసి వాళ్ళు ఎలా హేళన చేశారో నువ్వు చూశావు గదా! నాకు జీవితం దుర్భరంగా ఉన్నది. నా బాధ మా తండ్రితో చెప్పు," అన్నాడు.

ఈ మాటలు విని శకుని దుర్యోధనుడితో, "నువ్వు పాండవుల సంపద చూసి అసూయ పడటం దేనికి? వాళ్ళా సంపదను సక్రమంగానే సాధించుకున్నారు. వారికి దైవబలం జాస్తిగా ఉన్నది. అందుకే, వాళ్ళను నువ్వు నిర్మూలించటానికి చేసిన ప్రయత్నం ఒక్కటీ ఫలించలేదు. ద్రౌపది వారికి భార్య కావటం వాళ్ళకొక గొప్ప అదృష్టం; ద్రుపదుడు వాళ్ళకు పెద్ద అండఅయాడు.



ద్రోణుడూ, సమస్త అస్త్రాలనూ తెలిసిన అశ్వత్థామా, కర్ణుడూ, కృపాచార్యుడూ, నేనూ, అందరమూ లేమా?" అన్నాడు.

"అలా అయితే మనం సైన్యాలను తీసుకుని పోయి పాండవులతో యుద్ధం చేసి, ఆ మయసభను హస్తినాపురానికి తెచ్చుకుందాం," అన్నాడు దుర్యోధనుడు.

"దుర్యోధనా, పాండవులను గెలవటం అంత తేలిక కాదు. యుద్ధం దేనికి? అంతకన్న వారిని జయించే సులభోపాయం చెబుతాను విను. ధర్మరాజుకు జూదం చాలా ఇష్టం. అతన్ని జూదానికి పిలు. నేను అతన్ని జూదంలో ఓడించి, అతని రాజ్యాన్నీ, సంపదనూ కాజేసి నీకిస్తాను. ధృతరాష్ట్రుడి అనుమతి మాత్రం సంపాదించు" అన్నాడు శకుని.

శకుని దుర్యోధనుణ్ణి వెంటబెట్టుకుని ధృతరాష్ట్రుడి దగ్గిరికి వెళ్ళేసరికి ధృతరాష్ట్రుడు ధర్మరాజు పూర్తి చేసిన రాజసూయం గురించి ఎంతో సంబర పడుతున్నాడు. శకుని ఆయనతో, "మన దుర్యోధనుడు చిక్కి సగమయాడు. అతని ముఖం కళాహీనమయి పోయింది," అన్నాడు.

ఈ మాటకు ధృతరాష్ట్రుడు అదిరిపడి, దుర్యోధనుణ్ణి దగ్గిరికి తీసుకుని, శరీరం నిమిరి, "ఇలా చిక్కిపోవటానికి నీకేమి కష్టం వచ్చిందిరా?" అని అడిగాడు.

కృష్ణుడి సంగతి చెప్పనే అవసరం లేదు; అతను చిన్నతనం నుంచీ వారిని కంటిని రెప్పలాగా కాపాడుతున్నాడు. ఖాండవ దహనం ధర్మమా అంటూ అర్జునుడు అగ్ని దేవుడి సహాయంతో గాండీవమూ, అక్షయ తూణీరాలూ, దివ్యాస్త్రాలూ సాధించుకున్నాడు; వాటితోనే రాజులందరినీ జయించాడు. ఖాండవదహనం మూలానే వారికి మయసభ కూడా లభించింది. ఇందులో అధర్మమేమున్నది? అయినా, అంత మాత్రాన నీకెవరూ లేనట్టు మాట్లాడతావెందుకు? ఆ మాటకు వస్తే నీకున్న అంగబలం వారికెక్కడిది? నీకు తొంభై తొమ్మిదిమంది తమ్ములూ, మహా విలుకాడు

దానికి దుర్యోధనుడు, "నాకు మనో వ్యాధి పట్టుకున్నది. నిద్ర రాదు. భోజనం రుచించదు. ఎందువల్లా సంతోషం కలగదు. శత్రువుల వైభవం చూసి నా కీ మనోవ్యాధి పట్టుకున్నది. ధర్మరాజుకు గల సంపద పూర్వం ఏ రాజుకూ ఏనాడూ లేదు. నేను చిక్కిపోక ఏం చేస్తాను?" అన్నాడు.

తరవాత శకుని దుర్యోధనుడితో, "రాజా, ధర్మరాజుకు జూదమంటే తగని వ్యసనం, కాని ఆటలో నేర్పు లేదు. నేను జూదంలో ఆరితేరినవాణ్ణి. నా యుక్తితో ధర్మరాజు సంపద అంతా నీకు దక్కేటట్టు చెయ్యగలను. యుద్ధానికి గాని, జూదానికి గాని సాటిరాజు అహ్వానించినప్పుడు నిరాకరించటం క్షత్రియధర్మం కాదు. అందుచేత మనం పిలిస్తే ధర్మరాజు జూద మాడటానికి వస్తాడు," అన్నాడు.

అప్పుడు దుర్యోధనుడు తండ్రి కాళ్ళ మీద పడి, శకుని చెప్పినట్టు చెయ్యటానికి అనుమతి వేడుతూ, కన్నీరు కార్చాడు.

ధృతరాష్ట్రుడు దుర్యోధనుడితో, "విదురుడి సలహా తీసుకుని అతను ఏం చెయ్యమంటాడో చూద్దాం," అన్నాడు.

"విదురుడితో చెబితే ఈ ఆలోచనకు ఎంత మాత్రమూ ఒప్పుకోడు. దీనికి నువు ఒప్పుకోకపోతే నేను బతకను. ఆ తర్వాత నువ్వూ, విదురుడూ ఈ రాజ్యాన్ని నెత్తిన



కట్టుకుని ఊరేగండి," అన్నాడు దుర్యోధనుడు, చనువుతోనూ, నిరాశతోనూ.

ధృతరాష్ట్రుడికి పుత్రమోహం జాస్తి కావటం చేత దుర్యోధనుడి ఆలోచనకు ఎదురు చెప్పలేక పోయాడు. ఆయన శిల్పాచార్యులను అనేకమందిని పిలిపించి, మయసభ లాటి సభను నిర్మించమనీ, దానికి వెయ్యి స్తంభాలూ, నూరు వాకిళ్ళూ, రకరకాల బొమ్మలతో కూడిన మంటపమూ ఏర్పాటు చేయమనీ చెప్పాడు. తరవాత ఆయన విదురుణ్ణి పిలిపించి, ఆయనతో తన దురుద్దేశం చెప్పక, ధర్మరాజును జూదానికి రమ్మనమని ఆహ్వానించటం గురించి మాత్రం చెప్పాడు.



విదురుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, ఈ ఆలోచన నాకు సమ్మతం కాదు. జూదం కారణంగా పిల్లల మధ్య వైరం ఏర్పడుతుంది. ఈ ఆలోచన మాను," అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "విదురా, ఇందులో మంచిచెడ్డ లేమైనా ఉన్నప్పటికీ స్నేహపూర్వకంగా జూదం జరిగి తీరాలి. కుమారుల మధ్య వైరం వస్తే వారించడానికి నేనూ, నువూ, భీష్ముడూ, ద్రోణుడూ లేమా? నువు రథం మీద ఇంద్రప్రస్థానికి వెళ్ళి ధర్మరాజును ఇక్కడికి తీసుకురా," అన్నాడు.

విదురుడు ఈ సంగతి భీష్ముడితో చెప్పి ఆయన అభిప్రాయం తెలుసుకునేటందుకు బయలుదేరాడు. అతడు వెళ్ళగానే ధృతరాష్ట్రుడు తన కొడుకును పిలిచి, ఈ జూద ప్రయత్నం మానుకోమని చెప్పి చూశాడు. కావలిస్తే నువు కూడా రాజసూయం చేసి సామ్రాజ్యం సంపాదించ మన్నాడు. కాని దుర్యోధనుడు వినిపించుకో లేదు. జూదం కూడా ఒక విధమైన యుద్ధమే ననీ, అందులో నేర్పును బట్టి జయాపజయాలుంటాయనీ శకుని అన్నాడు.

ఈ లోపల ధృతరాష్ట్రుడు కోరిన ప్రకారం హస్తినాపురంలో కూడా ఒక గొప్ప సభా భవనం తయారయింది. ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి, కొత్త సభలో స్నేహపూర్వకంగా జూదం ఆడటానికి ధర్మరాజును పిలుచుకుని రమ్మని ఆజ్ఞాపించాడు.

తన కిక తప్పదని గ్రహించి విదురుడు రథం మీద ఇంద్రప్రస్థానికి వెళ్ళాడు. ధర్మరాజు ఆయనకు తగిన సత్కారాలు చేసి, "విదురా, క్షేమంగా ఉన్నావా? నీ ముఖం వాడిపోయి ఉన్నదేం? ధృతరాష్ట్రుడూ, దుర్యోధనాదులూ సుఖంగా ఉన్నారా?" అని కుశల ప్రశ్నలు చేశాడు.

దానికి విదురుడు, "అందరూ క్షేమంగానే ఉన్నారు. నీ మయసభలాంటిది హస్తినాపురంలో కూడా కట్టారు. నువు నా వెంట వచ్చి, ఆ సభలో కొన్నాళ్ళు దుర్యోధనాదులతో కులాసాగా గడిపి, వాళ్లతో స్నేహపూర్వకంగా జూద మాడాలట.

ఈ మాట ముసలిరాజు నీతో చెప్పమన్నాడు. నీతో జూదమాడితే గాని అయనకూ, అయన కొడుకులకూ సుఖం ఉండదుట. ఆ దుర్మార్గుల కోరిక తీర్చు," అన్నాడు.

ఆ మాట విని ధర్మరాజు, "అయ్యయ్యో. పెద్దలు జూదమాడతారా? దానివల్ల తప్పక తగాదా వస్తుంది. నీ ఉద్దేశం ఏమిటి? నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను," అన్నాడు.

"జూదం కలహకారణమని నేను ఎంత చెప్పినా ఆ గుడ్డిరాజు వినిపించుకోక, నిన్ను తీసుకు రమ్మని నన్ను పంపాడు. నువ్వే ఆలోచించి యుక్తమని తోచినట్టు చెయ్యి," అన్నాడు విదురుడు ధర్మరాజుతో.

"అక్కడ జూదమాడటానికి ఉబలాట పడుతున్నవారెవరు?" అని ధర్మరాజు అడిగాడు.

"శకునీ, వివింశతీ, చిత్రసేనుడూ, సత్యవ్రతుడూ, పురుమిత్రుడూ, జయుడూ." అని విదురుడు చెప్పాడు.

"జూదరులంతా ఒక చోట చేరారన్న మాట. కాని ఆపద కలిగి తీరుతుంది. పెద్దలు పిలిస్తే వెళ్ళకపోరాదు. జూదానికి పిలిస్తే పోకుండా ఉండరాదని నా నియమం. చాలా భయంగా ఉన్నది. ఏమయితే అవుతుంది, రేపు బయలుదేరుతాను," అన్నాడు ధర్మరాజు.



ప్రయాణ సన్నాహం జరిగింది. ధర్మరాజు తన తమ్ములనూ, ద్రౌపదినీ వెంట బెట్టుకుని హస్తినాపురానికి వచ్చాడు; పెద్దలయిన ధృతరాష్ట్ర, భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామలకు నమస్కారాలు చేశాడు. చిన్నవారిని పలకరించి, గాంధారితో కుశల ప్రశ్నలు జరిపాడు. ద్రౌపది ముఖాన మహారాణి కళ గమనించి, దుర్యోధనుడు మొదలయిన వాళ్ళ భార్యలు అసూయపడ్డారు.

ఆ రోజు గడిచి మర్నాడు తెల్లవారగానే ధర్మరాజు కాలకృత్యాలు తీర్చుకుని, శకునీ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ మొదలైన వాళ్ళున్న జూద మాడే ఇంటికి వచ్చి, పెద్దలందరికీ నమస్కారాలు చేశాడు.



అప్పుడు శకుని ధర్మరాజుతో, "రాజా, నిన్ను చూడటానికి కొందరు ఈ సభకు వచ్చారు. మరి కొందరు కాలక్షేపం కోసం నీతో జూదమాడ వచ్చారు. అందుచేత నియమాలు ఏర్పాటు చేసుకుని, ఈ పాచికలతో జూదం ప్రారంభింతాం," అన్నాడు.

దానికి ధర్మరాజు, "శకునీ, జూదంలో మోసం చెయ్యటం చాలా పాపం. అందులో క్షత్రియుడి ఘనత ఏమీ బయట పడదు. అందుచేత మోసంతో మమ్మల్ని జూదంలో గెలవటానికి ప్రయత్నించకు. మేము సంపాదించుకున్న ధనం బ్రాహ్మణ సంరక్షణార్థమూ, దుష్ట శిక్షణార్థమూ వినియోగిస్తున్నాం," అన్నాడు.

"వేదాధ్యయనంలో సమర్థుడైన శ్రోత్రియుడు మరొక శ్రోత్రియుణ్ణి వేదాధ్యయనంలోనే గెలుస్తాడు. అలాగే మోసం చేసే జూదరిని మోసంతోనే గెలవాలి. ఇది సహజం. జూదమాడటం నీ కిష్టంలేని పక్షంలో మానెయ్యి," అన్నాడు శకుని.

ధర్మరాజు పౌరుషం వచ్చి, "జూదానికి పిలవబడి వచ్చి వెనక్కు పోవటం అగౌరవం. అందుచేత ఆడతాను. నా కెదురాడే వారెవరు?" అని అడిగాడు.

"నా పక్షాన మా మేనమామ శకుని ఆడతాడు. అతను ఏ పందెం కాసినా నేను ఇస్తాను," అన్నాడు దుర్యోధనుడు.

"ఒకరి పక్షాన మరొకరు ఆడగా నేనెన్నడూ చూడలేదు, వినలేదు. ఇది అపూర్వంగా ఉన్నది. అయినా మీ ఇష్టప్రకారమే కానివ్వండి," అన్నాడు ధర్మరాజు.

జూదం చూడటానికి ధృతరాష్ట్రుడు తన వెంట రమ్మని పిలవగా కౌరవ వృద్ధులూ, భీష్మ ద్రోణ కృప విదురులూ వచ్చి, సభను అలంకరించారు.

మొదటి పందెంగా ధర్మరాజు తన హారానికి గల మణిపూస ఒడ్డితే, దుర్యోధనుడు తన వద్ద ఉన్న మణిరాసులన్నీ ఒడ్డాడు. పందెం వెయ్యగా ధర్మరాజు ఒడ్డిన మణి పోయింది. అది మొదలు ధర్మరాజు పందెం ఒడ్డిన ప్రతిదీ శకుని గెలిచాడు. జూదంలో

ఓడిపోతున్న కొద్దీ ధర్మరాజుకు మత్సరం జాస్తి అయింది. అతను బంగారాన్నీ, గుర్రాలనూ, రథాలనూ, దాసీజనాన్నీ, నిధులనూ పణంగా పెట్టి అన్నిటినీ పోగొట్టుకున్నాడు.

ఇలా సాగుతున్న అన్యాయాన్ని సహించలేక విదురుడు ధృతరాష్ట్రుడితో, "చావనున్నవాడికి దివ్యౌషధాలు రుచించవన్నట్టు, మా మాటలు నీకు రుచించవు. నీ కొడుకు కులం చెరచటానికి పుట్టాడు. నువే ఈ మోసపు జూదాన్ని ఏర్పాటు చేసి పాండవుల ధనం అపహరిస్తున్నావు. దీని వల్ల నీకు చాలా హాని కలుగుతుంది. నా మాట విని, వారికి ఆగ్రహం కలగనియ్యకు. పాండవుల సొత్తు కాజేసి ఆనందించటం కాదు, రేపు వారి ఆగ్రహానికి గురికావాలి. మీరు నిశ్చయంగా నిర్మూల మవుతారు. అందుచేత ఈ జూదం ఆపించు," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఈ మాటలు వినిపించుకోలేదు. కాని దుర్యోధనుడు మాత్రం విదురుణ్ణి నానామాటలూ అన్నాడు.

ఈ లోపల ధర్మరాజు తన కున్నదంతా ఓడాడు; బ్రాహ్మణ మాన్యాలు తప్ప తన కున్న రాజ్యాన్నీ, బ్రాహ్మణులు కాక తన మిగతా ప్రజలనూ, తనకు సామంతులైన రాజపుత్రులనూ ఓడాడు. శకుని పాచికలను ధర్మరాజు ముందు వేసి, "పణంగా పెట్టటానికి నీ కింకేమీ లేదు!" అన్నాడు.

ధర్మరాజు సహదేవుణ్ణీ, నకులుణ్ణీ పణం పెట్టి, ఇద్దరినీ పోగొట్టుకున్నాడు. తరవాత అర్జునుణ్ణీ, భీముణ్ణీ కూడా ఓడి, తనను తానే పణంగా పెట్టుకుని ఆ పందెం కూడా ఓడాడు. [అట్టమీది బొమ్మ]

"నీ సొత్తు ద్రౌపది ఉన్నది గదా? ఆమెను పందెంగా పెట్టు," అన్నాడు శకుని. ధర్మరాజు ఆ పని కూడా చేశాడు.

దీనితో సభలో కలకలం పుట్టింది. కౌరవుల కిదేం పొయ్యేకాలం అన్నారు కొందరు. భీష్మ ద్రోణ కృపులు మాత్రం ఏమీ మాట్లాడలేదు. విదురుడు బుసలు కొట్టుతూ ఉండిపోయాడు. కర్ణ దుశ్శాసనుల ఆనందం అంతా ఇంతా కాదు.






ధర్మరాజు ద్రౌపదిని కూడా పోగొట్టుకున్నాడు. ఇక అతనికి పోగొట్టుకోదగినది ఏమీ మిగలలేదు.

దుర్యోధనుడు, "ద్రౌపదిని పిలవండి. ఆమె చేత ఈ సభ ఊడ్పించాలి," అని కేక పెట్టాడు.

విదురుడు పట్టలేక దుర్యోధనుడితో, "మూర్ఖుడా, ఒళ్ళు తెలీక నోటికి వచ్చినట్టు మాట్లాడుతున్నావు. పాండవులకు కోపం తెప్పించటం విషసర్పాలను రెచ్చగొట్టటమే. ద్రౌపది నీకెలా దాసి అయింది? ధర్మరాజు తన స్వాతంత్ర్యం పోగొట్టుకున్నాక ద్రౌపదిని పందెం పెట్టాడు," అని సభ కేసి తిరిగి, "ఈ దుర్యోధనుడు మూఢుడు, నా మాట వినడు. కౌరవులకు త్వరలోనే నాశనం కలగబోతున్నది," అన్నాడు.

దుర్యోధనుడు ఈ మాట లేవీ పట్టించుకోక ప్రాతికామి అనే వాణ్ణి పిలిచి, "నువు వెంటనే అంతఃపురానికి పోయి ద్రౌపదిని ఇక్కడికి తీసుకురా. ఈ పాండవులను చూసి నువు ఏ మాత్రం భయపడనక్కర్లేదు," అన్నాడు.

దుర్యోధనుడి అజ్ఞ పొంది ప్రాతికామి పాండవుల బసలో ప్రవేశించి, "పాంచాలీ, నీ భర్త ధర్మరాజు జూదంలో నిన్ను పణంగా పెట్టి దుర్యోధనుడికి ఓడిపోయాడు. అందుచేత ఇప్పుడు నువు దుర్యోధనుడి దాసీవి. నిన్ను ధృతరాష్ట్రుడి ఇంటికి రమ్మని ఆయన అజ్ఞ," అన్నాడు.

25. ద్రౌపదీ వస్త్రాపహరణం



"క్షత్రియు డెవడైనా జూదంలో భార్యను పణంగా పెడతాడా? ధర్మరాజుకు మతి పోయిందా ఏమిటి? జరిగిన దేమిటో సరిగా చెప్పు," అన్నది ద్రౌపది.

"ధర్మరాజు తన కున్నదంతా జూదంలో పోగొట్టుకుని, పందెం కాయటానికి ఇంకేమీ లేకపోగా, తన తమ్ములను ఒడ్డి ఓడిపోయి, చివరకు తననూ, నిన్నూ కూడా పణం పెట్టి అంతా పోగొట్టుకున్నాడు," అని చెప్పాడు ప్రాతికామి.

"ఒరే నువ్వు సభకు తిరిగిపోయి, ఆయన ముందు తనను ఓడి నన్నోడాడో, లేక ముందు నన్ను ఓడి తరవాత తనను ఓడాడో తెలుసుకురా!" అన్నది ద్రౌపది.

ప్రాతికామి జూదమాడిన చోటికి తిరిగి వచ్చి, ద్రౌపది సందేహాన్ని ధర్మరాజుతో చెప్పాడు. ఈ ప్రశ్న విని ధర్మరాజుకు పుట్టెడు దుఃఖం ముంచుకువచ్చి, ఏమీ చెప్పలేక పోయాడు.

దుర్యోధనుడు ప్రాతికామితో, "ఆమెను ముందు సభకు వచ్చి, తన సంశయాన్ని తానే తీర్చుకోమని చెప్పు. వెళ్ళు," అన్నాడు.

ప్రాతికామి మళ్ళీ ద్రౌపది వద్దకు పోయి, "అమ్మా, నిన్ను స్వయంగా వచ్చి నీ అనుమానం తీర్చుకోమని సభవా రంటున్నారు," అని చెప్పాడు.

"ప్రాతికామీ, నేను ఆ సభకు రావటం చాలా తప్పు. అది కౌరవుల కీర్తికి పెద్ద కళంకం. నా ప్రశ్నకు సభలోని వారిని సమాధానం చెప్పమను. ఆటు తరవాత వారు ఏం చెయ్యమంటే అది చేస్తాను," అన్నది ద్రౌపది.

ప్రాతికామి ఆమె అన్న మాటలు సభకు తెలిపాడు. సభలోనివారు దుర్యోధనుడికి విరుద్ధంగా ఏమీ చెప్పలేక తలలు వంచి మౌనంగా ఉండిపోయారు. ఇది గ్రహించి ధర్మరాజు ద్రౌపదిని పిలుచుకు రావటానికి ప్రాతికామి వెంట ఒక దూతను పంపాడు. ఆ దూత ధర్మరాజు పిలిస్తున్నాడని చెప్పిన మీదట, ద్రౌపది బహిష్ఠ అయి ఉండి కూడా ప్రాతికామి వెంట సభకు వెళ్ళి, ధృతరాష్ట్ర

డికి ఎదురుగా దూరంగా నిలబడింది. పాండవులు ఎటు చూడటానికీ మొహాలు చెల్లక తలలు వంచుకుని దీనంగా, విషాదంగా కూర్చున్నారు.

వారి మనస్థితి గమనించి దుర్యోధనుడు మరింతగా విజృంభించి, ప్రాతికామితో, "చూస్తావేం, ఆమెను ఇక్కడికి తీసుకురారా!" అన్నాడు.

ప్రాతికామికి ద్రౌపదిని అంటుకోపటానికి భయం వేసింది. అతను సభలో ఉన్నవారిని ఉద్దేశించి, "ద్రౌపదితో ఏమి చెప్పమన్నారు?" అని అడిగాడు.

వాడు భీముణ్ణి చూసి భయపడుతున్నాడని గ్రహించి దుర్యోధనుడు దుశ్శాసనుడితో, "దుశ్శాసనా, దాన్ని ఇలా ఈడ్చుకురా. మనకు దాసులైన ఈ శత్రువులు ఏమీ చేయలేరు," అన్నాడు.

దుశ్శాసనుడు మానాభిమానాలు వదిలేసి, "ద్రౌపదీ, ఇలా రా. నీ భర్తలు నిన్ను మాకు ఓడారు. సిగ్గెందుకు? మా దుర్యోధనుణ్ణి ప్రేమించు. కౌరవులను వరించు," అంటూ ద్రౌపదిని సమీపించాడు. ద్రౌపది వెలవెలపోతూ ముఖాన్ని చేతులతో కప్పుకుని, గాంధారి కేసి వెళ్ళసాగింది.

దుశ్శాసనుడు ఆమెను వెంబడించి, "ఇంకెక్కడికి పోతావు?" అంటూ ద్రౌపది జుట్టు పట్టుకుని లాగాడు. అయిదుగురు మహావీరులు భర్తలై కూడా అనాథ అయిపోయిన ద్రౌపది గడగడా వణికిపోతూ, హీనస్వరంతో, "ఓరీ, బుద్ధిహీనుడా!





నే నిప్పుడు ఋతువులో ఉన్నాను. నన్ను సభ మధ్యకు తీసుకు పోరాదు," అన్నది.

దానికి దుశ్శాసనుడు, "నువు బహిష్ఠ వైతే నేం? బట్టలు లేనిదానివైతే నేం? నీ మొగుడు జూదంలో నిన్ను మాకు ఓడాడు. నువు మా దాసివి. ఇవాళ నుంచీ మా ఇతర దాసీలతో బాటు నువూనూ!" అంటూ ద్రౌపదిని జుట్టుపట్టుకుని సభా మధ్యానికి జరజరా ఈడ్చుకు వచ్చాడు.

ద్రౌపది జుట్టు ముడి ఊడిపోయింది, చీర సగం జారిపోయింది. సిగ్గూ, కోపమూ ఆమెను దహించాయి. ఆమె దుశ్శాసనుడితో, "దుర్మార్గుడా, తండ్రుల లాంటి ఈ అందరి ముందూ నే నిలా నిలవరాదు. నన్ను అవమానకరమైన స్థితిలో పెట్టకు. ఈ పాపిష్ఠి పనికి నువు అనుభవిస్తావు. ఈ సభలో అందరూ ధర్మం తెలిసినవారే కాని, ఒక్కరూ నిన్ను ఇదే మనరు. భరతకులం పుచ్చిపోయింది. ఈ అన్యాయాన్ని ఆపటం భీష్మ ద్రోణులకూ, విదుర ధృతరాష్ట్రులకూ కూడా సాధ్యం కాదులాగుంది!" అని పాండవుల కేసి చురచురా చూసింది.

దుశ్శాసనుడు, "ఓసి దాసీ!" అన్నాడు. ఆ హాస్యానికి కర్ణుడూ, శకునీ, దుర్యోధనుడూ విరగబడి నవ్వారు. మిగిలినవాళ్ళు లోలోపల దుఃఖపడ్డారు.

అప్పుడు భీష్ముడు ద్రౌపదితో, "అమ్మా, ధర్మసూక్ష్మం చెప్పటానికి లేదు. అయిదు గురికి భార్యవైన నిన్ను ధర్మరాజు పందెం పెట్టటం తప్పే. కాని ధర్మరాజు తన సర్వ స్వమూ వదులుకుంటాడు గాని, ధర్మం వదలడు. ఆయన జూదంలో నిన్ను ఓడి నీకు మోసం చేస్తాడా?" అన్నాడు.

ఈ మాటకు ద్రౌపది, "ధర్మరాజు తన కిష్టంలేని జూదంలో దిగి, మోసానికి గురి అయి, అంతా పోగొట్టుకుని, ఇంకేమీ లేక, నన్ను పందెం పెట్టాడా? కొడుకులకూ, కోడళ్ళకూ నియమానుసారంగా భరణా లిచ్చే కౌరవ పెద్దలు నాకు తెలియజెప్పాలి," అంటూ ఏడ్చింది. దుశ్శాసనుడు అవాచ్యాలు పలికాడు.



అ మాటలు విని భీముడు ధర్మరాజుతో, "జూదగాళ్ళు నీతిలేని భార్యలను సైతం పణం పెట్టరు. పరమపవిత్రురాలైన ద్రౌపదిని నువు పణంగా పెట్టటం మహా అన్యాయం. సమస్త ఐశ్వర్యాలనూ, మమ్మల్ని ఓడితే ఓడావు. పాంచాలిని పణంగా పెట్టిన నీ చేతులు కాల్చాలి. సహదేవా, నిప్పు పట్టుకురా!" అన్నాడు.

అది విని అర్జునుడు భీముడితో, "ఇంత సేపు ఓర్చుకున్నవాడివి ఇప్పుడు అన్న మనస్సు నెందుకు బాధిస్తావు? ఈ జూదగాళ్ళ మూలాన నీ ధర్మబుద్ధి కూడా చెడిపోయిందా ఏం? పెద్దవాణ్ణి దూషించవచ్చునా? ధర్మరాజు తానై జూదం ఆడలేదు; ఇతరులు పిలిస్తే రాజధర్మం పాటించి ఆడాడు. ధర్మరాజు చేసిన తప్పేమీ లేదు. శాంతించు," అన్నాడు.

ద్రౌపది అడిగినదానికి సభలో ఎవరూ జవాబు చెప్పకపోవటం చూసి, ధృతరాష్ట్రుడి కొడుకులలో ఒకడైన వికర్ణుడు, "ద్రౌపది అడిగినదానికి జవాబు చెప్పండి. కురువృద్ధులూ, గురువులూ మాట్లాడరేం? పక్షపాతం లేకుండా, రాగద్వేషాలు లేకుండా ధర్మం చెప్పండి," అని చాలాసార్లు గట్టిగా అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. అతను ఇంకా ఇలా అన్నాడు:

"మీరు న్యాయం చెప్పకపోతే నేను చెబుతాను, వినండి. ఆడదీ, వేటా, జూదమూ, తాగుడూ—ఈ నాలుగింటికీ దాసుడైన రాజు ధర్మానికి నిలబడలేడు. ధర్మరాజు జూదమనే వ్యసనం మూలంగా తన సమస్తాన్నీ, తమ్ములనూ, తననూ ఓడి, చివరకు ద్రౌపదిని ఓడాడు. ద్రౌపది పాండవులందరిదీ కాని, ధర్మరాజు సొంత సొత్తు కాదు. ఈమెను ఈ సభలోకి ఇలా తీసుకురావటం అన్యాయం. ఇది నా ధర్మనిర్ణయం," అన్నాడు.

వికర్ణుడికి కర్ణుడు అడ్డు వచ్చి, "ఈ సభలో పెద్దలెవరికీ తెలీని ధర్మం, కుర్రవాడివి నీకు తెలిసిందా? ధర్మరాజు తన



సర్వస్వాన్ని ఓడినప్పుడే ద్రౌపదినీ ఓడాడు. అందుకే పాండవులు మాట్లాడరు. ఈ ద్రౌపదిని ఈ సభకు తీసుకురావటం అన్యాయం అన్నావు. అయిదుగురు భర్తలు కలది కులట. అలాటి దాన్ని నిండుసభలో బట్టలు ఒలిచినా తప్పు కాదు. దుశ్శాసనా, వికర్ణుడు వదరటాని కేంలే? నువు ఆ పాండవుల బట్టలూ, ద్రౌపది బట్టలూ ఒలిచి పట్టుకురా," అన్నాడు.

కర్ణు డిలా అనగానే పాండవులు తమ పై బట్టలు తీసి దూరంగా పెట్టారు.

దుశ్శాసనుడు ద్రౌపది చీర విప్ప నారంభించాడు. అప్పుడు ద్రౌపది తనను రక్షించమని కృష్ణుణ్ణి ప్రార్థించింది. కృష్ణుడు అదృశ్యంగా వచ్చి అక్కడ నిలబడి, ద్రౌపదికి అనేక చీరలు ఇస్తూ పోయాడు. దుశ్శాసనుడు ఎన్ని చీరలు లాగేసినప్పటికీ, ద్రౌపది వంటిన చీర ఉంటూనే వచ్చింది. ఒక వంక దుశ్శాసనుడు ఒలిచిన చీరల గుట్ట చిన్న కొండ లాగా తయారయింది. దుశ్శాసనుడు విసిగిపోయి ఊరుకున్నాడు. [అట్టమీదిబొమ్మ]

భీముడు పట్టరాని కోపంతో, కింది పెదవి కొరికి, నేలను చేత్తో చరిచి, "అందరూ వినండి! ద్రౌపదికి మానభంగం కలిగించటానికి ప్రయత్నించిన ఈ దుశ్శాసనుణ్ణి యుద్ధంలో చంపి, వాడి రొమ్ము చీల్చి, వాడి రక్తం తాగుతాను! ఇదే నా ప్రతిజ్ఞ!" అన్నాడు.

ఇంత జరిగాక విదురుడు లేచి, చేతులు పైకెత్తి, "సభికులారా, ద్రౌపది ప్రశ్నకు సరి అయిన సమాధానం చెప్పకపోతే అధర్మం అవుతుంది. ఇంతమంది వున్నా వికర్ణుడొక్కడే తన అభిప్రాయం చెప్పాడు. దీనులకు ధర్మం చెప్పకపోతే అసత్య దోషంలో సగం మిమ్ముల నందరినీ అంటుకుంటుంది," అన్నాడు.

అప్పటికీ ఎవరూ మాట్లాడలేదు. దుర్యోధనుడు ద్రౌపదికి సైగ చేసి తన తొడ చూపాడు. భీము డిది చూసి మరింత మండిపడి, యుద్ధంలో దుర్యోధనుడి తొడలు గదతో విరగగొడతానని ఘోరప్రతిజ్ఞ చేశాడు.

అతను మండుతున్న అగ్నిజ్వాల లాగా కనిపించాడు.

దుర్యోధనుడు ద్రౌపదితో, "నా వల్ల ఏ తప్పూ లేదు. భీమార్జున నకుల సహదేవులు తమకు ధర్మరాజు ప్రభువు కాదని చెప్పితే నీకు దాస్యం ఉండదు," అన్నాడు.

అప్పుడు అర్జునుడు, "ధర్మరాజు మా కందరికీ ప్రభువన్నది నిజమే. కాని ఆయన తానే ఓడిపోయాక ఎవరికి ప్రభువో కౌరవులు చెప్పాలి," అన్నాడు.

ఆ సమయంలో అనేక ఉత్పాతాలు కలిగాయి. అది చూసి భయపడి ధృతరాష్ట్రుడు, "ఒరే దుర్యోధనా! దుర్మార్గుడా! ద్రౌపదిని సభ కెందుకు బలవంతంగా తెచ్చావురా? పాండవుల మీద నీ కీ పగ దేనికి? ఏమిటీ అన్యాయం?" అని కొడుకును మందలించి, ద్రౌపదిని దగ్గిరికి పిలిచి, "అమ్మా, నా కోడళ్ళలో నువే ఉత్తమురాలివి. నీ కేమి కావాలో కోరుకో, తల్లీ!" అన్నాడు.

ద్రౌపది పాండవులకు దాస్యవిముక్తి, వారి ఆయుధాలు వారికి తిరిగి ఇవ్వటమూ కోరింది.

"ఆహా, ఈ నాటికి పాండవులను ఒక ఆడది ఉద్ధరించింది!" అని కర్ణుడు వెటకారం చేశాడు.

భీముడు రౌద్రాకారం ధరించి, శత్రువుల నందరినీ ఆ క్షణమే నిర్మూలిస్తానన్నాడు. అతి కష్టం మీద అర్జునుడూ, ధర్మరాజూ అతనిని శాంతింపజేశారు. తర్వాత ధర్మరాజు ధృతరాష్ట్రుణ్ణి, "రాజా, మా కేమి ఆజ్ఞ?" అని అడిగాడు.

"నాయనా, నువూ, నీ తమ్ములూ ఇంద్రప్రస్థానికి వెళ్ళి హాయిగా రాజ్యం ఏలుకోండి. స్నేహపూర్వకంగా జూదం ఆడతామంటే సరే నన్నాను. ఆపకపోవటం నాది పొరపాటే. ముసలివాళ్ళమైన నన్నూ, గాంధారినీ చూసి నా కొడుకులు చేసిన దుష్కార్యాలను మరిచిపొండి. నీకూ, నీ తమ్ములకూ శుభం కలుగు గాక!" అన్నాడు ధృతరాష్ట్రుడు.

పాండవులు పెద్దలందరి వద్దా సెలవు తీసుకుని ద్రౌపదితో సహా ఇంద్రప్రస్థానికి తిరిగి వెళ్ళిపోయారు.






దుశ్శాసనుడు ప్రేరేపించగా దుర్యోధనుడు తండ్రి దగ్గిరికి పోయి, "జూదంలో గెలిచిన దంతా పోగొట్టావు. పాండవులు మనని యుద్ధంలో నిర్మూలించి తీరతారు. వాళ్ళకు అమితమైన బలసంపద ఉన్నది. వాళ్ళను మళ్ళీ జూదం ఆడటానికి పిలిపించు. ఈసారి వాళ్ళను జూదంలో ఓడించి పన్నెండేళ్ళు అరణ్యానికి పంపి, అరణ్యవాసం పూర్తి చేసేలోపల ప్రపంచంలోని రాజు లందరినీ మన పక్షం చేసుకుని, యుద్ధం వస్తే పాండవులను తేలికగా నిర్మూలిస్తాం," అన్నాడు.

ధృతరాష్ట్రుడు దీనికి ఒప్పుకున్నాడు. భీష్మద్రోణ విదురులు మొదలైనవారు అనేకులు వద్దన్నారు. గాంధారి గట్టిగా అడ్డుపడింది; కౌరవకులం నాశనమవుతుందని చెప్పింది. కులం నాశనమైనా సరే, జూదాన్ని ఆపటం తన వశం కాదని ధృతరాష్ట్రుడు భార్యతో అన్నాడు. ఇలా అంటూనే ఆయన పాండవులను జూదానికి ఆహ్వానించడానికి ప్రాతికామిని పంపాడు.

మళ్ళీ జూదం ఆడటం అపాయకరమని తెలిసి కూడా ధర్మరాజు, తన తమ్ములనూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని, జూదం ఆడటానికి హస్తినాపురం వచ్చాడు.

జూదం ఆడే ముందు శకుని ధర్మరాజుతో, "ఈసారి జూదంలో పందెం ఏమిటంటే, ఓడిపోయినవారు నారబట్టలు కట్టి పన్నెండేళ్ళు అరణ్యవాసం చెయ్యాలి. ఆ తరవాత ఒక ఏడు అజ్ఞాతవాసం చెయ్యాలి.

**26.** పాండవ వనవాసం



అజ్ఞాతవాస మప్పుడు బయటపడితే తిరిగి పన్నెండేళ్ళు అరణ్యవాసం చేసి, మళ్ళీ ఒక ఏడు అజ్ఞాతవాసం చెయ్యాలి. పదమూడేళ్ల అనంతరం ఎవరి రాజ్యాలు వారు ఏలుకో వచ్చు," అన్నాడు.

శకుని తెలిపిన ఈ నియమాలు విని సభలోని వాళ్ళు భయభ్రాంతులయారు. "ధృతరాష్ట్రుడు బుద్ధిలేక, కొడుకు ఆడించి నట్టు ఆడుతుంటే పెద్దలు నివారించరేం?" అని కొందరు గట్టిగా అరిచారు. ధర్మరాజు ఆ మాటలు విని, "రాజధర్మాన్ని పాలిస్తా నని కంకణం కట్టుకున్న నాబోటివాడు, కుట్రదార్లు జూదానికి ఆహ్వానించినా వచ్చి జూదమాడి తీరాలి," అని శకునితో అన్నాడు.

శకుని పాచికలు వేశాడు. ధర్మరాజు పందెం ఓడాడు.

పందెం ప్రకారం ధర్మరాజూ, అతని తమ్ములూ, ద్రౌపదీ నారబట్టలు ధరించి, జడలు దాల్చి, జింకతోళ్లు తీసుకుని వనవాసానికి పోవటానికి సిద్ధమయారు. వాళ్లను చూసి దుశ్శాసనుడు, "ఇంత కాలానికి పాండవులకు కష్టాలు ఆరంభం కావటం చూసి మా జన్మ తరించింది. ఇక దుర్యోధనుడి ఏలుబడికి అడ్డు ఉండదు. ఐశ్వర్య గర్వంతో ఈ పాండవులు మమ్మల్ని చాలా లోకువ చేసి చూశారు. ఇప్పుడు వారికి తగిన పరాభవం జరిగింది. ఇక వారు అరణ్యమృగాల లాగా జీవిస్తారు. ఇంక మాతో సమాన సంపదగలవారు ఎవరూ ఉండరు," అని, ద్రౌపదితో, "పాంచాలీ, దరిద్రులైన ఈ పాండవులతో అడవులలో ఎందుకు కష్టాలు పడతావు? మా కౌరవులలో నీ యిష్టం వచ్చిన వాణ్ణి వరించి, దాసదాసీ జనాలతో సమస్త భోగాలూ అనుభవించు," అన్నాడు.

భీము డీ మాటలు విని సింహం లాగా గర్జిస్తూ, "ఓరీ, పాపీ, శకుని ఆడిన మాయ జూదం మూలాన నీ కింత కావరం వచ్చిందా? లేకపోతే ఇలా వదరగలిగి ఉందువా? నిన్ను యుద్ధంలో కీలూ కీలూ విరిచి చంపేటప్పుడు నిన్నే ఘంటా నే

అందరూ వింటారులే. నిన్నే కాదు, నిన్నాశ్రయించి ఉన్న వారందరినీ యమలోకానికి పంపేస్తాను. ఇదే నా ప్రతిజ్ఞ!" అన్నాడు.

తరవాత భీముడు దుర్యోధనుడి కేసి తిరిగి, "ఓరీ, మూర్ఖుడా! అప్పుడే ఏమయింది? నిన్ను యుద్ధంలో చంపిన నాడు దీని కంతకూ సమాధానం చెబుతాను," అన్నాడు.

తరవాత పాండవులు జూదం ఆడిన చోటి నుంచి వెళ్ళి పోయేటప్పుడు భీముడు వెనక్కు తిరిగి సభను చూసి, "గుర్తుంచుకోండి. యుద్ధంలో ఈ పాపాత్ముడైన దుర్యోధనుణ్ణి నేను భయంకరంగా చంపుతాను. వీడి స్నేహితుడైన కర్ణుణ్ణి అర్జునుడూ, ఈ శకునిని మా సహదేవుడూ చంపేస్తారు. ఈ దుష్టచతుష్టయానికి మా చేతిలో చావు రాసి పెట్టి ఉన్నది. దాన్ని ఎవరూ తప్పించ లేరు," అన్నాడు.

భీముడికి అర్జునుడు అడ్డు వచ్చి, "వట్టి మాటల వల్ల లాభమేమిటి? ఇంకా పధ్నాలుగేళ్ళకు చేయదలచిన దాన్ని ఇప్పుడే ఎందుకు చాటటం? అది కూడా, పదమూడేళ్ళూ పూర్తి అయినాక ఈ దుర్మార్గుడు మన రాజ్యం మన కివ్వకపోతే మాట! అప్పుడు అన్నంత పనీ చేద్దాం," అన్నాడు.

సహదేవుడు శకునితో, "ఓరీ, నీచుడా! పాచికలతో మోసం చేసినట్టు కాదు, యుద్ధ



భూమిలో నీ ప్రతాపం చూపించు. భీముడు అన్నట్టుగా నేను నీ ప్రాణాలు తీసి తీరుతాను. ఈ లోపల నీ పనులన్నీ ముగించుకుని, చావటానికి సిద్ధంగా ఉండు," అన్నాడు.

నకులుడు రౌద్రంగా, "ద్రౌపదిని ఈ సభలో పరాభవించిన వారి నందరినీ పురుగులను చంపినట్టు చంపుతాం. ఇవి ప్రగల్భాలు కావు," అన్నాడు.

ఇలా పాండవులు తలా ఒక శపథమూ చేసి, ధృతరాష్ట్ర, భీష్మ, బాహ్లిక, కృప, ద్రోణ, అశ్వత్థామ, విదుర, సంజయాది పెద్దల వద్ద సెలవు పుచ్చుకుంటూ, "మళ్లీ కలుసుకుందాం," అని చెప్పారు.



దుష్టచతుష్టయానికి భయపడి మిగిలిన వాళ్ళు ఏమీ అనలేదు గాని, విదురుడు మాత్రం ధర్మరాజుతో, "మోసం చేత ఓడినవాడు ఓటమికి విచారించ నవసరం లేదు. నీకు రత్నాల లాటి తమ్ములూ, బుద్ధిమంతురాలైన ద్రౌపదీ, జ్ఞాని అయిన ధౌమ్యుడూ ఉండగా ఏ లోటూ రాదు. ఐకమత్యం గల మీ అన్నదమ్ముల మధ్య ఎవరూ భేదాలు కలిగించలేరు. మిమ్మల్ని ఎవరూ ఓడించనూ లేరు. మీ తల్లి పెద్దది, మీతోబాటు అరణ్యావాసం చెయ్యలేదు. అందుచేత ఆమెను నా యింట పెట్టుకుని, నేను చూసుకుంటాను. అందుకు నువు సరేనను. వెళ్ళిరా. నీకు శుభం కలుగుగాక. మళ్ళీ కలుసుకుందాం." అన్నాడు; ఇంకా అనేక హిత వాక్యాలు చెప్పాడు.

ధర్మరాజు విదురుడితో, "నీవు నాకు తండ్రీ, గురువూలాటి వాడివి. నువు చెప్పినట్టే నడుచుకుంటాను," అన్నాడు.

ద్రౌపది అంతఃపురంలో ఉన్న కుంతికీ, గాంధారికీ, ఇతర పుణ్యస్త్రీలకూ నమస్కారం చేసి, తన యీడువారిని కౌగలించుకుని, కంట తడి పెడుతూ, "వనవాసానికి పోతాను," అన్నది.

కుంతి ఆమెతో, "నీకు అన్నీ తెలుసును. భర్తల వెంబడి భార్య లుండటం సహజ ధర్మం. అందుచేత నువు కంట తడి పెట్టకు. నువు నిజంగా కోపంతో చూసి ఉంటే ఈ కౌరవులు భస్మమై ఉందురు. నేను నిన్ను ఒక్కటి కోరుకుంటున్నాను. మిగిలిన నలుగురూ ఒక ఎత్తూ, సహదేవుడు ఒక ఎత్తూనూ. వాడు చిన్న తనం నుంచీ సుకుమారుడు, కష్టాలు ఓర్చలేడు. వాణ్ణి కాస్త శ్రద్ధగా కనిపెట్టి ఉండు. వెళ్ళిరా, అమ్మా. ధర్మం జయించి మీకు శుభాలు కలుగుతాయి," అన్నది.

వూడిపోయిన జుట్టుముడితో, పెద్దపెట్టున ఏడుస్తూ ద్రౌపది అంతఃపురం నుంచి బయలుదేరింది. కుంతి ఆమె వెంటనే తన కొడుకుల వద్దకు వచ్చింది. వాళ్ళు ముని వేషాలు వేసుకుని అరణ్యానికి బయలుదేరు

తున్నారు. కుంతి వారిని చూసి కళ్ళవెంబడి అశ్రుధారలు కార్చుతూ, "కొడుకులారా, మీరు ధర్మాన్ని ఎంతో శ్రద్ధగా ఆచరిస్తున్నప్పటికీ మీకు వనవాసం సంప్రాప్తమయింది. దేవుడు అనుకూలించలేదో, లేక నా కడుపున పుట్టినందుకు మీ కిది శిక్ష! అరణ్యాలలో మీరు ఎలా వుంటారో! మీ ఈ దుస్థితి చూడకుండా దేహం చాలించిన మీ తండ్రీ, ఆయనతోపాటే పోయిన మాద్రీ అదృష్టవంతులు. నే నేదో మహాపాపం చేసుకుని, మీ కష్టాలు చూడటానికి బతికి వున్నాను. ఇదివరకు మీతోబాటు కష్టాలన్నీ పంచుకున్నాను. ఇప్పుడు నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళక, మీతోబాటు తీసుకుపొండి. అనాథ రక్షకుడైన కృష్ణుడు కూడా మనకు ఏమీ చేయలేకపోయాడు," అన్నది.

తరవాత ఆమె సహదేవుడితో, "నువు వనవాసం వెళ్ళకు, నాయనా. నువు నాదగ్గిర ఉంటే నా కొడుకు లందరూ దగ్గిర ఉన్నట్టే ఉంటుంది," అని ఆపుకోలేకుండా ఏడవసాగింది. విదురుడు ఆమెను ఎలాగో ఊరడించి, తన ఇంటికి తీసుకుపోయాడు.

పాండవులు తల్లికి మొక్కి, వనవాసానికి బయలుదేరారు. ద్రౌపది తల విరబోసుకుని వారి వెంట నడిచింది. ధర్మరాజు ముఖానికి గుడ్డ కప్పుకున్నాడు. భీముడు తన భుజాలు విశాలంగా పెట్టుకుని నడిచాడు. అర్జునుడు



ఇసక చల్లుకుంటూ వెళ్ళాడు. నకులుడు తన శరీరం నిండా బూడిద పూసుకున్నాడు. సహదేవుడు తన ఒంటినిండా మట్టి చల్లుకున్నాడు. ధౌమ్యుడు వారికి ముందు నడుస్తూ రౌద్ర, యామ్యసామగానం చేశాడు. [అట్ట మీది బొమ్మ]

ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి, "పాండవులు వనవాసానికి ఎలా వెళ్ళారు?" అని అడిగితే, ఇలా వెళ్లారని విదురుడు చెప్పాడు.

"ఎందు కలా వెళ్లారు?" అన్నాడు ధృతరాష్ట్రుడు.

"నీ కొడుకులు చేసిన అన్యాయానికి మండిపోతున్న ధర్మరాజు తన చూపుతో ప్రజలు భస్మమై పోతారేమో నని ముఖా



నికి గుడ్డ అడ్డం పెట్టుకున్నాడు. భీముడు లోకానికి తన భుజబలం ప్రదర్శించాడు. ఇసుక చల్లినట్టుగా బాణాలు వేసి శత్రు సంహారం చేస్తానని అర్జునుడు తెలియజేశాడు. తన అందం చూసిన ప్రజలు, తాను పడబోయే కష్టాలను గురించి మరింత విచారిస్తారని నకులుడు బూడిద పూసుకున్నాడు. తన దుఃఖం ప్రజలకు కనబడకుండా సహదేవుడు మట్టికొట్టుకున్నాడు. ద్రౌపది తడి చీర గట్టుకుని, జుట్టు విరబోసుకుని, మరి మధ్నాలుగేళ్ళకు నీ కోడళ్ళు విధవలై, ఇలాగే ఏడుస్తారని సూచించింది. ధౌమ్యుడు దర్భలు చేతబట్టుకుని, రాబోయే యుద్ధంలో చచ్చేవారికి ఉత్తరక్రియలు చేయిస్తానని చెప్పటానికి రౌద్రసామం చదివాడు....రాజా, నీ దుర్బుద్ధి మూలంగా కౌరవులకు వినాశం రాబోతున్నది," అన్నాడు విదురుడు.

పాండవులు వెళ్ళిపోయాక దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకుని దుష్టచతుష్టయం ద్రోణుడి వద్దకు వెళ్ళి, "మహానుభావా, పాండవుల నుంచి గెలుచుకున్న రాజ్యాన్ని మీరు ఏలండి. అందుకు మీ కన్న అర్హుడు లేడు," అన్నారు.

ఆ మాట విని ద్రోణుడు వారితో, "పాండవులను గెలవటం ఎవరి తరమూ కాదు. నా పట్ల ఎంతో అభిమానంగా ఉండే దుర్యోధనాదులను నేను విడవలేను. పాండవులు నియమాన్ని నిర్వర్తించి, యుద్ధానికి సిద్ధపడి తప్పక వస్తారు. నా చేతిలో ఓడిపోయిన ద్రుపదుడు మహాయజ్ఞం చేసి, నన్ను చంపగల కొడుకునూ, అర్జునుడికి భార్య కాదగిన కూతురినీ సంపాదించాడు. ధృష్టద్యుమ్నుడు ద్రౌపది వివాహం ద్వారా పాండవుల మనిషి అయాడు. దీనికి తోడు కృష్ణుడు కూడా పాండవుల పక్షాన ఉన్నాడు. అర్జునుడితో సమానుడైన అతిరథుడు గాని, మహారథుడు గాని లోకంలో ఎవడూ లేడు. నా చావు ధృష్టద్యుమ్నుడి చేతిలో ఉన్నదని అందరూ ఎరిగినదే. దీని కంతకూ మీరే కారకులు కావటం జరిగింది. ఇంత కన్న విచార కారణం ఏముంటుంది? ఇక

మీరు చేయగలిగిన దేమంటే, ఇతరులకు మేలు చేయ దలిస్తే ధర్మంగా ప్రవర్తిం చండి. లేదా, తాటిమాను నీడ లాటి సుఖాలు కావాలంటే, ఈ పదమూడేళ్లూ సుఖాలలో ఓలలాడండి. అటు తరవాత కౌరవ వినాశం తప్పదు," అన్నాడు.

ఈ మాటలు విన్న ధృతరాష్ట్రుడు దడు చుకుని విదురుడితో, "విదురుడా, ద్రోణా చార్యుల మాట నిజం. నువు అరణ్యానికి వెళ్ళి పాండవులను తీసుకురా. వాళ్ళు రామంటే, సన్మానం పొంది మళ్ళీ వెళ్ళ మని చెప్పు," అంటూ, మనసు నిప్పులు తొక్కిన కోతి లాగా గిలగిల లాడుతుండగా, నిట్టూర్పులు వదల సాగాడు.

అప్పుడు సంజయుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, నీ కీ రాజ్యమంతా పాండురాజు గెలిచిపెట్టాడు. అతని కొడుకులను అడవు లకు తోలేశావు. ఇంకేమిటి నీ విచారం?" అన్నాడు.

"విచారం కాకేమిటి? ఆ పాండవులు అతిరథులూ, యుద్ధం తెలిసిన వాళ్ళూ. అలాటి వాళ్ళతో వైరం వచ్చినాక విచారం ఉండదా?" అన్నాడు ధృతరాష్ట్రుడు.

"ఈ వైరం నువు బుద్ధి పూర్వకంగా తెచ్చుకున్నదే గద! పెద్దవాడు భీష్ముడూ, గురువైన ద్రోణుడూ, నీ మంత్రి అయిన విదురుడూ వద్దంటుంటే విన్నావు కావు. నీ కొడుక్కు బుద్ధిలేదు, లజ్జాలేదు; ప్రాతి కామిని పంపి, బహిష్ఠ అయి ఉన్న ద్రౌప దిని నిండు సభలోకి రప్పించి, బట్టలు ఊడ దీసి అవమానించాడు. ఆమె ఉసురు నీ కులానికి చేటు. చెట్టు చెడేనాటికి కుక్క మూతి పిందెలు పుడతాయి. వినాశకాలం వచ్చేసరికి దేవతలు బుద్ధి నశింప జేస్తారు. కాలం ఎవరినీ కర్ర తీసుకుని నెత్తి మీద కొట్టదు. కాలం తీరేసరికి అన్యాయం న్యాయంగా కనపడుతుంది," అని సంజయు డన్నాడు.

"అవును. పుత్ర మోహం చేత ఎవరు చెప్పినదీ వినక, నా కొడుకు చెయ్యమన్నది చేశాను. ఏం చేసేది? దేవుడే మమ్మల్ని కాపాడాలి!" అన్నాడు ధృతరాష్ట్రుడు.





# మహాభారతం

పాండవులు జూదంలో ఓడి, వనవాసం చెయ్యటానికి ద్రౌపదితో సహా హస్తినాపురం నుంచి అరణ్యాలకు బయలుదేరారు. ఇంద్రసేనుడు మొదలైన వాళ్ళు పధ్నాలుగు మంది సేవకులు రథాలు వెంట బెట్టుకుని వారి వెనకగా వచ్చారు.

దారిలో వారికి వర్ధమానపురం అనే ఊరు తగిలింది. పాండవులు ఆ ఊరికుండా వెళుతూండగా, హస్తినాపురం నుంచి బయలుదేరి వచ్చిన కొందరు పౌరులు వారిని చేరుకుని, "ధర్మరాజా, మేం లేకుండా మీ రెక్కడికి పోతారు? మమ్మల్ని కూడా మీ వెంట తీసుకుపొండి," అన్నారు.

వాళ్ళతో ధర్మరాజు, "మీ సోదరుడిలాటి వాణ్ణి, నా మనవి కొంచెం వినండి. మాకు రాబోయే కష్టాలు తలుచుకుని మా తాత భీష్ముడూ, మాకు తండ్రిలాటి వాడైన ధృతరాష్ట్రుడూ, అంతకన్న కూడా మా తల్లి కుంతీ తీరని దుఃఖంలో ఉంటారు. మీరు వెళ్ళి వారిని ఓదార్చినట్టయితే నాకు శుభం కలుగుతుంది. వాళ్ళను నేను మీకు అప్పగిస్తున్నాను. మీరు చాలా దూరం వచ్చారు. ఇక తిరిగి వెళ్ళండి," అన్నాడు.

అంత వినయంగా అడిగిన ధర్మరాజు మాట తీసి వెయ్యలేక, ఆ పౌరులు పాండవులను మెచ్చుకుంటూ హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోయారు.

తరవాత పాండవులు రథాలెక్కి గంగా తీరం వెంబడి అరణ్యాల కేసి పోతూ, సూర్యాస్తమానమయే వేళకు ఒక పెద్ద

## 27. మైత్రేయుడి శాపం



పడితే నేను భరించలేను. మీరు మీ మీ ఇళ్ళకు పొండి," అన్నాడు ధర్మరాజు.

"నిన్నే నమ్ముకుని వస్తామంటే నువు వద్దనటం భావ్యం కాదు," అన్నారు బ్రాహ్మణులు.

"నేను అసహాయుణ్ణి. నా తమ్ములు అసహాయులు. మీ కోసం కందమూలాలు తెమ్మని నా తమ్ములను కష్టపెట్టలేను," అన్నాడు ధర్మరాజు.

"మా తిప్పలన్నీ మేమే పడతాం. మామూలంగా మీరేమీ శ్రమపడవద్దు. మాకు కావలిసింది మీ సాంగత్యం మాత్రమే," అన్నారు బ్రాహ్మణులు.

ధర్మరాజు తమ పురోహితుడైన ధౌమ్యుడితో, "మునీశ్వరా, ఈ బ్రాహ్మణులు నా వెంట అష్టకష్టాలూ పడటానికి సిద్ధంగా ఉన్నారు. వద్దంటే వినరు. వీళ్ళను అరణ్యంలో ఎలా పోషించాలి? ఏదన్నా ఉపాయం ఉన్నదా?" అన్నాడు.

"ధర్మరాజా, అన్నం ఆదిత్యమయం. నువు సూర్యుణ్ణి ఆరాధించి, సూర్యుడి మహిమ చేత ఈ బ్రాహ్మణులను పోషించు," అని ధౌమ్యుడు ధర్మరాజుకు సూర్యస్తోత్రం ఉపదేశించాడు.

ధర్మరాజు కొన్ని రోజులు నిష్ఠగా సూర్యారాధన చెయ్యగా సూర్యుడు ప్రత్యక్షమై, ఒక రాగి పాత్రను ఇచ్చి, "ధర్మరాజా,

చెట్టున్న చోటికి చేరుకుని, ఆ రాత్రికి ఆ చెట్టు కింద నిలిచారు. చుట్టు పక్కల గ్రామాల నుంచి అనేకమంది బ్రాహ్మణులు వారి వద్దకు వచ్చి, అనేక పుణ్యకథలు చెప్పి ఆ రాత్రి వెళ్ళిపోయారు.

తెల్లవారగానే పాండవులు గంగాస్నానం చేసి, అరణ్య మార్గాన బయలుదేరబోతూ ఉన్న సమయంలో, భిక్షాటన వృత్తిగా గల బ్రాహ్మణులు కొందరు, ధర్మరాజు వెంట అరణ్య వాసానికి వస్తామన్నారు.

"మాకు ఉన్నదంతా పోయి, నియమానికి కట్టుపడి అరణ్యవాసం చెయ్యబోతున్నాం. అరణ్యాలలో మీరెలా జీవిస్తారు? నా కారణంగా మీరు బాధలు



ఇది అక్షయపాత్ర. ద్రౌపది కాయలనూ, దుంపలనూ వండి ఇందులో ఉంచితే, వనవాసం పన్నెండేళ్లూ, నీకూ, నీ అతిథులకూ కావలిసిన ఆహారమంతా ఇందులో లభిస్తుంది," అని చెప్పి మాయమయాడు.

ధర్మరాజు ఆ అక్షయపాత్రను ద్రౌపదికి ఇచ్చాడు. అది మొదలు ద్రౌపది కాయగూరలు వండి అందులో ఉంచితే, అందులో నుంచి అన్నిరకాల ఆహారాలూ అంతు లేకుండా లభిస్తూ ఉండేవి.

తరవాత పాండవులు గంగా తీరాన్ని వదిలిపెట్టి పడమటగా అరణ్యాల వెంబడి బయలుదేరి యమునా, దృషద్వతీ నదులు గడిచి, సరస్వతీనదీ తీరాన గల కామ్యక వనం ప్రవేశించారు. అది చాలా అందమైన ప్రదేశం. అక్కడ అనేకమంది మునులు ఉంటున్నారు.

పాండవులు ఇలా కామ్యకవనంలో ఉండగా, హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి, "విదురా, పాండవులు వనవాసం పోయిన తరవాత ప్రజలు మనకు దూర దూరంగా ఉంటున్నారు. వాళ్ళు మనకేదైనా అపకారం చేస్తారో ఏమో! వాళ్ళను చేరదీసే ఉపాయం ఏదన్నా ఉంటే చెప్పు," అన్నాడు.

"రాజా, ధర్మార్థ కామాలకు ధర్మం మూలం. నువు ధర్మం పాటించి, పాండవులనూ, నీ కొడుకులనూ కూడా కాపాడుకో. పాండవుల రాజ్యాన్ని శకుని ద్వారా దుర్యోధనుడు మోసం చేసి కాజేశాడు. పాండవులు నీ కొడుకులందరినీ నిర్మూలించ గల వాళ్ళు. ధర్మరాజుకు రాజ్యం ఇచ్చి, దుర్యోధన శకుని కర్ణాదులు ధర్మరాజును కొలవనీ. నిండు సభలో దుశ్శాసనుడి చేత ద్రౌపదికీ, భీముడికీ క్షమాపణ చెప్పించు. ధర్మరాజు క్షమాపణ ఆమోదిస్తాడు. నన్ను సలహా అడిగావు గనక చెప్పాను," అని విదురుడు అన్నాడు.

ధృతరాష్ట్రుడు, కోపం వచ్చి, "నా కన్న కొడుకును పరాయివాళ్ళ కోసం ఎట్లా వదులుకుంటాను? నువు ఈ మాట చెప్పదగిన

దేనా? నేను నిన్ను ఎంత మర్యాదగా చూస్తున్నా నీ కుత్సితబుద్ధి మారదు. నా కొడుకుల బాగు చూడలేవు. నీవి అన్నీ దురాలోచనలు. అవి వింటే నేను నాశన మవుతాను. ఎప్పుడూ పాండవులను ఆకాశాని కెత్తుతావు. వాళ్ళ దగ్గిరికే వెళ్ళి ఉండు. లేదా, నీ యిష్టం వచ్చిన మరో చోటికి వెళ్ళు." అన్నాడు.

వెంటనే విదురుడు రథం తెప్పించి, పాండవులున్న కామ్యకవనానికి వెళ్ళాడు.

విదురుడు వెళ్ళే సమయానికి ధర్మరాజు చుట్టూ బ్రాహ్మణులను పెట్టుకుని, కొలువు తీరి ఉన్నాడు. అతను విదురుణ్ణి దూరానే చూసి, భీముడితో, "జూదంలో మనం మన ఆయుధాలు ఓడ లేదు గాదూ? వాటిని గెలుచుకునేటందుకు మళ్ళీ జూదం ఆడ రమ్మని పిలవటానికి దుర్యోధనుడూ, శకునీ విదురుణ్ణి పంపించారల్లే ఉన్నది. లేకపోతే విదురుడు పనిపెట్టుకుని ఇక్కడికి ఎందుకు వస్తున్నట్టు? విదురుడు పిలిస్తే నేను రాకుండా ఉండనని వాళ్ళ ఉద్దేశమేమో! ఏమైనా ఇక నేను జూదం ఆడలేను. అర్జునుడి గాండీవమూ, నీ గదా వాళ్ళు జూదంలో గెలుచుకున్నారంటే ఇక మనకు రాజ్యం ఆశ లేదు!" అన్నాడు.

ఇంతలో విదురుడు దగ్గిరికి వచ్చాడు. రాజు మొదలైన వాళ్ళు లేచి ఆయనకు



ఎదురు వెళ్ళి, నమస్కారం చేసి తీసుకు వచ్చి కూర్చోబెట్టి, ఆయన వచ్చిన పని అడిగారు. ధృతరాష్ట్రుడు తనను హితం అడగటమూ, తాను చెప్పటమూ, అది రుచించక ధృతరాష్ట్రుడు తనను వెళ్ళగొట్టటమూ విదురుడు ధర్మరాజుకు తెలిపాడు. అలా అయితే, తన వద్దనే ఉండి, అడుగడుగునా తనకు ఆలోచన చెప్పమన్నాడు ధర్మరాజు విదురుడితో.

విదురుడు కామ్యకవనంలో పాండవులను చేరుకున్నట్టు ధృతరాష్ట్రుడికి తెలిసింది. విదురుడి సలహాతో పాండవులు ఎంత లాభం పొందుతారో అనిపించి ధృతరాష్ట్రుడికి మూర్ఛ వచ్చింది. కొంతసేపటికి ఆయన స్పృహ



తెచ్చుకుని, సంజయుడితో, ''సంజయా, విదురుడు నా తమ్ముడు. నా స్నేహితుడు. ఎంతో బుద్ధిమంతుడు. కొంచెం కఠినంగా మాట్లాడానని అలిగి, కామ్యకవనానికి వెళ్ళి, పాండవుల దగ్గిర చేరాడు. అతను లేకపోతే నా బుద్ధి పని చెయ్యకుండా ఉన్నది. నువు వెంటనే వెళ్ళి, విదురుణ్ణి తీసుకురా,'' అన్నాడు పశ్చాత్తాపంతో ఏడుస్తూ.

సంజయుడు కామ్యకవనానికి వెళ్ళి, విదురుణ్ణి తీసుకు పోవటానికి వచ్చినట్టు ధర్మరాజుతో చెప్పి, విదురుడితో, ''మహానుభావా, మీరు వచ్చినది మొదలు ధృతరాష్ట్రుడి ప్రాణాలు గిలగిలా కొట్టుకుంటున్నాయి. మిమ్మల్ని తీసుకు రమ్మని నన్ను పంపాడు. మీరు వచ్చి ఆయన ప్రాణాలు నిలబెట్టండి,'' అన్నాడు.

విదురుడు ధర్మరాజు అనుమతి పొంది, సంజయుడి వెంట హస్తినాపురానికి వచ్చాడు. ధృతరాష్ట్రుడు విదురుణ్ణి కౌగలించుకుని, ''నువు చాలా మంచివాడివి. నా మాట పాటించి తిరిగి వచ్చావు. ఇన్ని రోజులూ ఏమీ తోచక కొట్టుకున్నాను. నా తప్పులు క్షమించు,'' అన్నాడు.

దానికి విదురుడు, ''నీ ఆజ్ఞ అయిందని వచ్చాను. నేను నీకు హితమైన మాటలే చెప్పాను. నాకు వాళ్ళూ ఒకటే, వీళ్ళూ ఒకటే. కాకపోతే, వాళ్ళు దీనస్థితిలో ఉన్నారు గనక వారిపై జాలి హెచ్చు. అది న్యాయమే కూడానూ,'' అన్నాడు.

విదురుడు మళ్ళీ తన తండ్రిని చేరుకునే సరికి దుర్యోధనుడు కర్ణ శకుని దుశ్శాసనులను పిలిపించి, ''మళ్ళీ విదురుడు వచ్చాడు. ఆ పాండవ పక్షపాతి తండ్రికి ఏమి సలహా చెబుతాడో తెలీదు. పాండవులు తిరిగి వచ్చారో, నేను ఆత్మహత్య చేసుకుంటాను,'' అన్నాడు.

శకుని దుర్యోధనుడితో, ''మూఢుడిలాగా మాట్లాడకు. నీ తండ్రి రమ్మన్నా పాండవులు రారు. ఒకవేళ వచ్చినా, మళ్ళీ ధర్మరాజు చేత జూదం ఆడించి, దేబెలను చేసి పంపేద్దాం,'' అన్నాడు.

దుర్యోధనుడి కీ మాట రుచించలేదని గ్రహించి కర్ణుడు శకుని దుశ్శాసనులతో "మనం యుద్ధసన్నద్ధులమై ఇప్పుడే బయలు దేరి పోయి, అరణ్యంలో అసహాయులుగా ఉన్న పాండవులను చంపి వద్దాం. వాళ్ళు బతికి ఉన్నంతకాలమూ మనకు శత్రువులే. ఇప్పుడు కాకపోతే తరవాత వారిని గెలవటం కష్టం," అన్నాడు.

ఈ మాటలకు అందరూ సంతోషించి, సైన్యంతో సహా పాండవుల మీదికి యుద్ధా నికి వెళ్ళ నిశ్చయించారు.

సరిగా ఈ సమయంలో వ్యాసుడు ధృత రాష్ట్రుడి వద్దకు వచ్చి, "దుర్యోధనాదులు మాయ జూదంలో పాండవులను రాజ్య భ్రష్టులను చేసి, అరణ్యాలకు పంపటం నాకేమీ బాగా లేదు. ఇప్పుడు అరణ్యంలో ఉన్న ఆ పాండవుల మీదికి నీ కొడుకు యుద్ధానికి పోబోతున్నాడు. వెళ్ళాడో, భంగ పడి వస్తాడు. నీ కొడుకు చేత ఈ ప్రయత్నం మాన్పించు. నువూ, భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ ఈ అధర్మాన్ని జరగనిస్తున్నా రెందుకు?" అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "మహానుభావా, ఈ జరిగినదంతా మా కెవరికీ ఇష్టం లేదు. కాని పుత్ర ప్రేమ చేత దుర్యోధనుడికి అడ్డు పడ లేకుండా ఉన్నాను. మీరే వాడికి బుద్ధి చెప్పండి," అన్నాడు.



"నేను వెళ్ళాలి. ఇక్కడికి మైత్రేయు డనే ముని వస్తున్నాడు. అతనే నీ కొడుక్కు చెప్పవలసినది చెబుతాడు," అంటూ వ్యాసుడు వెళ్ళిపోయాడు.

వ్యాసుడు చెప్పినట్టే మైత్రేయమహా ముని కొద్ది రోజులకు హస్తినాపురం చేరి, ధృతరాష్ట్రుణ్ణి చూశాడు. ధృతరాష్ట్రు డాయ నకు సమస్తోపచారాలూ చేసి, "మహాత్మా, మీరు ఎక్కడి నుంచి వస్తున్నారు?" అని అడిగాడు.

"నేను తీర్థయాత్రలు చేస్తూ కామ్యక వనానికి వెళ్ళి, అక్కడ పాండవుల వద్ద కొన్ని రోజులుండి, నిన్ను చూసి పోదామని ఇలా వచ్చాను. పాండవులు జడలు దాల్చి,

నారబట్టలు కట్టి, ఆకులూ, అలములూ తింటూ ఆ అరణ్యంలో నా నా కష్టాలూ పడుతున్నారు," అన్నాడు మైత్రేయుడు.

వెంటనే ధృతరాష్ట్రుడు, "మునీశ్వరా, పాండవులు క్షేమంగా ఉన్నారు గద? వాళ్ళు నియమాన్ని ఉల్లంఘించే ఆలోచనలో లేరు గద?" అని అడిగాడు.

"వాళ్ళు లోకాలు తల కిందైనా చేసు కున్న నియమాన్ని తప్పరు. అలాటి వాళ్లకు నీ కొడుకు ద్రోహం చేశాడు! జూదం గురించి అంతా విన్నాను," అని మైత్రే యుడు దుర్యోధనుడితో, "అయ్యా, నీకే మన్నా కాస్త బుద్ధి ఉంటే పాండవుల స్నేహం సంపాదించుకో. వాళ్ళు మహా శూరులు. కామ్యకవనంలో భీముడు కిమ్మీరు డనే భయంకర రాక్షసుణ్ణి చంపాడు. అతను బకుణ్ణీ, హిడింబుణ్ణీ, జరాసంధుణ్ణీ చంపిన సంగతి మీకూ తెలును. ద్రుపదుడి లాటి బలవంతులు వాళ్ళకున్నారు. కృష్ణుడు వాళ్ళపక్షం. అలాటి వాళ్ళతో నీకు విరోధం దేనికి?" అన్నాడు.

దుర్యోధనుడు ఈ మాటలు విని వేళా కోళంగా తన చేతులతో తొడలు చరుచుకుని, చేతులు పై కెత్తి, కాలి బొటన వేలితో నేల రాచాడు. అది చూసి మైత్రేయుడు కోపించి, "ఆ తొడలు భీముడి గదతో విరుగుగాక!" అని శపించాడు.

ధృతరాష్ట్రుడు ఆందోళనగా, "స్వామీ, అలా జరగకుండా అనుగ్రహించండి," అన్నాడు.

"దానికి ఒకటే మార్గం: నీ కొడుకు పాండవులపై పగమాని, సఖ్యంగా ఉండ టమే," అన్నాడు మైత్రేయుడు.

"మహాత్మా, కిమ్మీరు డనేవాణ్ణి భీముడు చంపాడన్నారే, ఆ సంగతి కాస్త చెప్పండి," అని ధృతరాష్ట్రుడు అడిగాడు.

"అది నేను చెప్పను. విదురుణ్ణి అడిగితే అతను చెబుతాడు. నేను వెళ్ళి వస్తాను," అంటూ మైత్రేయమహాముని వెళ్ళిపోయాడు.

"భీముడు కిమ్మీరుణ్ణి చంపాడుగా!" అని విచారిస్తూ దుర్యోధనుడు సభామందిరం నుంచి అవతలికి వెళ్ళిపోయాడు.





# మహాభారతం

## 28. కిమ్మీర వధ

మైత్రేయుడు వెళ్ళిపోయాక ధృతరాష్ట్రుడు విదురుణ్ణి కిమ్మీరవధ గురించి చెప్ప మన్నాడు. విదురుడు ఆ వృత్తాంతం ఈ విధంగా చెప్పాడు:

అరణ్యావాసానికి బయలుదేరిన పాండవులు మూడు రోజులు ప్రయాణం చేసి, అర్ధరాత్రివేళ కిమ్మీరవనంలో నుంచి పోతూ ఉండగా ఒక భయంకర రాక్షసుడు మెరిసే గుడ్లతో, నోరు తెరుచుకుని, చేతులు చాచి, వారి దారికి అడ్డంగా నిలిచి కని పించాడు. వాడి ఎర్రని కనుగుడ్లూ, తెల్లని కోరపళ్ళూ, నెత్తిమీద బంగారం రంగులో నిక్క బొడుచుకుని ఉన్న వెంట్రుకలూ, నల్లని శరీరమూ భయంకరంగా ఉన్నాయి. వాడి రంకెలకు అరణ్యమృగాలు బెదిరి పారిపోతున్నాయి. వాడి చేతులో మండు తున్న కొరవి ఉన్నది.

పాండవులూ, వారివెంట ఉన్న ద్రౌపదీ, బ్రాహ్మణ బృందమూ ఆ రాక్షసుణ్ణి చూశారు. దౌప్రది వాణ్ణి చూసి భయంతో కళ్ళు మూసుకున్నది. పాండవులు ఆమెకు ధైర్యం చెప్పసాగారు. ధౌమ్యుడు రాక్షసవినాశన మంత్రాలు చదవ నారంభించాడు.

ధర్మరాజు ఆ రాక్షసుడితో, "నువు ఎవడవు? ఈ వనంలో ఎందు కున్నావు?" అన్నాడు.

దానికి రాక్షసుడు, "నేను బకాసురుడి తమ్ముణ్ణి. నా పేరు కిమ్మీరుడు. ఈ కామ్య కవన మంతా నేను యథేచ్ఛగా సంచరిస్తూ ఉంటాను. మనుషులను చంపి తింటాను.



అందు చేత మనుషులెవరూ ఈ ప్రాంతాలకు రారు. మీ రిక్కడికి ఎందుకు వచ్చారు? వచ్చారు గనక మిమ్మల్ని అందర్నీ ఇప్పుడే తినేస్తాను," అన్నాడు.

ధర్మరాజు వాడితో, "మేము పాండవులం. నా పేరు ధర్మరాజు. వీళ్ళు నలుగురూ నా తమ్ముళ్లు. ఒక నియమానికి లోబడి మేము వనవాసం చెయ్యటానికి బయలు దేరి వస్తున్నాం," అన్నాడు.

కిమ్మీరుడిది విని, "ఎట్లాగూ? ఇతడేనా భీముడు? ఈ భీముణ్ణి చంపాలని చాలా కాలంగా ఎదురు చూస్తున్నాను. ఇవాళ నా పంట పండింది. ఇతను మా అన్నను బకుణ్ణి చంపాడు, నా స్నేహితుడైన హిడింబుణ్ణి చంపి, వాడి చెల్లెలు హిడింబను కాజేశాడు. ఈ దుర్మార్గుడు బుద్ధితక్కువ తనం చేత మనుషులు ప్రవేశించ కూడని ఈ మహారణ్యంలోకి వచ్చి, నాకు దొరికాడు. ఇతని నెత్తురు బకహిడింబులకు తర్పణం చేస్తాను. మీ అందరి ఎదటనే ఈ దుర్మార్గుడి నెత్తురు తాగి, మాంసం తిని మాజాతి పగ తీర్చుకుంటాను," అన్నాడు.

ధర్మరాజుకు చాలా కోపం వచ్చి, "ఛీ. నోరు మూసుకో!" అన్నాడు. భీముడు ఒక చెట్టు పెరికి, కిమ్మీరుడి మీద కలియ బడటానికి సిద్ధమయాడు. అర్జునుడు గాండీవానికి తాడు తగిలించి మీటి, బాణాలు సవరించాడు. భీముడు అర్జునుణ్ణి వారిస్తూ, "నువు ఆగు. ఈ దుర్మార్గుణ్ణి ఇప్పుడే యమపురానికి పంపేస్తాను," అంటూ తన చేతిలో ఉన్న చెట్టు కిమ్మీరుడి మీదికి విసిరాడు.

కిమ్మీరుడు ఆ దెబ్బకు అలిగి, తన చేతిలో ఉన్న కొరవి భీముడి పైన విసిరాడు. భీముడు దాన్ని ఎడమకాలితో నలిపేశాడు. తరవాత ఆ ఇద్దరూ చెరొక చెట్టూ పీకి కొట్లాడ నారంభించారు; తరవాత రాళ్ళతో ఒకరి నొకరు కొట్టుకున్నారు; చివరకు కలియబడ్డారు; ఒకరి నొకరు రక్కుకు న్నారు, చాలా దారుణంగా పోట్లాడారు. చివరకు రాక్షసుడి బలం తగ్గిపోవటం గమ

నించి భీముడు వాణ్ణి చంకలో ఇరికించుకుని గిరగిరా తిప్పి, కింద పడేసి నడుముమీద కాలువేసి తొక్కి వాడి తలా, చేతులూ పట్టుకుని విరిచి చంపాడు. వాడు అతిదారుణంగా రంకెలు పెడుతూ చచ్చాడు. భీముడు వాడి శవాన్ని దూరంగా పారేశాడు. ఆ అరణ్యానికి వాడి పీడ లేకుండా చేశాడు. తరవాత ద్రౌపదీ, ధౌమ్యుడూ భీముణ్ణి ఎంతగానో అభినందించారు.

కిమ్మీరవధ ఇలా జరిగిందని విదురుడు చెప్పేసరికి ధృతరాష్ట్రుడు నిట్టూర్పులు విడుస్తూ, తలవంచుకుని విచారంలో మునిగిపోయాడు.

పాండవులు అధర్మమైన జూదంలో ఓడి అరణ్యాలలో ఉన్న మాట తెలిసి, యాదవులూ, పాంచాలులూ వారిని చూడవచ్చారు. యాదవులను వెంటబెట్టుకు వచ్చిన కృష్ణుడు కంట తడిపెట్టుకుని, క్రోధావేశంతో, "పాపాత్ములైన దుర్యోధన శకుని కర్ణుల రక్తంతో భూమి తడవాలి. అటువంటి అధర్మపరులను చంపటం ఉత్తమ ధర్మం. వారందరినీ ఒక్కపెట్టున చంపి, ధర్మరాజుకు రాజ్యాభిషేకం చేద్దాం," అన్నాడు.

ద్రౌపది తన వాళ్ళయిన ధృష్టద్యుమ్నుడు మొదలైన పాంచాలులను వెంట బెట్టుకుని కృష్ణుడి వద్దకు వచ్చి, తనకు కౌరవులు చేసిన పరాభవాలను చెప్పుకుని కుమిలి కుమిలి ఏడ్చింది.

కృష్ణుడు ఆమెను ఓదార్చుతూ, "ద్రౌపదీ, నిన్ను అవమానించిన ఆ దుర్మార్గులు





నశించి తీరుతారు. వారి భార్యలు నీకన్న మరింతగా దుఃఖసముద్రంలో మునుగుతారు. త్వరలోనే పాండవులు రాజాధిరాజులవుతారు. నువు వారిపట్టమహిషివి అవుతావు," అన్నాడు.

ద్రౌపదిని అర్జునుడూ, ధృష్టద్యుమ్నుడూ కూడా ఓదార్చారు.

తరవాత కృష్ణుడు ధర్మరాజుతో, "ఆ సమయంలో నేను ద్వారకలో ఉండినట్టయితే, పిలవని పేరంటంగానైనా మీరాడిన జూదం చూడటానికి వచ్చి, సహాయపడి ఉండే వాణ్ణి. అసలు నేనుంటే ఆ జూదం జరిగేది కాదు. దుర్యోధనుడు జూదం మానకపోతే అక్కడే వాడికి శాస్తి చేసి ఉండేవాణ్ణి. నేను ద్వారకకు తిరిగి రాగానే యుయుధానుడు నాకు మీ విషయాలన్నీ చెప్పాడు. వెంటనే మిమ్మల్ని చూడటానికి బయలుదేరి వచ్చాను," అన్నాడు.

"ఆ రోజులలో నువు ద్వారకలో ఎందుకు లేవు? ఎక్కడికి వెళ్ళావు?" అని అడిగాడు ధర్మరాజు.

"రాజసూయయాగ మప్పుడు శిశుపాలుణ్ణి నేను చంపానని నా మీద అతని తమ్ముడు సాళ్వుడు పగపట్టాడు. వాడుండే సౌభనగరం మీదికి యుద్ధానికి వెళ్ళాను," అని కృష్ణుడు ఆ కథ అంతా ఈ విధంగా చెప్పాడు:

కృష్ణుడు రాజసూయయాగ మప్పుడు శిశుపాలుణ్ణి చంపాడన్నది సాళ్వుడికి తెలియగానే, అతను సౌభ మనే విమానం మీద ద్వారక పైకి వచ్చి దాడి చేశాడు. అప్పుడు కృష్ణుడింకా ఇంద్రప్రస్థంలోనే ఉన్నాడు. అందు చేత, తమ నగరాన్ని ముట్టడించిన సాళ్వుడితో యుద్ధం చెయ్యటానికి ఉగ్రసేనుడు సన్నాహాలు చేసి, దుర్గరక్షణకుగాను శూరులను నియమించి, యుద్ధం చెయ్యటానికి గదుడూ, సాంబుడూ మొదలైన వారిని పంపాడు. యుద్ధం జరిగింది. అందులో ప్రద్యుమ్నుడు గొప్ప పరాక్రమం చూపి, సాళ్వుడి సేనలను చిందర వందర చేశాడు.

ఇంతలో కృష్ణుడు ఇంద్రప్రస్థం నుంచి ద్వారకకు తిరిగి వచ్చాడు. జరిగిన సంగతి విని అతను, సాళ్వుణ్ణి చంపిగాని ద్వారకలో అడుగుపెట్టనని శపథం చేసి, యుద్ధ సన్నద్ధుడై బయలుదేరాడు. ఈ సంగతి తెలిసి సాళ్వుడు తన సౌభ విమానంమీద సముద్ర తీరానికి పారిపోయాడు. కృష్ణుడు వాణ్ణి తరుముతూ వెళ్ళాడు.

సాళ్వుడు తన విమానాన్ని సముద్రానికి ఎగువగా ఆకాశంలో నిలిపి, నవ్వుతూ కృష్ణుణ్ణి యుద్ధానికి ఆహ్వానించాడు.

కృష్ణుడు సాళ్వుడిపై వేసిన బాణం ఒక్కటీ తగల లేదు, కాని వాడువేసే బాణాలు కృష్ణుడి సేనమీద వర్షంలాగా వచ్చి పడ్డాయి. ఇది చూసి విమానంలో ఉన్న సాళ్వుడి అనుచరులు చప్పట్లు కొట్టారు. ఆ ధ్వనిని బట్టి కృష్ణుడు బాణాలు వేసి కొందరిని చంపగలిగాడు. కాని విమానం సహాయంతో సాళ్వుడు మాయాయుద్ధం జయప్రదంగా సాగించాడు. కృష్ణుడి సారథి అయిన దారుకుడికి కూడా తమకు విజయం కలగదని సందేహం కలిగింది.

ఈ దారుణపరిస్థితిలో కృష్ణుడున్న చోటికి కృతవర్మ పంపిన దూత ఒకడు వచ్చి, సాళ్వుడు అదృశ్యంగా ద్వారక ప్రవేశించి, కృష్ణుడి తండ్రి అయిన వసుదేవుణ్ణి చంపేసినటు వార్తతెచ్చాడు. కృష్ణు డీ వార్తను ఎలా



నమ్మటమా అని ఆలోచిస్తూ ఉండగా వసుదేవుడి శవం ఆకాశం నుంచి కింద పడటం అతనికి కనిపించింది. వెంటనే కృష్ణుడు నీరసించి, రథంలో ఒక పక్కకు ఒరిగిపోయాడు. అతని చేతినుంచి విల్లు జారిపడిపోయింది. కృష్ణుడి సేనలో హహాకారాలుపుట్టాయి.

ఇదంతా సాళ్వుడి మాయ అని కృష్ణుడు గ్రహించటానికి కొంత సేపు పట్టింది. సాళ్వుడి మాయలన్నీ అర్థం చేసుకుంటూ కృష్ణుడు చాలా దీర్ఘమైన యుద్ధం చేసి, చిట్టచివరకు తన చక్రాయుధం ప్రయోగించి, సాళ్వుడి విమానాన్నీ, సాళ్వుణ్ణీ, అందులో ఉన్న వారందరినీ నాశనం చేశాడు. కృష్ణుడు



ఈ యుద్ధంలో జయించి ద్వారకకు తిరిగి వచ్చేసరికి, పాండవులు అరణ్యాలకు వెళ్లిన వార్త తెలిసింది. వెంటనే అతను పాండవులను చూడవచ్చాడు.

పాండవులను చూడవచ్చిన యాదవులూ, పాంచాలులూ, కైకేయులూ తిరిగి వెళ్ళిపోయారు.

పాండవులు వనవాసం చేస్తూ, రాగల యుద్ధం గురించి ఆలోచనలు చేశారు. ఒక నాడు ధర్మరాజు అర్జునుడితో, "అర్జునా, పూర్వం వృత్రాసురుడి దెబ్బకు తట్టుకోలేక దేవతలందరూ తమతమ అస్త్రాలను ఇంద్రుడి వద్ద ఉంచారు. ప్రతిస్మృతి అనే విద్యను వ్యాసమహాముని నాకు చెప్పాడు. నువ్వు దానిద్వారా ఇంద్రుణ్ణి మెప్పించి ఆ అస్త్రాలను సంపాదించుకురా. రేపు దుర్యోధనుడి పక్షాన భీష్మ, ద్రోణ, కర్ణాదులు నిలిచి యుద్ధం చేస్తారు. వారిని గెలవటం ఎలాగా అని నేను ఆలోచిస్తూ ఉంటే వ్యాసమహాముని ప్రత్యక్షమై నాకు ప్రతిస్మృతి అనే విద్య ప్రసాదించి, దానిని నీ కివ్వమన్నాడు. నా నుంచి దాన్ని నువు తీసుకుని పునశ్చరణ చేసి, ఇవాళే ఉత్తరంగా బయలుదేరి వెళ్ళు," అన్నాడు.

అర్జునుడు ధర్మరాజు నుంచి ప్రతిస్మృతి గ్రహించి, అగ్నిని ఆరాధించి ప్రదక్షిణం చేసి, కవచమూ, గాండీవమూ, అక్షయతూణీరాలూ ధరించి, ధౌమ్యుడికీ, ధర్మరాజుకూ ప్రదక్షిణ నమస్కారాలు చేసి, సెలవు పుచ్చుకుని బయలుదేరాడు.

ద్రౌపది అతన్ని సాగనంపటానికి కొంత దూరం వెంట వచ్చి, "నువు వెళ్ళేపని సఫలం అగుగాక. నువు లేనిలోటు మమ్మల్నందరినీ బాధిస్తుంది. నీ క్షేమం కోరుతూ, నీ రాకకోసం ఎదురు చూస్తూ ఉంటాం. మా కష్టసుఖాలన్నీ నీ మీదే ఆధారపడి ఉన్నాయి. విఘ్నాలు లేకుండా వెళ్ళినపని చేసుకురా," అన్నది.

అర్జునుడు అరణ్యాల వెంబడి ప్రయాణం చేస్తూ దారిలో తగిలిన హిమాలయాన్నీ, గంధమాదన పర్వతాన్నీ దాటి, ఇంద్ర

కీలాద్రి చేరాడు. అతను అతివేగంగా ముందుకు సాగిపోతూండగా, "ఆగు!" అన్నమాట వినిపించింది.

ఆ నిర్జన ప్రదేశంలో ఎవరు మాట్లాడారా అని అర్జునుడు చుట్టూ కలయజూసే సరికి, ఒక చెట్టు నీడను ఒక తపస్వి కనిపించాడు. ఆయన పింగళవర్ణదేహం కలిగి, బక్క చిక్కి కూడా బ్రహ్మతేజస్సుతో వెలుగుతున్నాడు.

అర్జునుడు ఆయన వద్దకు వెళ్ళి నిలబడ్డాడు.

"నాయనా, నువ్వెవరు? యుద్ధానికి వెళ్ళేవాడిలాగా కవచమూ, ఆయుధాలూ ధరించి ఈ వనంలో ఎందుకు తిరుగుతున్నావు? ఇక్కడ గొప్ప గొప్ప తపస్వులు, ఇంద్రియాలను జయించినవారు ఉంటారు. ఇలాటి చోట ఈ ఆయుధాలెందుకు? అందు చేత వీటిని అవతల పారెయ్యి," అన్నాడు ఆ తస్వి.

అర్జునుడు అందుకు సమ్మతించ లేదు. తపస్వి ఎంత చెప్పి కూడా ప్రయోజనం లేకపోయింది. అప్పుడా తపస్వి, "నాయనా, నీ పట్టుదలకు సంతోషించాను. నేను ఇంద్రుణ్ణి. ఏం వరం కోరుతావో కోరుకో!" అన్నాడు.

అర్జునుడు ఇంద్రుడికి నమస్కారం చేసి, "దేవా, నాకు దివ్యాస్త్రాలన్నీ ప్రసాదించు," అన్నాడు.

దానికి ఇంద్రుడు, "వెర్రివాడా, నీ కిక అస్త్రాలెందుకు? పుణ్యలోకాలే ఇస్తాను. హాయిగా సుఖించు," అన్నాడు.

"మా అన్నలూ, తమ్ములూ అరణ్యాలలో పడరానిపాట్లు పడుతూ ఉంటే, నే నొక్కణ్ణీ సుఖించనా? నా వల్ల కాదు. నేను క్షత్రియుణ్ణి. చచ్చిన తరవాత కూడా, నా కీర్తి నిలిచి ఉండాలి. అంతేగాని సుఖంకోసం అపకీర్తి పాలుకాలేను," అన్నాడు అర్జునుడు.

ఇంద్రుడు అర్జునుడి మంచితనాన్ని మెచ్చుకుని, "నాయనా, నీ కోరిక నెరవేరాలంటే నీకు ముందు శివుడి దర్శనం కావాలి. వెళ్ళి ఆయన దర్శనం చేసుకో," అని చెప్పి అంతర్ధానమయాడు.





# మహాభారతం

శివుడి దర్శనం చేసుకోమని సలహా చెప్పి ఇంద్రుడు అదృశ్యం కాగానే అర్జునుడు శివుణ్ణి ఆరాధించ నిశ్చయించుకుని ముందుకు సాగాడు. అతనికి అమితమనో హరమైన వనం ఒకటి తగిలింది. అందులోని చెట్లు చాలా అందంగా ఉన్నాయి. పూలనుంచి సువాసనలు వస్తున్నాయి. శివుణ్ణి గురించి తపస్సు చెయ్యటానికి అది చాలా అనుకూలమైన ప్రదేశంగా అర్జునుడికి తోచింది.

అర్జునుడు జడలు ధరించి, నారబట్టలు కట్టి, నాలుగు నెలలపాటు శివుణ్ణి గురించి అతి దారుణమైన తపస్సు చేశాడు. అతని నుంచి దారుణమైన వేడి పుట్టి, వనమంతా పొగ చుట్టవేసింది. అది చూసి ఆ వనంలో ఉండే ఋషులు శివుడి వద్దకు వెళ్ళి, అర్జునుడి కోరిక తీర్చి, అతని తపస్సు మాన్పించమని బతిమాలుకున్నారు. శివుడు వారితో, అర్జునుడి కోరిక తీర్చబోతున్నాననీ, భయపడ వద్దనీ చెప్పి పంపేశాడు.

ఋషులు వెళ్ళిపోగానే శివుడు కిరాతుడి వేషం ధరించాడు. పార్వతీ, ప్రమథులూ అతని అనుచరులకు తగిన వేషాలు ధరించారు. అందరూ కలిసి, అర్జునుడు తపస్సు చేసుకునే వనంలో విహరించసాగారు.

ఇదే సమయంలో మూకుడు అనే రాక్షసుడు పంది రూపంలో అర్జునుడి మీదికి చంపటానికి వచ్చాడు. తపస్సు చేసుకునే అర్జునుడు విల్లూ, బాణాలూ తీసుకుని ఆ పందిని చంపబోయాడు.

29. ఊర్వశీశాపం



ఇంతలో, కిరాతుడి రూపంలో ఉన్న శివుడు అర్జునుడితో, "ఒరే, ఆ పందిని నేను కొడతాను, నువ్వు కొట్టకు!" అన్నాడు.

అర్జునుడు ఆ మాట లక్ష్యపెట్టక, పందిని బాణంతో కొట్టాడు. కిరాతుడు కూడా దాన్ని తన బాణాలతో కొట్టాడు. ఇద్దరి బాణాలూ తగిలి, ఆ రాక్షసుడు నిజ స్వరూపంతో బయటపడి చచ్చాడు.

అప్పుడు అర్జునుడు కిరాతుడితో, "ఎవరు నువ్వు? నిర్జనమైన ఈ వనంలో ఆడదాన్ని వెంట బెట్టుకుని ఎందుకు తిరుగుతున్నావు? నన్ను చంపటానికి వచ్చిన ఈ రాక్షసుణ్ణి నేను కొట్టుతుంటే, నాతో సమంగా నువ్వు కూడా ఎందుకు బాణాలు వేశావు? ఇది వేటగాడి ధర్మం కాదు. ఇలా చేసినందుకు నేను నిన్ను చంపేస్తాను!" అన్నాడు.

కిరాత వేషంలో ఉన్న శివుడు అర్జునుడి మాటలకు నవ్వి, "నేను ఆడవాళ్ళను వెంట వేసుకు తిరుగుతున్నానని నీ కెందుకు విచారం? ఇది మా ఆటవికుల ధర్మం. నిర్జనమైన ఈ అరణ్యంలో నువ్వెందుకున్నావు? నువ్వు చూడబోతే నాగరికుడవుగానూ, సుకుమారంగానూ ఉన్నావు. ఈ పంది మాటంటావా? దాన్ని ముందు కొట్టిన వాణ్ణి నేను. నేను కొట్టిన పందినే నువ్వు కొట్టావు. బలమున్నదిగదా అన్న పొగరుతో నన్ను తప్పు పట్టుతున్నావు. అంత బలవంతుడవైతే నాతో యుద్ధానికి రా!" అంటూ అర్జునుణ్ణి రెచ్చగొట్టాడు.

అర్జునుడు అలిగి కిరాతుడి మీద వరసగా బాణాలు వేశాడు. కాని కిరాతుడు వాటిని లక్ష్యపెట్టక, "ఇవేం బాణాలు? ఇంతకన్న మంచి బాణాలు లేవా? ఇంతకన్న బాగా యుద్ధం చెయ్యలేవా?" అన్నాడు.

అమోఘమైన తన అస్త్రాలను లక్ష్యపెట్టని ఈ కిరాతుడు మాయా వేషంలో ఉన్న మహనీయు డెవడో అయి ఉంటాడని అర్జునుడికి అనుమానం కలిగింది. మామూలు కిరాతుడైతే ఎప్పుడో పోయి ఉండేవాడు. ఏమయినా అర్జునుడు వెనకాడకుండా కిరాతుడి పైన బాణ వర్షం కురి

పించాడు. కొద్ది సేపట్లోనే అక్షయతూణీ రాలు ఖాళీ అయిపోయాయి!

అగ్నిదేవుడు ప్రసాదించిన అక్షయ తూణీరాలు ఖాళీ అయిపోవటం అర్జునుడి అనుమానాన్ని మరింత చేసింది. అయినప్పటికీ అతను వెనకాడక తన గాండీవం మొనతో ఆ కిరాతుణ్ణి పొడిచి చంపబోయాడు. మరుక్షణం గాండీవం మాయమయిపోయింది! దాన్ని కూడా లక్ష్యపెట్టక అర్జునుడు కత్తి దూసి దానితో కిరాతుణ్ణి కొట్టాడు. కత్తి ముక్కలు ముక్కలై కింద పడింది.

అర్జును డిప్పుడు నిరాయుధుడు. అతను కిరాతుడి పైన చెట్ల కొమ్మలు విసిరాడు, రాళ్ళు రువ్వాడు. అర్జునుడు ఏది ప్రయోగించినా కిరాతుడు మటుకు చలించ లేదు. అప్పుడు అర్జునుడు కిరాతుడిపై కలియబడి, పిడికిళ్ళతో కొట్టసాగాడు. కిరాతుడు కూడా అర్జునుణ్ణి పిడికిళ్ళతో పొడిచాడు.

కిరాతుడి దెబ్బలకు అర్జునుడికి స్పృహ తప్పింది. అతను స్పృహ తెలిసి లేస్తూనే స్నానం చేసి, మట్టితో చేసిన శివలింగం మీద పూలగుత్తి ఉంచి, కొంచెం సేపు ధ్యానించి, లేచి కిరాతుడి కేసి చూసేసరికి, లింగం మీద తానుంచిన పూలగుత్తి కిరాతుడి నెత్తిన కనిపించింది.

ఇది చూడగానే అర్జునుడికి మొదట ఆశ్చర్యమూ, తరవాత సంతోషమూ కలి



గాయి. తాను ఇంతసేపూ యుద్ధం చేసిన కిరాతుడు శివుడేనని గ్రహించి, అర్జునుడు సాష్టాంగపడి, స్తోత్రం చేశాడు.

అప్పుడు శివుడు అతని భక్తికి మెచ్చుకుని, "అర్జునా, నీ వంటి శూరుడు మూడు లోకాలలోనూ మరొకడు లేడు. నీ భక్తికి మెచ్చాను. తేజస్సులో నువు నా అంత వాడివి. నా దివ్యాస్త్రాన్ని నీ కిస్తాను. దాన్ని ప్రయోగించటానికైనా, స్వీకరించటానికైనా నువు అర్హుడివి. దాని మహిమతో నువు శత్రువులను జయిస్తావు." అని చెప్పి అర్జునుడికి దర్శన మిచ్చాడు.

అర్జునుడు శివుడి కాళ్ళపైన పడి తన అజ్ఞానాన్ని క్షమించ మని వేడుకున్నాడు.



ఆ మహావీరులను జయించటానికి గాను నాకు పాశుపతాస్త్రమూ, బ్రహ్మశిరోనామాస్త్రమూ కావాలి. వాటిని నాకు అనుగ్రహించు," అని అర్జునుడు అన్నాడు.

శివుడు అర్జునుడికి పాశుపతాస్త్రం ప్రయోగమూ, ఉపసంహారమూ ఎలా చెయ్యాలో మంత్రసహితంగా తెలిపాడు. గాండీవమూ, అక్షయ తూణీరాలూ అతనికి తిరిగి లభించాయి. శివుడు పార్వతితో సహా అదృశ్యమయాడు.

అర్జునుడికి ఎక్కడ లేని శక్తి వచ్చినట్టయింది. తనకు అపూర్వమైన పాశుపతాస్త్రం లభించింది, ఈశ్వర దర్శనం లభించింది. ఈశ్వరుడి స్పర్శచే తన శరీరం పవిత్రమయింది.

అంతలో, లోకపాలకులైన ఇంద్ర, యమ, వరుణ, కుబేరులు తమ భార్యలతోసహా, అర్జునుడు ఉన్నచోటికి వచ్చి, తమ అస్త్రాలు అతనికిచ్చారు. ఇంద్రుడు మాత్రం అర్జునుణ్ణి స్వర్గానికి ఆహ్వానించి, అక్కడ అతనికి దివ్యాస్త్రాలు ఇస్తానన్నాడు.

మరి కొంత సేపటికి అర్జునుడి కోసం ఇంద్రుడి రథం వచ్చింది. దానికి సారథి అయిన మాతలి, "అర్జునా, నీ కోసం ఇంద్రుడు ఈ రథం పంపాడు. ఆయన దేవతలతోనూ, గంధర్వులతోనూ, ఋషులతోనూ, అప్సరసలతోనూ కొలువు దీరి,

శివుడు అర్జునుణ్ణి కౌగలించుకుని, అతని చెయ్యి పట్టుకుని, "అర్జునా, పూర్వజన్మలో నువు నరుడనే ఋషివి. అనేక వేల సంవత్సరాలపాటు నువూ, నారాయణుడనే ఋషీ బదరికాశ్రమంలో తపస్సు చేశారు. మీ రిద్దరూ అనేక మంది దుష్టరాక్షసులను చంపి, దేవేంద్రుడి పదవి నిలబెట్టారు. అప్పుడు నీ చేత ఉండిన ధనుస్సే ఇప్పుడు మళ్ళీ నీ వద్ద ఉన్నది. నా మాయచేతనే నీ గాండీవమూ, అక్షయ తూణీరాలూ మాయమయాయి. నీ కోరిక లేమిటో చెప్పు, తీర్చుతాను," అన్నాడు.

"మహేశ్వరా, నాకు భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనులతో యుద్ధం కలగబోతుంది.

నీ రాకకోసం ఎదురు చూస్తున్నాడు." అన్నాడు.

ఇంద్రుడి రథం ఎక్కటంమాట అటుంచి, తాకటానికైనా, తనకు అర్హత లేదేమోనని అర్జునుడికి అనిపించింది. అయినా, ఇంద్రుడి అనుజ్ఞ అయింది గనుక ఎక్క దలచి, ముందు మాతలిని ఎక్కమని, తర వాత తాను రథం ఎక్కాడు.

రథం ఆకాశంలోకి లేచి, సిద్ధమార్గాన పోసాగింది. దారిలో అర్జునుడికి కనిపించిన విమానాలలో స్వయంప్రకాశం గల రాజ ర్షులూ, యుద్ధాలలో చనిపోయిన శూరులూ, సిద్ధులూ, గంధర్వులూ, అప్సరోగణాలూ కనిపిస్తే, వారు ఎవరెవరైనదీ మాతలి అతనికి వివరించి చెప్పాడు.

కొంత సేపటికి అర్జునుడికి అమరావతీ నగరం అంత దూరాన కానవచ్చింది. దాని వెలుపలి ద్వారం మీద ఎత్తయిన గోపురం ఉన్నది. అది చూస్తేనే అర్జునుడికి పరమా నందమయింది. నగరంలోపల నందన వనంలో అప్సరలు విహరిస్తున్నారు.

అర్జునుడి రథం అమరావతీ నగరం ప్రవేశించగానే దేవతలు ఇంద్రుడి ఆజ్ఞపై అతనికి ఎదురు వచ్చారు. గంధర్వులూ, సిద్ధులూ, అప్సరలూ అతనికి మంగళోప చారాలు చేశారు. నారదుడు మొదలుగా గల దేవర్షులు అర్జునుణ్ణి ఆశీర్వదించారు.



అర్జునుడు మొగసాల వద్ద రథం దిగి, ప్రాకారాలుదాటి, దేవేంద్రుడి సుధర్మ అనే సభ ప్రవేశించాడు.

అక్కడ దేవేంద్రుడు నిండు కొలువులో ఉన్నాడు. ఆయన చుట్టూ గంధర్వులు స్తోత్రపాఠాలు చేస్తున్నారు. వేదఘోష వినిపిస్తున్నది; సిద్ధ, చారణ, మరుత్తులూ, విశ్వేదేవతలూ, అశ్వినులూ, ఆదిత్యులూ, వసువులూ, రుద్రులూ, బ్రహ్మర్షులూ, రాజర్షులూ ఉన్నారు. ఇంద్రుడి పైన తెల్లని గొడుగున్నది. ఆయనకు వింజామరలు వీస్తున్నారు.

అర్జునుడు ఇంద్రుడి వద్దకు వెళ్ళి ప్రణామం చేశాడు. ఇంద్రుడు అతన్ని కౌగ



లించుకుంటూ లేవదీసి, తన సింహాసనం
మీద తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు.
ఆయన తన కొడుకైన అర్జునుడి కేసి మళ్ళీ
మళ్ళీ చూస్తూ ఎంతో మురిసిపోయాడు.
నారదుడు వీణవాయించాడు, తుంబురుడు
పాడాడు; అప్సరసలు నృత్యాలు చేశారు.

తరవాత దేవతలు ఇంద్రుడి ఆజ్ఞపైన
అర్జునుడికి అర్ఘ్యపాద్యాలు ఇచ్చి, అంద
మైన విడిదిగృహానికి అతన్ని తీసుకు
పోయారు. అర్జునుడు స్వర్గంలో చాలాకాలం
ఉండి, దేవతాస్త్రాల ప్రయోగ, ఉపసంహా
రాలు పూర్తిగా గ్రహించాడు.

ఆ సమయంలో ఇంద్రుడు అర్జునుడికి
చిత్రసేను డనే గంధర్వుడి చేత దేవతల
సంగీతమూ, నృత్యమూ నేర్పించాడు.
అర్జునుడికి స్వర్గంలో ఉన్నా, అరణ్య
వాసం చేసే తనవాళ్ళూ, తనకు దూరమై
పోయిన తల్లీ జ్ఞాపకంవచ్చి మనసు ఎంతో
బాధపడేది.

అర్జునుడికి ఊర్వశిపైన మనసు కలి
గిందని ఇంద్రుడు అపోహపడి, చిత్రసేనుణ్ణి
పిలిచి, "అర్జునుడి కోరిక తీర్చమని ఊర్వ
శితో నా మాటగా చెప్పు." అన్నాడు. అలాగే
చిత్రసేనుడు ఊర్వశితో చెప్పాడు. ఊర్వశికి
అదివరకే అర్జునుడిపైన మోహం కలిగి
ఉన్నది. అందు చేత ఆమె ఇంద్రుడి ఆజ్ఞ
పాలించటానికి ఒప్పుకుని, ఒక నిండువెన్నెల
రాత్రి అర్జునుడి విడిదికి వెళ్ళింది.

అద్భుతంగా సింగారించుకుని, సువాస
నలు చిమ్ముతూ రాత్రివేళ తన విడిదికి
వచ్చిన ఊర్వశిని చూసి అర్జునుడు అదిరి
పడి, ఆమె పాదాలకు భక్తితో మొక్కి,
"దేవీ, నీ రాకకు కారణమేమిటి? నా వల్ల
ఏమి కావాలి?" అని అడిగాడు.

ఊర్వశి తాను వచ్చినపని చెప్పింది.

అర్జునుడు హరిహరీ అని చెవులు మూసు
కుని, "అమ్మా, నువు నాకు కుంతీదేవి
వంటి దానివి, శచీదేవి వంటి దానివి.
మా మూలపురుషుడైన పురూరవుడికి
భార్యవు. నేను నిన్ను తల్లిగానే భావిస్తు
న్నాను," అన్నాడు.

దానికి ఊర్వశి, "అర్జునా, ఈ దేవ లోకంలో మా పద్ధతులు వేరు. మీ భూలోకంలో ఉన్నట్టుగా మాకిక్కడ వావివరసలు లేవు. అందుచేత లేనిపోని అనుమానాలు పెట్టుకోక నాతో సుఖించు." అన్నది.

అర్జునుడు ఆమెతో, "అమ్మా, మీరు దేవతలు. మీరు ఏది చేసినా తప్పు లేదన్న మాట నిజమే. కాని నేను మానవమాత్రుణ్ణి. అందుచేత మీరు చేసేపనులు నేను చెయ్య లేను. నువు నాకు తల్లిలాంటి దానివి. నా మీద ఇతర భావాలు పెట్టుకోక, నన్ను నీ కొడుకు లాగా చూసుకో!" అన్నాడు.

ఆశాభంగం కలగటంతో ఊర్వశికి ఆగ్రహం కలిగింది. ఆమె అర్జునుడితో, "ఓయీ, నేను స్త్రీని. స్వేచ్ఛగలదాన్ని. నిన్ను మోహించి వస్తే, నువు నన్ను తృణీకరించావు. అందుచేత నిన్ను నపుంసకుడివి కమ్మని శపిస్తున్నాను. పేడివై, అంతఃపురంలో ఆడవాళ్ళ మధ్య ఆట పాటలతో కాలక్షేపం చేస్తూ ఉండిపోదువుగాక!" అని శపించి, గిరుక్కున తిరిగి, వెళ్ళిపోయింది.

అర్జునుడు ఆ రాత్రి ఎలాగో గడిపి, మర్నాడు చిత్రసేనుడు రాగానే అతనితో, గడచిన రాత్రి ఊర్వశి తనవద్దకు రావటమూ, తానామె కోరికను తోసిపుచ్చటమూ, ఆమె తనను శపించి వెళ్ళిపోవటమూ వివరించి చెప్పాడు.

ఇదంతా చిత్రసేనుడి ద్వారా విని ఇంద్రుడు అర్జునుడి వద్దకు వచ్చి, "అర్జునా, నువు నిజంగా ఇంత నిగ్రహం కలవాడివని నేను అనుకో లేదు. ఇంత నిగ్రహం గలవారు మహర్షులలో కూడా చాలా అరుదుగా ఉంటారు. ఊర్వశి శాపానికి భయపడకు. మీరు ఒక ఏడాదిపాటు అజ్ఞాతవాసం చెయ్యవలసి ఉన్నది గద. అప్పుడీ శాపాన్ని అనుభవించు. అందువల్ల నీకు మేలే అవుతుంది. ఆ ఏడాది కాగానే నీకు ఊర్వశి శాపం తీరిపోతుంది," అన్నాడు.

ఈ మాటలతో తృప్తి పడి అర్జునుడు చిత్రసేనుడి వెంట తిరుగుతూ స్వర్గంలో కాలం గడిపాడు.






ఇంద్రుడి వద్ద అర్జునుడు ఉండే సమయంలో రోమశు డనే మహర్షి మూడులోకాలూ తిరుగుతూ స్వర్గానికి వెళ్ళి, ఇంద్రసింహాసనంమీద ఇంద్రుడితోబాటు కూర్చుని ఉన్న అర్జునుణ్ణి చూసి అంతులేని ఆశ్చర్యంతో, "ఇతను ఎంత తపస్సు చేస్తే ఇంద్రుడి సింహాసనం మీద కూర్చునే అర్హత లభించి ఉండాలి?" అనుకున్నాడు.

ఆయన ఆశ్చర్యాన్ని గమనించి ఇంద్రుడు చిరునవ్వు నవ్వి, "మునీశ్వరా, ఈ అర్జునుడు సాధారణ మానవుడు కాడు; పూర్వజన్మలో నరు డనే మహర్షి. నారాయణు డనే మహర్షితో కలిసి ఇతను అనేకవేల ఏళ్ళు బదరికావనంలో తపస్సు చేశాడు. నారాయణ ఋషి పూర్వజన్మలో కపిలమహాముని. నరనారాయణులు ఇద్దరూ భూభారం తగ్గించటానికి ఇప్పుడు అర్జునుడుగానూ, కృష్ణుడు గానూ పుట్టి ఉన్నారు. పాతాళంలో ఉన్న నివాతకవచులు దేవతలను చాలా పీడిస్తున్నారు. వారిని ఈ అర్జునుడు నిర్మూలించాలి. అందుకే ఇతన్ని ఇక్కడికి రప్పించాను. నువు భూలోకానికి వెళ్ళి, కామ్యకవనంలో ఉన్న ధర్మరాజుతో, అర్జునుడు స్వర్గంలో నృత్య సంగీతాలు నేర్చుకుంటూ సుఖంగా ఉన్నాడని చెప్పు." అన్నాడు.

రోమశమహాముని ఇంద్రుడు చెప్పిన ప్రకారం భూలోకానికి బయలుదేరాడు.

అర్జుడు స్వర్గానికి వెళ్ళాడనీ, దివ్యాస్త్రాలు సంపాదించుకున్నాడనీ ధృతరాష్ట్రుడికి

**30. పాండవుల తీర్థయాత్రలు**



వ్యాసుడు తెలిపాడు. వెంటనే ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి పిలిచి, "విన్నావా, సంజయా? అర్జునుడు స్వర్గానికి వెళ్ళి దివ్యాస్త్రాలు సంపాదించాడట! దుర్యోధనుడి దుర్బుద్ధి వల్ల ఎటువంటి ప్రమాదం ఏర్పడిందో చూడు! పాపం, ప్రజలు ఎలాంటి ఆపదలు పొందుతారో! ధర్మరాజూ, అర్జునుడూ కలిసి మూడు లోకాలూ జయించగలరు. నా కొడుకులకు చావుమూడింది," అని దిగులుపడ్డాడు.

"అందులో అబద్ధం ఏమీలేదు. ద్రౌపదిని సభకు ఈడ్చి తెచ్చి, అన్నివిధాల అవమానిస్తే, మీ కొడుకుల మీద పాండవులకు పగ ఉండక ఏం చేస్తుంది?" అన్నాడు సంజయుడు.

అర్జునుడు తిరిగి వచ్చేదాకా తీర్థయాత్రలు చెయ్యమని ధౌమ్యుడు ధర్మరాజుకు చెప్పాడు. ధర్మరాజు తన తమ్ములనూ, ద్రౌపదినీ బ్రాహ్మణ బృందాన్నీ వెంట బెట్టుకుని తిరుగుతూ తీర్థయాత్రలు చేయటానికి పోదామనుకుంటూండగా వారి వద్దకు రోమశుడు వచ్చి, "ఇంద్రుడి సభ అయిన సుధర్మకు వెళ్ళాను. సింహాసనం మీద మీ అర్జునుడు ఇంద్రుడితోబాటు కూర్చుని ఉన్నాడు. నా కెంతో ఆశ్చర్యం కలిగింది. అర్జునుడు సుఖంగా ఉన్నాడని మీతో ఇంద్రుడు చెప్పమన్నాడు. అందుకే వచ్చాను. అర్జునుడికి ఇంద్రుడు ఎన్నో దివ్యాస్త్రాలు ఇచ్చాడు. ప్రస్తుతం అతను చిత్రసేను డనే గంధర్వుడి వద్ద నృత్యమూ సంగీతమూ నేర్చుకుంటున్నాడు. ఇంద్రుడు నిన్ను తీర్థయాత్రలు చెయ్యమన్నాడు. నేను ఇదివరకు రెండుసార్లు తీర్థయాత్రలు చేశాను. మళ్ళీ మూడోమారు మీ వెంట వస్తాను," అన్నాడు.

ధర్మరాజుకు చాలా ఆనందమయింది. అర్జునుడు వెళ్ళిన పని సానుకూలమయింది. తాను చేయదలచిన తీర్థయాత్రలనే చేయమని ఇంద్రుడు కబురుపంపాడు. ధర్మరాజు తీర్థయాత్రలకు బయలుదేరే ముందు తన వెంట ఉన్న బలగంలో కొంతమందిని హస్తినాపురానికీ, మరికొంతమందిని

ద్రుపదుడి నగరానికి పంపి, ఆయుధాలూ కవచాలూ గల ఇంద్రసేనుడు మొదలైన వారిని కొద్దిమందిని మాత్రమే దగ్గిర ఉంచుకున్నాడు.

పాండవులు తీర్థయాత్రలు చేసుకుంటూ గోమతీతీర్థమూ, కన్యాతీర్థాలూ, గోతీర్థమూ, బాహుదానదీ తీరమూ, త్రివేణీ, గయా క్షేత్రమూ సేవించారు; అగస్త్యుడి ఆశ్రమానికి వెళ్ళి అక్కడ అగస్త్యుడి కథ విన్నారు.

పూర్వం మణిమంతం అనే పట్టణంలో ఇల్వలుడూ, వాతాపీ అని ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. వాళ్ళు బ్రాహ్మణులకు ఆతిథ్యం ఇచ్చి చంపేస్తూ ఉండేవాళ్ళు. వాతాపి మేకగా మారేవాడు. ఇల్వలుడు ఆ మేకను వండి బ్రాహ్మణ అతిథికి పెట్టి, "వాతాపీ, రా!" అని పిలిచేవాడు. వాతాపి ఆ బ్రాహ్మణుడి పొట్టచీల్చుకుని బయటికి వచ్చేవాడు. బ్రాహ్మణ అతిథి చచ్చేవాడు.

ఇలా ఉండగా అగస్త్యమహాముని విదర్భరాజు కూతురైన లోపాముద్రను పెళ్ళాడి, ఆమె కోరగా ధనం తీసుకురావటానికి బయలుదేరాడు. అగస్త్యుడు ముగ్గురు రాజుల వద్దకు వెళ్ళాడు కాని ఏ ఒక్కడికీ ఖర్చుకు మించిన ఆదాయం లేదు. కాని, మణిమంతంలో ఉండే వాతాపీ, ఇల్వలుడూ అనే వాళ్ళవద్ద చాలా



ధనం ఉంటుందని విని, అగస్త్యుడు అక్కడికి వెళ్ళాడు.

ఇల్వలుడు తన అలవాటు ప్రకారం వాతాపిని మేకగా మార్చి, వాడి మాంసం అగస్త్యుడికి పెట్టాడు. అగస్త్యుడామాంసం తిని త్రేన్చాడు. ఇల్వలుడు, "వాతాపీ,రా!" అని పిలిచాడు.

"ఇంకెక్కడి వాతాపి? వాడు అప్పుడే జీర్ణమైపోయాడు," అన్నాడు అగస్త్యుడు.

ఇల్వలుడు తెల్లముఖం వేసి, అగస్త్యుడికీ, ఆయన వెంట వచ్చిన ముగ్గురు రాజులకూ అంతులేని ధనం ఇచ్చి పంపేశాడు.

అగస్త్యుణ్ణి గురించి ధర్మరాజు ఇంకా ఎన్నో కథలు విన్నాడు.



ఒకసారి వింధ్యపర్వతం సూర్యుడితో, "నువు మేరువు చుట్టూ ఎందుకు తిరుగుతావు? అంతకన్న గొప్పవాడినైన నాచుట్టూ తిరుగు," అన్నది.

"నేను మేరువు చుట్టూ బుద్ధిపూర్వకంగా తిరగటంలేదు, నాకు విధించబడిన మార్గంలో తిరుగుతున్నాను," అన్నాడు సూర్యుడు.

వింధ్యుడికి కోపం వచ్చి, సూర్యచంద్రుల దారికీ, గ్రహాల దారికీ అడ్డంగా పెరిగాడు. లోకం అంధకారమయమై పోయింది. అప్పుడు దేవతలు అగస్త్యుడి వద్దకు వెళ్ళి, "మునీశ్వరా, నీ శిష్యుడైన వింధ్యుడు లోకాన్ని తారుమారు చేసేశాడు. అతణ్ణి అదుపులోపెట్టు," అని వేడుకున్నారు.

అప్పుడు అగస్త్యుడు లోపాముద్రతో సహా వింధ్యపర్వతం వద్దకు వెళ్ళి, "నాయనా, నేను పనిమీద దక్షిణానికి వెళుతున్నాను. దారి ఇయ్యి," అన్నాడు. వింధ్యుడు అగస్త్యుడికి సాష్టాంగపడి దారి ఇచ్చాడు. "నేను తిరిగి వచ్చేదాకా ఇలాగే ఉండు!" అన్నాడు అగస్త్యుడు. ఆ మహాముని దక్షిణం నుంచి తిరిగి రాలేదు, వింధ్యుడు తిరిగి తల ఎత్తనూ లేదు!

కాలకేయులనే రాక్షసులు సముద్రంలో నివసిస్తూ, రాత్రిపూట భూమి మీదికి వచ్చి బ్రాహ్మణులను క్షోభపెట్టసాగారు. సముద్రం ప్రవేశించి కాలకేయులను చంపటం దేవతలకు సాధ్యంకాక, వాళ్ళు అగస్త్యుడి శరణుజొచ్చారు. అప్పుడా ముని సముద్రజలమంతా ఒక్కగుక్కలో తాగేశాడు. కాలకేయులు బయట పడ్డారు. దేవతలు వారితో యుద్ధం చేసి అనేక మందిని చంపారు. చావగా మిగిలిన కాలకేయులు పాతాళంలోకి పారిపోయారు. అప్పుడు వట్టిపోయిన సముద్రం, భగీరథుడు గంగను భూమికి తెచ్చినప్పుడు తిరిగి జలమయమయింది.

అగస్త్యుడి ఆశ్రమం నుంచి బయలుదేరి పాండవులు అనేక తీర్థాలు సేవించుతూ కౌశికీనదీతీరాన్ని చేరి, అక్కడ ఉన్న విశ్వామిత్రుడి ఆశ్రమమూ, దాని అవతల ఉన్న విభాండకుడి ఆశ్రమమూ చూసి,



విభాండకుడి కొడుకైన ఋశ్యశృంగుడి కథ విన్నారు.

అంగదేశాన్ని పాలించే రోమపాదుడు దశరథుడి స్నేహితుడు. ఆయన బ్రాహ్మణులకు ద్రోహం చెయ్యగా బ్రాహ్మణులందరూ ఆ రాజ్యాన్ని పదిలిపోయారు. తరవాత అక్కడ వానలు కురవక క్షామం ఏర్పడింది. అప్పుడు రోమపాదుడు తన మంత్రుల సలహాపై వేశ్యలను పంపి, ఋశ్యశృంగుణ్ణి ఆకర్షించి తన దేశానికి తెచ్చుకుని తన కుమార్తె అయిన శాంతను అతనికిచ్చి పెళ్ళి చేశాడు. ఋశ్యశృంగుడు అడుగు పెట్టగానే అంగదేశంలో ఎప్పటిలాగా వానలు కురిశాయి.

పాండవులు ఇలా అనేక తీర్థాలు సేవిస్తూ మహేంద్రపర్వతం వద్దకు వెళ్ళారు. అక్కడ అకృతవ్రణుడనే వాడు ధర్మరాజుకు పరశురాముడి కథ చెప్పాడు. హైహయ వంశాన పుట్టిన కార్తవీర్యుడు దత్తాత్రేయుడి వరం చేత వెయ్యి చేతులు సంపాదించి, బలమదాంధుడై అనేక ఉపద్రవాలు చేశాడు. ఒకనాడు ఆ కార్తవీర్యుడు పరశురాముడి తండ్రి అయిన జమదగ్ని ఆశ్రమానికి వచ్చి, ఆశ్రమాన్ని ధ్వంసం చేసి, హోమధేనువును పట్టుకుపోయాడు. పరశురాముడు ఆశ్రమానికి తిరిగి వస్తూనే ఈ సంగతి విని, కార్తవీర్యుడితో యుద్ధం చేసి చంపేశాడు. తరవాత కార్తవీర్యుడి కొడుకులు వచ్చి, ఒంటరిగా ఆశ్రమంలో ఉన్న జమదగ్ని గొంతు కోసి వెళ్ళిపోయారు. అప్పుడు పరశురాముడు పగబట్టి ఇరవై ఒక్కమారు ప్రపంచమంతా తిరిగి, కనిపించిన ప్రతి క్షత్రియుణ్ణీ చంపాడు.

పాండవులు ప్రభాసతీర్థాన్ని చేరుకున్నప్పుడు, ఆ వార్త తెలిసి బలరాముడూ, కృష్ణుడూ, ప్రద్యుమ్నుడూ, సాత్యకీ, అనిరుద్ధుడూ మొదలైన యాదవులు వారిని చూడవచ్చారు. ధర్మరాజు యుద్ధంలో కౌరవులనందరినీ చంపి రాజ్యం పొందుతాడని యాదవులు పాండవులకు ధైర్యం చెప్పారు.

యాదవులు ద్వారకకు తిరిగి వెళ్ళినాక పాండవులు తీర్థయాత్రలు కొనసాగించారు. వారు చివరకు గంధమాదనపర్వతం చేరి, అక్కడ అర్జునుడి రాకకోసం ఎదురు చూడ నిర్ణయించుకున్నారు. అది మహాపవిత్రమైన ప్రదేశం, అన్ని పుణ్యస్థలలాలోకీ గొప్పది. అక్కడ పాండవులు నరకాసురుడి అస్థికల గుట్టచూశారు.



వాళ్ళు గంధమాదన పర్వతాన్ని చేర బోతూ ఉండగా భయంకరమైన గాలి బయలు దేరింది. దానితో దుమ్ము లేచి అంతటా అంధకారమయి పోయింది. తర వాత ఆర్భాటంగా మెరుపులతో, ఉరుము లతో కుంభపోతగా వర్షంకురిసింది. తమ్ము తాము రక్షించుకోవటానికి తలా ఒకదారీ అయిపోయారు. తిరిగి తెల్లవారే సరికి తెరిపి ఇచ్చింది. కాని ద్రౌపది నడకప్రయాస వల్లా, వానదెబ్బకూ, చలికీ గడగడవణుకుతూ మూర్ఛపోయింది. ఆమె రాళ్ళమీద పడి పోకుండా నకులుడు పట్టుకుని, ధర్మ రాజును కేకపెట్టాడు. ధర్మరాజూ, భీముడూ, సహదేవుడూ ద్రౌపదిని ఆ స్థితిలో చూసి కొంతసేపు దిగ్భ్రమచెందారు.

ధర్మరాజు ద్రౌపది తలను తన తొడమీద పెట్టుకుని చాలా సేపు దుఃఖించాడు. మిగిలినవాళ్ళు ఆమెకు ఉపచారాలు చేశారు. దారి చాలా కంటకంగా ఉన్నది. ముందుకు సాగేమార్గం కనిపించ లేదు. అప్పుడు భీముడు తలచుకునే సరికి, ఘటోత్కచుడు తన రాక్షసబలగంతో వచ్చాడు. ఘటోత్క చుడు పాండవులనూ, ద్రౌపదినీ ఎత్తు కున్నాడు. మిగిలిన వాళ్ళను రాక్షసులు ఎత్తుకున్నారు. ప్రయాణం అతివేగంగా సాగింది. వాళ్ళు కాలక్రమాన కైలాసం సమీపంలో ఉన్న బదరికాశ్రమం దగ్గిర గంగా ప్రవాహం ఉన్నచోట రాక్షసుల భుజాలమీద నుంచి దిగి, గంగలో స్నానాలు చేశారు. అక్కడే వారు నివాసాలు ఏర్పరచు కున్నారు. అక్కడ ఉండే మునులు పాండ వులకు కందమూలాలతో అతిథిసత్కారం చేశారు.

వాళ్ళు అక్కడ ఆరురోజులున్న తరవాత వారికి గాలి వెంట ఒక దివ్యమైన సువాసన తెలియ వచ్చింది. అంతలోనే పాండవుల మధ్య ఒక అపూర్వమైన పుష్పం పడింది. అది వెయ్యి రేకులుగల ఎర్రకలవపువ్వు. చూడటానికి ఎంతో అందంగా ఉండి, అద్భుతమైన సువాసనలు వెదజల్లుతున్నది.

ద్రౌపది ఆ పుష్పాన్ని తీసుకొని భీముడితో, "దీన్ని ధర్మరాజుకు ఇస్తాను. ఇలాటి పుష్పాలను మనం తీసుకుపోయి కామ్యకవనంలో ఉంచుకుందాం. నా కోసం ఈ పూలను వెతికి తీసుకురాగలవా?" అన్నది.

భీముడు ఆమె కోరిక తీర్చే ఉద్దేశంతో విల్లూ, అంబులపొదీ తీసుకుని, ఏ గాలికి సౌగంధికపుష్పం వచ్చిపడిందో ఆ గాలి వచ్చిన దిక్కుగా బయలుదేరాడు. కోకిలల పాటలూ, తుమ్మెదల ఝుంకారాలూ, సెలయేళ్ళగలగలలూ వింటూ ద్రౌపదిని తలుచుకుంటూ, దారికి అడ్డం వచ్చిన చెట్లను విరుస్తూ, లతలను తెంపేస్తూ, మధ్యమధ్య అరణ్యం దద్దరిల్లేటట్టు సింహనాదాలు చేస్తూ, చాలా దూరం వెళ్ళాడు. ఒకచోట అంతులేని అరటితోట వచ్చింది. ఆ అరటి చెట్లను తోసుకుని పోతూ భీముడు మళ్ళీ సింహనాదం చేశాడు. దానికి భయపడి నీటి పక్షుల గుంపు ఆకాశంలోకి ఎగిరింది. ఆ పక్షులను చూసి, అటుగా నీరున్నదని గ్రహించి భీముడు ఆ దిక్కుగా వెళ్ళి ఒక సరస్సును చేరుకున్నాడు.

భీముడు ఆ సరస్సులో చల్లగా స్నానం చేసి, మళ్ళీ అరటితోట వెంబడి బయలుదేరి, కొంతదూరం వెళ్ళి, భుజాలుచరచుకుని, మరొకసారి సింహనాదం చేశాడు. ఆ అరటితోటలోనే ఉన్న హనుమంతుడు, ఆ సింహనాదం చేసినది భీముడని గ్రహించి, భీముణ్ణి చూడబోతున్నందుకు సంతోషించి, భీముడు వచ్చేదారికి అడ్డంగా పడుకుని, తన తోకను టెక్కెంలాగా పైకి ఎత్తి, దిక్కులు అదిరేలాగా ఒక్కచరుపు చరిచాడు.

ఆ చప్పుడు విని భీముడు హనుమంతుడు ఉన్న చోటికి వచ్చాడు.





# మహాభారతం

హనుమంతుడు అరటితోట మధ్య పడుకుని ఉన్నాడు. ఎర్రని ముఖమూ, పచ్చని కళ్ళూ, బంగారం లాటి శరీరమూ, పెద్ద మూపులూ కలిగి, దారికి అడ్డంగా పడుకుని ఉన్న హనుమంతుణ్ణి చూసి భీముడు ఏ మాత్రమూ భయపడక, దగ్గిరికి వచ్చి సింహనాదం చేశాడు.

హనుమంతుడు కళ్ళు తెరిచి భీముణ్ణి చూసి, చిన్నగా నవ్వుతూ, "నాయనా, ముసలివాణ్ణి. జబ్బువాణ్ణి. అలిసిపోయి సుఖంగా నిద్ర పోతూంటే ఎందుకు లేపావు? నా వంటి జంతువుల మీద నీ వంటి జ్ఞాని భూతదయ చూపవచ్చునే! నీకు పెద్దవాళ్ళను ఆదరించటం కూడా తెలియదు లాగున్నది. అసలు ఇటుగా ఒంటరిగా ఎందుకు వచ్చావు? ముందున్న ప్రదేశం దేవతలు సంచరించేది. అక్కడికి మనుషులు పోరాదు. నా మాట విని తిరిగి వెళ్ళు," అన్నాడు.

"నేను క్షత్రియుణ్ణి. కురువంశాన పుట్టినవాణ్ణి, నా పేరు భీమసేనుడు. నువు ఎవరివి? ఇక్కడ ఎందుకున్నావు? నీ కీ కోతి రూపం ఎలా వచ్చింది? నాకు దారి ఇయ్యి," అన్నాడు భీముడు.

"నేను వానరుణ్ణి, దారి తొలగను. అఘాయిత్యం చెయ్యక, మర్యాదగా తిరిగి వెళ్ళిపో," అన్నాడు హనుమంతుడు.

"దారి తొలగకపోతే అఘాయిత్యం చెయ్యటం కాదు. నీకు అపాయమే చేస్తాను," అన్నాడు భీముడు.

31. సౌగంధిక పుష్పాపహరణం



"అన్నా, నేను చాలా ముసలివాణ్ణి. జబ్బు మనిషిని. కదలలేను. నీకు నిజంగా వెళ్ళాలనే ఉంటే నన్ను దాటిపో." అన్నాడు హనుమంతుడు.

"దాటి వెళ్ళటం చాలా తప్పని నాకు తెలుసు. లేకపోతే, హనుమంతుడు సముద్రాన్ని దాటినట్టు ఎప్పుడో దాటకపోయానా?" అన్నాడు భీముడు.

"ఎవడా హనుమంతుడు? వాడు సముద్రాన్ని ఎందుకు దాటవలసి వచ్చింది?" అని హనుమంతుడు అడిగాడు.

"నా లాగే హనుమంతుడు కూడా వాయు దేవుడి కొడుకు. నాకు అన్న అన్నమాట. చాలా గొప్పవాడు. రాముడి భార్యను లంకాధిపతి ఎత్తుకుపోతే, హనుమంతుడు ఆమెను వెతుకుతూ సముద్రం దాటి లంకకు వెళ్ళాడు. నేను కూడా ఆ హనుమంతుడికి తీసిపోని బలపరాక్రమాలూ, శక్తి కలవాణ్ణి. మంచిగా నాకు దారి ఇయ్యి, లేదా దెబ్బతింటావు." అన్నాడు భీముడు.

హనుమంతుడు భీముడి గర్వం తెలుసుకుని, నవ్వు ఆపుకుంటూ, "నాయనా, నన్నెందుకు బాధిస్తావు? నా తోకను పక్కకు నెట్టి నీ దారిన నువ్వు వెళ్ళు." అన్నాడు.

భీముడు నిర్లక్ష్యంగా ఎడమచేత్తో హనుమంతుడి తోక పట్టి ఎత్తబోయినాడు. కాని అది కదలలేదు. అమితాశ్చర్యంతో అతను హనుమంతుడి తోకను రెండు చేతులా పట్టి, తన కున్న బలమంతా ఉపయోగించి కూడా ఆ తోకను కదల్చలేక పోయాడు.

భీముడికి చచ్చేసిగ్గు వేసింది. అతను చేతులు రెండూ జోడించి, "బాబూ, నా ప్రగల్భాలు మన్నించు. నువ్వు ఏ సిద్ధుడివో, గంధర్వుడివో గాని, మామూలు వానరుడివి మటుకు కావు. అభ్యంతరం లేకపోతే నీ కథ ఏమిటో చెప్పు. నన్ను నీ శిష్యుడుగా భావించుకో!" అన్నాడు.

దానికి హనుమంతుడు, "బాబూ, నేనే హనుమంతుణ్ణి. వాలి సుగ్రీవులకు వైరం వచ్చినప్పుడు సుగ్రీవుడు నా సహాయం కోరి, నాతో స్నేహం చేశాడు." అంటూ

రామాయణం కాలం నాటి తన కథ అంతా వినిపించాడు. చివరకు హనుమంతుడు, "నేను ఇక్కడే ఉంటున్నాను. ఇక్కడ గంధర్వులూ, విద్యాధరులూ కూడా రోజూ రామకథను పాటలు కట్టి పాడుతూ ఉంటే విని సంతోషిస్తూ ఉంటాను. ఈ ప్రదేశం మనుష్యులు రాదగినది కాదు. ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని భీముణ్ణి అడిగాడు.

భీముడు హనుమంతుడికి సాష్టాంగపడి, "మహాత్మా, ఇవాళ నీ దర్శనం చేయటం వల్ల నా జన్మ సార్థకమయింది. సముద్రం దాటిన నాడు నీ రూపం ఎలా ఉన్నదీ చూపి నన్ను ధన్యుణ్ణి చెయ్యి," అన్నాడు.

"ఆ నాటి రూపం ఈ నాడు చూపటం నాకు సాధ్యమా, నాయనా? కాలంతోపాటు సమస్తమూ మారటం లేదా?" అన్నాడు హనుమంతుడు.

అయినా భీముడు వదిలిపెట్టలేదు. అప్పుడు హనుమంతుడు తన శరీరాన్ని భయంకరంగా పెంచాడు. ఆ శరీరం అరటి తోటంతా ఆక్రమించుకుని, ఆకాశం తాకుతున్నట్టుగా ఉంది, సూర్యుడి లాగా ప్రకాశిస్తున్నది. కళ్ళు నిప్పు కణాల లాగా ఉన్నాయి. కోరలు దీర్ఘంగానూ, క్రూరంగానూ ఉన్నాయి. కనుబొమలు దట్టంగా, ముడిపడి ఉన్నాయి. తోక బ్రహ్మాండంగా పెరిగి, నేలను కొట్టుతున్నది.



హనుమంతుడు భీముడితో, "నా రూపం చూశావా, నాయనా? అవసరమైనప్పుడు నా శరీరాన్ని ఇంకా పెంచగలను. శత్రువుల ఎదట ఇంకా భయంకరంగా ఉంటాను. నువు ఆ రూపాన్ని చూడలేవు," అన్నాడు.

భీముడు, "మహాత్మా, దీన్నే చూడలేకుండా ఉన్నాను. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. ఈ రూపాన్ని ఉపసంహరించు," అని బతిమాలుకున్నాడు.

హనుమంతుడు తన మామూలు రూపం ధరించి, భీముణ్ణి కౌగలించుకుని, "నాయనా, ఇది సౌగంధిక వనానికి దారి. వెళ్ళిరా. నీకు శుభం కలుగు గాక. నీకు కష్టం కలిగినప్పుడు నన్ను తలుచుకో. సాహసించి



సౌగంధిక పుష్పాలు కోసేవు! దేవతలతో తగాదా వస్తుంది," అని చెప్పి అంతర్ధానమయాడు.

రెట్టించిన ఉత్సాహంతో భీముడు ముందుకు సాగి, కొండల మధ్యగా ప్రవహించే ఒక నదీతీరాన సౌగంధిక వనాన్ని చూశాడు. వైడూర్యాలను పోలిన నాళాలు గల రకరకాల సౌగంధిక పుష్పాలు సువాసనలు వెదజల్లుతూ ఎంతో అందంగా ఉన్నాయి. ద్రౌపది కోరిక తీర్చటానికి భీముడు ఆ పుష్పాలను కోయబోతూండగా భయంకరాకారులైన రాక్షసుల వంటి కావలావాళ్లు ఆయుధాలు ధరించి, భీముడి వద్దకు వచ్చి, "అయ్యా, నీ వెవరివి? ఆయుధాలుధరించి ఇక్కడికెందుకు వచ్చావు?" అని అడిగారు.

"నేను కురువంశంవాణ్ణి. పాండురాజు కొడుకును. ధర్మరాజు తమ్ముణ్ణి. ఈ సౌగంధిక పుష్పాల కోసం వచ్చాను," అన్నాడు భీముడు.

"ఇది కుబేరుడి వనం. ఇక్కడికి మనుష్యులు రారాదు. కుబేరుడి అనుమతి పొంది కావలసినన్ని పూలు కోసుకుపో," అన్నారు రాక్షసులు.

"కుబేరుడు ఎక్కడ ఉన్నాడో! కాకపోయినా, నాలుగు పూల కోసం నే నతన్ని బిచ్చ మడగాలా? నేను క్షత్రియుణ్ణి. కోరినది బలంతో సాధించటం నా ధర్మం. ఇదేమి కుబేరుడి పెరడు కాదు. ఇది దేవుడు సృష్టించిన చోటు. ఇక్కడ ఒకరిని మరొకరు యాచించేదేమిటి?" అని భీముడు, రాక్షసులు వద్దంటున్నా వినకుండా, సౌగంధిక పుష్పాలున్న కొలనులోకి దిగాడు.

అది చూసి రాక్షసులు భీముడి మీద కలియబడ్డారు. భీముడు తన గద గిరగిరా తిప్పి కొందరు రాక్షసులను చావగొట్టాడు. వారిలో కొందరు వెళ్ళి కుబేరుడితో ఇలా జరిగిందని చెప్పారు.

"భీముణ్ణి పూలు కోసుకోనివ్వండి. నాకేమీ అభ్యంతరం లేదు. మీరు అతనికి అడ్డు వెళ్ళకండి," అని వాళ్ళతో అన్నాడు



కుబేరుడు. ఆ రాక్షసులు తిరిగి వచ్చి చూసేసరికి భీముడు బోలెడన్ని సౌగంధిక పుష్పాలను కోస్తూ కనిపించాడు.

ఈ లోపల ధర్మరాజు, తాము ఉన్న చోట భీముడు కనిపించక పోయేసరికి, "భీముడు ఎక్కడికి వెళ్ళాడు? నువ్వు ఎక్కడికైనా పంపావా ఏమిటి?" అని ద్రౌపదిని అడిగాడు.

భీముడు సౌగంధిక పుష్పాలు తెస్తానని ఈశాన్యంగా బయలుదేరి వెళ్ళినట్టు ద్రౌపది చెప్పింది. అప్పుడు ఘటోత్కచుడు తన పరివారంతో వచ్చి, పాండవులను భీముడున్న చోటికి చేర్చాడు. భీముడు ద్రౌపదికి సౌగంధిక పుష్పాలు ఇచ్చాడు. పాండవులు కుబేరుడి అనుమతి పొంది, అర్జునుడి కోసం ఎదురు చూస్తూ గంధమాదన పర్వతం మీద ఉండి పోయారు. వారందరినీ తిరిగి నరనారాయణాశ్రమం వద్ద చేర్చి ఘటోత్కచుడు తన పరివారంతో సహా సెలవు పుచ్చుకున్నాడు.

ఇలా ఉండగా ఒకనాడు జటాసురుడనే రాక్షసుడు ద్రౌపదిని ఎత్తుకుపోవాలనే దుర్బుద్ధితో, బ్రాహ్మణ వేషం వేసుకుని, ధర్మరాజు వద్దకు వచ్చి, తాను పరశురాముడి శిష్యుడిననీ, సమస్త శాస్త్రాలూ, అస్త్ర విద్యలూ నేర్చినవాడిననీ చెప్పాడు. ధర్మరాజు ఆ మాటలు నమ్మి ఆ రాక్షసుణ్ణి తన వెంట ఉండనిచ్చాడు.

ఒకనాడు భీముడు వేటకు వెళ్ళాడు. రోమశుడూ, ధౌమ్యుడూ, ఇతర మునులూ కాలకృత్యాలు తీర్చుకోవటానికి ఆశ్రమానికి దూరంగా వెళ్ళారు. ఆ సమయంలో జటాసురుడు పాండవుల ఆయుధాలన్నీ కాజేసి, ముగ్గురు పాండవులనూ, ద్రౌపదినీ ఎత్తుకుని పారిపోసాగాడు. సహదేవుడు మాత్రం ఎలాగో వాడి భుజం మీది నుంచి జారి, వాడు కాజేసిన ఆయుధాలలో కత్తి ఒకటి లాగేసుకుని, భీముడి పేరుపెట్టి గట్టిగా అరుస్తూ రాక్షసుడి వెంట పడ్డాడు.

ధర్మరాజు వాడితో, "ఓరీ, దుర్మార్గుడా? ఎందుకిలా అధర్మం చేస్తున్నావు? ధైర్యం

ఉంటే మా ఆయుధాలు మా కిచ్చి, మాతో యుద్ధం చెయ్యి. నీకు మే మేమి కీడు చేశాం? పై పెచ్చు మా అతిథిగా ఉంచుకున్నాం,'' అంటూ ధర్మపన్నాలు ప్రారంభించాడు.

అది చూసి సహదేవుడు, ''పిరికితో మాటలేమిటి? చాతనైతే వాణ్ణి చంపాలి. లేదా వాడి చేతిలో చావాలి. మరో మార్గం లేదు,'' అంటూ రాక్షసుడి మీదికి వచ్చాడు. అంతలోనే భీముడు ఎటు నుంచో వచ్చి పడ్డాడు. జటాసురుడు ధర్మరాజునూ, నకులుణ్ణీ, ద్రౌపదినీ కింద ఉంచి భీముడితో కలియబడ్డాడు. జటాసురుడు బలహీనుడైపోయే దాకా భీముడు వాడితో మల్లయుద్ధం చేసి, చివరకు వాణ్ణి పైకెత్తి, నేల కేసి కొట్టి చంపేశాడు.

అందరూ ఆశ్రమానికి తిరిగి వచ్చారు. అర్జును డింకా రాలేదు. అతను వెళ్ళి అయిదేళ్ళయింది. అతని కోసం నిరీక్షిస్తూ పాండవులు ఆ ప్రాంతాల ఉండే ఇతర పర్వతాలూ, ఆశ్రమాలూ చూస్తూ కాలం వెళ్ళబుచ్చారు.

ఒకనాడు పాండవులు నలుగురూ ఒక చోట కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండగా ఒక విమానం ఆకాశంలో ప్రకాశిస్తూ కనిపించింది. వారున్న కొండ పక్కగా దిగింది. అందులో నుంచి దేవతా పురుషుడు



లాగా అర్జునుడు దిగాడు. స్వర్గం నుంచి తిరిగి వచ్చిన అర్జునుడు అన్నలకు నమస్కరించి, తమ్ముళ్ళను కౌగలించుకుని, వారి పక్కనే కూర్చున్నాడు.

పాండవులు ఇంద్రుడి రథాన్నీ, దాని అందాన్నీ వింతగా చూశారు; దానికి సారథి అయిన మాతలిని గౌరవించి, మర్యాదలు చేశారు; స్వర్గంలోని క్షేమ సమాచారాలు అడిగి తెలుసుకున్నారు. వారి ప్రశ్నల కన్నిటికీ మాతలి తగిన సమాధానాలు చెప్పి, రథాన్ని తిరిగి స్వర్గానికి తీసుకుపోయాడు.

ఇంద్రుడు అర్జునుడికి అనేక దివ్య వస్త్రాభరణాలు ఇచ్చాడు. అర్జునుడు వాటిని ద్రౌపది కిచ్చి, ధర్మరాజు దగ్గిరే కూర్చుని,

స్వర్గంలో తనకు కలిగిన అనుభవాలన్నిటినీ పూసగుచ్చినట్టు వివరించి ఇలా చెప్పాడు:

"దితికి పులోమా, కాలకా అని ఇద్దరు కుమార్తెలు. వాళ్ళు బ్రహ్మను తమ తపస్సు చేత మెప్పించి, తమ సంతతికి దేవదానవుల చేత చావు లేకుండానూ, హిరణ్య అనే గొప్ప నగరం వారికి నివాసంగానూ వరాలు కోరారు. ఆ కారణంగా పౌలోములూ, కాలకేయులూ ఆ నగరంలో ఉంటూ, దేవతలను లక్ష్యపెట్టకుండా జీవిస్తూ వచ్చారు. నేను ఆ రాక్షసులను జయించిన అనంతరం, వారి నగరం ప్రవేశించాను. రథం నడపటం చాలా కష్టమయింది. దారికి అడ్డంగా రాక్షసుల శవాలు గుట్టలుగా పడి వున్నాయి. నగరమంతటా రాక్షస స్త్రీల రోదనం వినిపించింది. రథం చప్పుడు విని ఆ స్త్రీలు ఇళ్ళలో దూరి దాక్కున్నారు. ఆ నగరం మొదట నిర్మించినప్పుడు దేవతల వశంలోనే ఉండేదనీ, ఇంద్రుడు అక్కడ ఉండేవాడనీ, బ్రహ్మ వరం మూలంగా రాక్షసులు దేవతలను వెళ్ళగొట్టి ఆ నగరాన్ని ఆక్రమించుకున్నారనీ మాతలి నాకు చెప్పాడు. పౌలోమ, కాలకేయులను ఎలా నిర్మూలించటం అని ఇంద్రుడు బ్రహ్మను అడగగా, దేవదానవ జాతులకు చెందనివాడి వల్లనే అది సాధ్యమవుతుందని బ్రహ్మ చెప్పాడట. ఇంద్రుడు ఆ పనికి నన్ను నియోగించి, కాలకేయులను చంపటానికే నాకు దివ్యాస్త్రాలను ఇప్పించాడు."

మర్నాడు, అందరూ కాలకృత్యాలు తీర్చుకున్న అనంతరం ధర్మరాజు అర్జునుణ్ణి పిలిచి, అతను సాధించుకు వచ్చిన అస్త్రాలను చూపమన్నాడు. అర్జునుడు శుచి అయి, దేవదత్తమనే తన శంఖం మొదలుకుని తన వద్ద గల దివ్యాస్త్రాలన్నిటినీ చూపించసాగాడు. ఆ సమయంలో నారదుడు వచ్చి అర్జునుడితో, "అర్జునా, ఈ అస్త్రాలను తగిన కారణం లేకుండా ఎన్నడూ ప్రయోగించకు. అందువల్ల చాలా ప్రమాదం ఉంటుంది. యుద్ధంలో వీటిని నువ్వు ప్రయోగించేటప్పుడు నేను వచ్చి చూస్తానులే!" అని చెప్పి వెళ్ళిపోయాడు.






పాండవులు ఒక ఏడాదిపాటు అరణ్య వాసం చేసిన తరవాత అర్జునుడు ఇంద్ర లోకానికి వెళ్ళాడు. అతను అక్కడి నుంచి తిరిగి రావటానికి అయిదేళ్ళు పట్టింది. అతను వచ్చిన అనంతరం మరి నాలుగేళ్ళ పాటు వాళ్ళు గంధమాదన ప్రాంతంలోనే గడిపారు. కుబేరుడి అనుమతితోనూ, కుబేరుడు ఏర్పాటు చేసిన యక్షుల సహాయంతోనూ దివ్యమైన ఆ ప్రదేశాల సౌందర్యం తనివితీరా చూశారు. వారి అరణ్యవాసంలో పదేళ్ళు నిండి, పదకొండో ఏడు మొదలయింది. ఇంక త్వరలో పన్నెండేళ్ళూ పూర్తి అవుతాయి. తరవాత వాళ్ళు అజ్ఞాత వాసం కూడా ముగించి కౌరవుల మీద పగ తీర్చుకుంటారు. పగ తీర్చుకునే సమయం కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నట్టు భీముడు ధర్మరాజుతో పైకే అనేశాడు. పైకి అనకపోయినా, అర్జున నకుల సహదేవులు కూడా ఆత్రంగానే ఉన్నారు.

ఈ సంగతి ధర్మరాజు గ్రహించి, ఈ దేవప్రాంతాలను విడిచి తిరిగి వెళ్ళటానికి నిశ్చయించాడు. భీముడు తలచుకోగానే ఘటోత్కచుడు తన అనుచరులతో సహా వచ్చి, పాండవులను వృషపర్వుడి ఆశ్రమానికి చేర్చాడు. అక్కడి నుంచి వారు బదరికారణ్యానికి వచ్చి, అందమైన ఆ అరణ్యంలో ఒక మాసం ఉండి, కిరాత దేశం చేరి, సుబాహుపురానికి వచ్చి పడ్డారు. ఇంద్రసేనుడూ, విశోకుడూ మొదలుగా గల పాండవ భృత్యులు ఒకప్పుడు అక్కడే

32. భీమ విమోచనం



దిగబడిపోయారు. అక్కడి నుంచి ఘటోత్కచుణ్ణీ, అతని అనుచరులనూ పంపేసి, తమ భృత్యులను కలుపుకుని కాలినడకన హిమాలయాలలో విశాఖయూపం చేరుకున్నారు.

ఈ ప్రాంతంలో వేటాడదగిన మృగాలు ఎన్నయినా ఉన్నాయి. వేట మీది వ్యామోహం కొద్దీ పాండవులు ఒక ఏడాది పాటు ఆ ప్రాంతంలోనే ఉండిపోయారు.

ఒకనాడు భీముడు తగిన ఆయుధాలు తీసుకుని వేటకు బయలుదేరి అనేక మృగాలను చంపుతూ వెళ్ళివెళ్ళి ఒక మహా సర్పాన్ని చూశాడు. అది అకుపచ్చ రంగులో ఉన్నది. దాని నోరు కొండగుహలాగున్నది. అందులో నాలుగు భయంకరమైన కోరలున్నాయి. దాని కళ్ళు ప్రకాశిస్తున్నాయి. దాని నోటి నుంచి విషజ్వాలలు వెలువడి, చుట్టూ ఉన్న చెట్లను మాడ్చేస్తున్నాయి.

అలాటి ప్రళయనాగును భీముడు పాగరుగా ఎదిరించాడు. వెంటనే అది భీముడి శరీరాన్ని బలంగా చుట్టివేసింది. వెయ్యి ఏనుగుల బలం గల భీముడు ఎంత ప్రయత్నించీ దాని పట్టు నుంచి తప్పించుకోలేక నిర్ఘాంతపోయాడు.

ఈలోపల ధర్మరాజు, భీము డెంతకూ తిరిగిరాకపోవటం చూసి, అతను బయలుదేరిన దిక్కు తెలుసుకుని, ద్రౌపదికి రక్షగా అర్జున నకుల సహదేవులను ఉండమని, ధౌమ్యుడితో సహా అరణ్యమార్గాన బయలుదేరాడు. దారి పొడుగునా, భీముడిచేత చచ్చిన మృగాలు గుట్టలుగా పడి ఉండటం చేత దారి వెతుక్కునే అవసరం లేకపోయింది.

అలా పోగా చివరకు ధర్మరాజుకు భీముడు పాము చుట్టలలో అసహాయుడై చిక్కి కనిపించాడు. అతను పోయి అలా పాము నోటిలో ఎందుకు చిక్కుకోవలిసిన అవసరం కలిగిందో ధర్మరాజుకు అర్థం కాలేదు. ఆయన పామును సంబోధించి, "సర్పరాజా, నీకు ఆహారం కావాలంటే



మరేదన్నా అడుగు, ఇస్తాను. ఇతను నా తమ్ముడు, ఇతన్ని వదిలిపెట్టు," అన్నాడు.

దానికా సర్పం, "అయ్యా, నాకు నీ తమ్ముడు దైవికంగా దొరికాడు. నేను అతన్ని వదలను. అతను నా ఆహారం. నువు కూడా ఇక్కడే ఉండిపోయేటట్టుంటే రేపు నిన్ను మింగుతా!" అన్నది.

ఈ జవాబు విని, "నువు ఎవరు?" అని ధర్మరాజు సర్పాన్ని అడిగాడు.

"నేను మీ పూర్వీకుణ్ణి. నా పేరు నహుషుడు. చంద్రుడికి ఏడోతరంవాణ్ణి. బతికి ఉండగా అంతులేని పుణ్యాలు చేసి, అమితమైన తపస్సు చేసి ఇంద్రపదవి సంపాదించాను. ఇంద్రపదవి రాగానే పొగరు తలకెక్కి బ్రాహ్మణులను అవమానించాను. అగస్త్యుడనే ముని నా మీద ఆగ్రహించి, పామువు కమ్మని శపించాడు. అయితే ఆ ముని అనుగ్రహంతోనే నాకు పూర్వస్మృతీ, అంతులేని బలమూ కలిగాయి. ఎవరు నా ప్రశ్నలకు సరి అయిన సమాధానాలిచ్చినా నాకు శాప విముక్తి కలిగేటట్టు కూడా ఆయనే అనుగ్రహించాడు," అని సర్పం అన్నది.

"అలా అయితే నా శక్తికి తగినట్టుగా సమాధానాలిస్తాను. నీ ప్రశ్నలు అడుగు," అన్నాడు ధర్మరాజు.

"బ్రాహ్మణుడంటే ఎలాటివాడు? అతను తెలుసుకోదగినది ఏది?" అని సర్పం అడిగింది.

"నాకు తోచిన సమాధానం చెబుతాను. ఎవడిలో సత్యమూ, దానమూ, ఓర్పూ, తపస్సూ, దయా, కనికరమూ ఉంటాయో వాడు బ్రాహ్మణుడు. వాడు తెలుసుకోదగినది ఏదంటే, దుఃఖం లేనిదీ, సుఖం లేనిదీ అయిన పరబ్రహ్మం," అన్నాడు ధర్మరాజు.

"రాజా, నువు చెప్పిన గుణాలన్నీ శూద్రుడిలో ఉంటే వాణ్ణి బ్రాహ్మణుడనవచ్చునా? సుఖదుఃఖాలకు అతీతమైన పరబ్రహ్మం అన్నావు గదా, సుఖదుఃఖాలకు అతీతమైనది ప్రపంచంలో ఏదీ లేదా?" అని సర్పం మళ్ళీ అడిగింది.

''సత్వాది గుణాలు శూద్రుడిలో ఉంటే వాడు శూద్రుడు కాడు. అవి లేనివాడు బ్రాహ్మణుడూ కాడు. ప్రవర్తనే సర్వోత్తమ మైనది. శీతోష్ణాల మధ్య మరేదీలేనట్టుగా, సుఖదుఃఖాలకు భిన్నమైనది కూడా లోకంలో ఏదీ లేదు. అలాటి ద్వంద్వాలకు అతీతమైనది పరబ్రహ్మం ఒక్కటే అను కుంటున్నాను,'' అన్నాడు ధర్మరాజు.

''ప్రవర్తనే అత్యుత్తమమన్నావు గదా, ప్రవర్తన చేతనే ఎవడైనా బ్రాహ్మణుడయే టట్టుంటే వర్ణాశ్రమాల ఏర్పాటు వృథాయే గదా?'' అని సర్పం అడిగింది.

దానికి ధర్మరాజు, ''మాట్లాడటమూ, పుట్టటమూ, చావటమూ, బిడ్డలను కన టమూ సర్వమానవులకూ సమానమే. అయితే పూర్వం ప్రమాదవశాన జాతిసాంక ర్యం కలిగిన కారణంచేత వర్ణవిభజన అవ సరం అయింది. అంతేగాని, వేదాలు తెలి సినవారికి ప్రవర్తనే ప్రధానం. బ్రాహ్మణ స్త్రీకి పుట్టినవాడు వేదసంస్కారం పొందే వరకూ శూద్రుడితో సమానుడే. తరవాత వాడు సత్వాది గుణాలు అలవరచుకుని బ్రాహ్మణుడవుతాడు. అలాటి గుణాలు గల శూద్రుడు సచ్ఛూద్రుడని స్వాయంభువ మనువు పూర్వం చెప్పాడు,'' అన్నాడు.

అప్పుడు సర్పం, ''నీ సమాధానాలకు సంతోషించాను. నీ తమ్ముణ్ణి నేను కబ



ళించను,'' అంటూ శాపం వదిలి, పూర్వపు నహుష రూపం పొందింది. అంతలో స్వర్గం నుంచి విమానం రాగా, నహుషుడు అందులో ఎక్కి స్వర్గానికి వెళ్ళిపోయాడు. తరవాత ధర్మరాజు భీముణ్ణి వెంటబెట్టు కుని, ధౌమ్యుడితో సహా తమ పర్ణశాలకు తిరిగివచ్చి, మిగిలినవాళ్ళకు జరిగినది చెప్పాడు.

''భీముడికి ఈ దుస్సాహస మేమిటి? ధర్మరాజు ఎంత జ్ఞాని!'' అని అందరూ ఆశ్చర్యపడ్డారు.

పాండవులు వర్షాకాలం వెళ్ళిపోయేదాకా ద్వైతవనంలోనే ఉండి, తమ వెంట బ్రాహ్మణులనూ, పరివారాన్నీ తీసుకుని



బయలుదేరి కామ్యకవనానికి చేరుకున్నారు. అక్కడి ఋషులు వారిని చక్కగా ఆదరించారు.

ఇంతలో పాండవులను చూడటానికి సత్యభామతో సహా కృష్ణుడు వారున్న చోటికి వచ్చాడు. అతను, పాండవులందరూ వింటూ ఉండగా, ధర్మరాజుతో, "రాజా, నువు ఇంతకాలం అడవులలో నివసించి కూడా ఆటవికధర్మాలు అవలంబించక రాజధర్మాన్ని నిలిపావు. ధర్మరాజు అనే పేరు నీకు సార్థకమయింది. మీ నియమకాలం గడవగానే నీ శత్రువులను యముడి వద్దకు పంపటానికి మేమంతా తోడువస్తాము. నువు వైభవంగా రాజ్యమేలుతావన్నది నిశ్చయం," అని, ద్రౌపదితో, "పాంచాలీ, దుర్యోధనుడు మొదలైనవారికి కాలం మూడింది. నీ బిడ్డలను సుభద్ర చక్కగా చూసుకుంటున్నది. ప్రద్యుమ్నుడు వారికి విలువిద్యలు నేర్పుతున్నాడు," అన్నాడు.

ధర్మరాజు కృష్ణుడికి నమస్కరించి, "నువే మాకు దిక్కు. అరణ్యవాసం అయిపోవచ్చింది. నీ దయవల్ల అజ్ఞాతవాసం కూడా పూర్తి చేశామంటే, అటుతరవాత మేము ఏం చెయ్యాలో నువే ఆజ్ఞాపింతువుగాని," అన్నాడు.

కృష్ణుడు పాండవుల వద్ద ఉండగానే అక్కడికి మార్కండేయుడు వచ్చాడు. ఆయన వయసు చాలా దీర్ఘమైనది. కాని చూడటానికి ఇరవైయేళ్ళవాడిలాగా కనిపిస్తూ, గొప్ప తేజస్సుతో వెలిగిపోతూండేవాడు. మార్కండేయుడు అక్కడ చేరినవారికి అనేక కథలూ, అనుసరించవలసిన ధర్మాలూ చెప్పాడు.

ఆశ్రమం వెలపల ఈ గోష్ఠి సాగుతూ ఉండగా ఆశ్రమం లోపల సత్యభామా, ద్రౌపదీ ఏకాంతంగా కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు.

ఆ సమయంలో సత్యభామ ద్రౌపదితో, "నీ భర్తలు దిక్పాలకులకు తీసిపోనివారు గదా, అలాంటివారు అయిదుగురూ నీకు వశులై, ఎన్నడుగాని నీకు అయిష్టం కలగ

కుండా, ఎంతో ఆదరంగా చూడటానికి ఏమిటి కారణం? వారిని వశపరచుకోవటానికి నేమేమైనా నోచావా? మంత్రాలూ, మూలికలూ మొదలైన వశీకరణాలు ప్రయోగించావా? ఆ రహస్యం ఏమిటో నాకు కూడా కాస్త చెప్పావంటే, నేను కూడా నా భర్తను వశపరచుకుంటాను," అన్నది.

దానికి ద్రౌపది, "సత్యభామా, నువు చెప్పే వశీకరణ మార్గాలు చెడ్డస్త్రీలు అవలంబించేవి. కృష్ణుడి వంటివాడికి భార్యవైన నువు ఇలా అడగటమే తప్పు. నన్ను గురించి నీకు సందేహం రావటం కూడా తప్పే. తన భార్య మందులూ, మంత్రాలూ ప్రయోగిస్తుందని తెలిసినాక మగవాడు ఆమెను విషసర్పాన్ని చూసినట్టు చూడడా? పాండవులు నా పట్ల ప్రేమగా-ఉండటానికి కారణాలు చెబుతాను విను. నేను లేనిపోని కోరికలు కోరి, అవి తీర్చకపోతే అలిగి కూర్చోను. భర్తలకు నా మీద విశ్వాసం ఉన్నది గదా అని వారికి జరగవలసిన ఉపచారాల విషయంలో అశ్రద్ధ చెయ్యను. వారి సేవలు నేనే చేస్తానుగాని, పని మనుషులచేత చేయించను. వారికి ఇష్టమైన వంటలు నాచేతి మీదుగా చేసి, నేనే పెడతాను. వారు చెప్పేదానికీ, చేసేదానికీ నేనెన్నడూ ఎదురు చెప్పను. అకారణంగా నవ్వను. నా సవతులను చూసి అసూయ



పడను. ధర్మరాజు ఇంద్రప్రస్థంలో రాజ్యం చేసే కాలంలో రోజూ అనేక వేలమంది బ్రాహ్మణులూ, బ్రహ్మచార్లూ, సన్యాసులూ అతిథులుగా ఉండేవారు. వారికి అన్నీ సక్రమంగా జరిగినదీ, లేనిదీ నేనే స్వయంగా చూసేదాన్ని. అంతేకాదు, పాండవుల ఇతర భార్యలూ, లక్షలాది దాసీజనమూ, పశువుల కాపర్ల దగ్గిర నుంచీ ఎందరో ఉండేవారు; ఆ అందరి యోగక్షేమాలూ నేనే చూసేదాన్ని. చివరకు బొక్కసం జమా ఖర్చులు కూడా నేనే చూసేదాన్ని. కుటుంబ భారమంతా నేనే మోసేదాన్ని. అందుకనే నా భర్తలకు నాపైన అంత విశ్వాసమూ, స్నేహమూనూ. అంతేగాని మందులూ,

మాకులూ, మంత్రాలూ, తంత్రాలూ నా వద్ద ఏమీ లేవు," అన్నది.

సత్యభామ ఈ మాటలు విని, "నిన్ను ఇలా అడిగినందుకు నాకు చాలా పశ్చాత్తాపం కలుగుతున్నది. నా మీద కోపం ఉంచకు. నవ్వులకు అడిగాననుకో," అన్నది.

తరవాత మార్కండేయ మహామునీ, సత్యభామా కృష్ణులూ పాండవుల వద్ద సెలవు తీసుకుని, ఎవరిదారిన వారు వెళ్ళి పోయారు. అప్పుడే పాండవులు కూడా కామ్యకవనాన్ని వదిలిపెట్టి తిరిగి ద్వైత వనానికి వచ్చి, ఒక అందమైన ప్రదేశంలో, ఒక సరస్సుతీరాన పర్ణశాల నిర్మించి, అందులో కాపరం పెట్టారు.

పాండవులు ద్వైతవనంలో ఉంటూం డగా ఆ వనంలో ఉండే ఒక బ్రాహ్మణుడు హస్తినాపురానికి వెళ్ళి, ధృతరాష్ట్రుణ్ణి కలుసు కుని, "మహారాజా, నేను ద్వైతవనం నుంచి వస్తున్నాను. అక్కడ పాండవులు చలికీ, వేడికీ, గాలికీ కూడా గురి అయి నానా అవస్థలూ పడుతున్నారు. లోకాలను జయించగల అయిదుగురు భర్త లుండి కూడా ద్రౌపది అనాథ లాగా అగచాట్లు పడుతున్నది," అన్నాడు.

ఈ మాట విని ధృతరాష్ట్రుడు లోలోపల కుమిలిపోయాడు. ఎందుకంటే, పాండవుల పాట్లన్నిటికీ తన ఉపేక్షే కారణమని అయ నకు తెలుసు. ఆయన ఆ బ్రాహ్మణుడితో, "నా కొడుకు లందరి కన్న కూడా ధర్మ రాజు ఉత్తముడు. అతని మనసులో కోపం అనేది ఉండదు. అర్జునుడు ధర్మరాజుకు విధేయుడు. భీముడు అలా కాదు. అతను మహాబలుడు. అతని మనసులో కోపం ఎప్పుడూ ఉంటుంది. అయితే ధర్మరాజు మాటకు కట్టుపడి ఆ భీముడు విజృంభించ కుండా అణిగి పడిఉన్నాడు. ఇంతకూ నా కొడుకు దుర్యోధనుడు దుష్టబుద్ధి గలవాడు. వాడి దుర్మార్గమే ఇన్ని కష్టాలకూ కారణం. రేపు వాడు ఆ పాండవులకు అర్ధరాజ్యం ఇస్తే ఏ బాధా వుండదు. కాని వాడివ్వడు. అది వాడి స్వభావానికి విరుద్ధం," అంటూ పెద్దగా నిట్టూర్పులు విడిచాడు.





# మహాభారతం

పాండవుల వృత్తాంతం విని ధృతరాష్ట్రుడు పశ్చాత్తాపపడటమూ, రానున్నదానిని గురించి భయపడటమూ శకుని గమనించి, ఆ సంగతి కర్ణుడితో చెప్పాడు. వాళ్ళిద్దరూ దుర్యోధనుడి దగ్గిరికి వెళ్ళి, ముసలిరాజు మథన పడుతున్నమాట చెప్పారు. అది విని దుర్యోధనుడికి దిగులు పుట్టింది.

అప్పుడు కర్ణుడు దుర్యోధనుడితో, "రాజా, నీ తెలివితేటలవల్ల అరణ్యాలలో అష్టకష్టాలూపడుతున్న పాండవులు దిగులు పడాలిగాని, వారి రాజ్యం కూడా వశపరచుకుని మహారాజువై సర్వసౌఖ్యాలూ అనుభవిస్తున్న నీకు దిగులెందుకు? పాండవులిప్పుడు ద్వైతవనంలో ఉన్నారట. ఈ స్థితిలో వాళ్ళ దగ్గిర నీ వైభవం ప్రదర్శించినట్టయితే వాళ్ళు మరింత ఏడుస్తారు. నీ రాణివాసస్త్రీలను చూసి ఆ ద్రౌపది కుళ్ళిపోవాలి," అన్నాడు.

శకుని కర్ణుడు చెప్పినట్టు చేసితీరాలన్నాడు.

ఇద్దరి మాటలూ విని దుర్యోధనుడు, "మీ ఆలోచన ఎంతో బాగున్నది. కాని నా తండ్రి మనని ద్వైతవనం వెళ్ళనిస్తాడా అని నా అనుమానం. అసలే ఆయన పాండవుల స్థితి చూసి పశ్చాత్తాపపడుతున్నట్టు మీరు చెప్పారు గద! అందుచేత మనం పాండవుల కష్టాలు కళ్ళారా చూసి ఆనందించటానికి ఉపాయం ఏదన్నా ఉంటుందేమో. మీరు దుశ్శాసనుడితో కూడా ఆలోచించి రేపు ఉదయం నాకు చెప్పండి.

33. ఘోషయాత్ర



మన ప్రయాణానికి భీష్ముడు కూడా ఒప్పు
కోవలసి ఉంటుంది మరి. ఆ పెద్దవాళ్ళిద్ద
రినీ ఒప్పించే మార్గం ఆలోచించండి,"
అని శకుని కర్ణులను పంపేశాడు.

మర్నాడు కర్ణుడు వచ్చి, శకుని దుశ్శా
సనులు వింటూండగా దుర్యోధనుడితో,
"మన గోవులమందలు ద్వైతవనంలో
ఉన్నాయి. వాటికి క్రూరమృగాల బాధ
లేకుండా రక్షించే ఏర్పాట్లు చూడటం
నీ విధి. అందుచేత, ద్వైతవనానికి ఆ పని
మీద వెళతామంటే ముసలిరాజు తప్పక
ఒప్పుకుంటాడు. మనం ఆర్భాటంగా ద్వైత
వనానికి వెళ్ళి, పాండవులను అడలగొట్టి
పద్దాం," అన్నాడు.

అందరూ చప్పట్లు చరిచి, కర్ణుడి ఆలో
చనను ప్రశంసించారు. వాళ్ళు సమంగు
డనే గొల్లవాణ్ణి పిలిచి, "నువు మా వెంట
పెద్దరాజు దగ్గిరికి వచ్చి, ఆయనతో మన
ఆవులమందలు ద్వైతవనంలో ఉన్నాయని
చెప్పు," అన్నారు.

ఆ గొల్లవాడు దుష్టచతుష్టయం వెంట
ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి, "దేవా, మన
ఆవులమందలు ఇప్పుడు ద్వైతవనంలో
ఉన్నాయి. అక్కడ వాటికి చక్కని మేత
ఉన్నది. మందలు క్షేమంగానే ఉన్నవి
గాని, వాటికి క్రూరమృగాల బాధ ముందు
ముందు లేకుండా కాపాడాలి. ఈ మాట
చెప్పటానికే నేను వచ్చాను," అన్నాడు.

అప్పుడు కర్ణశకునులు ధృతరాష్ట్రుడితో,
"దుర్యోధనుడు అక్కడికి వెళ్ళి క్రూర
మృగాలను వేటాడితే మందలకు క్షేమం
కలుగుతుంది. అదీగాక దూడలకు గుర్తులు
వేయించటమూ, వాటి పోషణ ఏర్పాట్లు
కూడా చూసి రావచ్చు," అన్నారు.

ఆ మాటలు విని ధృతరాష్ట్రుడు, "మంద
లను క్రూరమృగాల నుండి రక్షించటమైతే
మంచిదేగాని, ఈ సమయంలో ద్వైతవనా
నికి వెళ్ళటం మంచి పని కాదు. జూదంలో
ఓడిపోయి వనవాసం చేస్తున్న పాండవులు
ఆ వనంలోనే ఉన్నారు. మీరు అక్కడికి
పోతే ఏదో ఒక దురంతం జరగవచ్చు.

అందులో మీ తప్పేమీ లేకపోయినా, అప కీర్తి మీకే వస్తుంది. మిగిలిన పాండవుల నుంచి భయంలేదుగాని, భీముడు పగ పట్టిన తాచులాటివాడు. ద్రౌపది కూడా అలాటిదే. మీరు కూడా తొందర స్వభావం కలవాళ్ళే. మీకూ మీకూ జగడం వచ్చిం దంటే చాలా ప్రమాదం కలుగుతుంది. ఇటీవలనే అర్జునుడు స్వర్గానికి వెళ్ళి, దివ్యాస్త్రాలు తెచ్చాడట. మీరు అతనికి చాలరు. అందుచేత గోవులరక్షణకు మీరు వెళ్ళక, మరెవరినైనా పంపండి," అన్నాడు.

శకుని ధృతరాష్ట్రుడితో, "మేము ఎలాటి ఒడుదుడుకులూ రానివ్వము. అసలు మేము పాండవులున్న ప్రాంతానికే పోము. కొద్ది రోజులపాటు వనవిహారం చేసి, గోవుల మందలను పరీక్షించి, మా దారిన తిరిగి వచ్చేస్తాము. పాండవులు కూడా ధర్మరాజు మాట మీరి తొందరపాటు పనులు చేయరు. ధర్మరాజు ధర్మమూర్తి గదా!" అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఈ మాటలు నమ్మి, "సరే, వెళ్ళి రండి!" అన్నాడు. దుర్యోధనుడు పరమానందంతో, కర్ణశకుని దుశ్శాసనులను వెంటబెట్టుకుని, అనేకమంది పౌరులూ, వారి భార్యలూ వెంటరాగా ఘోషయాత్ర మీద బయలుదేరాడు. అతని వెంట అనేకవేల రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, సైన్యమూ, వేటగాళ్ళూ, వంది



మాగధులూ బయలుదేరారు. బళ్ళ మీద రకరకాల వస్తుసామగ్రి వచ్చింది.

కొన్ని రోజులకు వీరంతా ద్వైతవనానికి చేరి, శిబిరం ఏర్పాటు చేసుకున్నారు. మందలన్నిటినీ పరీక్షించి, ఆవులనూ, ఎద్దులనూ, ఆబోతులనూ వేరువేరుగా ఏర్పాటు చేసి, అన్నిటికీ గుర్తులువేసి, గోవులను రక్షించేవారికి తగిన హెచ్చరికలు ఇచ్చి, వారికి బహుమానా లిచ్చి, వారి ఆటపాటల వినోదాలు చూసి ఆనందించారు. శిబిరానికి కావలిసిన పాలూ, పెరుగూ వచ్చాయి. వేటగాళ్ళు వేటాడి మాంసం తెచ్చారు.

దుర్యోధనుడు స్త్రీలనూ, కొడుకులనూ, స్నేహితులనూ వెంటబెట్టుకుని వనవిహారం



చేస్తూ, వనసౌందర్యం చూసి ఆనందిస్తూ, ద్వైతవనం మధ్య ఉండే సరస్సు వద్దకు వచ్చి, దాని గట్టున విడిది చేశాడు.

అదే సరస్సు అవతలి గట్టున ధర్మరాజు ఆశ్రమం ఉన్నది. దుర్యోధనుడు చేరిన సమయానికి ధర్మరాజు తన వెంట ఉన్న బ్రాహ్మణుల సహాయంతో సద్యస్క మనే యజ్ఞం చెయ్యటానికి దీక్షలో ఉన్నాడు.

దుర్యోధనుడి ఆజ్ఞప్రకారం అతని సేవకులు సరస్సు ఇవతలి గట్టున కుటీరాలు నిర్మించే ప్రయత్నాలు ప్రారంభించారు. అప్పుడు, సరస్సుకు రక్షకులుగా ఉన్న గంధర్వ భటులు వారికి అడ్డం వచ్చి, "ఇక్కడ ఎవరూ విడియరాదని మా ప్రభువుగారి ఆజ్ఞ. మీరు యీ చోటు వదిలి మరెక్కడనైనా విడుదులు కట్టుకోండి," అన్నారు.

తన సేవకులు వచ్చి ఈ సంగతి చెప్పగానే దుర్యోధనుడు పొగరుగా తన సైనికులను పిలిచి, ఆ గంధర్వ భటులను తరిమి వెయ్యమని ఆజ్ఞాపించాడు. వాళ్ళు వెళ్ళి గంధర్వ భటులతో, "దుర్యోధన మహారాజుగారు ఇక్కడ విహారంచేయ వచ్చారు. మీరు వెళ్ళిపొండి. లేకపోతే మీ ప్రాణాలు దక్కవు." అని భయపెట్టారు.

గంధర్వభటులు నవ్వి, "మీరు ఎవరిని భయపెడదా మనుకుంటున్నారు? మీ మహారాజంటే మేము లక్ష్యపెట్టేవాళ్ళం కాము. మా ప్రభువు చిత్రసేనుడనే గంధర్వరాజు. మీరు మర్యాదగా ఈ చోటు వదిలి, అవతలపక్క ఉన్న ధర్మరాజు ఆశ్రమం పక్కనో, మరొక చోటనో విడుదులు కట్టుకోండి. ఇది మా గంధర్వరాజు విహరించే స్థలం," అన్నారు.

ఈ సంగతి విని దుర్యోధనుడు తోక తొక్కిన తాచులాగా అయి, "నన్ను ఆజ్ఞాపించటానికి గంధర్వు లెవరు?" అని గంధర్వుల మీదికి తన సైన్యాన్ని యుద్ధానికి పంపాడు.

ఈ లోపుగా గంధర్వులు చిత్రసేనుడి ఆజ్ఞపొంది, దుర్యోధనుడి బలాలను తుక్కు

చేసేశారు. ఇదంతా దూరాన్నుంచి చూస్తున్న కర్ణుడు, దుర్యోధనుడు మెచ్చుకో గలందులకు గంధర్వభటుల మీద యుద్ధానికి వెళ్ళి, కొందరు భటులను చంపాడు. కాని అంతలోనే గంధర్వభటులు వేలసంఖ్యలో వచ్చిపడి కర్ణుణ్ణి చుట్టుముట్టారు. అది చూసి దుర్యోనుడి తమ్ములు కర్ణుడికి సహాయం వెళ్ళారు. చిన్న కొట్లాట కాస్తా పెద్ద యుద్ధమై కూర్చుంది. చిత్రసేనుడే స్వయంగా యుద్ధానికి వచ్చాడు.



చిత్రసేనుడు మాయా యుద్ధం ప్రారంభించే సరికి దుర్యోధనుడి సైనికులు పారిపోసాగారు. దుర్యోధనుడి తమ్ములు వాళ్ళను మళ్ళించటం మొదలుపెట్టారు. కర్ణుడు ఒకడే ధైర్యంగా నిలబడి పోరాడాడు. కాని గంధర్వ సైనికులు అతని రథాన్ని ముక్కలు ముక్కలు చేశారు. కర్ణుడు విరథుడై, వికర్ణుడి రథమెక్కి పారిపోయాడు. దుర్యోధనుడు గంధర్వులకు దొరికిపోయాడు. చిత్రసేనుడు దుర్యోధనుణ్ణి చంపక పెడరెక్కలు విరిచికట్టి వశపరచుకున్నాడు. అది చూసి మిగిలిన గంధర్వులు దుర్యోధనుడి తమ్ములనూ, వారి భార్యలనూ పట్టి బంధించారు.

తమ నాయకులను గంధర్వులు చెరపట్టి తీసుకుపోతూ ఉండటం చూసి, కౌరవ సైనికులు ధర్మరాజు ఆశ్రమానికి పరిగెత్తి పోయి అతనితో, "మహాత్మా, కౌరవకుమారులనూ, వారి భార్యలనూ పట్టుకుని గంధర్వులు గంధమాదన ప్రాంతాలకు తీసుకుపోతున్నారు. దయ ఉంచి వారిని విడిపించు," అని మొరపెట్టుకున్నారు.

భీముడీ మాటలు విని, "కాగల పని గంధర్వులే చేశారు! పెద్దపెట్టున సైన్యాలను కూర్చుకుని, యుద్ధం చేసే అవసరం తప్పింది. కష్టాలలో ఉన్న మంచివారికి దేవుడు అలా సాయపడతాడు," అన్నాడు.

ధర్మరాజు భీముణ్ణి మందలిస్తూ, "ఇలా మాట్లాడటానికి ఇదా సమయం? కౌరవులు ఇప్పుడు మనను శరణుజొచ్చారు. వారిని ఆదుకోవటం మన ధర్మం. మన జ్ఞాతుల



భార్యలకు అవమానం జరిగితే మనకు అవమానం కాదా? నేను యజ్ఞదీక్షలో ఉన్నాను గనక, నువ్వూ, అర్జున నకుల సహదేవులూ, మన పరివారాన్ని వెంటబెట్టుకుని గంధర్వులను వెన్నంటి వెళ్ళి, కౌరవుల భార్యలను విడిపించండి. తొందరపడి గంధర్వులతో యుద్ధానికి దిగవద్దు. వీలయితే మంచి మాటలతో పనిచేసుకు రండి. అది సాధ్యం కాకపోతేనే యుద్ధం చెయ్యండి. జ్ఞాపకం ఉంచుకోండి: మన మధ్య కయ్యం వస్తే వారు నూరుగురూ, మనం అయిదుగురమూ; కాని పైవాళ్ళతో కయ్యం వస్తే మనం నూట అయిదుగురం!" అన్నాడు.

అర్జునుడు ధర్మరాజు చెప్పినట్టే చేస్తామని, భీమ నకుల సహదేవులతో యుద్ధానికి సిద్ధమై, వేగంగా పరిగెత్తే రథాలెక్కి, గంధర్వులు వెళ్ళిన దారిన బయలుదేరాడు. కౌరవ సైనికులకు ప్రాణాలు లేచివచ్చాయి.

పాండవులు తమను వెన్నంటి వస్తున్న సంగతి తెలిసి గంధర్వులు ఆగారు. అర్జునుడు వారిని సమీపించి, "ఓ గంధర్వులారా, మీరు పట్టుకుపోతున్న దుర్యోధనుడు మా సోదరుడు. అతన్ని విడిచిపుచ్చండి. ఇది మా అన్న అయిన ధర్మరాజు కోరిక," అన్నాడు.

"ఇలా చేయమని మాకు దేవేంద్రుడి ఆజ్ఞ. ఆయన ఆజ్ఞ పాలించటం మా ధర్మం," అన్నారు గంధర్వులు.

"స్త్రీలను గంధర్వరాజు చెరపట్టటం చాలా అనుచితం. మా మాట విని దుర్యోధనుడు మొదలైనవారినీ, వారి భార్యలనూ విడిచిపెట్టండి. మంచిగా మీరు అలా చేయకపోతే, మీతో యుద్ధం చేసి మావారిని మేము విడిపించుకోవలసి వస్తుంది," అన్నాడు అర్జునుడు.

అయితే గంధర్వులు మంచి మాటలకు లొంగక యుద్ధానికి సిద్ధమయారు.

పాండవులకూ, గంధర్వులకూ యుద్ధం ప్రారంభమయింది. దుర్యోధనుణ్ణీ, అతని తమ్ముళ్ళనూ పట్టుకున్నట్టే, పాండవులను

కూడా పట్టుకోవాలని గంధర్వులు ఆ పాండవులను చుట్టుముట్టారు. కాని పాండవుల మీద ఈ ఎత్తు పారలేదు. అర్జునుడు గంధర్వ సైనికులను తన బాణాలతో తీవ్రంగా గాయపరచసాగాడు; వాళ్ళు తనపై విసిరిన ఆయుధాలను మధ్య దారిలో విరగగొట్టాడు.

యుద్ధం మధ్యలో చిత్రసేనుడు, "అర్జునా, నన్ను గుర్తించలేదా? నేను చిత్రసేనుణ్ణి. నీ స్నేహితుణ్ణి. ఈ దుర్మార్గుడైన దుర్యోధనుడు మీకూ, ద్రౌపదికీ తన వైభవం ప్రదర్శించి, బాధించటానికి ఘోషయాత్ర నెపంతో తన పరివారాన్ని వెంట బెట్టుకుని ద్వైతవనానికి బయలుదేరాడు. అది తెలిసి దేవేంద్రుడు వీళ్ళందరినీ పట్టి, స్వర్గానికి తీసుకు రమ్మని నన్ను పంపాడు. అందుచేత ఆయన అజ్ఞ నిర్వర్తిస్తున్నాను," అన్నాడు.

దానికి అర్జునుడు, "ఇతను దుర్మార్గుడే గాని, మా దాయాది. ఇతన్ని విడిపించుకు రమ్మని మా ధర్మరాజు మమ్మల్ని ఆజ్ఞాపించాడు. నువు మా ధర్మరాజు దగ్గిరికి వచ్చి ఆయన చెప్పినట్టు చేస్తే బాగుంటుంది. నీ మిత్రుణ్ణిగానూ, శిష్యుణ్ణిగానూ ఈ మాట అడుగుతున్నాను," అన్నాడు.

చిత్రసేనుడు అర్జునుడు మొదలైన వారి వెంట ఆశ్రమానికి వచ్చి, ధర్మరాజుతో జరిగినదంతా చెప్పాడు. అంతా విని ధర్మరాజు, "గంధర్వరాజా, మీరు దుర్యోధనుణ్ణి చంపకపోవటం నిజంగా మా అదృష్టం. మా కులానికి గొప్ప ఆపద తప్పింది. మిమ్మల్ని చూడటం నా కెంతో సంతోషంగా ఉంది. మీరు నా విన్నపం మన్నించి దుర్యోధనాదుల నందరినీ విడిచి పుచ్చండి," అని వేడుకున్నాడు.

చిత్రసేనుడు ధర్మరాజు కోరినట్టే కౌరవులను విడిచిపుచ్చి, సపరివారంగా స్వర్గానికి వెళ్ళిపోయాడు.

తరవాత ధర్మరాజు దుర్యోధనుణ్ణి దగ్గిరికి పిలిచి, "బాబూ, ఎప్పుడూ ఇలాటి సాహసం చేయకు. అందువల్ల సుఖం కలగదు. జరిగిన దానికి విచారించక, అంతఃపుర స్త్రీలతో ఇంటికి తిరిగి వెళ్ళు," అన్నాడు.





# మహాభారతం

చావు తప్పి కన్ను లొట్ట పోయినట్టుగా అయి దుర్యోధనుడు తన వారి నందరినీ కలుసుకుని, దుర్భరమైన అవమానంతో కుంగిపోతూ, హస్తినాపురికి ప్రయాణమై, దారిలో ఒక చెరువు ఉండే చోట మజిలీ చేశాడు.

యుద్ధరంగం నుంచి పారిపోయిన కర్ణుడు ఆ మజిలీలో తిరిగి దుర్యోధనుణ్ణి చేరుకుని, జరిగిన సంగతి ఎరగక, "దుర్యోధనా, నీ పరాక్రమం ఎటువంటి దనాలి! ఆ గంధర్వులను జయించి ఇంటికి తిరిగి పోతున్నావా? వాళ్ళు ఉద్దండులు. వాళ్ళకు తట్టుకోలేక నేను వికర్ణుడి రథం మీద పారిపోయి, ఇంతసేపూ ఎక్కడో దాగి ఉండి, ఇప్పుడే వస్తున్నాను. నీ వంటి శూరుడు ప్రపంచంలో మరొకడు ఉండడు," అన్నాడు ఉత్సాహంగా.

కర్ణుడు ఇలా మెచ్చుకునేసరికి దుర్యోధనుడికి దుఃఖం ఆగలేదు. అతను వణుకుతున్న గొంతుతో, జరిగినదంతా కర్ణుడికి చెప్పి, "నేను యుద్ధంలో గెలిచినా కీర్తి వచ్చేది, చచ్చినా వీరస్వర్గం వచ్చేది. రెండూ జరగలేదు. రెంటికీ చెడ్డ రేవడనైనాను. ఈ అవమానం మోసుకుని హస్తినాపురానికి తిరిగి వెళ్ళలేను. నా తండ్రికీ, ద్రోణ కృపాశ్వత్థామలకూ నా మొహం చూపలేను: వాళ్ళతో జరిగినది చెప్పలేను. నా కసలు జీవితం మీద విరక్తి పుట్టింది. చచ్చిపోతాను. నే నిక్కడే ప్రాయోపవేశం చేస్తాను. మీ రందరూ హస్తినాపురానికి



వెళ్ళి పొండి. దుశ్శాసనుడికి పట్టం కట్టి, మీ రందరూ ఉండి రాజ్యం ఏలించండి,'' అంటూ తమ్ముణ్ణి కౌగలించుకున్నాడు. ఇద్దరూ ఏడ్చారు.

కర్ణుడు వారి ఏడుపు చూసి చిరాకు పడుతూ, ''మీ రిద్దరూ దేనికని శోకాలు పెడుతున్నారు? ఏడ్చిన కొద్దీ మరింత ఏడుపే గాని మనశ్శాంతి రాదు. పాండవులు నిన్ను విడిపించారని నువు ఎందుకు కుమిలి పోతున్నావు? నీ పౌరులుగా వారు నీకు సేవ చెయ్యటం వారి ధర్మం. ఇందులో అవమానం ఏమున్నది? చచ్చిపోతానం టావు. ఈ మాట నీ సామంతులకు తెలిస్తే నిన్ను పిరికిపంద కింద జమ కట్టుతారు. పాండవుల కున్నదంతా నువు లాగేస్తే వాళ్ళు ప్రాయోపవేశం చేశారా? ఇలాటి వెర్రి ఆలోచనలు మానుకో,'' అన్నాడు.

వెంటనే శకుని, ''నేను నీకు జూదంలో పాండవుల సర్వస్వమూ గెలిచి పెట్టినది అనుభవించక ప్రాయోపవేశం చేస్తానంటా వేమిటి?'' అన్నాడు.

ఎవరి మాటలూ దుర్యోధనుడి చెవికి ఎక్కలేదు. అతను దర్భలు పరుచుకుని, నారబట్టలు కట్టి, ప్రాయోపవేశం చేశాడు.

దేవతలకు ఓడి పాతాళంలో నివాసం ఏర్పరచుకున్న దానవులకు దుర్యోధనుడి ప్రాయోపవేశ దీక్ష తెలిసింది. వారు దుర్యో ధనుణ్ణి తమ వద్దకు తెప్పించుకోవటానికి గాను అగ్ని చేసి, అథర్వవేద మంత్రాలు చదువుతూ, పాలతో హోమం చేశారు. అప్పుడు ఆ అగ్ని నుంచి కృత్య అనే శక్తి ఒకతె, ఆవులిస్తూ లేచి వచ్చి, దానవుల ముందు నిలబడి, ''నా వల్ల ఏమి కావాలి?'' అని అడిగింది.

''భూలోకంలో దుర్యోధనుడు ప్రాయోప వేశం చేసి ఉన్నాడు. అతన్ని ఈ పాతా ళానికి తీసుకురా,'' అని దానవులు కృత్యతో అన్నారు. కృత్య దుర్యోధనుణ్ణి పాతాళ లోకానికి తెచ్చింది.

దానవులు ఆ రాత్రి అంతా దుర్యోధనుణ్ణి తమ మధ్య ఉంచుకుని, కబుర్లు చెప్పి,

"నీ సామంతులు మహా శూరులు. నువు ఉత్తమ క్షత్రియుడవు. క్షత్రియ ధర్మం విడిచి, ప్రాయోపవేశం చేశావేమిటి? ఇందు వల్ల నీకు ఆత్మహత్య చేసుకున్న పాపం తప్ప ఇంకేమీ లభించదు. సుఖమూ కీర్తీ కూడా దక్కవు. నీ శత్రువులు మాత్రం ఆనందిస్తారు. నిజం చెబుతున్నాము, విను. ఈశ్వరుడి వరం పొంది, వజ్ర సమానమైన నీ శరీరం పై భాగాన్నీ, లోకమాత వరం పొంది, అందమైన నీ శరీరం దిగువ భాగాన్నీ మేమే సృష్టించాం. నువు సాధారణ మానవుడివి కాదు, దేవతామూర్తివి. యుద్ధంలో నీ పక్షాన పోరాడి, నీ శత్రువులను వధించబోయే వారందరూ మా అంశలతో పుట్టినవారే. నీ స్నేహితుడు కర్ణుడు నరకాసురుడి అంశ గలవాడు. అందుచేత నువు విచారించకు," అని అతని మనసుకు ఊరట కలిగించి పంపేశారు. కృత్య అతన్ని తిరిగి భూలోకానికి తెచ్చి, దర్భశయ్య మీద పడుకోబెట్టి అదృశ్యమయింది.

దుర్యోధనుడు నిద్ర లేచి, రాత్రి జరిగినదంతా కల అనుకున్నాడు. దాన్ని గురించి అతను ఎవరికీ చెప్పలేదు.

ఈసారి కర్ణుడు దుర్యోధనుడి మనసు తేలికగానే మార్చగలిగాడు. అతను తన పరివారాన్ని వెంట బెట్టుకుని, వైభవంగా హస్తినాపురానికి తిరిగి వెళ్ళాడు.



నిండు సభలో భీష్ముడు దుర్యోధనుడితో, "వద్దంటే వినక, ఘోషయాత్ర వెళ్ళి, పరాభవం పొందావు. ధర్మరాజు నీ మానం కాపాడి, నీ పట్ల ఉదారంగా ప్రవర్తించాడు. కర్ణుడి మాటలు నమ్మి నువు అలాటి వాడితో వైరం పెట్టుకున్నావు. నువు స్నేహితుడనుకునే కర్ణుడు, నిన్ను గంధర్వుల పాల పెట్టి, తాను యుద్ధరంగం నుంచి పారిపోయాడు. ఇప్పటికైనా పాండవులతో స్నేహం చేసుకుని, వంశాన్ని కాపాడు," అన్నాడు.

దుర్యోధనుడు పకపకా నవ్వి, కర్ణ శకుని దుశ్శాసనులతో సభ నుంచి వెళ్ళిపోయాడు. భీష్ముడి మాటలు కర్ణుడికి తల వంపు కలి



గించాయి. అతను దుర్యోధనుడితో, "రాజా, నాకు సేన ఇయ్యి, భీమార్జున నకులసహదేవులు నలుగురూ కలిసి జయించిన దేశాలన్నిటినీ నేనొక్కణ్ణే జయించి నీకిస్తాను. అప్పుడు ఈ ముసలి భీష్ముడు నన్నింత తేలికగా చూడడు," అన్నాడు. దుర్యోధనుడు సమ్మతించాడు.

కర్ణుడు సేనతో బయలుదేరి, మొట్టమొదటగా ద్రుపదుణ్ణే ఓడించి, కప్పం పుచ్చుకున్నాడు. తరవాత అతను ఉత్తరంగా వెళ్ళి, అంగ, వంగ, కళింగ, మగథ, మత్స్య, కోసల మొదలైన దేశాల రాజులను ఓడించి, అందరి వద్దా కప్పాలు పుచ్చుకున్నాడు. తరవాత కర్ణుడు దక్షిణ జైత్రయాత్ర చేసి, చాలా రాజులను ఓడించాడు. కుండిననగర రాజైన రుక్మి లాటి వాళ్ళు కర్ణుడితో యుద్ధం చెయ్యక స్నేహం చేశారు. ఇలా దిగ్విజయం చేసి, ధనంతో కర్ణుడు కొంత కాలానికి హస్తినాపురానికి తిరిగి వచ్చాడు.

దుర్యోధనుడు కర్ణుణ్ణి అభినందించి, "భీష్ముడూ, ద్రోణుడూ, బాహ్లికుడూ మొదలైన వీరులు ఎందరుండి కూడా నువు చేసిన సహాయం నాకు చేయలేకపోయారు. ఈ లోకంలో నీకు సమానులెవరూ లేరు," అన్నాడు.

కర్ణుడు దిగ్విజయం చేశాడు గనక తాను కూడా రాజసూయం చేయాలని బుద్ధి పుట్టింది దుర్యోధనుడికి. అందుకు తగిన ఏర్పాట్లన్నీ చేసి, ఋత్విజులను పిలిచి, తన చేత రాజసూయం చేయించమని అతను వారిని కోరాడు.

కాని ఋత్విజులు అందుకు అభ్యంతరాలు చెబుతూ, "పాండవులను జయించి గాని రాజసూయం చేయటానికి వీలులేదు. అదీగాక, నీ తండ్రి బతికి ఉన్నాడు. ఆయన బతికి ఉండగా నీకు చక్రవర్తి అయే అర్హత లేదు. రాజసూయంతో సమానమైనది వైష్ణవమనే మరొక యజ్ఞం ఉన్నది. కావాలంటే ఆ యజ్ఞం చెయ్యవచ్చు," అన్నారు.

దుర్యోధనుడు ఈ మాట తన తమ్ము లకూ, కర్ణ శకునులకూ చెబితే, వాళ్ళు ఋత్విజులు చెప్పినట్టే చెయ్యమని సలహా ఇచ్చారు. యజ్ఞానికి కావలిసిన ఏర్పాట్లన్నీ జరిగాయి. నగరం వెలపల యజ్ఞశాల నిర్మించారు. ద్వైతవనంలో ఉన్న పాండ వులను యజ్ఞానికి ఆహ్వానించటానికి దుర్యో ధనుడు దూతను పంపాడు.

ధర్మరాజు ఆ దూతతో, "దుర్యోధనుడు యజ్ఞం చెయ్యటం గొప్ప విషయం. మాకు కూడా వచ్చి యజ్ఞం చూడాలనే ఉన్నది గాని, మేమిప్పుడు హస్తినాపురానికి వస్తే మా వనవాస దీక్ష భంగమవుతుంది గనక, మేము రాలేము," అన్నాడు.

ఆ దూతతో భీముడు, "మా అరణ్య వాసమూ, అజ్ఞాతవాసమూ పూర్తి అయాక మా ధర్మరాజు దుర్యోధనుణ్ణీ, అతని తమ్ములనూ బలి పశువులుగా పెట్టి, శస్త్రా లతో గొప్ప యజ్ఞం చెయ్యబోతాడు. ఆ యజ్ఞానికి నేను తప్పక వస్తానని దుర్యో ధనుడితో చెప్పు," అన్నాడు.

దుర్యోధనుడి వైష్ణవయజ్ఞం విజయవం తంగా జరిగి, పూర్తి అయింది. కర్ణుడు దుర్యోధనుణ్ణి అభినందిస్తూ, "వచ్చే యుద్ధంలో నేను పాండవులను చంపి, నీ చేత రాజసూయం చేయిస్తాను, చూస్తూ ఉండు!" అన్నాడు.



అక్కడ పాండవులు ద్వైతవనంలో చాలా కాలం ఉండటంచేత, వారు వేటాడిన కారణంగా మృగాల సంఖ్య బాగా క్షీణించి పోయింది. అందుచేత ధర్మరాజు తన తమ్ములతో సహా తిరిగి కామ్యకవనం చేరాడు. అక్కడ వారు పళ్లూ, కాయలూ, దుంపలూ ఏరి చాలావరకు వాటితోనే పొట్ట పోసుకుంటూ కాలక్షేపం చేశారు.

వాళ్ళ వనవాసం పదకొండేళ్ళు ముగి సింది. ధర్మరాజుకు చాలా బాధగా ఉండేది. తాను జూదం ఆడకుండా ఉంటే తనకూ, తన తమ్ములకూ, ద్రౌపదికీ ఈ దుర్భరమైన కష్టాలు రాకపోను! ముందు రాబోయేది తలుచుకున్నా బాధ



గానే ఉండేది. కర్ణుడు పాండవుల నందరినీ యుద్ధంలో చంపుతానని దుర్యోధనుడికి మాట ఇచ్చాడు. ఇలాటి మనోవేదనలతో ధర్మరాజుకు రాత్రివేళ నిద్ర కూడా పట్టేదికాదు.

పాండవులు కామ్యకవనంలో ఉండగా ఒకసారి వ్యాసుడు వారిని చూడ వచ్చి, వారు కృశించి ఉండటం చూసి బాధపడి, వారికి ఉపశమనం కలిగే మాటలు చెప్పి, పదమూడేళ్ళ నియమమూ పూర్తి కాగానే పాండవులకు తిరిగి రాజ్యప్రాప్తి కలుగుతుందని ధైర్యం చెప్పి, వెళ్ళిపోయాడు.

పాండవులు ఈ విధంగా అరణ్యంలో అలమటిస్తూ, ఉండగా, దుర్యోధనుడూ, కర్ణుడూ, శకునీ వారిని ఎలా బాధలకు గురి చేయాలా అని ఆలోచనలు చేస్తూ వచ్చారు.

ఆ సమయంలో దుర్వాసమహాముని, తన పదివేల మంది శిష్యులతో హస్తినా పురానికి వచ్చాడు. దుర్వాసుడు మహా కోపిష్ఠి. ఆయనకు జరిగే ఆతిథ్యంలో ఏమాత్రం లోపం వచ్చినా శపించేస్తాడు. అందుకని దుర్యోధనుడూ, అతని తమ్ములూ ఆ మునికి అత్యంత భక్తి శ్రద్ధలతో సేవలు చేసి, వినయ విధేయతలతో నడుచుకున్నారు.

దుర్యోధనుడికి దుర్వాసుడు అనేక రకాల పరీక్షలు పెట్టాడు.

"రాజా, నాకు ఆకలిగా ఉన్నది. వేగం భోజనం సిద్ధం చేయించు. స్నానం చేసి వస్తాను," అని దుర్వాసుడు వెళ్ళిపోయి, ఎంతకూ వచ్చేవాడు కాడు. ఆలస్యంగా వచ్చి, "ఆకలి లేదు," అనేవాడు.

ఒకసారి అర్ధరాత్రివేళ లేచి, "మా కందరికీ ఆకలిగా ఉన్నది," అనేవాడు దుర్వాసుడు. తీరా అన్నం వడ్డిస్తే ఆకలి లేదనేవాడు. ఒక్కొసారి, "ఛీ, ఇదేం భోజనం!" అని తిట్టి, తినటం మానేసేవాడు.

ఇలా ఎన్ని తిప్పలు పెట్టినా దుర్యోధనుడు ఓర్పుగా అన్నిటినీ సహించి సేవలు చెయ్యటం చూసి దుర్వాసుడు సంతోషించి, "రాజా, నీ పరిచర్యలకు సంతోషించాను. నీకు ఏమి కావాలో కోరు," అన్నాడు.

దుర్వాసుడు శపించనందుకు దుర్యోధనుడు ఎంతగానో సంతోషించి, శకుని కర్ణ దుశ్శాసనులతో సంప్రతించి, దుర్వాసుడితో, "స్వామీ, పరమ ధర్మాత్ముడైన ధర్మరాజు అరణ్యంలో ఉన్నాడు. ఆయన వెంట ఆయన తమ్ములూ, భార్యా, అనేకమంది బ్రాహ్మణులూ ఉన్నారు. ద్రౌపది వారి కందరకూ భోజనాలు పెట్టి, తాను తిని, పడుకుని ఉన్న సమయంలో మీరు మీ శిష్య గణంతో సహా అక్కడికి వెళ్ళి ఆతిథ్యం అడగాలి. ఇదే నేను మీ నుంచి కోరేవరం," అన్నాడు.

దుర్వాసుడు అందుకు సమ్మతించి, తన శిష్యులతో సహా కామ్యకవనానికి బయలు దేరాడు. దుర్యోధనుడి సంతోషానికి మేర లేదు. "పాండవులు దుర్వాసుడికి ఆగ్రహం తెప్పించి, ఆయన శాపానికి గురి అయి, నాశనమైపోతారు. ఇంత కాలానికి మన కోరిక తీరుతున్నది," అని కర్ణుడు దుర్యోధనుడితో అన్నాడు. శకుని దుశ్శాసనులు సంతోషించారు.

కామ్యకవనంలో ఒకనాడు ద్రౌపది తన భర్తలకూ, బ్రాహ్మణులకూ భోజనం పెట్టి, తాను కూడా తిని, పడుకున్నది. ఆ సమయంలో వారి ఆశ్రమానికి దుర్వాసుడు తన పదివేల శిష్యులతోనూ వచ్చి చేరాడు.

ధర్మరాజు తన తమ్ములతో సహా దుర్వాసుడికి ఎదురు వెళ్ళి, స్వాగతం చెప్పి, అర్ఘ్యపాద్యాలతో పూజించి, ఆయన పాదాలకు నమస్కరించి, "మహాత్మా, తమరు తమ శిష్యులతో సహా మా ఆతిథ్యం స్వీకరించాలి," అన్నాడు.

ఈ మహారణ్యంలో ఉంటున్నవాడు తనకూ, తన శిష్యులు పదివేల మందికీ ఎలా భోజనం పెడతాడా అన్న ఆలోచన కూడా లేకుండా, దుర్వాసుడు ధర్మరాజు ఆతిథ్యం స్వీకరించటానికి ఒప్పుకుని, తన శిష్యులతో సహా స్నానం చేసి రావటానికి గంగానదికి వెళ్ళాడు.

ఇంతమందికి ఎలా భోజనం పెట్టాలో ద్రౌపదికి అర్థం కాలేదు. ఆమెకు ఇంకేదారీ కనిపించక కృష్ణుణ్ణి ధ్యానించింది.






దుర్వాసుడికీ, ఆయన శిష్యులు వెయ్యి మందికీ, వేళ గాని వేళ, ఎలా భోజనం సమకూర్చాలో తెలీక ద్రౌపది కృష్ణుణ్ణి ప్రార్థించగానే, అరణ్యంలో ద్రౌపది ఎదట కృష్ణుడు ప్రత్యక్షమయాడు.

ద్రౌపది కృష్ణుడి పాదాలకు నమస్కరించి, "దుర్వాసుడు తన శిష్యగణంతో గంగ నుంచి తిరిగి వచ్చి భోజనం పెట్టమంటాడు. అక్షయ పాత్రలో ఒక్క మెతుకైనా లేదు. నేనేం చేసేది?" అన్నది.

"దుర్వాసుడి మాట దేవుడెరుగు. ముందు నాకు ఆకలి మండిపోతున్నది. నా ఆకలి తీర్చు," అన్నాడు కృష్ణుడు.

ద్రౌపది సిగ్గుపడుతూ, "నేను తినేదాకా నే పాత్రలో అన్నం ఉంటుంది. నా భోజనం అయి పోయింది. నువే నన్ను పరీక్ష పెడితే నా కేది దారి?" అన్నది.

"నేను ఆకలితో చచ్చిపోతుంటే నీకు హాస్యంగా ఉన్నట్టున్నది. నీ అక్షయ పాత్రలో ఎంత ఉంటే అంతే పెట్టు. దాన్ని తీసుకురా, చూస్తాం," అన్నాడు కృష్ణుడు.

ద్రౌపది వెళ్ళి అక్షయ పాత్ర తెచ్చింది. దానిలో ఏ మూలనో ఒక మెతుకు అంటుకుని ఉన్నది. కృష్ణుడు దాన్ని నోట వేసుకుని, "నా కడుపు నిండిపోయింది!" అన్నాడు.

అతను భీముణ్ణి పిలిచి, "నువు గంగకు వెళ్ళి, దుర్వాసుణ్ణీ, ఆయనగారి శిష్యులనూ భోజనానికి త్వరగా రమ్మని పిలుచుకురా," అన్నాడు.

35. సైంధవ పరాభవం



భీముడు వచ్చే లోపుగానే దుర్వాసుడికీ, శిష్యులకూ పొట్టలు ఉబ్బరించి, త్రేపులు రాసాగాయి. శిష్యులు దుర్వాసుడి దగ్గిరికి వచ్చి, "స్వామీ, గొంతు పూడేదాకా తిన్నట్టుగా ఉన్నది. మనం అనవసరంగా ధర్మరాజును వంట చేయించమన్నాం. ఒక్క మెతుకు కూడా తినలేం. ఇప్పుడేం చెయ్యాలి?" అన్నారు.

దుర్వాసుడు వాళ్ళతో, "ధర్మరాజుకు ద్రోహమే చేశాం. అతను సామాన్యుడు కాడు. మన కేసి కోపంగా చూస్తే మాడి, మసి అయి పోతాం. అంబరీషుడి వల్ల నా కొకసారి పరాభవం ఇలాగే జరిగింది. మనం చెయ్యగలది ఒకటే ఉన్నది. ధర్మరాజుకు చెప్పకుండా పారిపోదాం," అన్నాడు. అందరూ గంగ నుంచి అటే వెళ్ళిపోయారు.

అంబరీషుడు ఒకసారి ద్వాదశీవ్రతం చేసి, బ్రాహ్మణులతో సహా భోజనానికి కూర్చోబోతూండగా దుర్వాసుడు వచ్చాడు. అంబరీషుడు ఆయనను భోజనానికి రమ్మని ఆహ్వానించాడు. దుర్వాసుడు స్నానానికి వెళ్ళి ఎంతకూ రాలేదు. ద్వాదశి ఘడియలు దాటి పోతున్నాయి. ద్వాదశి వెళ్ళాక పారణ చేస్తే వ్రత ఫలితం దక్కదు. అతిథి రాకుండా భోజనం చెయ్యటం పాపం. అందుచేత అంబరీషుడు మధ్య మార్గంగా నీరు తాగాడు. దుర్వాసుడు ఆలస్యంగా వచ్చి, అంబరీషుడు జలపానం చేసినట్టు తెలిసి ఆగ్రహించి, మహాకృత్యను సృష్టించి, అంబరీషుడి పైకి పంపకం చేశాడు. ఇంతలో విష్ణుచక్రం వచ్చి, కృత్యను చంపి, దుర్వాసుడి వెంట బడింది. అప్పుడు దుర్వాసుడు శివుడి వద్దకూ, విష్ణువు వద్దకూ వెళ్ళి, వారు రక్షించ లేకపోగా, తిరిగి వచ్చి అంబరీషుడి కాళ్ళపైనే పడి, ప్రాణాలు దక్కించుకున్నాడు. ఇది దుర్వాసుడికి మరవరాని అనుభవం.

భీముడు గంగా తీరానికి వచ్చేసరికి అక్కడ ఒక్కరూ లేరు. అక్కడ ఉండే బ్రాహ్మణులను అడిగితే, "మునులందరూ

పారిపోయారే!" అని చెప్పారు. భీముడు ఆశ్రమానికి తిరిగి వచ్చి ఆ మాట చెప్పాడు. దుర్వాసుడు మళ్ళీ ఏ వేళగాని వేళ వస్తాడో నని ధర్మరాజు భయపడ్డాడు.

కృష్ణుడు ఆయనతో, "దుర్వాసుడు ఇక రాడు!" అంటూ జరిగిన సంగతి చెప్పి, సెలవు పుచ్చుకుని తిరిగి వెళ్ళిపోయాడు. కృష్ణుడి అనుగ్రహం వల్ల పాండవులను దుర్యోధనాదులు ఇలాటి కష్టాలకు గురి చేయలేకపోయారు.

కొంతకాలం గడిచింది. పాండవులు కామ్యకవనంలోనే ఉంటూ ఒకనాడు వేటకు వెళ్ళ నిశ్చయించారు. తాము తిరిగి వచ్చే దాకా వారు ద్రౌపదిని తృణబిందుడు అనే ఋషి ఆశ్రమంలో ఉంచి, ఆమెకు తమ పురోహితుడైన ధౌమ్యుణ్ణి తోడు ఉంచారు.

అదే రోజు సైంధవుడు సాళ్వరాజు కుమార్తెను పెళ్ళాడాలని, కొంత సైన్యాన్నీ, అనేకమంది రాజులనూ వెంట బెట్టుకుని, తృణబిందు ఆశ్రమం పక్కగా వెళు తున్నాడు. ఆశ్రమం నిర్జనంగా వున్నది. ఒక పొదరింటి ద్వారం వద్ద ద్రౌపది, మెరుపుతీగ లాగా వెలిగిపోతూ నిలిచి ఉండటం సైంధవుడికి కనిపించింది.

ఆమెను చూడగానే సైంధవుడి కళ్ళు జిగేలుమన్నాయి. అతనిలో మోహం పుట్టు కొచ్చింది. అతను కోటికాస్యు డనే రాజ



కుమారుణ్ణి పిలిచి, "ఒరే, ఆ స్త్రీని చూశావా? ఆమెను చూస్తే నాకు ఎక్కడలేని కోరికా కలుగుతున్నది. నాకు సాళ్వరాజు కుమార్తె వద్దు. ఈమె ఎవరి కూతురో, ఎవరి భార్యో, నాతో వచ్చేస్తుందేమో నువు వెళ్లి కను క్కురా." అన్నాడు.

ఆ కోటికాస్యుడు కూడా మానాభిమా నాలు లేనివాడే. వాడు ద్రౌపది దగ్గిరికి వచ్చి, "సుందరీ, నువ్వెవరు? వనదేవత లాగున్న నీకు భర్త ఎవరు? ఏ కులం దానివి? నీ పేరేమిటి? ఈ వనంలో ఒంట రిగా ఎందుకున్నావు? మా సంగతి నువు అడగకపోయినా చెబుతాను. నేను సురథ రాజు కొడుకును, నా పేరు కోటికాస్యుడు.



ఆ కనబడే రాజులు త్రిగర్తరాజూ, కుళింద రాజూనూ. నీ వంక ఆత్రంగా చూస్తున్న యువకుడు సుబలరాజు కుమారుడు. పన్నెండుమంది రాజుల మధ్య వెలిగి పోతున్న రథం మీద కూర్చున్నవాడు సింధు సౌవీర దేశాలకు రాజు, జయద్రధుడు. ఆ జయద్రధుడే నీ సంగతి కనుక్కురమ్మని నన్ను పంపించాడు,'' అన్నాడు.

ద్రౌపది అతనితో, ''నువు ఎవరో నాకు తెలుసు. నా వంటి కులస్త్రీలు నీతో మాట్లాడ రాదు. కాని నీ ప్రశ్నలకు జవాబు చెప్ప టానికి ఇక్కడ ఎవరూ లేరు. అందుచేత విధి లేక నేనే చెబుతున్నాను. నేను ద్రుపద రాజు కూతురిని. నన్ను కృష్ణ అని పిలు స్తారు. పాండవులు నా భర్తలు. వారిప్పుడు వేటకు పోయి ఉన్నారు. త్వరలోనే వస్తారు. వారు వచ్చేదాకా మీరంతా ఆగి, వారి అతిధి సత్కారాలు పొంది వెళ్ళండి. వారు సంతో షిస్తారు,'' అన్నది.

కోటికాస్యుడు వెళ్ళి సైంధవుడితో సంగతి అంతా చెప్పాడు.

''ఆమె మనుష్య స్త్రీ అంటే నమ్మ శక్యం కాకుండా ఉన్నది. ఆమెను చూసిన కళ్ళతో మరొక స్త్రీని చూడటం సాధ్యం కాదు,'' అన్నాడు సైంధవుడు.

''అలా అయితే ఆమెను రథంలో ఎక్కించుకుని ఇంటికి వెళ్ళిపో,'' అన్నాడు కోటికాస్యుడు.

సైంధవుడు తన రథం దిగి, తన వారిని ఆరుగురిని వెంట బెట్టుకుని పాండవుల పర్ణశాలకు వెళ్ళి, ద్రౌపదితో, ''నువు, నీ భర్తలూ క్షేమంగా ఉన్నారా?'' అని అడిగాడు.

ద్రౌపది అతన్ని క్షేమసమాచారా లడిగి అర్ఘ్యపాద్యాలిచ్చింది. ఆమె అతన్ని కూర్చో మని, ''పాండవులు వేట నుంచి తిరిగి వచ్చి, వేట మాంసంతో భోజనం పెడతారు,'' అన్నది.

''అతిథ్యాని కేముందిగాని, నా రథం మీద మా నగరానికి వచ్చెయ్యి. నిన్ను నా భార్యగా చేసుకుని, సుఖాలలో ముంచి

ఎత్తుతాను. రాజ్యభ్రష్టులైన పాండవుల వెంట ఈ అరణ్యాలలో ఎందుకు ఇక్కట్లు పడతావు? సింధు సావీర దేశాలను నువే ఏలుకో!" అన్నాడు సైంధవుడు.

ద్రౌపదికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. తన భర్తలు వచ్చేదాకా సైంధవుణ్ణి మాటలలో పెట్టదలచి ఆమె, "నువు ఎంత తెలివి మాలినవాడివి! నా భర్తలు ఇంద్రుడికి తీసిపోనివాళ్ళు కదా. వారికి ఆగ్రహం తెప్పించటం నీకు ఎంత ప్రమాదకరం!" అంటూ ధర్మాలు చెప్పసాగింది.

"పాంచాలీ, పాండవులను గురించి మాకు కొత్తగా చెప్పి భయపెడదామనుకుంటున్నావా? లాభం లేదు. లోకంలో ఉన్న పదిహేడు ఉన్నత కులాలలో మాది ఒకటి. ఊరికే మాటలలో పెట్టక, నా వెంట వచ్చెయ్యి. పాండవులకు భయపడి నిన్ను వదిలి పోతాననుకోకు," అన్నాడు సైంధవుడు.

ద్రౌపది మండిపడి, "ఓరీ, అధముడా, పాండవుల భార్య నీకు అంత సులువుగా చిక్కుతుందనుకుంటున్నావా? నీ వెనకగా అర్జునుడు రథంమీద వచ్చి, నిన్ను కార్చిచ్చులాగా దహించడా? నన్ను తీసుకుపోవటం ఇంద్రుడి తరం కూడా కాదు, నువ్వెంత? నేనై నిన్ను వరిస్తాననుకోవటం భ్రమ. నేను మహా పతివ్రతను. నా మనసు పాండవుల పైన తప్ప ఇతరులపైన పోదు," అన్నది.



సైంధవుడి వెంట వచ్చినవాళ్ళు ద్రౌపదిని పట్టుకోబోయారు. ద్రౌపది వాళ్ళకు చిక్కకుండా, ధౌమ్యుడికి వినిపించేటట్టు గట్టిగా కేకలు పెట్టింది. సైంధవుడు ఆమెను రెండు చేతులా పట్టుకుని ఎత్తి పరిగెత్త సాగాడు. ద్రౌపది కేకలు విన్న ధౌమ్యుడు సైంధవుడి వెనకగా పరిగెత్తుకుంటూ రాసాగాడు. ఆయన కూడా కేకలు పెట్టాడు.

సైంధవుడు ద్రౌపదిని రథం మీద ఎక్కించుకుని బయలుదేరాడు.

ధౌమ్యుడు సైంధవుడితో, "సైంధవా, ఏం పని ఇది? చేతనైతే ఆమె భర్తలను ఓడించి ఆమెను పట్టుకుపో గాని, పరస్త్రీని ఇలా బలాత్కారంగా తీసుకుపోవచ్చునా?"



అన్నాడు. సైంధవుడు వినిపించుకోక రథాన్ని పోనిచ్చాడు. ధౌమ్యుడు ఆ రథం వెనకగా పరిగెత్తాడు.

ఈలోపుగా పాండవులు కొన్ని మృగాలను వేటాడి ఒక చోట కలుసుకుని, ఆశ్రమానికి బయలుదేరారు. వారు ఆశ్రమం చేరేసరికి ద్రౌపది కనిపించ లేదు. సారథి అయిన ఇంద్రసేనుడికి ధాత్రేయిక అనేది ఏడుస్తూ కనిపించింది. ఆమె ఇంద్రసేనుడితో ద్రౌపదిని సైంధవుడు బలాత్కారంగా రథంలో పెట్టుకుని తీసుకుపోయాడనీ, అది జరిగి ఎంతో సేపు కాలేదనీ చెప్పింది.

ధర్మరాజు ధాత్రేయికతో ఏడవ వద్దని చెప్పి, తన తమ్ములతో వెంటనే సైంధవుడి మీదికి పోదామన్నాడు. అయిదుగురూ రథాలెక్కి, సైంధవుడి సేనలు వెళ్ళిన జాడలను బట్టి బయలుదేరారు. త్వరలోనే వారికి దుమ్ము రేగుతూ దూరాన కనిపించింది. తరవాత వారికి ధౌమ్యుడు పరిగెత్తుతూ కనిపించాడు. ఆయనను నింపాదిగా -రమ్మని చెప్పి, పాండవులు మాంసం మీదికి ఉరికే డేగల్లాగా సైంధవుడి సేన మీదికి ఉరికారు.

సేన మధ్యలో రథం మీద సైంధవుడి వెంట ద్రౌపది కనిపించగానే వారికి ఒళ్ళు తెలియని కోపం వచ్చింది. "ఆగండి! ఆగండి!" అని కేకలు పెడుతూ వాళ్ళు సైంధవుడి రథాన్ని చేరుకున్నారు. వారిని చూసి సైంధవుడి వెంట ఉన్నవారు భయపడ్డారు.

ద్రౌపది సైంధవుడితో, "అరుగో, నా భర్తలు వస్తున్నారు. నువ్వూ, నీ సైన్యమూ సర్వనాశనం కాబోతున్నది. నీకు కాలం మూడటం చేతనే ఈ పాడు పని చేశావు. ఈసారి నువు చాపక బతికావంటే అది నీకు పునర్జన్మే అనుకోవాలి," అన్నది.

పాండవులు సైంధవుడి సేనమీద బాణవర్షం కురిపించారు. సైనికులు చెల్లాచెదరుగా పారిపోసాగారు. భీముడు గద తీసుకుని సైంధవుడి మీదికి పోబోతే కోటికాస్యుడు అడ్డపడ్డాడు. వాడికి సహాయంగా చాలా రథికులు వచ్చి, భీముడి మీద

శక్తులూ, తోమరాలూ, ఇతర ఆయుధాలూ విసిరారు.

అర్జునుడు సైంధవుడి రథాన్ని చేరుకునేటందుకు దారిలో అడ్డు వచ్చిన పదిహేను మందిని చంపేశాడు. ధర్మరాజు నూరుగురు సౌవీరులను చంపాడు. నకులుడు రథం నుంచి దిగి సైనికులను చంపసాగాడు. సహదేవుడు ఏనుగుల మీద ఎక్కిన వారందరినీ చంపాడు. త్రిగర్తరాజు ధర్మరాజు చేతిలో చచ్చాడు.

సైంధవుడి పక్షంవాళ్ళు చాలామంది చచ్చారు. కోటికాస్యుడు పారిపోయాడు. చివరకు చేసేది లేక సైంధవుడు ద్రౌపదిని రథం మీదనే విడిచి, తాను ప్రాణాలు దక్కించుకుని పారిపోబోయాడు. అర్జునుడు ఆ సంగతి భీముడికి చెప్పాడు. భీముడు అనాథలైన సైనికులను చంపటం నిలిపి, ధర్మరాజుతో, "అన్నా, నువు ద్రౌపదినీ, ధౌమ్యుణ్ణి నీ రథంలో ఆశ్రమానికి తీసుకుపో. నేనూ, అర్జునుడూ వెళ్ళి ఆ సైంధవుడి సంగతి తేల్చుతాము," అన్నాడు.

"భీమసేనా, సైంధవుడు ఎంత దుర్మార్గుడైనా వాణ్ణి చంపవద్దు. దుశ్శల విధవ కారాదు, గాంధారికి శోకం తెప్పించరాదు," అని ధర్మరాజు భీముణ్ణి హెచ్చరించాడు. కాని ద్రౌపది మాత్రం సైంధవుణ్ణి ప్రాణాలతో వదలరాదన్నది. ధర్మరాజు ఆశ్రమానికి తిరిగి వెళ్ళాడు.

ఒక కోసు దూరాన భీమార్జునులకు సైంధవుడు దొరికాడు. భీమార్జునులు సైంధవుణ్ణి పట్టుకుని, తల గొరిగి, పంచ శిఖలు పెట్టి, వికారంగా తయారు చేసి, మట్టి కొట్టుకుని ఉన్న ఆ సైంధవుణ్ణి రథంలో పెట్టుకుని ఆశ్రమానికి తెచ్చి ధర్మరాజు ముందు పెట్టారు.

"ఇక ముందు నువు ఎక్కడికి వెళ్ళినా పాండవదాసుణ్ణి అని చెప్పుకు బతుకు," అని భీముడు, ద్రౌపది అంగీకారంతో సైంధవుణ్ణి వదిలిపెట్టాడు.

"ఇక ఎన్నడూ ఇలాటి నీచపు పని చెయ్యకు," అని మందలించి, ధర్మరాజు సైంధవుణ్ణి పంపేశాడు.






పాండవులు సైంధవుణ్ణి పరాభవించి పంపేసి, కామ్యకవనంలో ఉంటూ ఉండగా, మార్కండేయుడు వచ్చాడు. ధర్మరాజు ఆయనతో తాము పడుతున్న కష్టాలూ, తమతోబాటు ద్రౌపది పడుతున్నపాట్లూ చెప్పి, "మహాత్మా, పూర్వం ఏ పతివ్రత అయినా ద్రౌపది లాగా కష్టాలు పడిందా?" అని అడిగాడు.

అప్పుడు మార్కండేయుడు పాండవులకు సావిత్రి కథ ఇలా చెప్పాడు:

పూర్వం మద్రదేశాన్ని అశ్వపతి అనే ధర్మాత్ముడు పాలించాడు. ఆయనకు సంతానం లేదు. అందుచేత ఆయన కఠిన నియమాలతో సావిత్రీదేవతను ఉపాసించుతూ, హోమాలు చేశాడు. చివరకు హోమకుండంలో సావిత్రీదేవి ప్రత్యక్షమై ఏమి కావాలని అడిగింది.

దానికి అశ్వపతి, "దేవీ, వంశోద్ధారకులైన కొడుకులు కావాలి," అన్నాడు.

"రాజా, నీ కోరిక తెలిసి, నేను ముందుగానే బ్రహ్మను అడిగాను. ఆయన నీకు ఒక కూతుర్ని ఇవ్వటానికి మాత్రమే సమ్మతించాడు. కనక నువు అదే మహాప్రసాదంగా భావించి, తృప్తిపడు," అని చెప్పి సావిత్రీదేవి అదృశ్యమయింది.

అశ్వపతి తపస్సు చాలించి, నగరానికి తిరిగివచ్చి, యథాప్రకారం రాజ్యం చేస్తూ ఉండగా, ఆయన భార్య మాళవి గర్భవతి అయి, ఒక శుభముహూర్తాన చక్కని ఆడపిల్లను కన్నది. అశ్వపతి ఆమెకు జాత

36. సావిత్రీ సత్యవంతుల కథ



కర్మలు జరిపించి, అమెకు సావిత్రి అని నామకరణం చేశాడు.

సావిత్రి ఎంతో గారాబంగా పెరుగుతూ, నానాటికీ అందంలో మించిపోతూ, చూసే వారికి ఏ దేవతా స్త్రీయో, సావిత్రీదేవే స్వయంగా మనిషి జన్మ ఎత్తిందేమోనని భ్రమ కలిగేటట్టుగా తయారయింది.

ఒకనాడు అశ్వపతి అమెతో, "అమ్మా, నీకు పెళ్ళియీడు వచ్చింది. ఏ కారణం చేతనో రాజకుమారుడు ఒక్కడు కూడా నిన్ను పెళ్ళాడతానని రావటం లేదు. నీకు తగిన భర్తను నువ్వయినా వరించి నాకు చెప్పు. నేను నిన్ను అతనికి ఇచ్చి నా ధర్మం నెరవేర్చుకుంటాను," అన్నాడు.

సావిత్రి తన భర్త కాదగిన వాడికోసం వెతుకుతూ రథమెక్కి రాజర్షులుండే ఆశ్రమాల వెంబడి బయలుదేరింది.

సావిత్రి అలా తిరుగుతూ ఉండగా ఒక నాడు అశ్వపతి వద్దకు నారదమహాముని వచ్చి, లోకవార్తలు చెప్ప నారంభించాడు. నారదుడు ఉండగానే సావిత్రి తన పర్యటన పూర్తి చేసుకుని, ఇంటికి తిరిగి వచ్చింది. అమె తన తండ్రికీ, నారదుడికీ నమస్కరించి నిలబడేసరికి నారదుడు అశ్వపతితో, "రాజా, నీ కూతురు ఎక్కడికి వెళ్ళి వస్తున్నది? యుక్తవయస్కురాలైన ఈ పిల్లకు ఇంకా వివాహం చేశావుకావేం?" అని అడిగాడు.

"మునీంద్రా, ఈమెను భర్తను వెతుక్కురమ్మని పంపాను. ఎవరిని వరించి వచ్చిందో అడిగి తెలుసుకోవాలి," అంటూ అశ్వపతి తన కూతురితో, "అమ్మా, నువు వెళ్ళిన పని అయిందా?" అన్నాడు.

సావిత్రి తండ్రితో ఇలా అన్నది:

"చాలా కాలంగా సాళ్వదేశాన్ని ఏలిన ద్యుమత్సేనుడనే మహారాజుకు వార్ధక్యంలో ఒక కొడుకు పుట్టాడు. ద్యుమత్సేనుడికి దురదృష్టవశాన గుడ్డితనం సంప్రాప్తమయింది. అది ఆధారం చేసుకుని, ద్యుమత్సేనుడికి పూర్వం ఓడిన శత్రువులు ఆయన రాజ్యాన్ని కాజేశారు. ఆ ముసలిరాజు తన

ముసలి భార్యనూ, పసికొడుకునూ వెంట బెట్టుకుని అరణ్యాలలో ఉంటూ తపస్సు చేసుకుంటున్నాడు. పసితనం నుంచీ ఆశ్రమాలలో పెరిగిన ద్యుమత్సేనుడి కొడుకు మునికుమారుడి లాగా పెరిగి, క్రూరబుద్ధి ఏమాత్రమూ లేక, ఎప్పుడూ నిజంచెబుతూ, సత్యవంతు డని పేరు తెచ్చుకున్నాడు. నేను ఆ సత్యవంతుణ్ణి నా భర్తగా వరించి తిరిగి వచ్చాను."

ఈ మాట వినగానే నారదుడు, "అయ్యో, పాపం! సావిత్రి తెలియక ఆ కుర్రవాణ్ణి భర్తగా వరించింది," అన్నాడు.

అప్పుడు అశ్వపతి, "మునీశ్వరా, మీకు తెలియనిదంటూ లేదు. ఈ సత్యవంతుడు ఎలాటివాడు? అతని గుణమూ, రూపమూ, శీలమూ ఎలాటివి?" అని అడిగాడు.

దానికి నారదుడు, "రాజా, ద్యుమత్సేనుడి కొడుకు తన తల్లి దండ్రులలాగే సత్యవ్రతుడు. అతను గుర్రాల బొమ్మలు చాలా బాగా తయారు చేస్తాడు. అందుచేత అతన్ని చిత్రాశ్వు డని కూడా పిలుస్తారు. అతని అందచందాలు అశ్వినీదేవతలకు తీసిపోవు. సకల సద్గుణ సంపన్నుడు. కాని అతని ఆయువు ఇంకొక్క ఏడాది మాత్రమే ఉన్నది. ఇవాళ నుంచి సరిగా ఏడాది గడిచే సరికి అతని జీవితం ముగిసిపోతుంది," అన్నాడు.



ఈ మాటకు అశ్వపతి కలతపడి, "అమ్మా, ఈ అల్పాయుష్కుణ్ణి విడిచి మరెవరినైనా వరించు," అన్నాడు.

"ఒకసారి త్రికరణశుద్ధిగా ఒకరిని వరించిన తరవాత, అతను అల్పాయువైనా, దీర్ఘాయువైనా, శీలవంతుడైనా, దుశ్శీలుడైనా మరొకరిని వరించటం సాధ్యం కాదు. నేను సత్యవంతుణ్ణి వదిలేసి మరొకరిని వరించను. నన్ను అతనికే ఇచ్చి పెళ్ళిచెయ్యి," అన్నది సావిత్రి తండ్రితో.

నారదుడు కూడా అశ్వపతితో, "రాజా, నీ కుమార్తె దృఢనిశ్చయం గలది. ఆమె మనసు మార్చటం నీవల్ల కాదు. నన్నడిగితే ఈనాటి రాజులలో సత్యవంతుడికి సమాన



మని చెప్పగలవాడు ఎవడూ లేడు. సావిత్రిని అతని కిచ్చి చెయ్యి. ఆమె సుకృతం మంచిదైతే సత్యవంతుడు దీర్ఘాయువు కావచ్చు. శుభమస్తు!'' అని చెప్పి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

నారదుడు చెప్పిన ప్రకారం అశ్వపతి తన కుమార్తెను సత్యవంతుడి కిచ్చి పెళ్ళి చేయ నిశ్చయించి, సావిత్రిని వెంట బెట్టుకుని బంధుమిత్ర పరివారసహితంగా ద్యుమత్సేనుడి ఆశ్రమానికి వెళ్ళాడు.

ముసలివాడూ, వృద్ధుడూ అయిన ద్యుమత్సేనుడు ఒక మద్దిచెట్టు నీడన కూర్చుని ఉన్నాడు. అశ్వపతి ఆయనతో, ''మహారాజా, నా కుమార్తెను సావిత్రిని నీ కుమారుడి కిచ్చి పెళ్ళి చేయ నిశ్చయించి వచ్చాను. దీనిని నీ కోడలుగా స్వీకరించు,'' అన్నాడు.

''రాజా, మేము రాజ్యం పోగొట్టుకుని, ఈ అరణ్యంలో జీవిస్తున్నాము. నీ కుమార్తె సుకుమారి, మాతో కష్టాలు పడగలదా?'' అన్నాడు ద్యుమత్సేనుడు.

''సుఖ దుఃఖాలు మనిషి అధీనంలో ఉండేవి కావు. ఆ మాట నా కుమార్తెకు తెలుసు. కష్టసుఖాలను గురించి ఆలోచించే వచ్చాము. నా కూతురూ, నీ కొడుకూ ఒకరికొకరు తగినవారు. మనం వియ్యం అందుదాం,'' అని అశ్వపతి అన్నాడు.

ద్యుమత్సేనుడు సంతోషించి, తన ఆశ్రమంలో ఉన్న మునులందరినీ చేరబిలిచి, మంచి ముహూర్తంలో సావిత్రీ సత్యవంతుల వివాహం జరిపించాడు. అశ్వపతి తన నగరానికి తిరిగి వెళ్ళాడు.

తన తండ్రి తిరిగి వెళ్ళగానే సావిత్రి తన మేలివస్త్రాలూ, ఆభరణాలూ తీసేసి, భర్తతోబాటు తాను కూడా నారచీరలు కట్టి, శరీరశ్రమ లక్ష్యపెట్టకుండా అత్త మామలకూ, భర్తకూ అన్నివిధాలా సేవలు చేస్తూ, మితభాషిణి అయి కాలం గడపసాగింది.

కాని ఆమె తన భర్త ఆయువు ఒక్కొక్క రోజే తరిగిపోవటం లెక్క పెడుతూనే ఉన్నది. నారదుడు చెప్పిన ప్రకారం సత్యవంతుడి ఆయుర్దాయం ఇంకా నాలుగు

రోజులు ఉన్నదనగా ఆమె త్రిరాత్రోపవాసం ప్రారంభించింది.

"అమ్మా, అసలే సుకుమారివి. ఇలాటి వ్రతం ఎందుకు ప్రారంభించావు? నిన్నీ కఠోరవ్రతం మానమనటానికి నాకు నోరు రాకుండా ఉన్నది." అని ద్యుమత్సేనుడు సావిత్రితో అన్నాడు.

"దృఢనిశ్చయం ఉండాలేగాని, ఎంత కఠినమైన పనులైనా నిర్విఘ్నంగా సాగించవచ్చు. నేను దృఢనిశ్చయంతోనే ఈ వ్రతం ప్రారంభించాను," అన్నది సావిత్రి.

సావిత్రికి ఉపవాసశ్రమ కన్న తన భర్తకు చావు రానున్నదన్న దిగులు జాస్తి అయింది. మూడు రాత్రులూ గడిచాయి. నారదుడు చెప్పిన ప్రకారం సత్యవంతుడి జీవితంలో అఖరు రోజు తెల్లవారింది.

ఆ రోజు సావిత్రి తెల్లవారుతూనే లేచి, సూర్యోదయం కాగానే అగ్ని ప్రజ్వలింపజేసి, హోమం చేసి, ఆశ్రమంలో ఉన్న అత్త మామలకూ, మిగిలిన పెద్దలకూ నమస్కారాలు చేసి, "దీర్ఘసుమంగలీ భవ!" అని ఆశీస్సులు పొంది, భర్తకు రాబోయే మరణం గురించి ఆలోచిస్తూ దిగులుగా కూర్చున్నది.

"అమ్మా, నీ వ్రతం పూర్తి అయింది గదా, పారణ చెయ్యవేం?" అని అత్త మామలు సావిత్రిని అడిగారు.



"ఈ వ్రతానికి సూర్యాస్తమయం అయిన తరవాతనే పారణ చెయ్యాలి," అని సావిత్రి బదులు చెప్పింది.

సత్యవంతుడు సమిధలనూ, పూలనూ, పళ్ళనూ తీసుకురావటానికి గొడ్డలి భుజాన పెట్టుకుని, అరణ్యంలోకి బయలుదేరుతున్నాడు. అప్పుడు సావిత్రి అతన్ని సమీపించి, "నేనూ వస్తాను. ఇవాళ నిన్ను విడిచి ఉండ బుద్ధి కావటంలేదు," అన్నది.

"పిచ్చిదానా, అడవి ఎలా ఉంటుందో నీకు తెలీదు. అక్కడి బాటల నిండా రాళ్ళూ, ముళ్ళూ ఉంటాయి. అదీగాక మూడు రోజులుగా ఉపవాసం ఉండి బడలి ఉన్నావు." అన్నాడు సత్యవంతుడు.



"ఉపవాసంచేత నా కేమీ బడలిక లేదు. ఎందుకో నా కివాళ అరణ్యంలో తిరగాలని పించింది. అభ్యంతరం చెప్పవద్దు," అన్నది సావిత్రి.

"నీ యిష్టం. కాని మా అమ్మా, నాన్నా ఒప్పుకుంటే అలాగే నా వెంట రా. తప్పు నా మీద ఉండదు," అన్నాడు, సత్యవంతుడు.

సావిత్రి మామగారికి తన కోరిక తెలిపింది. "నేను వచ్చి దాదాపు సంవత్సరం కావస్తున్నది. అరణ్యం చూడాలన్న నా కోరిక తీరలేదు. ఇవాళ నన్ను నా భర్త వెంట వెళ్ళనివ్వండి," అని ఆమె అడిగింది. ఎన్నడూ ఏ కోరికా కోరినది కాదుగదా అని, ద్యుమత్సేనుడు సావిత్రిని సత్యవంతుడి వెంట వెళ్ళమన్నాడు.

అత్తమామల అనుమతితో సావిత్రి, కడుపులో పుట్టెడు దిగులు ఉన్నా, పైకి ఎంతో ఉల్లాసంగా కనబడుతూ, సత్యవంతుడి వెంట అరణ్యంలోకి బయలుదేరింది. సత్యవంతుడు అరణ్యంలోని అందాలను చూపుతూ నడుస్తూ ఉంటే సావిత్రికి అతను అప్పుడే చచ్చిపోయినట్టే అనిపించసాగింది.

సత్యవంతుడు బుట్టనిండా పూలూ, పళ్ళూ కోసి, కట్టెలు కొట్టటం ప్రారంభించాడు. అతనికి కొద్దిసేపట్లో ఆయాసం వచ్చింది. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. అతను గొడ్డలి అవతల పడేసి, సావిత్రి దగ్గిరికి వచ్చి, "తల పగిలిపోతున్నది. శరీరం తూలుతున్నది. నిలబడలేకుండా ఉన్నాను. కాస్సేపు పడుకుంటాను," అన్నాడు.

సావిత్రి అతని తల పెట్టుకోవటానికి తన తొడ ఇచ్చి, పడుకోనిచ్చింది. కొంతసేపటికి సత్యవంతుడి సమీపంలో సావిత్రికి ఒక ఆకారం కనబడింది. ఆ వ్యక్తి నల్లగా, ఎర్రని కళ్ళు కలిగి, నీలవస్త్రాలు ధరించి, చేతిలో పాశం పట్టుకుని, చూడటానికి భయంకరుడుగా ఉన్నాడు.

అతన్ని చూస్తూనే సత్యవంతుడి తలను తన తొడమీది నుంచి తీసి కిందపెట్టి, లేచి

నిలబడి, నమస్కారం చేసి, "అయ్యా, నువు ఎవరు? ఎందుకు వచ్చావు?" అని అడిగింది సావిత్రి.

"అమ్మా, నేను యముణ్ణి. నువు పతివ్రతవు గనక నన్ను చూడ గలిగావు. సత్యవంతుడికి ఆయువు ముగిసింది. అతను గొప్ప ధార్మికుడు గనక అతని కోసం దూతలను పంపక, నేనే స్వయంగా వచ్చాను," అంటూ యముడు తన పాశంతో సత్యవంతుడి శరీరం నుంచి బొటనవేలి ప్రమాణంలో ఉన్న జీవుణ్ణి లాగి, దక్షిణంగా బయలుదేరాడు.



సావిత్రి తన భర్త శరీరాన్ని భద్రపరచి, యముడి వెంట బయలుదేరింది. యముడామెను తిరిగి పొమ్మన్నాడు. కాని సావిత్రి తన భర్త ఎక్కడికి పోతే తాను కూడా అక్కడికి పోతానన్నది, అది తన ధర్మమన్నది.

యముడు సంతోషించి సావిత్రితో, "నీ భర్త ప్రాణాలు తప్ప మరేదన్నా వరం కోరుకో," అన్నాడు.

"మా మామగారు ముసలివాడూ, గుడ్డివాడూ అయాడు. ఆయనకు చూపూ, శరీర బలమూ ప్రసాదించు," అన్నది సావిత్రి. యముడు సరేనన్నాడు.

కాని సావిత్రి యముణ్ణి అనుసరించటం మానలేదు. ఆమెను వదిలించుకోవటానికి యముడు ఆమెను మరొక వరం కోరుకోమన్నాడు.

సావిత్రి రాజ్యం కోల్పోయిన తన మామగారికి తిరిగి రాజ్యప్రాప్తి కలగాలని వరం కోరింది. యముడు సరే నన్నాడు.

అప్పటికీ ఆమె యముడి వెంట పోవటం మానలేదు. యముడు ఆమెను మరొక వరం కోరమన్నాడు. సావిత్రి తన తండ్రికి పుత్ర సంతానం కోరింది. యముడు అశ్వపతికి నూరుగురు కొడుకులు కలిగేలాగు వరం ఇచ్చాడు.

అయినా సావిత్రి తిరిగి పోవటం లేదని గమనించి యముడు ఆమెకు నాలుగోవరం ఇస్తానన్నాడు. సావిత్రి తనకూ, సత్యవంతు

డికీ వంశవృద్ధి అయేటట్టు నూరుగురు కొడుకులను ప్రసాదించమన్నది.

"నీకు నూరుగురు కొడుకులు పుడతారు. ఇక తిరిగి వెళ్ళు," అన్నాడు యముడు.

"అలా అయితే నా భర్త ప్రాణాలు తిరిగి ఇచ్చెయ్యి," అన్నది సావిత్రి.

యముడు సత్యవంతుడి ప్రాణాలు వదిలేసి వెళ్ళిపోయాడు. సావిత్రి తన భర్త శరీరం ఉన్నచోటుకు తిరిగి వచ్చి, అతని తలను తన తొడల మీద పెట్టుకుని కూర్చున్నది. కొంతసేపటికి సత్యవంతుడు కళ్ళు తెరిచి సావిత్రి ముఖంలోకి చూసి, "నేను చాలాసేపు నిద్రపోయానా? నన్నెవరో నల్లని వాడు చాలాదూరం తీసుకుపోయినట్టు కల వచ్చింది," అన్నాడు.

"అదంతా తరవాత చెబుతాను. చీకటి పడుతున్నది. నువు లేచి నడవగలిగితే మనం ఆశ్రమానికి పోదాం," అని సావిత్రి అన్నది.

అతన్ని సావిత్రి లేపి నిలబెట్టవలిసి వచ్చింది. బుట్టను మోసే శక్తి అతనికి లేదు. దాన్ని ఒక చెట్టుకొమ్మకు తగిలించి, సావిత్రి మెల్లిగా అతన్ని నడిపించుకుంటూ, వెన్నెలలో దారి చూసుకుంటూ ఆశ్రమానికి చేర్చింది.

ఆశ్రమంలో అకస్మికంగా చూపు వచ్చిన ద్యుమత్సేనుడు, చీకటి పడినా కొడుకూ కోడలూ తిరిగి రానందున ఆందోళనపడి తన భార్యతో సహా, కొడుకు కోడళ్ళను పేరెత్తి పిలుస్తూ, అరణ్యం కేసి బయలు దేరాడు. ఇంతలో సావిత్రీ సత్యవంతులు రానే వచ్చారు. ఈ సరికే ఆశ్రమంలో అనేక మంది చేరారు. సావిత్రి వారందరికీ జరిగినదంతా చెప్పింది.

యముడి వరాలు వృథా కాలేదు. ద్యుమత్సేనుడికి రాజ్యం తిరిగి వచ్చింది. అశ్వపతికి కొడుకులు కలిగారు. సావిత్రీ సత్యవంతులకు కూడా కొడుకులు పుటారు.

మార్కండేయుడు పాండవులకు ఈ కథ చెప్పి, "ద్రౌపది పాతివ్రత్యం వల్ల మీ కష్టాలు తొలగి పోతాయి," అని చెప్పి, తన దారిన తాను వెళ్ళాడు.





# మహాభారతం

## 37. యక్షప్రశ్నలు

పాండవుల అరణ్యవాసం పన్నెండో ఏడు పూర్తి కాబోతున్నది. ఇంద్రుడు పాండవులకు మేలు చేసే ఉద్దేశంతో బ్రాహ్మణ రూపంలో కర్ణుడి వద్దకు వెళ్ళి, అతని సహజ కవచకుండలాలు యాచించాలని నిశ్చయించాడు. ఈ సంగతి కర్ణుడి తండ్రి అయిన సూర్యుడికి తెలిసింది. సూర్యుడు ఒకనాటి వేకువజామున కర్ణుడికి కలలో కనిపించి, "కర్ణా, నువు బ్రాహ్మణులకు ఏది అడిగినా ఇస్తావు. అందుచేత ఇంద్రుడు నీ దగ్గిరికి బ్రాహ్మణవేషంలో వచ్చి, నీ సహజ కవచకుండలాలు దానం అడుగుతాడు. ఆయనకు మరేదన్నా ఇయ్యి గాని కవచకుండలా లియ్యకు. అవి ఉన్నంత కాలమూ నిన్ను ఎవరూ యుద్ధంలో చంపలేరు. అవి పోతే మాత్రం నీకు తప్పక చావుకలుగుతుంది." అని చెప్పాడు.

"దేవా, నువు స్వయంగా వచ్చి నాకు హితబోధ చెయ్యటమే నాకు పదివేలు. కాని, బ్రాహ్మణులు అడిగినది ఇవ్వటం నా వ్రతం. దీని మూలాన లోకంలో నాకు ఖ్యాతి వచ్చింది. అలాటప్పుడు దేవేంద్రుడంతటివాడు వచ్చి నా సహజ కవచకుండలాలు అడిగితే ఎలా ఇయ్యకుండా ఉంటాను? అందుచేత తప్పక ఇస్తాను. దానివల్ల నా కీర్తి మరింత పెరుగుతుంది. పాండవులకు అపకీర్తి వస్తుంది. కీర్తి పోయాక బతికి ఉండి మాత్రం లాభమేమిటి?" అన్నాడు కర్ణుడు.

"పిచ్చివాడా, శరీరమే పోయాక కీర్తితో ఏం పని? అది శవాలంకరణ లాటిది. నీకూ,



అర్జునుడికి తప్పక యుద్ధం కలుగుతుంది. నీకు కవచకుండలాలు ఉన్నంత కాలమూ అర్జునుడు ఇంద్రుణ్ణి తోడుతెచ్చుకున్నా నిన్ను గెలవలేడు. అందుచేత వాటిని ఇంద్రుడికి ఇయ్యకు," అన్నాడు సూర్యుడు.

"దేవా, నన్ను క్షమించు. బ్రాహ్మణులు వచ్చి అడిగితే ప్రాణాలన్నా ఇవ్వాలన్నది నా నియమం. కవచకుండలాల సహాయం లేకుండానే నేను అర్జునుణ్ణి గెలవగలను. నా వద్ద పరశురాముడూ, ద్రోణుడూ ఇచ్చిన అస్త్రాలు ఉన్నాయి," అన్నాడు కర్ణుడు సూర్యుడితో.

"నీకు అంత పట్టుదలగా ఉంటే, ఒక పని చెయ్యి. ఇంద్రుడి వద్ద ఒక అమోఘమైన శక్తి ఉన్నది. దానితో ఎలాటి శత్రువునైనా చంపవచ్చు. అది శత్రువును చంపి తిరిగి వస్తుంది. ఇంద్రుడు నీ కవచకుండలాలు యాచించినప్పుడు నువు ఆ శక్తిని అడుగు. దానితో నువు అర్జునుణ్ణి గెలవగలుగుతావు." అన్నాడు సూర్యుడు.

ఇంతలో కర్ణుడు నిద్రలేచి తెల్లవారుతూ ఉండటం గమనించి, ఇంద్రుడి రాకకు ఎదురు చూడసాగాడు. అతను రోజూ మధ్యాన్నం వేళ సూర్యోపాసన చేసి, బ్రాహ్మణులకు అడిగిన దానాలు చేసేవాడు. ఈనాడు ఆ సమయంలో ఇంద్రుడు బ్రాహ్మణ వేషంలో వచ్చి, "భిక్షాం దేహి," అన్నాడు.

కర్ణుడు ఆయనను తన అలవాటు ప్రకారం పూజించి, "బ్రాహ్మణా, నీకు ఏం కావాలి? అందమైన స్త్రీలా? సారమైన భూములా? మంచి గోవులా? ఏది కావాలో కోరు," అన్నాడు.

"నాయనా, నాకు అవి ఏమీ వద్దు. నీ సహజ కవచమూ, కుండలాలూ కోసి ఇయ్యి," అన్నాడు ఇంద్రుడు.

"బ్రాహ్మణోత్తమా, ఈ కవచకుండలాలు నా ప్రాణాన్నికాపాడేవి. ఇవిగాక మరేదైనా కోరు," అన్నాడు కర్ణుడు. ఆ బ్రాహ్మణుడు ఇంద్రుడేనని అతనికి తెలిసిపోయింది.

"కాదు, నాకు నీ కవచకుండలాలే కావాలి," అన్నాడు ఇంద్రుడు.

కర్ణుడు నవ్వి, "నువు ఇంద్రుడి వని నాకు తెలుసు. మా వంటి వారికి వరాలు ఇవ్వవలసిన నువు ఇలా యాచనకు దిగటం బాగాలేదు. నీకు నేను కవచకుండలాలు ఇచ్చేసినట్టయితే శత్రువులకు తేలికగా ఓడి, అపఖ్యాతి పాలవుతాను. అందుచేత కవచ కుండలాలు ఇస్తానుగాని, నాకు అమోఘ మైన నీ శక్తిని ఇయ్యి," అన్నాడు.

దానికి ఇంద్రుడు, "నా శక్తిని అలాగే ఇస్తాను. కాని నువు దానిని ఒక్కణ్ణి చంప టానికి మాత్రమే ఉపయోగించ గలుగుతావు. నువు ప్రయోగించగానే అది నీ శత్రువును చంపి నా దగ్గిరికి తిరిగి వచ్చేస్తుంది. దానికి అభ్యంతరం లేకపోతే తీసుకో," అన్నాడు.

"దేవా, నాకు ఉన్న శత్రువు ఒక్కడే. అతన్ని చంపటమే నా కోరిక," అన్నాడు కర్ణుడు.

"నాకు తెలును. ఈ శక్తితో అర్జునుణ్ణి చంపాలను కుంటున్నావు, కాని కృష్ణుడు అతనికి అండగా ఉండగా అతన్ని చంపటం నీకు సాధ్యం కాదు. ఏమయినా, నేనిచ్చే శక్తిని ప్రాణాపాయ సమయంలో, నీ వద్ద ఉండే ఇతర అస్త్రాలేవీ పనికిరానప్పుడు మాత్రమే ఉపయోగించు. తొందరపడి అనామకులపైన గాని, అనవసరంగా గాని ప్రయోగిస్తే ఈ శక్తి నీ ప్రాణాలే తీస్తుంది," అని హెచ్చరించాడు ఇంద్రుడు.



తన శరీరంతో పుట్టి పెరిగిన కవచకుండ లాలను కోసి ఇచ్చినప్పుడు తనకు వికృత రూపం కలగకుండా చెయ్యమని కర్ణుడు కోరాడు. ఇంద్రుడు సరేనన్నాడు. కర్ణుడు ఇంద్రుడి నుంచి శక్తి గ్రహించి, ఆయనకు తన శరీరంనుంచి కవచాన్ని, కుండలాలనూ కోసి ఇచ్చాడు.

కర్ణుడి కవచకుండలాలు పోయాయన్న వార్త తెలిసి పాండవులు పరమానందం చెందారు, కౌరవులు దుఃఖించారు.

పాండవులు ద్వైతవనంలో ఉంటూ ఉండగా ఒక బ్రాహ్మణుడు పరిగెత్తుకుంటూ వచ్చి, "నేను అరణిని ఒక చెట్టుకొమ్మకు తగిలించాను. ఇంతలో ఒక దుప్పి వచ్చి



ఆ చెట్టును తన శరీరంతో రుద్దుతూ ఉండగా నా అరణి దాని కొమ్ములకు తగులుకున్నది. ఆ దుప్పి నా అరణితో సహా పారిపోతున్నది. అది లేకుండా నా అగ్నికార్యం సాగదు. దయచేసి నా అరణిని నాకు తెచ్చిఇయ్యండి," అన్నాడు.

వెంటనే పాండవులు ఆ దుప్పి వెంట పరిగెత్తి, దాన్ని బాణాలతో కొట్టారు. కాని ఒక్క బాణమూ ఆ దుప్పికి తగలలేదు. పైపెచ్చు, అది అంతకంతకూ వారికి దూరమై, చివరకు కీకారణ్యంలో కనబడకుండా పోయింది.

పాండవులు అయిదుగురూ అలిసిపోయి, ఆకలి దప్పులతో బాధపడుతూ ఒక చెట్టు నీడన చతికిలబడ్డారు. అప్పుడు నకులుడు, "మనకిలా కష్టాల మీద కష్టాలు రావటానికి కారణమేమిటో?" అన్నాడు.

"పూర్వజన్మలో చేసుకున్న దుష్కృతాల వల్ల ఈ జన్మలో కష్టాలుకలుగుతాయి," అన్నాడు ధర్మరాజు.

"ఆనాడు ద్రౌపదిని సభలోకి తెచ్చినప్పుడే నేనాదుర్మార్గులను చంపకపోవటం చేత ఇలా అగచాట్లు పడుతున్నాం," అన్నాడు భీముడు.

"జూదం ఆడేటప్పుడు కర్ణుడు పేలిన మాటలను నేను శాంతంగా సహించటంవల్ల మనం అప్రయోజకుల మల్లే అరణ్యానికి వచ్చామేమో, అవస్థలు పడుతున్నాం," అన్నాడు అర్జునుడు.

"ఆ శకునిగాణ్ణి అప్పుడే చంపేసి ఉంటే మనకే పాట్లూ ఉండేవి కావు," అన్నాడు సహదేవుడు.

ధర్మరాజు నకులుణ్ణి చూసి, "అందరికీ దాహంగా ఉన్నది. ఈ చెట్టెక్కి, ఎక్కడన్నా నీరున్నదేమో చూసి, బాణాల పొదితో నీరు తీసుకురా," అన్నాడు.

నకులుడు చెట్టెక్కి దగ్గిరలోనే నీరున్న జాడలు తెలుసుకుని, అక్కడికి వెళ్ళి తాను దాహం తీర్చుకుని, మిగిలిన వారికి నీరు తెచ్చి పెట్టటానికి బయలుదేరాడు. అతను ఒక సరోవరాన్ని చేరుకుని, నీరు తాగబో



తూండగా, ఏదో అశరీర వాక్కు, "ఆగు! నేనడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పి నీరుతాగు. ఈ సరస్సు నాది," అన్నది.

నకులుడు ఆ మాటలను లక్ష్యపెట్టక, నీరుతాగి, మూర్ఛపోయాడు. అతను ఎంతకూ రాకపోయేసరికి ధర్మరాజు సహదేవుణ్ణి పంపాడు. సహదేవుడు కూడా సరస్సును చేరుతూనే, చచ్చిపోయినట్టు పడి ఉన్న నకులుణ్ణి చూసి ఆవేదనపడుతూ, దాహ బాధ భరించలేక, అశరీరవాణి మాటలు పెడ చెవిని బెట్టి, నీరుతాగి, తాను కూడా పడిపోయాడు.

తరవాత ధర్మరాజు, వెళ్ళిన వారి జాడ తెలుసుకు రమ్మని అర్జునుణ్ణి పంపాడు. అర్జునుడు సరస్సుచేరి తమ్ములను చూశాడు. వారిని అలా చేసినవారు ఎవరా అని చుట్టూ చూస్తే ఎక్కడా ఒక పిట్ట కూడా లేదు. దాహ బాధకు తాళలేక అతను నీరు తాగ బోతుండగా అతనికి కూడా అదృశ్యవాక్కులు వినిపించాయి.

"సామర్థ్యం ఉంటే నా ఎదట కనబడు. అదృశ్యంగా ఉండి మాట్లాడుతావెందుకు?" అంటూ అర్జునుడు ధ్వని వచ్చిన దిక్కుగా బాణాలు వేసి, నీరుతాగి తానుకూడా పడిపోయాడు. అతని తరవాత భీముడు వచ్చి, అశరీర వాక్కులను పెడచెవిని బెట్టి, నీరుతాగి పడిపోయాడు.

చివరకు ధర్మరాజు స్వయంగా బయలుదేరి సరస్సు వద్ద ప్రాణాలు లేకుండా పడి ఉన్న తమ్ములను చూసి ఎంతో దుఃఖించాడు. అప్పుడు అశరీర వాక్కు ఇలా అన్నది:

"నేనొక కొంగను. నేనీ సరస్సుల్లో చేపలను తిని జీవిస్తూ ఉంటాను. నా ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా నీరు తాగినందుకు నీ తమ్ములను చంపాను. నువ్వయినా నా ప్రశ్నలకు సమాధానాలు చెప్పి నీకు కావలసినంత నీరు తీసుకో. లేదా, నీకు కూడా వారి గతే పట్టుతుంది."

ఈ మాటలు విని ధర్మరాజు, "నా తమ్ములు ఒక పక్షి చేత చచ్చేవారు కారు.



నువు కొంగవు కావు. నువు ఎవరు? నీకేం కావాలి?'' అని అడిగాడు.

''అవును, నేను కొంగను కాను, యక్ష రాజును,'' అంటూ ఆ యక్షుడు తాడి ప్రమాణాన సరస్సు ఒడ్డున ధర్మరాజుకు కనిపించి, ''నీకు నీరు కావాలంటే నా ప్రశ్నలకు సరి అయిన సమాధానాలియ్యి.'' అన్నాడు.

''అడుగు, నాకు సాధ్యమైతే చెబుతాను,'' అన్నాడు ధర్మరాజు.

యక్షుడు అనేక ప్రశ్నలు వేశాడు. ధర్మరాజు చెప్పిన సమాధానాలు యక్షుణ్ణి తృప్తి పరిచాయి.

''నీ సమాధానాలకు సంతోషించాను. చచ్చిపోయిన నీ తమ్ములలో ఒక్కణ్ణి బతికిస్తాను. ఎవణ్ణి బతికించమంటావో కోరుకో,'' అన్నాడు యక్షుడు.

''యక్షరాజా, నకులుణ్ణి బతికించు,'' అన్నాడు ధర్మరాజు.

''మహా బలుడైన భీముణ్ణీ, మహా పరాక్రమశాలి అయిన అర్జునుణ్ణీ వదిలి, నీ సవతి తల్లి కొడుకైన నకులుణ్ణి ఎందుకు బతికించమంటున్నావు?'' అని యక్షుడు అడిగాడు.

''మా తండ్రికి కుంతి, మాద్రీ ఇద్దరు భార్యలు. కుంతి కొడుకులలో నేను బతికి ఉన్నాను. మాద్రి కొడుకులలో ఒకడు బతికి ఉండటం ధర్మమని నాకుతోచింది,'' అన్నాడు ధర్మరాజు.

''మంచిది, ధర్మద్రోహం చెయ్యక పోవటమే ఉత్తమ ధర్మంగా భావించావు. నీ తమ్ములందరినీ బతికిస్తాను,'' అన్నాడు యక్షుడు. వెంటనే భీమార్జున నకుల సహదేవులు నిద్రలేచినట్టు లేచి కూర్చున్నారు. వారిలో ఆకలిదప్పుల జాడకూడాలేదు.

''అయ్యా, నువు మామూలు యక్షుడవు కావు, ఏ దేవతవో చెప్పు,'' అని ధర్మరాజు అడిగాడు.

దానికా యక్షుడు, ''నేను ధర్మదేవతను. నీ తండ్రిని. నిన్ను పరీక్షించటానికి వచ్చాను,'' అన్నాడు.

"దేవా, ఒక బ్రాహ్మణుడి అరణిని ఒక దుప్పి తీసుకుని పారిపోయింది. పాపం, అది లేకుండా ఆయన అగ్ని కార్యం చేయ లేదు. ఆయన దైనిక కర్మకాండకు విఘ్నం రాకుండా అనుగ్రహించు," అన్నాడు ధర్మరాజు.

"నేనే ఆ దుప్పిని. మిమ్ములను యిక్కడికి రప్పించేందుకు ఆ పని చేశాను. ఇదిగో ఆ బ్రాహ్మణుడి అరణి. ఏదన్నా వరం కోరుకో, ఇస్తాను," అన్నాడు ధర్మదేవత.

"మా పన్నెండేళ్ళ వనవాసం పూర్తి అవుతున్నది. అజ్ఞాతవాసకాలంలో మమ్మల్ని ఎవరూ గుర్తించకుండా అనుగ్రహించు," అన్నాడు ధర్మరాజు.

ధర్మదేవత అలాగేనని వరమిచ్చి అదృశ్యుడయాడు.

పాండవులు అరణిని తీసుకు పోయి, దాన్ని పోగొట్టుకున్న బ్రాహ్మణుడికి ఇచ్చారు. తన అగ్ని కార్యానికి భంగం రాకుండా కాపాడినందుకు ఆ బ్రాహ్మణుడు పాండవులకు తన కృతజ్ఞత తెలుపుకుని, వారికి విజయం చేకూరాలని ఆశీర్వదించి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

త్వరలోనే పాండవుల వనవాసం ముగిసింది. వాళ్ళు తమ వెంట ఇంతకాలమూ ఉండిన బ్రాహ్మణుల వద్ద సెలవు పుచ్చుకుని, వారికి నమస్కరించుతూ, "బ్రాహ్మణోత్తములారా, మా నియమం ప్రకారం ఇక నుంచీ ఏడాదిపాటు అజ్ఞాతవాసం జరపాలి. అందుచేత మీ వద్ద సెలవు పుచ్చుకుంటున్నాము," అని చెప్పి, అజ్ఞాతవాసం నిర్విఘ్నంగా సాగేటట్టు వారి ఆశీర్వాదం పొందారు.

అప్పుడు ధౌమ్యుడు ధర్మరాజుతో, "ఇంద్రుడికే అజ్ఞాతవాసం తప్పలేదు. త్వరలోనే మీ కష్టాలు తీరిపోతాయి," అన్నాడు.

పాండవులు ద్రౌపదినీ, ధౌమ్యుణ్ణీ వెంట బెట్టుకుని తమ ఆశ్రమం నుంచి కొనుదూరం వెళ్ళి, అక్కడ ఏకాంతంగా, మర్నాటి నుంచీ తాము ప్రారంభించ వలసిన అజ్ఞాతవాసం గురించి రహస్య చర్చలు చేశారు.





# మహాభారతం

"తమ్ములారా, మనం ఇక ఏడాది పాటు అజ్ఞాతవాసం చెయ్యవలసి ఉన్నది. ఈ ఏడాది పాటు మన జాడ ఎవరికీ తెలియఁగూడదు. మనం ఈ అజ్ఞాతవాసం ఏ దేశంలో చేద్దాం?" అని ధర్మరాజు అడిగాడు.

"పాంచాల, చేది, మత్స్య, శూరసేన, పటచ్చర, వీశార్ణ, నవరాష్ట్ర, మల్ల, సాల్వ, యుగంధర, కుంతి, సురాష్ట్ర, అవంతి దేశాలు పాడి పంటలతో తులతూగుతున్నవి. వాటిలో ఏ దేశంలోనైనా మనం అజ్ఞాతవాసం చెయ్యవచ్చు. ధర్మదేవత అనుగ్రహం ఉన్నది గనక మన అజ్ఞాతవాసానికి భంగం కలగదు," అన్నాడు అర్జునుడు.

"మత్స్యదేశాన్ని పాలించే విరాటుడు ధర్మ శీలుడూ, బలవంతుడూ, మన మేలు కోరేవాడూనూ. మనం ఏడాది పాటు అతని వద్ద కొలువు చేద్దాం. మీరందరూ ఏయే వృత్తులు అవలంబించదలిచారు?" అని ధర్మరాజు మిగిలిన వారిని అడిగాడు.

అర్జునుడు విచారంగా, "అన్నా, మామాట కేమిటి గాని, ఎవరికీ ఎన్నడూ సేవ చేసి ఎరగని నువ్వు విరాటుణ్ణి ఏ విధంగా కొలుస్తావు? ఆ మాట తలుచుకుంటేనే మాకు తహ తహ పుట్టుతున్నది," అన్నాడు.

దానికి ధర్మరాజు, "నేను బ్రాహ్మణ వేషం ధరించి, కంకుడు అని పేరు పెట్టుకుని విరాటుడి సభలో చేరిపోతాను. పాచికల ఆటతో రాజునూ, మంత్రులనూ, సామంతులనూ రజింపజేస్తాను. ఇంతకు పూర్వం ఏం చేసేవాడిపని అడిగితే ధర్మరాజుకు ప్రాణ

38. అజ్ఞాతవాసారంభం



స్నేహితుడుగా ఉండేవాణ్ణి అని చెబుతాను." అని భీముడి కేసి తిరిగి, "భీమసేనా, విరాటుడి వద్ద నువు ఏం పని చెయ్యదలిచావు?" అని అడిగాడు.

"నాకు వంట చెయ్యడంలో నేర్పున్నది. వల్లవు డని పేరు పెట్టుకుంటాను. విరాటుడు ఏనాడూ తినని వంటకాలు తినిపిస్తాను. అయుధం లేకుండా కట్టెలు చీల్చి, పెద్ద పెద్ద కట్టెల మోపులను అవలీలగా మోసి, రాజు ఎలాటి సాహస కార్యాలకైనా నన్ను నియోగించేటట్టు చేస్తాను. రాజుగారి వినోదం కోసం ఎలాటి మల్లులనైనా జయిస్తాను. పూర్వం ఏం చేసేవాడివని అడిగితే ధర్మరాజు దగ్గిర బానిసగా ఉండేవాణ్ణి అని చెబుతాను. నేను బయట పడకుండా జాగ్రత్త పడతాను, మీరేమీ విచారించకండి," అన్నాడు భీముడు.

అర్జునుడి సమస్య అదివరకే తేలిపోయింది. అతన్ని నపుంసకుడు కమ్మని ఊర్వశి శపించగా, ఇంద్రుడు ఆ శాపాన్ని అరునుడు అజ్ఞాతవాస కాలంలో అనుభవించేటట్టు అనుగ్రహించాడు.

"నేను బృహన్నల అనే పేరు పెట్టుకుని, నా ముంజేతికి కాచిన కాయలు కనపడకుండా కంకణాలు తొడుక్కుని, ఆడదీ మగవాడూ కాని అవతారంతో విరాటుడి అంతఃపురం ప్రవేశించి, నాట్య సంగీతాలతో అంతఃపురస్త్రీలను రంజింప జేస్తాను. నువు పూర్వం ఏంచేసేదానివి అని అడిగితే ద్రౌపదికి పరిచర్యలు చేసేదాన్ని అని చెబుతాను," అన్నాడు అర్జునుడు.

"నేను దామగ్రంథి అని పేరు పెట్టుకుని విరాటుడి గుర్రాలకు శిక్షకుడుగా పని చేస్తాను. గుర్రాల జబ్బులకు చికిత్సచేస్తాను. నాకు అశ్వవైద్యం బాగా తెలుసు గద. పూర్వం ధర్మరాజు దగ్గిర అశ్వాధికారిగా ఉండేవాణ్ణి అని చెబుతాను," అని నకులుడు అన్నాడు.

"తంత్రీపాలు డనే పేరు పెట్టుకుని విరాటుడి గోవులను పాలిస్తాను. నేను పూర్వం నీ ఆజ్ఞమీద ఈపని చేసినవాణ్ణే గనక కొత్త

ఏమీ కాదు. నాకు అవులను గురించీ, అబోతులను గురించీ తెలియనిది ఏమీ లేదు." అన్నాడు సహదేవుడు.

ద్రౌపది ఏమి చేస్తుందనేది ధర్మరాజును బాధించింది. ఆమె సేవలు అందుకున్నదే గాని, సేవలు చేసినదికాదు. సుకుమారి, భర్తల అండన జీవించిన పతివ్రత.

ధర్మరాజు విచారం చూసి ద్రౌపది, "నా కోసం విచారం దేనికి? సైరంధ్రి వృత్తి అనేది గౌరవనీయమైనది. ఇతర దాసీలను చూసినట్టు సైరంధ్రిని లోకువగా చూడరు. అలాటి వృత్తిలో నేను స్త్రీలకు తలలు దువ్వి రకరకాల ముడులు వేస్తూ, విరాటుడి భార్య అయిన సుధేష్ణ వద్ద రహస్యంగా జీవిస్తాను." అన్నది.

తమ్ములూ, ద్రౌపదీ చేసిన నిర్ణయాలతో ధర్మరాజు తృప్తి చెందాడు. ఆయన ధౌమ్యుణ్ణీ, సూతులనూ, ఇతర పనివారినీ ద్రుపదుడి వద్దకు వెళ్ళమన్నాడు; ఇంద్రసేనుడు మొదలైన మంత్రులను ఖాళీ రథాలతో ద్వారకకు వెళ్ళమన్నాడు; పాండవులు ఎటు వెళ్ళారో మాకు తెలియదని చెప్పమని అందరినీ హెచ్చరించాడు.

రాజుల వద్ద సేవ చేసేవారు తెలుసుకోదగిన ధర్మాలన్నిటినీ ధౌమ్యుడు పాండవులకు బోధించాడు. ఎవరి దారిన వారు వెళ్ళిపోగా పాండవులు తమ ఆయుధాలన్నిటినీ



వెంట తీసుకుని ద్వైతవనం నుంచి బయలుదేరారు. వాళ్ళు వనాలూ, కొండలూ దాటి వెళ్ళి మత్స్యదేశం ప్రవేశించారు. ఆ మత్స్యదేశం దశార్ణదేశాలకు ఉత్తరానా, పాంచాలానికి దక్షిణానా, శూరసేన దేశాలకు మధ్యనా ఉన్నది.

ద్రౌపది మిగిలిన వాళ్ళతో, "ఇక్కడ పొలాలూ, దారులూ చాలా కనిపిస్తున్నాయి. విరాటనగరం ఇంకా చాలా దూరం ఉండవచ్చు. నేను అలిసి పోయాను. ఈ రాత్రి గడిచే వరకూ, ఈ అరణ్యంలోనే ఉండి పోదాం," అన్నది.

ధర్మరాజు అడవి దాట నిశ్చయించి, ద్రౌపదిని మోసుకురమ్మని అర్జునుడితో



అన్నాడు. ఆ విధంగా వాళ్ళు విరాటనగరం పొలిమేర చేరారు.

అప్పుడు ధర్మరాజు తమ ఆయుధాలను గురించి ఆలోచించాడు. వాటితో నగరం ప్రవేశించటానికి లేదు. పైపెచ్చు, అర్జునుడి గాండీవం ప్రపంచానికంతకూ తెలిసిన ఆయుధం. పాండవులను పట్టి ఇవ్వటానికి అది ఒకటే చాలు. అందుచేత ఆయుధాలన్నిటినీ దాచటానికి తగిన చోటు వెతకమని ధర్మరాజు అర్జునుడితో అన్నాడు.

అర్జునుడు నాలుగు వైపులా కలియజూశాడు. అతనికి శ్మశానమూ, అందులో విపరీతంగా పెరిగిపోయిన జమ్మిచెట్టూ కనిపించాయి. ఆ ప్రాంతానికి ఎవరూ రారు. ఒకవేళ వచ్చినా, జమ్మిచెట్టు పైభాగం ఎవరికీ కనిపించదు. అందుచేత తమ ఆయుధాలను ఆ చెట్టుకొమ్మల గుబుళ్ళమధ్య దాచటానికి అర్జునుడు నిశ్చయించాడు.

పాండవులందరూ తమ ధనుస్సులను ఎక్కుదించి నేలపైన ఉంచారు. తమ ఖడ్గాలను కూడా ధనుస్సులతో చేర్చారు. ధర్మరాజు ఆజ్ఞాపించగా నకులుడు జమ్మిచెట్టు మీదికి ఎక్కి, వర్షపు నీరు కూడా పడనంత దట్టమైన ఆకుల మధ్య ఆయుధాలను దాచి, వాటి మీద ఒక శవాన్ని కప్పాడు.

శవాన్ని చెట్టు మీదికి ఎక్కించటం దూరం నుంచి గొల్లవాళ్ళు ఎవరో చూసినట్టున్నారు. పాండవులు వాళ్ళతో, "నూటఎనిమిదేళ్ళ వయసు గల మా తల్లి చచ్చిపోయింది. మా కులాచారం ప్రకారం శవాన్ని చెట్టు మీద ఉంచాము," అని చెప్పారు.

తరవాత వాళ్ళు విరాటనగరం కేసి బయలుదేరారు. వారు తమలో తాము ఉపయోగించుకోవటానికి జయుడూ, జయంతుడూ, విజయుడూ, జయత్సేనుడూ, జయద్బలుడూ అనే పేర్లు పెట్టుకున్నారు.

విరాటనగరానికి వెళ్ళే దారిలో ధర్మరాజు దుర్గను ధ్యానించి, "తల్లీ, నీవే మాకు శరణు. మమ్మల్ని కాపాడి కనిపెట్టి ఉండు," అని వేడుకున్నాడు. ఆ దేవి తన

దివ్యరూపంతో ప్రత్యక్షమై, "త్వరలోనే నువ్వు యుద్ధంలో విజయం పొంది, సుఖంగా ఉంటావు," అని దీవించి అంతర్ధానమయింది.

తరవాత ధర్మరాజు ఒక నదిలో స్నానం చేసి, చేతులు మోడ్చి ధర్మదేవతను ధ్యానించి, "యక్షుడుగా నా కిస్తానన్న వరం ఇప్పుడు కోరుకుంటున్నాను," అన్నాడు.

వెంటనే చిత్రంగా ఆయనకు కాషాయ వస్త్రాలతోనూ, కమండలంతోనూ సహా యతి వేషం వచ్చేసింది. మిగిలిన వారి వేషాలకు తగిన పరికరాలన్నీ పక్కనే ప్రత్యక్షమయాయి. అందరూ ఒక్కసారిగా వాటి మీద పడి, ఎవరికి కావలసినవి వారు తీసుకుని, తమ తమ వేషాలు తాము చేయబోయే పనులకు అనుగుణంగా మార్చుకున్నారు.

ధర్మరాజు పాచికలను తన ఉత్తరీయం కొంగున కట్టుకుని, విరాటరాజు కొలువు దీరి ఉన్న సభకు వెళ్ళాడు. యతివేషంలో ఉన్నప్పటికీ ధర్మరాజును చూసి విరాటుడు ఆయన తేజస్సుకు నివ్వెరపోయాడు. ఆయన వెంట పరివారం ఉన్నట్టయితే చక్రవర్తి అన్న భావం విరాటుడికి కలిగి ఉండేదే.

ధర్మరాజు విరాటుణ్ణి సమీపించి, "రాజా, నేను సమస్తమూ కోల్పోయి, కొంత కాలం నీ కొలువులో ఉండగోరి వచ్చాను. మాది వైయాఘ్రపద గోత్రం. నా పేరు కంకుడు. నేను పూర్వం ధర్మరాజు వద్ద ఆయన ఆప్తుడుగా ఉండేవాణ్ణి. జూదంలో నేను ధర్మ





రాజుతో ఓడితే ఆయన నన్ను ఎన్నడూ ధనం అడిగేవాడు కాడు. మీరు కూడా నన్ను అలాగే చూసుకోవాలి,'' అన్నాడు.

ఆ మాటకు విరాటుడు, ''నా పరివారంలో ఎవరైనా నీకు అప్రియం చేస్తే వారిని దండిస్తాను. నిన్ను ఎవరన్నా ధనధాన్యాదులు యాచిస్తే నాకు చెప్పు. నేను వాటిని వారికి ఇస్తాను. అందరూ నన్ను చూసినట్టే నిన్ను చూస్తారు,'' అన్నాడు.

మరి కొంతసేపటికి నల్లని బట్టలు ధరించి భీముడు రాజు వద్దకు వచ్చాడు. అతనికి ఒక చేతిలో గరిటె, మరొక చేతిలో కత్తి ఉన్నాయి. అతను విరాటుణ్ణి సమీపించి, ''రాజా, నేను వంటలవాణ్ణి. నా పేరు వలవుడు. నన్ను నియమించినట్టయితే రకరకాల పంటకాలు చేసి పెట్టగలను,'' అన్నాడు.

''నిన్ను చూస్తే వంటలు చేసే వాడివని నమ్మశక్యం కావటం లేదు,'' అన్నాడు విరాటుడు.

''నా వంట నేర్పు ధర్మరాజుకు తెలుసును. బలంలో కూడా నేను అందరినీ మించినవాణ్ణి. మీరు వినోదించాలంటే ఏనుగులతోనూ, సింహాలతోనూ పోరాడగలను,'' అన్నాడు భీముడు.

''సరే, నువు మా పాకశాలలో పెద్ద వంటవాడుగా పని చెయ్యి,'' అని విరాటుడు భీముణ్ణి తన వంటసాలకు పంపేశాడు.

ఈ లోపల ద్రౌపది మాసిన బట్ట కట్టి, జుట్టు విరబోసుకుని, సైరంధ్రీ వేషంలో వీధుల వెంట తిరుగుతూ ఉండగా, నగరవాసులు, ''అమ్మా, నువు ఎవరు? ఏం చేస్తూంటావు?'' అని అడిగారు.

వారితో ద్రౌపది, ''నేను సైరంధ్రిని. ఎవరన్నా నన్ను పోషిస్తే వారికి కావలిసిన సేవలు చేస్తాను,'' అంటూ వచ్చింది.

రాజభవనం పై భాగాన విహరిస్తున్న సుధేష్ణరాణి ద్రౌపదిని చూసి, పిలిపించి, ''నువు ఎవతెవు? ఏం పని చేస్తావు?'' అని అడిగింది.

''దేవీ, నేను సైరంధ్రిని. నాకు జుట్టు ముడులు వెయ్యటమూ, వంటి పూతలు

తయారు చెయ్యటమూ, తలలో పూలు అమర్చటమూ, పూలమాలలు కట్టటమూ చేతనవును. కృష్ణుడి భార్య అయిన సత్యభామనూ, పాండవుల భార్య అయిన ద్రౌపదినీ మెప్పించిన దాన్ని. ద్రౌపది నన్ను మాలిని అని పిలిచేది.'' అని ద్రౌపది ఎంతో వినయంగా అన్నది.

''నువ్వు చూడబోతే ఆడవాళ్ళనే ఆకర్షించేటంత అందంగా ఉన్నావు. మా మహారాజు నిన్ను చూసినాక మళ్ళీ నా మొహం చూడడేమోననిపిస్తున్నది. ఆయన నీ దాసుడైపోతాడేమోనన్న అనుమానంతో నిన్ను మా అంతఃపురంలో పెట్టుకోవటానికి భయపడుతున్నాను,'' అన్నది రాణి సుధేష్ణ.

''మహారాణీ, నన్ను విరాటరాజుగాని మరొకరుగాని ఏమీ చేయలేరు. మహా బలవంతులైన అయిదుగురు గంధర్వ రాజకుమారులు నా భర్తలు. వారు నన్ను అనుక్షణమూ కనిపెట్టుకుని ఉంటారు. నన్ను కాళ్ళు కడగటంలాంటి పనులు చెప్పకుండా, ఎంగిలి తినమనకుండా ఉంటే నేను ఎంతో ప్రీతితో కొలుస్తాను. నన్ను మామూలు స్త్రీ కింద చూసి నా జోలికి వచ్చిన వారినిమాత్రం నా భర్తలు రాత్రికి రాత్రే చంపిపారేస్తారు,'' అన్నది ద్రౌపది.

ఆ మాటమీద సుధేష్ణ ద్రౌపదిని తన ఇంట ఉండనిచ్చింది.



తరవాత నపుంసకుడి రూపంలో అర్జునుడు విరాటరాజు వద్దకు వచ్చాడు. అతను ముదురు ఎరుపు రంగు బట్టలు ధరించి ఉన్నాడు. అతను సభికులను దాటివెళ్ళి రాజును సమీపించి, ''మహారాజా, నా పేరు బృహన్నల. నాట్య కళలో నాతో సరితూగే వాళ్ళులేరు. నాకు జడలు వెయ్యటమూ, పూలు పెట్టటమూ కూడా వచ్చు,''అన్నాడు.

విరాటుడు నమ్మలేక, ''నీ పొడుగాటి చేతులూ, ఎగు భుజాలూ చూస్తూంటే గొప్ప విలుకాడిలాగా ఉన్నావు,'' అన్నాడు.

''లేదు, మహారాజా. విల్లు ఎలా ఉంటుందో కూడా నాకు తెలీదు. సంగీతం పాడతాను. వీణా, మృదంగమూ వాయి

స్తాను. నాట్యం చెయ్యగలను," అన్నాడు అర్జునుడు.

విరాటుడు తన కూతురైన ఉత్తరను పిలిపించి, "తల్లీ, ఈమె బృహన్నల. ఇకనుంచీ నువ్వు ఈమె వద్దనే నాట్యం నేర్చుకో," అని చెప్పాడు. అర్జునుడు ఉత్తర వెంట అంతఃపురానికి వెళ్ళిపోయాడు.

తరవాత కొంత సేపటికి విరాటుడు తన గుర్రాలను చూడబోయేసరికి, నకులుడు గుర్రాల కేసి పరీక్షగా చూస్తూ కనిపించాడు. ఆయన తన వారితో, "ఆ యువకుడికి గుర్రాల సంగతి తెలిసినట్టున్నది. అతన్ని సభకు పంపండి," అని తాను అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

నకులుడు సభలో ఆయన దర్శనం చేసుకుని, "మహారాజా, బతుకు తెరువు కోసం మీ దేశం వచ్చాను. నన్ను తమ గుర్రాలకు యజమానిగా పెట్టుకోండి. నాకు పొగరుమోతు గుర్రాలను లొంగదీయటమూ, గుర్రాల జబ్బులు నయం చెయ్యటమూ తెలుసు. ఒకప్పుడు ధర్మరాజుగారి అశ్వాలను పాలించేవాణ్ణి. నా పేరు దామగ్రంథి," అన్నాడు.

విరాటుడు అతని మాటలకు తృప్తిపడి, అతన్ని తన గుర్రాలకూ, రథాలకూ అధిపతిగా నియమించాడు.

మరి కొంతసేపటికి సహదేవుడు సభ దగ్గిరికి వచ్చాడు. అతను అచ్చమైన గొల్లవాడి వేషంలో, పూలదండలు వేసుకుని, తాళ్ళు పట్టుకుని, పొడుగైన వేణువు చేతబట్టి ఉన్నాడు. అతను రాజును సమీపించి, "మహారాజా, నేను మీ గోవులకు చోరబాధా, రోగబాధా లేకుండా చూసి, పాలు మరింతగా ఇచ్చేటట్టు చూడగలను. నేను అరిష్టనేమి అనే వైశ్యుణ్ణి. ధర్మరాజు గారి కోటి గోవులు నా అధీనంలో ఉండేవి. నన్ను తంత్రీపాలుడని పిలుస్తారు," అన్నాడు.

విరాటుడు తృప్తిపడి, సహదేవుణ్ణి తన గోపాలకుడుగా నియమించాడు.

ఈ విధంగా పాండవులు అయిదుగురూ విరాటుడి అండచేరి తమ అజ్ఞాతవాసం ప్రారంభించారు.






పాండవులూ, ద్రౌపదీ విరాటరాజు వద్ద గుట్టుగా అజ్ఞాతవాసం చేస్తున్నారు. ధర్మరాజు పాచికలాటలో డబ్బు గెలిచి తన తమ్ముళ్ళకు పంచి పెట్టేవాడు. భీముడు తాను వండిన రకరకాల మాంసాలు మిగిలిన వారికి ఇచ్చేవాడు. అర్జునుడు అంతఃపురంలో తనకు లభించే పాత బట్టలను అందరికీ చేర్చేవాడు. నకులుడు తన అశ్వపోషణకు మెచ్చి రాజు ఇచ్చే బహుమానాలను మిగిలిన వారికి పంచేవాడు. సహదేవుడు పాలూ, పెరుగూ అందించేవాడు. ద్రౌపది తన భర్తలందరినీ కనిపెట్టుతూ తన రహస్యం బయట పడకుండా మసలుకుంటున్నది. తమ ఆచూకీ దుర్యోధనుడికి తెలిసిపోతుందన్న భయం అందరికీ ఉన్నది.

ఇలా నాలుగు మాసాలు గడిచింది. అప్పుడు మత్స్యదేశంలో బ్రహ్మోత్సవం జరిగింది. ఆ ఉత్సవానికి దేశదేశాల నుండి మల్లులు వచ్చారు. విరాటరాజుకు మల్లయుద్ధం గురించి బాగా తెలుసు. అందుచేత ఆయన మల్లవీరులకు చక్కని సౌకర్యాలు కలిగించి, వారి మధ్య యుద్ధాలు ఏర్పాటు చేసి చూసి ఆనందిస్తూ వచ్చాడు.

అలా వచ్చిన మల్లులలో జీమూతుడనే వాడు మహా బలశాలి. వాడు అందరినీ తనతో యుద్ధం చెయ్యమని పిలిచేవాడు. మిగిలిన మల్లులు వాడితో యుద్ధం చెయ్యటానికి భయపడ్డారు. అందుచేత విరాటుడు తన వంట వాడుగా ఉంటున్న భీముణ్ణి పిలిచి, జీమూతుడితో మల్లయుద్ధం చెయ్య

39. కీచకుడి విజృంభణ



మన్నాడు. రాజు ఆజ్ఞాపిస్తే కాదనటం బాగుండదని భీముడు సమ్మతించాడు.

భీముడూ, జీమూతుడూ రెండు మదపు ఏనుగుల లాగా మల్లయుద్ధం ప్రారంభించారు. మహా దారుణమైన వారి యుద్ధం చూసి ప్రేక్షకులు పరమానందం చెందారు. భీముడు జీమూతుణ్ణి పట్టుకుని గిరగిరా తిప్పేసరికి మిగిలిన మల్లులు దిగ్భ్రమ చెందారు. భీముడు జీమూతుణ్ణి అలా తిప్పి, తిప్పి నేల కేసి కొట్టి, చంపేశాడు. జీమూతుణ్ణి జయించిన భీముడికి విరాటుడు అంతులేని ధనం కానుక ఇచ్చాడు.

భీముడి శక్తి సామర్థ్యాలు చూసి రాజు అతనిని మల్లులతోనే గాక, సింహాలతోనూ, ఏనుగులతోనూ, పులులతోనూ పోట్లాడించి వినోదించేవాడు. ఈ పోరాటాలు చూడటానికి అంతఃపుర స్త్రీలు కూడా వచ్చేవారు.

అర్జునుడు అంతఃపుర స్త్రీల చేత పాటలు పాడించి, నాట్యాలు చేయించి రాజుకు ఆనందం కలిగించేవాడు. పొగరుబోతు గుర్రాలను అధీనంలోకి తెచ్చి, వాటికి కళ్ళాలు తగిలించి, రాజుకు చూపి నకులుడు చాలా ధనం బహుమానంగా పొందాడు. అలాగే సహదేవుడు పొగరైన ఆబోతులను మచ్చిక చేసి బహుమతులు సంపాదించాడు. తన భర్తలు రాజు కొలువులో పడే పాట్లుచూసి ద్రౌపది బాధ పడేది.

ఈ విధంగా పాండవుల అజ్ఞాతవాసం దాదాపు ఏడాది పూర్తికావచ్చింది. ఆ సమయంలో ద్రౌపది పాలిటికి సింహబలుడు అనే కీచకుడు దాపరించాడు. ఈ కీచకుడు విరాటరాజు బావమరిదీ, సేనాపతి కూడానూ. అతను సుధేష్ణ ఇంట ద్రౌపదిని చూసి మోహపరవశుడై, తన చెల్లెలితో, "నేనీమెను ఇక్కడ ఇది వరకు చూడలేదు. ఈమె అందం నన్ను సమ్మోహితుణ్ణి చేస్తున్నది. ఈమె ఎవరు? అప్సరసలాటి రూపం గల ఈమె ఎక్కడి నుంచి వచ్చింది? ఇంత సౌందర్యవతి చేత చాకిరీ చేయించడమేమిటి? ఈమె నా యింటికి వస్తే పువ్వుల్లో పెట్టి పూజిస్తాను," అన్నాడు.



అతను సుధేష్ణ వద్ద సెలవు పుచ్చుకుని, ద్రౌపది ఒంటరిగా ఉన్నప్పుడు ఆమెకు తన కోరిక తెలిపాడు.

ద్రౌపది అతనితో, "నాతో ఇలా మాట్లాడటం తప్పు. నేను మరొకరి భార్యను. నన్ను కోరటం నీకు కీడు," అన్నది.

"నన్ను అలా తోసి పుచ్చకు. తరవాత పశ్చాత్తాప పడగలవు. ఈ రాజుకూ, రాజ్యానికీ నేనే ఆధారం. భోగ భాగ్యాలలోనూ, రూపంలోనూ, యౌవనంలోనూ నన్ను మించిన వాళ్ళు ఈ లోకంలో లేరు. అలాటి నన్ను నీ సేవకుడుగా చేసుకుని వివిధ భోగాలు అనుభవించక దాసిగా ఎందుకు పని చేస్తావు?" అన్నాడు కీచకుడు.

ద్రౌపది మండి పడి, "నా మీద మోహం విడిచి పెట్టక పోయావో నీ ప్రాణాలకు అపాయం ఉన్నది. నా భర్తలైన అయిదుగురు గంధర్వులు నన్ను అహర్నిశలు కనిపెట్టి ఉంటారు. వారికి నీ సంగతి తెలిస్తే నీకు చావు తప్పదు. వారి నుంచి నిన్ను ఎవరూ కాపాడే వాళ్ళు లేరు," అన్నది.

ద్రౌపది ఈ మాటలు అన్నా కూడా కీచకుడు నిరుత్సాహ పడలేదు. అతనికి ఆమె మీది మోహం అంతకంతకూ ఎక్కువ కాసాగింది. అతను మళ్ళా సుధేష్ణ వద్దకు వెళ్ళి, "ఎలాగైనా సైరంధ్రిని నాకు దక్కేటట్టు చేయక పోయావో, నా ప్రాణాలు నిశ్చయంగా పోతాయి. నేను ఎన్ని రకాల ప్రార్థించినా ఆమె మనసు నా కేసి మరలటం లేదు," అన్నాడు.

సుధేష్ణ అన్న దుస్థితి చూసి చాలా బాధ పడి, "సైరంధ్రి నాకు ఆశ్రితురాలు. ఆమెను రక్షిస్తానని నేను మాట ఇచ్చాను. తనకు అయిదుగురు గంధర్వులు భర్తలని ఆమె మొదటనే చెప్పింది. అన్నవు గనక ఈ రహస్యం నీకు చెప్పాను. సైరంధ్రి మీద భ్రమ పెట్టుకుని ప్రాణాపాయం తెచ్చుకోకు," అన్నది.

"వెయ్యిమంది గంధర్వులు కూడా నన్నేమీ చెయ్యలేరు. నా వంటి అందగాణ్ణి ఎంతటి పతివ్రత అయినా కోరుతుంది.

నా వైభవం చూసి సైరంధ్రి మనసు నా మీదికి తప్పక తిరుగుతుంది. ఎలాగైనా ఆమెను నాకు అనుకూలవతిని చేసి నా ప్రాణాలు నిలబెట్టు," అంటూ కీచకుడు తన చెల్లెలిని బతిమాలసాగాడు.

"ఓరీ, పాపీ! నువు కూడని పని తల పెట్టటమే గాక అందుకు నన్ను సాధనంగా ఉపయోగించుకో జూస్తున్నావు. నీ పాపం నీతో పోదు, కులాన్నే నాశనం చేస్తుంది. నువు ఇంటికి వెళ్ళి, కల్లూ, మధురాన్నమూ సిద్ధం చేయించి ఉంచు. వాటిని తీసుకు రావటానికి సైరంధ్రిని పంపుతాను. ఆమెను ఎలా లోబరుచుకుంటావో!" అన్నది సుధేష్ణ.

కీచకుడు వెంటనే తన యింటికి వెళ్ళి, భక్ష్య భోజ్య పానీయాలు తయారు చేయించి, ద్రౌపది కోసం చూడసాగాడు.

తరవాత సుధేష్ణ ద్రౌపదితో, "సైరంధ్రీ, నాకు చాలా దాహంగా ఉన్నది. నువు కీచకుడి ఇంటికి వెళ్ళి, తాగటానికి ఏమైనా తీసుకురా," అని ఆజ్ఞాపించింది.

"అమ్మా, నేను అతని ఇంటికి వెళ్ళలేను. అతను కామోద్రేకంతో కొట్టుకుపోతున్న సంగతి నీకు తెలును గదా. నేను వెళ్ళితే అతను తప్పక నన్ను అవమానపరుస్తాడు. నీ వద్ద ఇంకా ఎందరో పరిచారికలున్నారు. వారిలో ఎవరినైనా పంపు," అన్నది ద్రౌపది.



"కల్లు తెమ్మని నేనై పంపుతూంటే, వాడు నిన్ను తాకగలడా?" అంటూ సుధేష్ణ ద్రౌపదికి ఒక బంగారు పాత్ర ఇచ్చింది.

గత్యంతరం లేక ఆ పాత్ర తీసుకుని ద్రౌపది కీచకుడి ఇంటికి వెళ్ళింది. ఆమెను చూస్తూనే కీచకుడు పరమానందంతో లేచి, "సుందరీ, నీకు స్వాగతం. నా ప్రాణేశ్వరివైన నువు నా దగ్గిరికి వచ్చావు. నా కోరిక తీర్చు. దివ్యాంబరాలు ధరించు, రత్నాలంకారాలు అలంకరించుకో. నాతో కలిసి తాగి, సుఖంగా ఉండు." అన్నాడు.

"రాణిగారు కల్లు తెమ్మని పంపింది. ఆమెకు చాలా దాహంగా ఉన్నదట. వెంటనే కల్లు ఇప్పిస్తే నేను పోతాను," అన్నది ద్రౌపది.



"కల్లు మరొకతె చేత పంపిస్తాలే," అంటూ కీచకుడు ఆమె చేతిని పట్టుకున్నాడు.

ద్రౌపది కంగారు పడుతూ కీచకుణ్ణి ఒక్క తోపుతో పడదోసి, పరిగెత్తుకుంటూ విరాటరాజు సభలో ప్రవేశించింది. కీచకుడు ఆమె వెంట పడి, విరాటరాజు చూస్తూండగానే జుట్టు పట్టుకుని ఆపాడు.

ఈ దురన్యాయాన్ని ధర్మరాజూ, భీముడూ సభలో ఉండి కళ్ళారా చూశారు. భీముడికి ఆ క్షణంలోనే కీచకుణ్ణి చంపాలనిపించి, పళ్ళు పట పటా కొరికాడు. అతని శరీరమంతా చెమట పట్టింది. కళ్ళ నిప్పులు రాలాయి. ఎదురుగా కనబడే చెట్టును పీకే ఉద్దేశంతో అతను లేచాడు.

ధర్మరాజు భీముడి కాలి బొటన వేలిని తన బొటన వేలితో నొక్కి, "ఏమోయ్, కట్టెల కోసం ఈ చెట్టును ఎందుకు పడగొడతావు? అవతల ఇంకా చాలా చెట్లున్నాయి. వాటిని పడగొట్టు," అన్నాడు.

ఈ లోపల ద్రౌపది తన భర్తల అశక్తత గ్రహించి, చుర చురా చూస్తూ విరాటుడి కేసి తిరిగి, "ఈ నీచుడు నన్నిలా అవమానిస్తూ ఉంటే మహా బలులైన నా భర్తలు, గంధర్వులు, కాలానికి కట్టుపడి నన్ను కాపాడలేని స్థితిలో ఉన్నారు. అలాటప్పుడు రాజువైన నీవైనా రక్షకుడివై, మానభంగం కలగకుండా చూడడానికి బదులు ఉపేక్షిస్తావా?" అని సభలో వారితో, "రాజుకూ, కీచకుడికి లాగే మీకు కూడా ధర్మం తెలియదు లాగుంది," అన్నది.

అప్పుడు విరాటరాజు, "ఏమమ్మా, మీ ఇద్దరికీ పరోక్షంగా ఏమి తగాదా వచ్చినదీ తెలియకుండా నేను ఎలా మీ మధ్య ధర్మ నిర్ణయం చెయ్యగలను?" అని ద్రౌపదితో అన్నాడు.

అప్పుడు ధర్మరాజు ద్రౌపదితో, "ఓసీ, నువు ఇక్కడ తారట్లాడక అంతఃపురానికి పో. నీ భర్తలు ఏమీ చెయ్యకపోతే దానికి కారణం ఉండే ఉంటుంది. దేశమూ, కాలమూ ఆలోచించకుండా ఇక్కడ శోకాలు పెట్టి రాజ సభలో ఎందుకు గల్లంతు చేస్తావు?

నీకు అపకారం చేసిన వారిని నీ భర్తలే దండిస్తారులే," అన్నాడు.

ద్రౌపది సుధేష్ణ మందిరానికి తిరిగిపోయి, జుట్టు విరబోసుకుని, శోక దేవతలాగా కూర్చున్నది. ఆమె అవతారం చూసి సుధేష్ణ, "మాలినీ, ఎవరు నీకు కష్టం కలిగించారు?" అని అడిగింది.

"నువు కల్లు తెమ్మని పంపిస్తే కీచకుడు నన్ను బాధించి, నిండు సభలో పరాభవించాడు. ఇలా చెయ్యటం వల్ల ఎవరికి రోషం వస్తుందో వాళ్ళే అతని అంతు చూస్తారు," అన్నది ద్రౌపది.

నిజంగా కీచకుణ్ణి చంపించటానికే ఆమె నిశ్చయించుకున్నది. ఆమె తన ఇంటికి వెళ్ళి, స్నానం చేసి, బట్టలు ఉతికేసి, తన కోరిక తీర్చగలవాడు భీముడు ఒకడే నని నిశ్చయించుకున్నది. ఆమె రాత్రి వేళ భీముడుండే ఇంటికి వెళ్ళింది. భీముడు బుసలు కొట్టుతూ గాఢ నిద్రలో ఉన్నాడు. ద్రౌపది అతని వద్దకు వెళ్ళి, గట్టిగా కౌగలించుకుని, "చచ్చిపోయిన వాడిలాగా ఇలా చలనం లేకుండా ఉన్నావేం? బతికున్నవాడు తన భార్యను ఎవడన్నా ఇలా నిండు సభలో అవమానం చేస్తే ఊరుకుంటాడా? లే, లే!" అన్నది.

భీముడు మేలుకుని పక్క మీది నుంచి లేచి, "ఏమిటి ఇలా పాలిపోయి, చిన్నబోయి ఉన్నావు? ఇక్కడి కెందుకు వచ్చావు? నా వల్ల కావలిసిన పని ఉంటే చెప్పి, ఎవరికీ తెలియకుండా వెళ్ళి పడుకో," అన్నాడు.



"అన్నీ తెలిసి నన్నెందు కిలా అడుగుతున్నావు? మీ అన్న జూదగాడు కావటంతో నాకు ఇన్నిపాట్లు వచ్చాయి. నేను ఈ విరాటుడి భార్య దగ్గిర సేవలు చేస్తూ ఉండటమే గాక కీచకుడు నా వెంటబడి నాకు సహించరాని అవమానం చేశాడు. నాకు ఆ విరాటరాజు ఏమంటాడోనన్న భయం కూడా ఉన్నది. చాకిరి చేసి చేసి నా చేతులు ఎలా మొరటు దేలాయో చూడు," అంటూ ద్రౌపది భీముడికి తన చేతులు చూపింది.



61

భీముడు ఆమెతో, "ఆ కీచకుడు నిన్ను సభలో కాలితో తన్నినప్పుడు వాణ్ణి అక్కడే చంపేద్దామనుకున్నాను గాని, ధర్మరాజు వారించాడు. అసలు ఆ రోజే దుర్యోధన కర్ణ శకుని దుశ్శాసనుల తలలు పగల గొట్టకపోతినే! కొద్ది రోజులు ఓర్చు కున్నా వంటే తిరిగి నువు మహారాణివి అవు తావు." అన్నాడు.

"ఈ దుఃఖం భరించటం నా వల్ల కాదు. నేను తిరిగి రాణిని కావటం అబద్ధం. ఈ కబుర్లన్నీ దేనికి? ఇప్పుడు జరిగిన దానికి ప్రతీకార మార్గం ఆలోచించు. సుధేష్ణ కన్న నేను బాగుంటానని విరాటుడు చూస్తున్నాడు. అది తెలిసి కీచకుడు నా వెంట పడ్డాడు. నాకు అయిదుగురు గంధర్వులు భర్తలున్నారనీ, వాళ్ళు ప్రాణాలు తీస్తారనీ మంచిగా చెప్పి చూశాను. కాని వాడు నా మాట లక్ష్యపెట్టడు. సుధేష్ణ వాడికి సహాయం వచ్చి, కల్లు తెమ్మని నన్ను వాడి ఇంటికి పంపింది. వాడు నన్ను పట్టుకోబోయాడు. నేను పారిపోయి వచ్చి రాజభవనంలో దూరాను. అందరూ చూస్తుండగా ఆ దుర్మార్గుడు నన్ను కాలితో తన్నాడు. ఈ దుర్మార్గుణ్ణి నువు కుండను పగలగొట్టి నట్టు ధ్వంసం చెయ్యకపోతే నేను విషం తాగి చస్తాను," అంటూ భీముణ్ణి గట్టిగా కౌగలించుకుని ఏడ్చింది ద్రౌపది.

భీముడు ఆమెను గట్టిగా పట్టుకుని, కన్నీరు తుడుస్తూ ఓదార్చి, "నువు చెప్పి నట్టే వాణ్ణి చంపేస్తాను. దానికి నువు ఒక పని చెయ్యాలి. ఇలా ఏడుపు మొహంతో కాకుండా, నవ్వుతూ కళకళలాడే మొహంతో కీచకుణ్ణి కలుసుకుని, వాడి కోరిక తీర్చే దానిలాగా అభినయించు. నర్తనశాలలో పగలు స్త్రీలు ఆడుతారు, పాడుతారు. రాత్రి వేళ అక్కడ ఎవరూ ఉండరు. అక్కడ ఒక మంచం కూడా ఉన్నది. రాత్రికి అక్కడికి వాణ్ణి రమ్మను. మూడో కంటి వాడికి తెలియకుండా అక్కడ కీచకుణ్ణి వాడి తాతల వద్దకు పంపుతాను." అన్నాడు.

ఇలా మంత్రాలోచన చేస్తూ వాళ్ళు ఆ రాత్రి గడిపారు.






మర్నాడు తెల్లవారగానే కీచకుడు రాజభవనానికి వచ్చి ద్రౌపదిని చూసి, "నా పరాక్రమం చూశావు గదా! నిన్న రాజసభలో నిన్ను తన్నితే ఒక్కడు కూడా నోరెత్తలేక పోయాడు. ఈ విరాటుడు పేరుకే రాజు. సేనలన్నీ నా అధీనంలో ఉన్నాయి. నేనే అసలైన రాజును. అలాటి నా చేత సేవలు చేయించుకుని నన్ను ధన్యుణ్ణి చెయ్యి. నీకు రోజుకు నూరు నిష్కాలు (మాడలు) ఇస్తాను. వందల కొద్దీ దాసదాసీలను ఇస్తాను. మంచి రథం ఇస్తాను," అని మళ్ళీ బతిమిలాడ నారంభించాడు.

"నీకు నిజంగా నేను కావాలంటే, నేను చెప్పిన నియమాలకు లోబడాలి. మన రహస్యం రాజసభకు గాని, నీ తమ్ములకు గాని ఏ మాత్రమూ తెలియరాదు. ఈ రహస్యం బయటికి పొక్కిందో గంధర్వులు తప్పక తెలుసుకుంటారు. అదే నా భయం. ఇందుకు నువు ఒప్పుకుంటే నేను నీ దాసను అవుతాను," అని ద్రౌపది అన్నది.

కీచకుడు, "అలా అయితే ఎవ్వరికీ తెలియకుండా నువు ఉండే చోటికి వస్తాను. గంధర్వులకు ఏ మాత్రమూ తెలియనివ్వను," అన్నాడు.

అప్పుడు ద్రౌపది, "నర్తనశాలలో రాత్రి వేళ ఎవరూ ఉండరు. బాగా చీకటి పడినాక అక్కడికి రా. మనం అక్కడ కలుసుకుంటే ఎవరికి తెలీదు. గంధర్వులు కనుక్కోలేరు," అన్నది.

40. కీచకవధ



తరవాత ఆమె, తాను కీచకుడితో చేసిన ఏర్పాటు గురించి భీముడికి తెలిపింది.

సైరంధ్రి ఆహ్వానం మృత్యువు పిలుపేనని గ్రహించలేని మూర్ఖుడు, కీచకుడు, ఆమె తనకు దక్కబోతున్నదని నమ్మి, ఆ పగలు ఎలా గడిచినదీ కూడా తెలుసుకోలేక పోయాడు.

ఈ లోపల భీముడికి కీచకుణ్ణి చంపాలన్న ఉత్సాహం మితిమీరి పోయింది. అతను ద్రౌపదితో, "వాణ్ణి రహస్యంగా కాకపోతే బహిరంగంగానే చంపుతాను. వాణ్ణి చంపి అలాగే వెళ్ళి దుర్యోధనుణ్ణి చంపేస్తాను. కావలిస్తే ధర్మరాజును ఈ విరాటరాజు కొలువు చెయ్యనీ!" అన్నాడు ఉద్రేకంతో.

ద్రౌపది అతన్ని నిగ్రహించుతూ, "నువు వాణ్ణి నియమాలు ఉల్లంఘించకుండా చంపు," అన్నది.

"సరే, ఇవాళ రాత్రి చీకటిలో నేనెవరో కూడా వాడికి తెలియరాకుండా నువు చెప్పినట్టే చంపి పారేస్తాను," అన్నాడు భీముడు.

ఆ రాత్రి గాఢాంధకారంలో భీముడు నర్తనశాల చేరుకుని, లేడి రాక కోసం వేచి ఉండే సింహం లాగా కీచకుడి కోసం పొంచి ఉన్నాడు.

త్వరలోనే కీచకుడు రకరకాల అలంకారాలు చేసుకుని, సైరంధ్రి కోసం తహతహ లాడుతూ నర్తనశాల ప్రవేశించాడు. భీముడు మంచం మీద పడుకుని ఉన్నాడు. కీచకుడు అతన్ని చేత్తో తడుపుతూ, "నా అంతఃపురంలో ఎన్నో అలంకారాలు చేయించి, వందల కొద్దీ దాసీలనూ, బోలెడంత ధనాన్నీ నీ కోసం సిద్ధంగా ఉంచాను. నా అంతఃపుర స్త్రీలు నా వంటి అందగాడు ప్రపంచంలో లేడని మెచ్చుకుంటారు. అలాటి వాణ్ణి నీ కోసం ఈ చీకటిలో పడి ఒంటరిగా వచ్చాను," అన్నాడు.

దానికి భీముడు, "నిజంగా నువు అందగాడివే. కాని ఇలాటి స్పర్శ నువు ఎప్పుడూ అనుభవించి ఉండవు." అంటూ మంచం మీది నించి లేచి, "ఏనుగును సింహం

చంపినట్టు నిన్ను చంపుతాను. సైరంధ్రికి నీ పీడ విరగడ అయిపోతుంది," అంటూ కీచకుడి జుట్టు పట్టుకుని లాగాడు.

కీచకుడు తన జుట్టు విడిపించుకుని భీముడితో కలియబడ్డాడు. జయించాలన్న దీక్షతో ఇద్దరూ భయంకరంగా పోరాడుతూ, చేతులతోనూ, గోళ్ళతోనూ, పళ్ళతోనూ ఒకరి నొకరు హింసించారు. కీచకుడు ఎంత బల మైన దెబ్బలు కొట్టినా భీముడు నిలబడిన చోటి నుంచి కదలకుండా స్తంభం లాగా ఉండి పోయాడు. వారి పోరాటంతో నర్తన శాల కంపించి పోయింది.

ఈ పోరాటం మధ్యలో భీముడు కీచ కుణ్ణి బలంగా కాలితో తన్ని పడదోశాడు. ఆ పాటుకు కీచకుడు కదలక పోవటం చూసి అతని రొమ్ములో బలంగా పొడిచాడు. తర వాత కీచకుణ్ణి చేతులతో పట్టుకుని గిరగిరా తిప్పాడు. కీచకుడి గొంతు పట్టుకుని పిసి కాడు. తరవాత కీచకుడి మీద ఎక్కి మోకాళ్ళతో కుమ్ముతూ పశువును చంపి నట్టు చంపాడు. కీచకుడు చచ్చిన తరవాత కూడా వదలక, అతని కాళ్ళూ, చేతులూ, తలా మొండెంలోకి తోసి, కీచకుడి శవాన్ని ఒక పెద్ద మాంసపు ముద్దలాగా తయారు చేశాడు.

భీముడు ఆ స్థితిలో ఉన్న శవాన్ని కాలితో ఒక్క తన్ను తన్ని, మంట చేసి, దాని



వెలుగులో ఆ శవాన్ని ద్రౌపదికి చూపి, "నిన్ను కామించిన వాడి కెవడికైనా ఇదే గతి!" అని చెప్పి, వంట ఇంటికి వెళ్ళి పోయాడు.

తరవాత ద్రౌపది నర్తనశాలను చూసే సేవకులను లేపి, "కీచకుణ్ణి గంధర్వులు నర్తనశాలలో చంపారు. వెళ్ళి చూడండి." అని చెప్పింది. వాళ్ళు కంగారు పడుతూ దివిటీలు వెలిగించి నర్తనశాలలో ప్రవేశించి, అమానుషంగా చంపబడిన కీచకుడి శవాన్ని చూసి, కాళ్ళూ, చేతులూ, మెడా ఎక్కడ ఉన్నదీ పోల్చలేకపోయారు.

అక్కడ ఉండే కీచకుడి బంధువులు శవం చుట్టూ చేరి ఏడవసాగారు. తాబేలు



లాగా అయిపోయిన కీచకుడి శవం చూసి వారికి కంపరం పుట్టింది. శవానికి సంస్కారం చెయ్యాలి గనక ఉపకీచకులు దాన్ని తీసుకుపోయే యత్నంతో ఉండగా, దగ్గిర లోనే ఒక స్తంభాన్ని కౌగలించుకుని ఉన్న సైరంధ్రి వారి కంట పడింది.

"దీని కోసమే మన అన్న చచ్చాడు. దీన్ని కూడా మన అన్న శవంతో బాటు దహించితే అతడికి సంతోషం కలుగుతుంది," అనుకుని ఉపకీచకులు విరాటుడితో ఆమెను కీచకుడితో పాటు దహనం చేస్తామనీ, అందుకు అనుమతి ఇవ్వమనీ అన్నారు.

విరాటుడు వారికి ఎదురు చెప్పే ధైర్యం లేక సరేనన్నాడు.

ఉపకీచకులు ద్రౌపదిని కీచకుడి శవంతో కలిపి కట్టి, శ్మశానానికి బయులుదేరారు. దారిలో ద్రౌపది గట్టిగా గొంతెత్తి తన భర్తలను వారి రహస్య నామాలతో పిలుస్తూ, "జయా, జయంతా, విజయా, జయత్సేనా, జయద్బలా. ఈ కీచకులు నన్ను పట్టుకు పోతున్నారు," అని కేకలు పెట్టింది.

అప్పుడే పడుకుని నిద్రకు ఉపక్రమించిన భీముడు ఈ కేకలకు లేచి, "సైరంధ్రీ, భయపడకు. నేను వస్తున్నాను," అని కేక పెట్టి, మారు వేషం వేసుకుని, ప్రాకారం దూకి, శ్మశానం కేసి పరిగెత్తాడు.

అతను వెళ్ళేటప్పటికి చితి సిద్ధంగా ఉన్నది. భీముడు అక్కడ ఉన్న ఒక చెట్టును కౌగలించుకుని పెకలించి, దాన్ని ఆయుధంగా పట్టుకుని ఉపకీచకులకు ఎదురు వచ్చాడు.

అతన్ని చూడగానే, "అమ్మో, గంధర్వుడు!" అని అరిచి, ద్రౌపదిని అక్కడే వదిలేసి, ఉపకీచకులు నగరం కేసి పరుగు తీశారు. భీముడు ఆ నూట అయిదుగురునీ వెంట తరిమి చంపి, ద్రౌపది కట్లు విప్పి, "నువు నిశ్చింతగా అంతఃపురానికి తిరిగివెళ్ళు. నేను వంటసాలకు పోతాను," అన్నాడు.

చచ్చి చెట్లలాగా పడి ఉన్న ఉపకీచకులనూ, అంతః పురానికి తిరిగి వెళుతున్న సైరంధ్రినీ చూసిన మనుషులు విరాటరాజు

దగ్గిరికి వెళ్ళి, "మహారాజా, కీచకులందరూ చచ్చారు. గంధర్వులు వాళ్ళను చంపి, సైరంధ్రిని విడిపించారు. ఆమె తిరిగి వస్తున్నది. ఆమె చాలా అందగత్తె. ఆమెను చూసిన వాడికి ఎవడికైనా మోహం పుట్టి తీరుతుంది. ఆమెను మోహించిన వారికి అందరికీ ఇదే గతి పట్టుతుంది. ఆ విధంగా మన నగరమే నాశనమవుతుంది. ఈ సైరంధ్రి కారణంగా మనకు హాని కలగకుండా ఏదైనా పద్ధతి ఆలోచించండి," అన్నారు.

విరాటరాజు వారితో కీచకులందరినీ ఒకే చితిలో దహనం చెయ్యమని చెప్పి, సుధేష్ణ వద్దకు వెళ్ళి "ఆ సైరంధ్రి రాగానే ఆమెను మర్యాదగా పంపించి వెయ్యి. ఆమె కారణంగా గంధర్వుల వల్ల ఏమి పరాభవం జరుగుతుందోనని నేను భయపడుతున్నట్టు ఆమెకు చెప్పు. తనతో చెప్పే ధైర్యం లేక నిన్ను చెప్పమన్నానని కూడా చెప్పు," అన్నాడు.

ద్రౌపది సచేల స్నానం చేసి నగరానికి తిరిగి వస్తుంటే, గంధర్వుల భయం కొద్దీ కొందరు ఆమెను చూసి పారిపోయారు, మరి కొందరు కళ్ళు గట్టిగా మూసుకున్నారు.

ఆమె వంటసాల సమీపంలోకి వచ్చే సరికి భీముడు వాకిలి దగ్గిర ఏనుగులాగా నిలబడి ఉన్నాడు. అతన్ని చూసి ద్రౌపది చిన్నగా, "నన్ను కాపాడిన గంధర్వరాజుకు నమస్కారం," అన్నది. "నిన్ను సేవిస్తూ ఇక్కడ తిరిగే వాళ్ళు ఋణవిముక్తులైనారు," అన్నాడు భీముడు.





పురంలో కూర్చుని, ఈ సైరంధ్రి గతి ఏమయినదీ తెలియకుండానే, నవ్వుతూ అడగ వచ్చావు!" అని ద్రౌపది అర్జునుణ్ణి దెప్పి పొడిచింది.

"నీతో ఇంతకాలం స్నేహంగా ఉన్న నాకు నిన్ను గురించి దుఃఖం ఉండదా? ఒకరి మనస్సు ఒకరికేం తెలుస్తుంది?" అన్నాడు అర్జునుడు.

ద్రౌపది రాజకుమార్తెలతో సహా రాజు గారింటికి వెళ్ళేసరికి సుధేష్ణ తన భర్త చెప్ప మన్నట్టుగానే, "నిన్నూ, నీ గంధర్వులనూ గురించి రాజుగారు చాలా భయపడు తున్నారు. నువు మరెక్కడికైనా వెళ్ళిపో. నీ అందం చూస్తే ఎలాటి వారికైనా మతి చెడుతుంది. గంధర్వులు చూడబోతే మహా కోపిష్టి వాళ్ళుగా ఉన్నారు," అన్నది.

"అమ్మా, ఇంకా పదమూడు రోజులు రాజుగారు నన్ను క్షమించినట్టయితే గంధ ర్వులు నన్ను తీసుకుపోతారు. ఆ తరవాత రాజుగారూ, వారి బంధువులూ, మిత్రులూ సుఖంగా ఉండవచ్చు." అని ద్రౌపది వేడింది.

మహా బలవంతుడైన కీచకుడు తమ్ము లందరితో సహా చచ్చిపోవటంతో విరాట నగరంలో వాళ్ళు చాలా బాధపడ్డారు. ఎవరో ఆడదాని మూలాన కీచకుణ్ణి గంధర్వులు హత్య చేశారన్న వార్త దేశ దేశాలా వ్యాపిం

ద్రౌపది ముందుకు కదిలి నర్తనశాల వద్దకు చేరి, అక్కడ రాజకుమార్తెలకు నృత్యం నేర్పుతున్న అర్జునుణ్ణి చూసింది. ఆమెను చూడగానే నర్తనశాలలో ఉన్న అర్జునుడూ, రాజకుమార్తెలూ ఆమె వద్దకు వచ్చి, గొప్ప ప్రమాదం నుంచి బయట పడినందుకు ఆమెను అభినందించారు.

అర్జునుడు, "సైరంధ్రీ, నువు ఎలా బయట పడ్డావు? ఆ దుర్మార్గులు ఎలా చచ్చారు? చెప్పవా?" అని ద్రౌపదిని అడిగాడు.

"బృహన్నలా, ఎందుకు అడుగుతావు? నువు ఆర్చగలదీ, తీర్చగలదీ ఏమన్నా ఉన్నది గనకనా? సుఖంగా కన్యాంతః

చింది. ఇదేసమయానికి దుర్యోధనుడి చారులు పాండవుల జాడ కోసం అనేక దేశాలూ, కొండలూ, తీర్థాలూ, గ్రామాలూ గాలించి హస్తినాపురానికి తిరిగి వచ్చి, ఎక్కడా పాండవుల అచూకీ దొరకనట్టు చెప్పారు. పాండవులు చచ్చిపోయి ఉండవచ్చునని వాళ్ళు ఊహించారు. కీచకుణ్ణి గంధర్వులు చంపారన్న వార్త కూడా వాళ్ళే తెచ్చి, "ఆ గంధర్వులు ఎవరికీ కనిపించలేదట," అన్నారు.

దుర్యోధనుడు తన సభలో ఉన్న వారితో, "ఏం చెయ్యాలో తెలియటంలేదు. మీరు కూడా ఆలోచించండి. పాండవుల అజ్ఞాత వాసం ఇంకా కొంచెమే మిగిలి ఉన్నది. గడువు దాటేలోగా వారి జాడ తెలుసుకున్నా మంటే మాటకు కట్టుబడి ఉండే ఆ పాండవులు తిరిగి పన్నెండేళ్ళు వనవాసం ప్రారంభిస్తారు," అన్నాడు.

కర్ణ దుశ్శాసనులు మళ్ళీ చారులను పంపమన్నారు. వాళ్ళు తప్పక బతికే ఉంటారనీ, వారిని వెతకటానికి వాళ్ళ సంగతి తెలిసిన చారులను పంపమనీ ద్రోణుడు అన్నాడు. భీష్ముడు కూడా పాండవులు బతికే ఉన్నారని ఊహిస్తూ, "ధర్మరాజు ఉండే దేశం సుభిక్షంగా ఉంటుంది. అక్కడి ప్రజలు సంతృప్తితోనూ, ధర్మపరులుగానూ జీవిస్తూ ఉంటారు. వర్షాలు సక్రమంగా కురుస్తాయి. అలాటి దేశం కోసం వెతికించు," అన్నాడు.

తరవాత కృపాచార్యుడు దుర్యోధనుడితో, "భీష్ముడు చెప్పినది నిజం. ఒక వంక పాండవుల కోసం వెతుకుతూ, మనం చెయ్యవలసిన పని ఒకటి ఉన్నది. పాండవులు అజ్ఞాతవాసం ముగించగలిగితే రాజ్యం కోసం యుద్ధం చేసి తీరుతారు. అందుచేత మనం మన బలాలనూ, ధనాన్నీ, రాజ నీతినీ పెంపొందించుకోవాలి. సామ దాన భేద దండోపాయాలు ప్రయోగించి బలవంతులనూ, బలహీనులనూ మన పక్షం చేసుకోవాలి, కోశం నింపుకోవాలి. అలా అయితే పాండవుల పక్షాన పోరాడే రాజులనందరినీ యుద్ధంలో జయించి సుఖపడతావు," అన్నాడు.





# మహాభారతం

సభలో భీష్ముడూ, కృపాచార్యుడూ దుర్యోధనుడికి హితబోధ చేసిన మీదట త్రిగర్త రాజూ, రథబలాలకు నాయకుడూ అయిన సుశర్మ చప్పున లేచి దుర్యోధనుడితో ఇలా అన్నాడు:

"మత్స్యదేశపు రాజు నా దేశాన్ని చాలా సార్లు చీకాకు పరచాడు. అమిత బలవంతుడైన అతని సేనానాయకుడు గంధర్వుల చేతిలో చచ్చాడు. ఇప్పుడు మత్స్యదేశానికి నాథుడు లేడు. మీరు కోరినట్టయితే ఆ దేశం మీద యుద్ధానికి పోదాం. కౌరవులూ, త్రిగర్తులూ కలిసి వెళ్ళినట్టయితే మత్స్యదేశం లొంగిపోతుంది. కావలిసినంత ధనమూ, రత్నాలూ, అంతులేని ఆవుల మందలూ కొల్లగొట్ట వచ్చు. వాటితో నీ బలం వృద్ధి అవుతుంది. నా దేశానికి శత్రు బాధపోతుంది."

సుశర్మ చెప్పిన ఆలోచనను కర్ణుడు బలపరిచాడు.

దుర్యోధనుడు తన తమ్ముడైన దుశ్శాసనుడితో, "సైన్యాన్ని సిద్ధం చెయ్యి. సుశర్మ త్రిగర్తసేనలతో ఒక పక్క నుంచి మత్స్యదేశం మీద దాడి చేసి ఆవుల మందలను పట్టుకుంటాడు. మర్నాడు మనం మరొక పక్క నుంచి దాడి చేద్దాం," అన్నాడు.

ఈ పథకం ప్రకారం కృష్ణసప్తమినాడు సుశర్మ తన బలాలతో మత్స్యదేశం మీదికి దండయాత్ర బయలుదేరాడు. అష్టమినాడు కౌరవసేనలు కదిలాయి.

## 41. గోగ్రహణం



ఈ లోపల విరాటనగరంలో రహస్యంగా జీవిస్తున్న పాండవుల గడువు పూర్తి అయింది. కీచకుడు చచ్చినాక విరాటుడు కుక్కిన పేనులాగా ఉన్నాడు.

ఇంతలో సుశర్మ సేనలు విరాటుడి గోవుల మందలను చుట్టుముట్టి పట్టుకున్నాయి. త్రిగర్తులు వచ్చి లక్షల సంఖ్యలో గోవులను వశపరచుకున్నారనీ, వారిని ఎదిరించి గోవుల మందలను కాపాడుకోవలసిందనీ గోపాలకుల నుంచి విరాటుడికి వార్త వచ్చింది.

వెంటనే విరాటుడు తన సైన్యాన్ని ఆయత్తపరచి, తన తమ్ములైన శతానీకుడూ, మదిరాక్షుడూ మొదలైన వీరులతో యుద్ధ సన్నద్ధుడైనాడు. తన వద్ద ఉన్న పాండవులలో ధర్మరాజూ, భీముడూ, నకుల సహదేవులూ యుద్ధం చెయ్యగలిగే ఉంటా రనుకుని విరాటుడు వారికోసం కూడా నాలుగు రథాలు సిద్ధం చేయించాడు.

విరాటుడి సేనలు త్రిగర్త సైన్యాన్ని కలుసుకునే సరికి చాలా పొద్దెక్కింది. ఇరు పక్షాలకూ మధ్య తీవ్రమైన యుద్ధం జరుగుతూండగా చీకటి పడింది. ఆ సమయంలో సుశర్మ విరాటుడితో యుద్ధం చేసి, ఆయనను ప్రాణాలతో పట్టుకున్నాడు. విరాటుడి సేన చీకాకు పడిపోయింది.

అప్పుడు ధర్మరాజు భీముణ్ణి యుద్ధానికి వెళ్ళి విరాటరాజును విడిపించుకు రమ్మనీ, యుద్ధం చేసే పద్ధతిలో భీముడన్న సంగతి బయట పడకుండా జాగ్రత్త పడమనీ హెచ్చరించాడు. భీముడు సుశర్మను ఎదిరించి యుద్ధం చేసి, అతన్ని చితకపొడిచి, బంధించి పట్టుకుని, విరాటుణ్ణి విడిపించాడు. భీముడు పట్టితెచ్చిన సుశర్మను ధర్మరాజు విడిపించాడు.

తాను గెలిచినట్టు విరాటనగరానికి వార్త పంపి, విరాటుడు తన గోవుల మందలను మళ్ళించుకుంటూ ఉన్న సమయంలో దుర్యోధనుడు బ్రహ్మాండమైన సేనతోనూ, భీష్మ, ద్రోణ, కర్ణ, శకుని, దుశ్శాసన, అశ్వత్థామ మొదలైన మహావీరులతోనూ



మరొక పక్కనుంచి మత్స్యదేశంలోకి జొర బడి అక్కడి గోవుల మందలను పట్టాడు.

గోపాలకుల పెద్ద ఈ వార్త తెలపటానికి రథం మీద అతి వేగంగా విరాటనగరానికి వెళ్ళి, భూమింజయు డనే రాజకుమారుణ్ణి చూసి, "రాజకుమారా, కౌరవులు మన ఆరువేల గోవులను పట్టుకున్నారు. నువు మహా వీరుడవని రాజుగారు చెబుతూంటారు. మన గోవులను వచ్చి విడిపించు. కౌరవ సేనను చించిచెండాడు," అని అన్నాడు.

ఉత్తరుడు అని ప్రసిద్ధి కెక్కిన భూమింజ యుడు ఈ వార్త వినేటప్పుడు స్త్రీల మధ్య కూర్చుని ఉన్నాడు. అందుచేత అతను తాను నిజంగా మహాయోధుడిగానే అనుకుని, "మన ఆవులను అవలీలగా మరల్చగలను గాని, నాకు యుద్ధమర్మం తెలిసిన సారథి లేకపోవటం ఎంతో విచారంగా ఉన్నది. మంచి సారథిని చూడండి," అన్నాడు.

ఉత్తరుడి వద్ద ఉన్న స్త్రీలతోబాటు బృహన్నల రూపంలో అర్జునుడు కూడా అక్కడే ఉన్నాడు. అతను తమ అజ్ఞాత వాసం పూర్తి అయినట్టు లెక్క చూసుకుని, రహస్యంగా ద్రౌపదితో, "నేను ఒకప్పుడు అర్జునుడికి సారథిగా ఉండి, అతని మెప్పు పొందిన వాడినని ఉత్తరుడికి చెప్పి, నన్ను సారథిగా పెట్టుకోమను," అన్నాడు.

ద్రౌపది కొంచెం సిగ్గుపడుతూ ఉత్తరుణ్ణి సమీపించి, అర్జునుడు చెప్పమన్నమాట చెప్పింది. బృహన్నల నపుంసకుడని సందే హిస్తూ, ద్రౌపది గెలుస్తావని గట్టిగా చెప్పిన మీదట ఉత్తరుడు సరేనన్నాడు. అతను కోరిన మీదటఅతని చెల్లెలు ఉత్తర బృహన్న లను సమీపించి, తన అన్నకు సారథిగా పని చెయ్యమని కోరింది.

ఉత్తరుడు కౌరవ యోధులతో యుద్ధం చెయ్యటానికీ, అర్జునుడు అతనికి సారథ్యం చెయ్యటానికీ సిద్ధమయారు. ఉత్తరా, ఆమె తోటి ఆడపిల్లలూ బృహన్నలతో, "మీరు భీష్మ ద్రోణులను జయించి, మా బొమ్మ లకు రంగు రంగుల బట్టలు, మెత్తనివి తీసుకురండి," అని కోరారు.

అర్జునుడు నవ్వి, "ఉత్తరుడు గెలిస్తే అలాగే తెస్తాను," అన్నాడు.

రథం నగరం దాటింది. ఉత్తరుడు అర్జునుడితో, "బృహన్నలా, రథాన్ని కౌరవ సేన ఉండే దిక్కుగా తోలు. మనం ఆ సేనను జయించి, ఆవులను మళ్ళించుకుని త్వరగా తిరిగి రావాలి," అన్నాడు.

అర్జునుడు రథాన్ని వేగంగా నడిపాడు. వాళ్ళు శ్మశానం మధ్య ఉన్న శమీవృక్షాన్ని చేరేసరికి దూరాన కౌరవ సేన మహా సముద్రంలాగా కనిపించింది. ఆ సేనలు రేపిన దుమ్ము ఆకాశంలోకి చాలా ఎత్తు లేస్తున్నది.

ఆ దృశ్యం చూసి ఉత్తరుడు బెదిరిపోయాడు.

"అమ్మో, ఈ సేనను నేనెట్లా గెలుస్తాను? దేవతలు కూడా గెలవలేరు. మా నాన్న సైన్యంతో సహా త్రిగర్తుల మీదికి వెళ్ళటం చేత నేను పురంలో ఒంటిగా దిగబడిపోయాను. నేను భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, ఇంకా అనేక మంది యోధులనూ ఒంటరిగా ఎదిరించగలనా? బృహన్నలా, రథాన్ని వెనక్కు తిప్పు," అని ఉత్తరుడు విలవిలలాడాడు.

"నాయనా, భయపడకు. నిన్ను చూసి శత్రువులు నవ్వుతారు. వాళ్ళతో యుద్ధం చెయ్యి. గెలిచి వస్తానని ఆడవాళ్ళ ముందు



ప్రజ్ఞలు పలికావు. నేను రథాన్ని శత్రువుల మీదికే పోనిస్తాను. ఏ విధంగానైనాసరే వాళ్ళను జయించకుండా తిరిగిపోను," అన్నాడు అర్జునుడు.

"కౌరవులు మా గోవులను ఎత్తుకుపోనీ, మా అంతఃపుర స్త్రీలు నన్ను చూసి నవ్వనీ! నేను మాత్రం యుద్ధం చెయ్యలేను," అంటూ ఉత్తరుడు రథం మీది నుంచి కిందికి దూకి, విల్లూ బాణాలూ పారేసి, నగరం కేసి పరిగెత్తసాగాడు.

"యుద్ధంలో చావనైనా చావాలిగాని, వెన్ను చూపి పారిపోవటమా?" అంటూ అర్జునుడు రథం దిగి, ఉత్తరుడి వెంట పడ్డాడు. అతని బృహన్నల ఆకారం చూసి,



అర్జునుడని తెలునుకోలేక కౌరవ సేనల వాళ్ళు విరగబడి నవ్వారు.

ఈ లోపల అర్జునుడు ఉత్తరుణ్ణి జుట్టు పటుకుని ఆపి, తనను పోనివ్వమని రక రకాలుగా వేడుకుంటున్న ఉత్తరుణ్ణి రథం దగ్గిరికి లాక్కొచ్చి, "నేను యుద్ధం చేసి గోవులను విడిపిస్తాను, నువు రథం నడుపు," అంటూ అతన్ని రథం ఎక్కించాడు.

రథం శమీవృక్షానికి సమీపంగా వచ్చినాక అర్జునుడు ఉత్తరుడితో, "నాయనా, మన వద్ద ఉన్న ఆయుధాలు ఎందుకూ పనికి రావు. నువు ఈ చెట్టు ఎక్కు. దీనిమీద పాండవులు తమ ఆయుధాలు దాచారు. అందులో అర్జునుడి గాండీవం కూడా ఉన్నది. పై కప్పు విప్పావంటే నీకు ఆయుధాలన్నీ కనిపిస్తాయి," అన్నాడు.

ఉత్తరుడు చెట్టు ఎక్కి, అస్త్రాలను విప్ప దీసి, వాటిని చూసి ఆశ్చర్యపడుతూ, "మాయ జూదంలో రాజ్యం పోగొట్టుకున్న పాండవులూ, ద్రౌపదీ ఏమయారో తెలియదు గద!" అని విచారంగా అన్నాడు.

"నేనే అర్జునుణ్ణి. మీ తండ్రి కొలువులో ఉండే కంకుడు ధర్మరాజు. మీ వంటల వాడైన వల్లవుడే భీముడు. గుర్రాలను చూసేవాడు నకులుడు. గోవులను పాలించే వాడు సహదేవుడు. కీచకుల చావుకు కారణ భూతురాలైన సైరంధ్రి ద్రౌపది," అని అర్జునుడు అన్నాడు.

ఉత్తరుడు మొదట అర్జునుడి మాటలు నమ్మలేకపోయాడు. తనకు ఏమేమి పేర్లున్నాయో, అవి ఎలా వచ్చాయో అర్జునుడు వివరించి చెప్పిన మీదట ఉత్తరుడు అతని కాళ్ళ మీద పడి, "నీ పరిచయం కలగటం నా మహాభాగ్యం. నేను తెలియక ఏమేమో వాగి ఉంటాను, క్షమించు. నా భయం పోయింది. నువు ఏ సేన కేసి రథం తోలమన్నా తోలుతాను," అన్నాడు.

అర్జునుడు ఉత్తరుడి చేత ఆయుధాలను రథంలో పెట్టించి, "నీ శత్రువులను నేనెలా నాశనం చేస్తానో చూడు," అంటూ గాండీవాన్ని మాత్రం తాను తీసుకున్నాడు. తర

వాత అతను తన చేతి కంకణాలు తీసేసి, జుట్టు ముడి వేసుకుని, తూర్పుగా తిరిగి అస్త్రాలను ధ్యానించాడు. అతను గాండీ వానికి తాడు తగిలించి మీటే సరికి మహా ధ్వని పుట్టింది. అర్జునుడు శంఖం పూరించే సరికి ఉత్తరుడే భయపడ్డాడు. అలాటి నాదం అతను ఎన్నడూ వినలేదు.



అర్జునుడి రథం తమకేసి వస్తుంటే చూసి ద్రోణాచార్యుడు దుర్యోధనుడితో, "ఆ వచ్చేవాడు నిశ్చయంగా అర్జునుడు," అన్నాడు.

ఆ మాట విని దుర్యోధనుడు, "అజ్ఞాత వాస సంవత్సరం పూర్తి కాకముందే అర్జు నుడు బయటపడ్డాడు. తిరిగి పాండవులు పన్నెండేళ్ళు వనవాసం చెయ్యాలి. గడువు తీరలేదని వాళ్ళు ఎరగకపోయి ఉండాలి. లేదా, మనం పొరపాటు పడి ఉండాలి. సరి అయిన లెక్క తేల్చవలిసినవాడు భీష్ముడే. నిన్న సాయంకాలం త్రిగర్తులు దక్షిణాన మత్స్యగోగణాలను పట్టి ఉంటారు. ఇవాళ ఉదయం మనం ఉత్తరాన గోవులను పట్టాం. గోవులను విడిపించటానికి అర్జునుడు వస్తు న్నాడు. మత్స్యసేన ఇతని వెనక వస్తున్న దేమో తెలియదు. అర్జునుడితో యుద్ధం చేద్దాం," అన్నాడు.

"గడువు తీరకపోతే అర్జునుడు ఇలా బయట పడడు. అతను గోవులను విడి పించుకోకుండా తిరిగిపోడు గనక యుద్ధం తప్పదు," అన్నాడు ద్రోణుడు.

భీష్ముడు దుర్యోధనుడితో, "ప్రతి అయి దేళ్ళకూ రెండేసి అధిక మాసాలు వస్తాయి. పాండవులు వనవాసం కిందా, అజ్ఞాతవాసం కిందా గడిపిన పదమూడేళ్ళలోనూ అయిదు నెలల పన్నెండు రోజులు అధికంగా వచ్చాయి. ఆ లెక్క ప్రకారం పాండవుల అజ్ఞాతవాసం గడువు తీరిపోయింది. అది తెలిసే అర్జునుడు వస్తున్నాడు. యుద్ధంలో జయాపజయాలు నిర్ణయించటం సాధ్యం కాదు. అందుచేత న్యాయంగా పాండవులకు రాజ్యం ఇస్తావో, యుద్ధం చేస్తావో తేల్చుకో," అన్నాడు.

"నేను పాండవులకు రాజ్యం ఇవ్వను. యుద్ధానికి సిద్ధం కండి," అన్నాడు దుర్యోధనుడు.

"అలా అయితే, నువు మన సేనలో నాలుగోవంతు వెంట బెట్టుకుని హస్తినాపురానికి బయలుదేరు. మరొక నాలుగోవంతు సేన గోగణాలను వెంట బెట్టుకుని నీ వెనకనే వస్తుంది. మిగిలిన సగం సేనతో నేనూ, ద్రోణుడూ, కర్ణుడూ, అశ్వత్థామా, కృపుడూ అర్జునుణ్ణి ఎదిరించి యుద్ధం చేస్తాం," అన్నాడు భీష్ముడు.

అందరికీ ఈ పద్ధతి నచ్చింది. దుర్యోధనుడు కూడా అలా చేయటానికి సమ్మతించాడు. భీష్ముడు సేనను వ్యూహపరచి, ఏ పక్కన ఏ యోధుడు నిలబడాలో నిర్ణయించాడు.

వ్యూహంలో నిలబడిన కౌరవసేన కేసి అర్జునుడి రథం వచ్చింది. ఇప్పుడు అర్జునుడు గుర్తించటానికి వీలుగా కనిపించాడు. అతను ఉత్తరుడితో, "బాణం వేటు దూరంలో రథాన్ని నిలుపు. దుర్మార్గుడైన దుర్యోధనుడు ఎక్కడ ఉన్నదీ చూస్తాను. మిగిలిన వాళ్ళను వదిలేసి అతన్ని జయిస్తాను. ఆ తరవాత వీరందరూ ఓడినవాళ్ళే," అన్నాడు.

అతను ఉత్తరుడికి ద్రోణుణ్ణీ, అశ్వత్థామనూ, కృపాచార్యుణ్ణీ, కర్ణుణ్ణీ చూపాడు. కాని దుర్యోధనుడు కనిపించలేదు.

"దుర్యోధనుడు ప్రాణాలు దక్కించుకుని, గోవులతో సహా దక్షిణ మార్గాన హస్తినాపురానికి బయలుదేరాడల్లే ఉంది. ఉత్తరుడా, ఈ సేనను వదిలేసి, రథాన్ని దుర్యోధనుడు వెళ్ళే వైపుగా నడిపించు. అతన్ని ఎదిరించి గోవులను మరలిస్తాను," అన్నాడు అర్జునుడు.

అర్జునుడు తమ నందరినీ విడిచిపెట్టి మరొక దిక్కుగా ఎందుకు పోతున్నాడో గ్రహించి కృపాచార్యుడు, "అర్జునుడు దుర్యోధనుడి మీదికి పోతున్నాడు. అర్జునుడి ముందు దుర్యోధనుడు నిలవలేడు. అందుచేత మనం దుర్యోధనుడికి అండగా వెళ్ళి నిలబడదాం," అన్నాడు.






అర్జునుడు కొంతదూరం ముందుకు వెళ్ళి కౌరవసేనల మీద బాణవర్షం కురిపించి, గట్టిగా శంఖం పూరించాడు. ఆ ధ్వని విని గోవులు మోరలెత్తి వెనక్కు తిరిగి పరిగెత్త సాగాయి. అర్జునుడు వచ్చిన పని అప్పుడే తీరినట్టు కనపడింది. కాని అతను దుర్యోధనుడి మీదికి పోతూ ఉండగా, కౌరవ వీరులు అందరూ అతనికి ఎదురు వచ్చారు. అర్జునుడు వారిలో కర్ణుణ్ణి చూసి, ఉత్తరుడితో రథాన్ని కర్ణుడి కేసి నడపమన్నాడు.

కర్ణుణ్ణి అనుసరించి ఉన్న యోధులు కొందరు అర్జునుడిపై యుద్ధం ప్రారంభించారు. అర్జునుడు వారి నందరినీ ఓడించి, కొందరిని చంపాడు. యుద్ధం తీవ్రమయింది. అర్జునుడి చేత చచ్చిన వారిలో కర్ణుడి తమ్ముడు కూడా ఉన్నాడు. అది చూసి కర్ణుడు అమిత పౌరుషంతో అర్జునుణ్ణి ఎదుర్కొన్నాడు. అర్జునుడు కోరినదీ అదే. ఇద్దరూ ద్వంద్వయుద్ధం చేస్తూంటే మిగిలిన వాళ్ళు చూస్తూ ఉండిపోయారు. కొంత సేపు యుద్ధం చేసి, తీవ్రంగా గాయపడి కర్ణుడు వెనక్కుపోయాడు.

కౌరవులు అర్జునుడి యుద్ధ నైపుణ్యాన్నే గాక ఉత్తరుడి సారధ్య నైపుణ్యాన్ని కూడా మెచ్చుకున్నారు.

కర్ణుడు వెనక్కు తగ్గగానే మళ్ళీ కౌరవ యోధులందరూ అర్జునుడిపై యుద్ధం సాగించారు. వారిలో కృపాచార్యుణ్ణి ఎంచుకుని అర్జునుడు తన రథాన్ని ఉత్తరుడి చేత అటు నడిపించాడు. అర్జునుడి రథం కృపా



చార్యుడి రథానికి ప్రదక్షిణం చేసి ఎదురుగా నిలబడింది. అర్జునుడు శంఖం ఊదాడు. ఇద్దరికీ ఘోరంగా జరిగిన యుద్ధంలో కృపాచార్యుడు ఓడాడు.

కృపాచార్యుడు వెనక్కు తగ్గగానే ద్రోణుడు అర్జునుడితో యుద్ధం చేయటానికి ముందుకు వచ్చాడు. అప్పుడు అర్జునుడు ద్రోణుడికి నమస్కారం చేసి, "గురూ, వనవాసంలో మేము చాలా కాలం కష్టాలు అనుభవించాం. మా మీద కోపం వద్దు. ముందు మీరు నా మీద బాణం వేస్తేనేగాని నేను మీతో యుద్ధం చెయ్యలేను," అన్నాడు.

ద్రోణుడు ముందుగా తానే అర్జునుడిపై బాణాలు వేశాడు. తరవాత ఇద్దరూ యుద్ధం చేశారు. నిజానికి కౌరవ సేనలో ద్రోణుడికి చాలిన యోధుడు లేడు. అర్జునుడు అయనను బాణ వర్షంలో ముంచి ఎత్తేసరికి, కౌరవసేనలలో హాహాకారాలు చెలరేగాయి.

అది చూసి ద్రోణుడి కొడుకైన అశ్వత్థామ అర్జునుణ్ణి తన బాణాలతో తాకాడు. అప్పుడు అర్జునుడు ద్రోణుణ్ణి తొలగిపోనిచ్చి, తన రథాన్ని అశ్వత్థామ కేసి నడిపించాడు. అశ్వత్థామ అర్జునుణ్ణి చాలాసేపు చిక్కుపెట్టాడు, కాని చివరకు అర్జునుడిదే పై చెయ్యి అయింది.

ఈ విధంగా అర్జునుడు విజృంభించి మరొకసారి కర్ణుడితోనూ, దుశ్శాసనుడితోనూ, కౌరవ వీరులందరితోనూ యుద్ధం చేశాడు. ఆ యోధులు పారిపోసాగారు. అప్పుడు భీష్ముడు అర్జునుడితో యుద్ధానికి వచ్చాడు.

ఇద్దరూ ఒకరి మీద ఒకరు అస్త్రాలు ప్రయోగించుకున్నారు. తరవాత మామూలు బాణాలతో యుద్ధం చేశారు. చివరకు భీష్ముడు రథంలో తెలివితప్పి పడిపోయాడు. ఆయన సారథి రథాన్ని దూరంగా తోలుకు పోయాడు.

అది చూసి దుర్యోధనుడే అర్జునుడి పైకి వచ్చాడు. ఇద్దరూ తీవ్రంగానే యుద్ధం చేశారు. అర్జునుడు ఒక బాణంతో దుర్యోధనుడి రొమ్ములో కొట్టాడు. ఆ దెబ్బతో దుర్యో



ధనుడు రథంతో సహా పారిపోయాడు. పారిపోతున్న దుర్యోధనుణ్ణి చూసి అర్జునుడు గేలి చేశాడు.

దుర్యోధనుడు రోషం వచ్చి, తిరిగి అర్జునుడి కేసి వచ్చాడు. అతని వెంట మిగిలిన కౌరవ యోధులందరూ వచ్చారు. అర్జునుడు ఆ అందరితోనూ యుద్ధం చేస్తూ సంమోహనాస్త్రం ప్రయోగించాడు. దాని ఫలితంగా యోధులందరూ ఆయుధాలు జారవిడిచి మూర్ఛపోయారు.

అప్పుడు అర్జునుడు ఉత్తరుడితో, "నాయనా, పగ్గాలు పక్కన పెట్టి వెళ్ళి, త్వరగా ఆ యోధుల తలగుడ్డలు తీసుకురా. ఉత్తర రంగురంగుల బొమ్మ పొత్తికలు తెమ్మన్నది. ఆ తలగుడ్డలలో కృపుడిది తెల్లనిది, కర్ణుడిది పసుపు పచ్చది, దుర్యోధనుడిదీ, అశ్వత్థామదీ నీలం రంగువి. నేను వేసిన అస్త్రం భీష్ముణ్ణి బాధించదు. అందుచేత ఆయన జోలికి మాత్రం పోకు," అని చెప్పాడు.

ఉత్తరుడు వెళ్ళి, తలపాగాలు తీసుకుని వెంటనే తిరిగి వచ్చి రథం ఎక్కాడు. అతను రథాన్ని సేనల మధ్యగా నడుపుతుంటే భీష్ముడు అర్జునుణ్ణి తన బాణాలతో అటకాయించాడు. అర్జునుడు భీష్ముడి రథం గుర్రాలను చంపి, భీష్ముడితో యుద్ధానికి దిగకుండా ముందుకు సాగాడు.

అంతలో దుర్యోధనుడికి స్పృహ వచ్చింది. నిశ్చింతగా పోతున్న అర్జునుణ్ణి చూసి అతను, "ఇతన్ని ఎందుకిలా నిశ్చింతగా పోనిస్తున్నారు? ఇతను తప్పించుకుపోకుండా చూడండి," అని కేక పెట్టాడు.

ఆ మాట విని భీష్ముడు, "నీ తెలివి ఏమయింది? అందరూ అస్త్రాలు జారవిడిచి స్పృహ తప్పి ఉంటే ఈ అర్జునుడు అందరినీ చంపగలిగి ఉండి కూడా తలగుడ్డలు మాత్రం తీసుకున్నాడు. అతను గెలిచినట్టు ఒప్పుకో. ఆవుల మందలను తీసుకుపోనీ," అన్నాడు.

భీష్ముడు చెప్పిన ప్రకారం కౌరవులు ఓటమి ఒప్పుకుని తిరిగి వెళ్ళి పోవటానికి



నిశ్చయించారు. వాళ్ళు వెళ్ళిపోవటం చూసి అర్జునుడు సంతోషించి భీష్ముడికీ, ద్రోణుడికీ, కృపుడికీ, అశ్వత్థామకూ మిగిలిన కురువీరులకూ నమస్కార బాణాలు వేసి; ఒక బాణంతో దుర్యోధనుడి కిరీటాన్ని మటుకు పగలగొట్టాడు.

అతను ఉత్తరుడితో, "శత్రువులను ఓడించాం. గోగణాలను కాపాడాం. ఇక ఆనందంగా ఇంటికి పద," అన్నాడు.

రథం శమీవృక్షం దగ్గిర మరొకసారి నిలిచింది. పాండవుల అస్త్రాలన్నీ తిరిగి ఆ చెట్టు మీదికి చేరాయి. అర్జునుడు సారథి స్థానంలో కూర్చుని, "పాండవులందరూ తన కొలువులో ఇంత కాలమూ దాగి ఉన్నట్టు తెలిస్తే మీ తండ్రి భయంతో కంగారు పడిపోతాడు. అందుచేత యుద్ధం చేసి కౌరవులను జయించినది నువేనని ఆయనతో చెప్పు," అని ఉత్తరుడితో అన్నాడు.

"మహానుభావా, నువు చేసిన ఈ యుద్ధం నాబోటి వాడివల్ల ఏమవుతుంది? అయినా నీ ఆజ్ఞ అయేవరకూ నిజం దాచిపెట్టి, నేనే యుద్ధం చేసి గెలిచినట్టు చెబుతాను," అన్నాడు ఉత్తరుడు.

"మనం కాస్త విశ్రాంతి తీసుకుని, గుర్రాలకు నీరు పెట్టి, మధ్యాన్నం దాటినాక నగరం చేరుదాం. ఈ లోపుగా మీ గోపాలకులను నగరానికి వెళ్ళి, నువు గెలిచినట్టు మీ తండ్రిగారికి వార్త చెప్పమను," అన్నాడు అర్జునుడు.

ఈ లోపుగా విరాటుడు సుశర్మను ఓడించి నగరానికి తిరిగి వచ్చి, కొలువు తీరి కూర్చున్నాడు. పెద్దలైన పౌరులూ, బ్రాహ్మణులూ ఆయన విజయాన్ని అభినందించారు.

ఆయన, "ఉత్తరుడు ఎక్కడికి వెళ్లాడు?" అని అడిగాడు. కౌరవసేనలు వచ్చి గోవుల మందలను పట్టుకున్నాయనీ, వాటిని విడిపించటానికి ఉత్తరుడు బయలుదేరాడనీ, ఉత్తరుడికి బృహన్నల సహాయం వెళ్ళాడనీ అంతఃపుర స్త్రీలు విరాటుడికి చెప్పారు.

ఈ వార్త విని విరాటుడు కంగారుపడి తన మంత్రులతో, "సుశర్మతో యుద్ధం

చేసిన మిగిలిన యోధులనందరినీ ఉత్తరుడికి సాయం పంపండి. నపుంసకుణ్ణి సారథిగా పెట్టుకున్న ఉత్తరుడు ప్రాణాలతో ఉన్నాడే, లేడో ముందు తెలుసుకోండి," అంటూ ఆవేశపడ్డాడు.

విరాటుడి భయం చూసి ధర్మరాజు చిన్నగా నవ్వి, "బృహన్నల సారథిగా ఉండగా నీ కుమారుడు గెలిచి తీరుతాడు. కౌరవసేనలే కాదు, దేవాసుర సేనలు ఎదురైనా అతనికి అపజయం ఉండదు," అన్నాడు.

అంతలోనే, ఉత్తరుడు శత్రువులను జయించి, గోవులను విడిపించి తిరిగి వస్తున్నట్టు విరాటుడికి వార్త తెలిసింది. అది విని ధర్మరాజు, "ఉత్తరుడు విజయుడై తిరిగి రావటం శుభం. అయితే, బృహన్నల సారథిగా ఉండగా ఉత్తరుడు జయించటం నాకేమీ ఆశ్చర్యం కలిగించదు," అన్నాడు.

కొడుకు గెలిచాడని వింటూనే విరాటుడు పరమానందభరితుడై, వార్త తెచ్చిన వారికి బంగారు బట్టలు కప్పి, రాజమార్గాలను అలంకరించమనీ, ఉత్తరుడి విజయం చాటించమనీ, మంగళ వాద్యాలతో ఉత్తరుడికి ఎదురు వెళ్ళమనీ ఆజ్ఞాపించాడు.

తరవాత ఆయన సైరంధ్రితో, "పాచికలు పట్టుకురా. కంకుడితో జూదం ఆడాలి," అన్నాడు.



ఇద్దరూ జూదం ఆడటానికి కూర్చున్నారు. అప్పుడు విరాటుడు ధర్మరాజుతో, "చూశావా, కంకభట్టూ, నా కొడుకు ఎందరో మహావీరులను ఒంటరిగా ఎదిరించి, జయించాడు!" అన్నాడు.

దానికి ధర్మరాజు, "బృహన్నల సారథిగా ఉండగా ఎందుకు జయించడూ?" అన్నాడు.

విరాటుడికి చప్పున కోపం వచ్చింది. ఆయన ధర్మరాజుతో, "బ్రాహ్మణాధమా, నా కొడుకుతో సమంగా ఆ నపుంసకుణ్ణి మెచ్చుకుంటావా? నీకు అనదగినదీ, అనరానిదీ కూడా తెలియదే. ఈసారికి నిన్ను క్షమించాను. మరొకసారి ఇలా మాట్లాడితే



నీ ప్రాణానికే ప్రమాదం. జాగ్రత్త!" అన్నాడు.

దానికి ధర్మరాజు, "భీష్ముడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, కర్ణుడూ, కృపుడూ గల కౌరవసేనను ఇంద్రుడు కూడా జయించలేడు. అలాటి శక్తి బృహన్నలకే ఉన్నది. బృహన్నల సహాయం ఉండగా నీ కొడుకు అంతమంది వీరులను గెలవటంలో వింత ఏమీ లేదు," అన్నాడు.

విరాటుడు మండిపడి, "మళ్ళీ అదే మాట అంటావా?" అంటూ పాచికలను ధర్మరాజు ముఖం మీద విసిరాడు. ధర్మరాజు ముక్కుకు దెబ్బ తగిలి నెత్తురు కారసాగింది. ఆ రక్తం కింద పడేలోపుగా ద్రౌపది పక్కనే ఉండి తన చేతిలోకి పట్టుకున్నది. తరవాత ఆమె ధర్మరాజు అభిప్రాయం గ్రహించి, ఒక బంగారు పాత్ర తెచ్చి, ధర్మరాజు ముక్కునుండి కారే రక్తాన్ని అందులో పట్టింది.

ఇంతలో ఉత్తరుడూ బృహన్నలా వచ్చినట్టు ద్వారపాలకుడు విరాటుడితో చెప్పాడు.

"వారిద్దరినీ చూడాలని నేను తొందర పడుతున్నాను. వెంటనే వారిని లోపలికి ప్రవేశపెట్టు," అని ద్వారపాలకుడితో విరాటుడు అన్నాడు.

ధర్మరాజు ద్వారపాలకుడితో రహస్యంగా, "బృహన్నలను ప్రవేశపెట్టకు. ఉత్తరుణ్ణి మాత్రమే ప్రవేశపెట్టు. యుద్ధంలో తప్ప, నన్నెవరన్నా గాయపరిస్తే వాళ్ళను చంపుతానని బృహన్నలకు వ్రతం ఉన్నది. నా రక్తం చూస్తే అతను మీ రాజును సకుటుంబంగా నాశనం చేస్తాడు," అని చెప్పాడు.

తరవాత ఉత్తరుడు ఒక్కడే విరాటుడున్న చోటికి వచ్చి, తండ్రి కాళ్ళకు నమస్కారం చేసి, తరవాత ధర్మరాజు కాళ్ళకు నమస్కారం చేసి లేచి, ధర్మరాజు ముక్కునుంచి కారుతున్న రక్తం చూసి చాలా ఆవేదన పడుతూ, "ఈ మహానుభావుణ్ణి ఎవరు ఇలా చేశారు? ఈ పాడు పని ఎవరిది?" అని అడిగాడు.

"ఈ మతిమాలినవాడు నిన్ను కాదని ఆ నపుంసకుణ్ణి మెచ్చుకుంటుంటే కోపం వచ్చి నేనే ఒక దెబ్బతీశాను," అన్నాడు విరాటుడు.

"ఎంత పొరపాటు చేశావు! బ్రాహ్మణ కోపం కార్చిచ్చులాగా దహిస్తుంది. అందు చేత ఆయనను మంచి చేసుకో," అని ఉత్తరుడు తండ్రికి హితవు చెప్పాడు.

విరాటుడు క్షమాపణ చెప్పుకోగా ధర్మ రాజు, "రాజా, నా కోపం పోయి చాలా సేపయింది. అంతకన్న నా రక్తం నేల మీద పడటం నీ దేశానికీ, నీకూ ఎక్కువ హాని!" అన్నాడు.

ధర్మరాజు ముక్కు నుంచి కారే రక్తం నిలిచిపోయింది. కొద్ది సేపట్లో ఉత్తరుడు బృహన్నలతో సహా అక్కడికి వచ్చాడు. బృహన్నల విరాటరాజుకూ, కంకుడికీ నమ స్కారాలు పెట్టి నిలబడ్డాడు.

అప్పుడు విరాటుడు ఉత్తరుణ్ణి చూసి, బృహన్నలకు వినిపించేలాగా, "నాయనా, నువు నాకు నిజంగా తగిన కొడుకువు అని పించావు. నీలాటి శూరులు ఎక్కడా ఉండరు. కర్ణుడు అంతటి పరాక్రమశాలి గదా, అతనితో ఎలా యుద్ధం చేశావు? భీష్ముడంతటి మహాయోధుణ్ణి ఎలా జయించ గలిగావు? ద్రోణుడూ, ఆయన కొడుకు అశ్వత్థామా ఎంతటి వీరులు! కృపా చార్యుణ్ణి చూస్తేనే సామాన్య యోధులు వణికిపోతారు గదా! దుర్యోధనుడు ఉండనే ఉన్నాడు. ఇలాంటి మహా వీరులందరినీ జయించి, మన గోవులను విడిపించుకు వచ్చావంటే మలయమారుతం వీచినట్టు అనిపించింది. గొప్ప ప్రశంసనీయమైన పని చేశావు," అన్నాడు.

ఈ ప్రశంసలు విని ఉత్తరుడు, "గోవు లను నేను విడిపించలేదు. శత్రువులను జయించినది కూడా నేను కాదు. ఎవరో దేవుడు అదంతా చేశాడు. శత్రువులను చూసి బెదిరి పారిపోతున్న నన్ను ఆపి, అతను రథం మీద కూర్చుని, నన్ను సార థిగా పెట్టుకుని, యుద్ధం చేసి గెలిచాడు," అన్నాడు.






ఉత్తరుడు కౌరవసేనలను జయించి గొవులను మళ్ళించటానికి సహాయపడిన వాడు ఎవరో దేవుడని విని విరాటరాజు, "నాకు ఇంత మహోపకారం చేసిన ఆ దేవుడు ఎవరో గదా! ఆయనను చూసి, పూజించాలని నాకు కోరికగా ఉన్నది," అన్నాడు.

దానికి ఉత్తరుడు, "ఆ దేవకుమారుడు అక్కడే అంతర్ధాన మయాడు. రేపుగాని, ఎల్లుండిగాని ఆయన మనకు దర్శనమిస్తాడు," అన్నాడు. ఆ దేవకుమారుడు నపుంసకుడి ఆకారంలో తన ఎదటనే ఉన్న సంగతి విరాటరాజు ఎరగడు.

విరాటుడు అనుమతించిన మీదట అర్జునుడు కురువీరుల తలగుడ్డలను ఉత్తరకు ఇచ్చేశాడు.

తరవాత ఉత్తరుడూ, ధర్మరాజూ, అర్జునుడూ జరగవలసిన దాన్ని గురించి ఏకాంతంగా మాట్లాడుకున్నారు.

ఇది జరిగిన మూడోనాడు పాండవులు అయిదుగురూ, కాలకృత్యాలు తీర్చుకుని, చక్కగా స్నానం చేసి, తెల్లని బట్టలు కట్టుకుని, విరాటుడి కొలువు కూటానికి వచ్చారు. వాళ్ళు రాజులు కూచునే ఆసనాలలో కూర్చున్నారు.

కొంతసేపటికి విరాటుడు రాచకార్యాలు చూడటానికి సభాస్థలానికి వచ్చి, ఉన్నతాసనాలలో కూర్చుని ఉన్న పాండవులను చూసి ఒక్కక్షణం నివ్వెరపోయి, మరుక్షణం ఆగ్రహావేశుడై ధర్మరాజుతో, "ఏమయ్యా, నిన్ను నాతో జూదం ఆడటానికి గదా పెట్టు

43. ఉత్తర వివాహం



కున్నాను? సింహాసనం మీద కూర్చున్నావు ఎందుచేత?'' అని అడిగాడు.

విరాటుడు పరాచకాలాడుతున్నాడనుకున్న వాడిలాగా అర్జునుడు ఆశ్చర్యం ప్రకటిస్తూ, "రాజా, ఈ మహాత్ముడు ఇంద్రుడి అర్ధాసనం మీద కూర్చోవటానికి కూడా అర్హుడే. ఈ చిన్న గద్దె మీద కూర్చోదగడా? ఈయన ధర్మస్వరూపుడు. మహాబలశాలి. రాజర్షి. మనువు లాగా లోకాన్ని రక్షించగలవాడు. ఈయన కురుదేశాన్ని పాలించేటప్పుడు, ఈయన వెనక పదివేల గజ బలమూ, ముప్ఫైవేల రథాలూ ఉంటాయి. శకుని కర్ణులు అండగాగల దుర్యోధనుడే ఈయన బలాన్ని తలుచుకుని దిగులు పడతాడు. ఈయన ఈ సింహాసనం మీద కూర్చోవటానికి తగడా?'' అన్నాడు.

విరాటుడీ మాటలకు నివ్వెరపోతూ, "ఈయన కుంతీదేవి పెద్ద కొడుకైన ధర్మరాజా? అయితే ఈయన తమ్ములైన భీమార్జున నకులసహదేవు లేరీ? ద్రౌపది ఏదీ? వారి జాడ ఏ మాత్రమూ తెలియరాలేదే,'' అన్నాడు.

దానికి అర్జునుడు, "వల్లవు డనే పేరుతో నీ దగ్గిర వంటలవాడుగా ఉన్నవాడు భీముడు. గంధర్వులను జయించి, ద్రౌపది కోసం సౌగంధిక పుష్పం తెచ్చినవాడు. ఇతనే కీచకుణ్ణి హతమార్చిన గంధర్వుడు. ఆ పని మరొకరివల్ల అవుతుందా? నీ గుర్రాలను చూస్తూ వచ్చినవాడు నకులుడు. గోవులను పాలించినవాడు సహదేవుడు. ఈ ఇద్దరూ మహారథులు. నీ సైరంధ్రి ద్రౌపది. నేను అర్జునుణ్ణి. రాజా, నీ చాటున మాకు అజ్ఞాతవాసం సుఖంగా గడిచింది.'' అన్నాడు.

పాండవులు ఈ విధంగా బయటపడిపోయిన మీదట ఉత్తరుడు అర్జునుడు యుద్ధంలో చూపిన పరాక్రమాన్ని వర్ణించి చెప్పాడు. అతను అర్జునుణ్ణి గురించి చెబుతూ, "సింహం జింకలను తోలి చంపినట్టు ఈయన కౌరవ యోధులను వేటాడాడు. ఈ మహావీరుడు ఒక్క బాణంతో

ఏనుగును చంపటం నేను చూశాను. ఈయన శంఖం పూరించే సరికి శత్రువుల తోపాటు, నా చెవులూ గడియలు పడి పోయాయి," అన్నాడు.

అది విని విరాటుడు, "నిజమే. ఇప్పుడు పాండవులను మనం మంచి చేసుకోవాలి. అందుకోసం మన ఉత్తరను అర్జునుడికి ఇచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు.

"ముందు మనం పాండవులందరినీ గొప్పగా సన్మానించవలసి ఉన్నది," అన్నాడు ఉత్తరుడు.

దానికి విరాటుడు, "అవును. యుద్ధంలో నేను ఓడిపోయి సుశర్మకు చిక్కినప్పుడు నన్ను విడిపించి, మనకు విజయం సాధించి పెట్టినవాడు భీముడు. పాండవుల సహాయం తోనే మనం గెలిచాం. అందుచేత మనం పాండవుల పెద్ద అయిన ధర్మరాజును సుముఖుణ్ణి చేసుకోవాలి. మనం తెలియక ఏమేమో పేలి ఉంటాం. అదంతా ధర్మ రాజు క్షమించాలి," అన్నాడు.

ఇలా అని విరాటుడు ధర్మరాజుకు తన రాజ్యం, ఖజానా, రాజధానీలతో సహా సమ ర్పించి, పాండవులనందరినీ మళ్ళీమళ్ళీ కౌగలించుకున్నాడు.

తరవాత ఆయన ధర్మరాజుతో, "మీరు క్షేమంగా వనవాసం గడిపి, అమిత కష్టమైన అజ్ఞాతవాసాన్ని గడిపారు. నా రాజ్యాన్ని అర్జునుడికి ఉండనివ్వండి. అతనికి నా కూతు రైన ఉత్తరను ఇచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు.





ధర్మరాజు అర్జునుడి కేసి చూశాడు. అర్జునుడు విరాటుడితో, "రాజా, నీ కుమార్తెను నేను కోడలుగా చేసుకుంటాను. మన వంశాల మధ్య ఇలా సంబంధం ఏర్పడటం ఎంతైనా మేలు," అన్నాడు.

అది విని విరాటుడు ఎక్కడ లేని ఆశ్చర్యం కనబరుస్తూ అర్జునుడితో, "నా కుమార్తెను భార్యగా స్వీకరించటానికి అభ్యంతరమేమిటి?" అన్నాడు.

"రాజా, నేను నీ కుమార్తెను చాలా కాలంగా చూస్తున్నాను. ఆమె నన్ను తండ్రిగా చూసుకుంటున్నది. అదీగాక నేను ఆమెకు నాట్యాచార్యుణ్ణి. నా కొడుకు అభిమన్యుడు కృష్ణుడి మేనల్లుడు. చిన్నవాడే, అయినా అస్త్రాలు తెలిసిన వీరుడు. నీ కుమార్తెకు తగిన వరుడు," అన్నాడు అర్జునుడు.

విరాటుడు తృప్తిపడి, "సరే, నీ యిష్ట ప్రకారమే చేస్తాను. నాతోటి సంబంధం నీకు అచ్చివచ్చుగాక!" అన్నాడు.

పెళ్ళి ఎప్పుడు జరగవలసినదీ ధర్మరాజు నిర్ణయించాడు. విరాటుడూ, అర్జునుడూ మొదలైనవారు కృష్ణుడికి కబురు చేశారు.

అజ్ఞాతవాస సంవత్సరం పూర్తికాగానే పాండవులు విరాటనగరం విడిచి, మత్స్యదేశంలోనే ఉపప్లావ్యం అనే చోటికి మారి, అక్కడ బస చేశారు. అక్కడికి పాండవుల హితులు సైన్యాలతో సహా వచ్చిచేరారు. కాశీరాజూ, శైబ్యుడూ చెరొక అక్షౌహిణీ సేనతోనూ వచ్చారు. ద్రుపదుడూ, ద్రౌపది కొడుకులైన ఉపపాండవులూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ ఒక అక్షౌహిణి సేనతో వచ్చారు. విరాటుడు ద్రుపదమహారాజుకు ఎదురువెళ్ళి, పూజించి, సగౌరవంగా తీసుకు వచ్చాడు. ఇలా అనేక మంది రాజులు ఉపప్లావ్యం చేరారు.

ద్వారక నుంచి అభిమన్యుణ్ణీ, ఇంద్రసేనుడు మొదలైన పాండవ భృత్యులనూ వెంటబెట్టుకుని కృష్ణుడూ, బలరాముడూ, కృతవర్మా, యుయుధానుడూ, సాత్యకీ,

అక్రూరుడూ, సాంబుడూ మొదలైనవారు రథాలలో వచ్చి చేరారు.

విరాటుడి ఇంట శంఖాలూ, భేరీలూ మొదలయినవి మోగాయి. అక్కడ విరాటుడు పాండవులను పూజించాడు. అతిథుల కోసం ఎన్నో పశువులను కోశారు. తాగటానికి చెరుకురసం సారా అందించారు. సుధేష్ణ వెంట అంతఃపుర స్త్రీలు చక్కగా అలంకరణలు చేసుకుని, ఉత్తరను పెళ్ళికూతురుగా అలంకరించారు.

ఉత్తరను అభిమన్యుడికి భార్యగా స్వీకరించటానికి అర్జునుడూ, ధర్మరాజూ అంగీకరించిన మీదట వారిద్దరికీ అర్జునుడు కృష్ణుణ్ణి తన వెంట ఉంచుకుని, వివాహం జరిపించాడు.

అభిమన్యుడి పెళ్ళి జరిగిన మర్నాడు పాండవులు అతిథులందరితోనూ కలిసి విరాటుడి సభాభవనంలో సమావేశమయారు. సభ మధ్య విరాటుడూ, ద్రుపదుడూ, మరి కొందరు వయసు మళ్ళిన రాజులూ కూర్చున్నారు. సభలో వసుదేవుడూ, సాత్యకీ, బలరాముడూ, కృష్ణుడూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, అభిమన్యుడూ, ఉపపాండవులూ, పాండవులూ, విరాటుడి కొడుకులూ ఉన్నారు. సభ చాలా శోభించింది.

కొంతసేపు కబుర్లు చెప్పుకున్నాక, కృష్ణుడు అందరినీ ఉద్దేశించి ఇలా అన్నాడు:

"శకుని ఆడిన మాయజూదంలో ఈ ధర్మరాజు ఓడిపోవటమూ, ఇతని రాజ్యాన్ని





దుర్యోధనుడు మోసంతో కాజెయ్యటమూ మీ కందరికీ తెలుసు. బల పరాక్రమాలతో రాజ్యం సంపాదించుకోగలిగి ఉండి కూడా ఈ పాండవులు మాటకు కట్టుబడి, మహా భయంకరమైన వనవాసం పన్నెండేళ్ళు చేశారు. అంత కన్న కూడా కష్టమైనది అజ్ఞాతవాసం. ఇదికూడా వారు జయప్రదంగా ముగించారు. ఏడాది పాటు వీరు దాస్యంలో గడిపారు. ఇకముందు జరగవలిసిన దేమిటో మీరు నిర్ణయించండి. అది ధర్మరాజుకూ, దుర్యోధనుడికీ కూడా నచ్చేదిగానూ, కీర్తికరంగానూ ఉండాలి, ధర్మ సమ్మతంగా కూడా ఉండాలి. ఈ ధర్మరాజు అధర్మంగా స్వర్గాధిపత్యం వచ్చినా పుచ్చుకోడు. ధర్మం ప్రకారం ఒక చిన్న పల్లెను ఏలుకోమన్నా ఏలుకుంటాడు. ఆయన ఎప్పటికీ ధృతరాష్ట్రుడి కొడుకుల మంచేకోరుతాడు. పాండవులు తమ స్వశక్తిచేత జయించుకున్న రాజ్యాన్నే ఇప్పుడు కోరుతున్నారు. ఉభయ పక్షాల వారూ అన్నదమ్ముల బిడ్డలే గనక ఉభయపక్షాలకూ మేలు జరిగేమార్గం ఆలోచించండి. దుర్యోధనుడు న్యాయంగా వీరి రాజ్యం వీరికిస్తే సరే, అలాకాక మళ్ళీ మోసానికి దిగితే పాండవులు ధృతరాష్ట్రుడి కొడుకులను ఒక్కపెట్టున చంపేస్తారు. దుర్యోధనుడే బలవంతుడనీ, పాండవులు బలహీనులనీ అనుకోనవసరం లేదు. ఇంతకూ దుర్యోధనుడి అభిప్రాయం ఎలా ఉన్నదీ తెలియరాలేదు. అది తెలియకుండా ఏ నిర్ణయంగాని చెయ్యటం సాధ్యం కాదు. కాబట్టి, దుర్యోధనుడి ఉద్దేశం తెలుసుకోవటానికి ఇక్కడి నుంచి ఒక దూతను, కులీనుడూ, జాగరూకుడూ అయిన వాణ్ణి పంపితే బాగుంటుంది, ఆ దూత వెళ్ళి, దుర్యోధనుడికి తగిన విధంగా చెప్పి, పాండవులకు అర్ధరాజ్యం ఇచ్చేటట్టు ఒప్పించి వస్తాడు గాక!''

తరవాత బలరాముడు కృష్ణుడి అభిప్రాయాన్ని బలపరుస్తూ, "ఇక్కడి నుంచి వెళ్ళే దూత భీష్మణ్ణీ, ధృతరాష్ట్రుణ్ణీ, ద్రోణుణ్ణీ, అశ్వత్థామనూ, కృపుణ్ణీ, శకునినీ,

ఇతర కౌరవముఖ్యులనూ, కర్ణుణ్ణీ కలుసు కుని, వారికి కోపం రాకుండా మంచిగా మాట్లాడి, పని పూర్తి చేసుకురావాలి. నిజానికి శకునితో జూదం ఆడటం ధర్మరాజుదే తప్పు. శకుని పాచికల ఆటలో సాటిలేని వాడు. ధర్మరాజు ఆ సభలో ఇంకెవరితో ఆడినా గెలిచి ఉండేవాడే. ఆడినవాడు ఆవేశంకొద్దీ తనకున్నదంతా పణంగా పెట్టాడు. ఇందులో శకుని చేసిన మోసం ఏమీ లేదు. అందుచేత ఇక్కడి నుంచి వెళ్ళే దూత దుర్యోధనుడి అనుగ్రహం సంపాదించాలి," అన్నాడు.



బలరాముడిలా అనేసరికి సాత్యకికి అమితమైన ఆగ్రహం కలిగింది. అతను చప్పున లేచి, బలరాముణ్ణి నిందిస్తూ, "నీ అంతరాత్మకు తగినట్టే మాట్లాడావు. అందుచేత నీ మీద నాకు కోపం లేదు. కాని నీ అర్థంలేని మాటలు వింటూ కూర్చున్న ఈ సభను చూస్తే నాకు మండిపోతున్నది. జూదంలో ప్రావీణ్యంలేని ధర్మరాజుచేత వాళ్ళు బలవంతాన ఆడిస్తే అది వారికి న్యాయమైన గెలుపు ఎలా అయింది? ధర్మరాజు ఇంటికి వారు వచ్చి జూదమాడి గెలిస్తే అది న్యాయమైన విజయం అయేది. ఏమైనా, జూదంలో ఓడినందుకు పాండవులు ప్రతిజ్ఞ పాలించి వనవాసమూ, అజ్ఞాతవాసమూ చేశారు గద. ఇప్పుడు ధర్మరాజు తన రాజ్యం తాను కోరటానికి యాచించవలసిన పని ఏమిటి? ఏ విధంగానైనా వీళ్ళ రాజ్యం కాజెయ్యాలన్న దురుద్దేశం గల దుర్యోధనాదులు ధర్మమార్గం అవలంబిస్తారనే మాట అబద్ధం. మేమంతా వాళ్ళను హతమార్చి ధర్మరాజుకు రాజ్యాభిషేకం చేస్తాం. ధృతరాష్ట్రుడు జాలి తలిచి ఇచ్చే రాజ్యం ధర్మరాజుకు అవసరం లేదు. ధర్మరాజు అభిప్రాయం తెలుసుకోకుండా ఏమీ చెయ్యవద్దు," అన్నాడు.

తరవాత ద్రుపదుడు మాట్లాడుతూ, "సాత్యకి చక్కగా చెప్పాడు. మంచి మాటలకు కరిగి దుర్యోధనుడు రాజ్యం ఇవ్వడన్నది నిజం. ధృతరాష్ట్రుడికి తన

కొడుకును శాసించే శక్తి లేదు. భీష్మ ద్రోణులు దుర్యోధనుణ్ణి అనుసరించవలసిన దుస్థితిలో ఉన్నారు. కర్ణుడూ, శకునీ మూర్ఖులై దుర్యోధనుణ్ణి సేవిస్తున్నారు. మనం పంపే దూత పని సాధించుకు రావాలంటే మంచిగా మాట్లాడి లాభంలేదని నా నమ్మకం. మంచిగా మాట్లాడటం దుర్యోధనుడి దృష్టిలో అశక్తత అవుతుంది. మనం చేసే ప్రయత్నం చెయ్యాలి. శల్యుణ్ణీ, ధృష్టకేతుణ్ణీ, జయత్సేనుణ్ణీ, కైకేయులనూ, ఇతర రాజులనూ తమ తమ బలాలతో రమ్మని పిలవటానికి వేగంగా దూతలను పంపాలి. దుర్యోధనుడు కూడా ఆ పనే చేస్తాడు. ముందు అడిగినవారికి సహాయం లభిస్తుంది గనక త్వరగా సైన్యాల సమీకరణ చూడండి. ఇది చాలా భారమైన పని. వార్తలు పంపవలిసిన రాజులు చాలా మంది ఉన్నారు. ఇతను నా పురోహితుడు. వృద్ధుడు. ధర్మశీలుడు. ఇతనికి ఏం చెప్పాలో చెప్పి ధృతరాష్ట్రుడి కొలువుకు పంపుదాం," అన్నాడు.

కృష్ణుడు చివరకు మాట్లాడుతూ, "ద్రుపదుడు చెప్పినట్టు చేస్తే పాండవులకు మేలు కలుగుతుంది. చేసేదానిలో రాజనీతి ఉపయోగించాలి. ఇరుపక్షాలవారూ సుఖంగా ఉండగలిగితే మనకు అంతకన్న కావలిసినది లేదు. మనమంతా పెళ్ళికి వచ్చినవాళ్ళం. పెళ్ళి సలక్షణంగా జరిగింది. మన మందరమూ ఇక తిరిగి మన మన చోట్లకు వెళ్ళిపోవచ్చు. ద్రుపదుడు వృద్ధుడు. మన కందరికీ గురువులాటివాడు. ధృతరాష్ట్రుడికి పంపదగిన సందేశం ఏదో ఆయనే చెబితే అక్కడ భీష్మద్రోణులు మొదలైనవారు ఆదరిస్తారు. అది మా కందరికీ సమ్మతమే అవుతుంది. దుర్యోధనుడు ఒకవేళ ఆ సందేశాన్ని లక్ష్యపెట్టకపోతే, మిగిలిన రాజులకు వార్త పంపినట్టే నాకు కూడా పంపండి," అన్నాడు.

ఇలా అని కృష్ణుడు తిరుగు ప్రయాణం అవుతున్నప్పుడు విరాటుడు అతనికి ధన కనకవస్తువాహనాలు కానుకగా ఇచ్చి సంతోషంగా సాగనంపాడు.





# మహాభారతం

కృష్ణుడు ద్వారకకు బయలుదేరి వెళ్ళి పోగానే ఉపప్లావ్యంలో ధర్మరాజూ, విరాటుడూ, ఇతర రాజులూ యుద్ధప్రయత్నాలు ప్రారంభించారు. మంత్రి, బంధు, మిత్రులతో వెంటనే బయలుదేరి రమ్మని అందరు రాజులకూ విరాటుడూ, ద్రుపదుడూ కలిసి వార్తలు పంపారు. అలా వార్తలు అందిన రాజులు, పాండవుల మీది ప్రేమ చేతనైతేనేమి, విరాట ద్రుపదుల పట్ల గల గౌరవం చేతనైతేనేమి, ఉపప్లావ్యానికి రాసాగారు.

ఇక్కడ యుద్ధయత్నాలు సాగుతున్నట్టు తెలియగానే ధృతరాష్ట్రుడి కొడుకులు కూడా తమ తమ మిత్రులను పిలిపించనారంభించారు. ఈ విధంగా, రానున్న కురుపాండవ యుద్ధానికి గాను దేశాలన్నిటా సంచలనం కలిగింది. పెద్ద పెద్ద సేనల నడకతో భూమి అదిరిపోయింది.

ఈ లోపల ద్రుపదుడు తన పురోహితుణ్ణి కౌరవుల వద్దకు రాయబారం పంపబోతూ, "నువు ప్రజ్ఞావంతుడవు. ధృతరాష్ట్రుడు ఎలాటివాడో, ధర్మరాజు ఎలాటివాడో నీకు బాగా తెలుసు. కౌరవులు పాండవులను ఎలా మోసం చేశారో ధృతరాష్ట్రుడు ఎరుగును. విదురుడు వద్దంటున్నా వినక, తన కొడుకు కోరాడని ఆయన ధర్మరాజును జూదం ఆడటానికి పిలిపించాడు. వాళ్ళు ఇప్పుడు పాండవులకు రాజ్యం ఇవ్వకుండా ఉండటానికే నిశ్చయించుకుని ఉన్నారు. నువు ధృతరాష్ట్రుడితో ధర్మం చెప్పు. విదు



రుడు నీకు సహాయంగా మాట్లాడతాడు. నువు పాండవుల మంచితనమూ, దుర్యోధనుడి చెడ్డతనమూ నొక్కిచెప్పినట్టయితే వారి పక్షం వారు అధర్మం కోసం యుద్ధం చెయ్యటానికి వెనకాడుతారు. వారిలో ఈ విధంగా చీలిక తీసుకు రావటమే నీ ప్రధాన కర్తవ్యం. ఈ పని నీ వల్ల అవుతుంది. దుర్యోధనాదుల వల్ల నీకు ఎలాటి భయమూ ఉండదు. నువు దూతవేగాక, వయసులో చాలా పెద్దవాడివి," అని హెచ్చరించాడు.

ద్రుపదుడి పురోహితుడు తన శిష్యగణాన్ని వెంట బెట్టుకుని హస్తినాపురానికి బయలుదేరి వెళ్ళాడు.

తరవాత పాండవులు ఇతర రాజుల వద్దకు దూతలను పంపారు గాని, కృష్ణుడి వద్దకు అర్జునుడు స్వయంగా బయలుదేరాడు. వేగులవాళ్ళ ద్వారా పాండవుల చర్యలన్నీ తెలుసుకుంటున్న దుర్యోధనుడు కొద్దిపాటి పరివారాన్ని వెంట బెట్టుకుని, తాను కూడా స్వయంగానే ద్వారకకు వెళ్ళాడు. అర్జునుడూ, దుర్యోధనుడూ ఒకే రోజు ద్వారకలో అడుగు పెట్టారు.

ఇద్దరూ కృష్ణుడి ఇల్లు చేరేసరికి కృష్ణుడు నిద్రపోతున్నాడు. కృష్ణుడి తలదిక్కుగా ఒక ఉత్తమాసనం ఉన్నది. దుర్యోధనుడు తిన్నగా వెళ్ళి అందులో కూర్చున్నాడు. దుర్యోధనుడి వెనకనే అక్కడికి ప్రవేశించిన అర్జునుడు చేతులు కట్టుకుని, కృష్ణుడి కాళ్ళ వద్ద నిలబడ్డాడు.

మరికొంత సేపటికి కృష్ణుడు నిద్రలేస్తూ, తన కాళ్ళ వద్ద నిలబడి ఉన్న అర్జునుణ్ణి చూసి, తరవాత తన తల వైపున కూర్చుని ఉన్న దుర్యోధనుణ్ణి చూశాడు. అతను ఇద్దరితోనూ కుశలప్రశ్నలు చేసి, అతిథి సత్కారాలు పూర్తి చేసిన మీదట వారు వచ్చిన పని అడిగాడు.

దుర్యోధనుడు చిరునవ్వు నవ్వుతూ, "కృష్ణా, మాకు జరగబోయే యుద్ధంలో నువు నా పక్షాన ఉండి సహాయం చెయ్యాలి. నీకు నేనొకటి, అర్జునుడు ఒకటి కాదు

గద! ఇద్దరమూ నీకు ఒకేరకం బంధు వులం. అయినా ముందుగా నేను నీ వద్దకు వచ్చాను. అందుచేత నువు నాకే సహాయం చెయ్యటం ధర్మం," అన్నాడు.

దానికి కృష్ణుడు, "నువు ముందే వచ్చావు గాని, నేను ముందు అర్జునుణ్ణి చూశాను. అందుచేత, నేను మీ ఇద్దరికీ సహాయం చేస్తాను. చిన్నవాడు గనక అర్జు నుడు ముందు కోరుకుంటాడు. నా వంటి వారు యోధులు పదిలక్షల మంది ఉన్నారు. వారు ఒక పక్షం. నేను మరొక పక్షం. నేను మాత్రం యుద్ధం చెయ్యను, సలహా ఇస్తాను. అర్జునా, ఇందులో నువు ఏ పక్షం కోరుకుంటావు?" అని అడిగాడు.

అర్జునుడు కృష్ణుణ్ణి ఎంచుకున్నాడు. పది లక్షలమంది గోపాలయోధులను తీసు కోవటానికి దుర్యోధనుడు సంతోషంగా ఒప్పు కున్నాడు. తరవాత అతను బలరాముడి వద్దకు వెళ్ళి, యుద్ధంలో సహాయం చెయ్య మని కోరాడు.

బలరాముడు దుర్యోధనుడితో, "నాయనా, విరాటనగరంలో పెళ్ళికి వెళ్ళినప్పుడు నేను మీ రెండు పక్షాలను సమానంగా చేసి మాట్లా డాను. కాని కృష్ణుడు నాతో ఏకీభవించ లేదు. ఏ పక్షానికీ సహాయం చెయ్యరాదని నేను అప్పుడే నిశ్చయించుకున్నాను. కాక పోయినా, నీకు ఒకరి సహాయంతో ఏం



పని? వెళ్ళి క్షాత్రధర్మంతో యుద్ధం చెయ్యి!" అన్నాడు.

దుర్యోధనుడు పరమానంద భరితుడై, బలరాముణ్ణి గట్టిగా కౌగలించుకుని, తనకు విజయం కలిగినట్టే భావించుకుని, కృత వర్మ వద్దకు వెళ్ళి, అయనను సహాయం అడిగాడు. కృతవర్మ దుర్యోధనుడికి ఒక అక్షౌహిణీ సేన ఇచ్చాడు. దుర్యోధనుడు ఈ విధంగా తాను వచ్చిన పని పూర్తి చేసు కుని హస్తినాపురానికి తిరిగివెళ్ళాడు.

దుర్యోధనుడు వెళ్ళిపోగానే కృష్ణుడు అర్జునుడితో, "నేను యుద్ధం చెయ్యనని చెప్పాను గదా, నన్నే కోరుకుని పెద్ద సేనను ఎందుకు పోగొట్టుకున్నావు?" అని అడిగాడు.



దానికి అర్జునుడు, "ఆ సేనను నువ్వు ఒక్కడివే జయించగలవు. శత్రువుల నందరినీ నే నొక్కణ్ణే జయించగలను. నువ్వు యుద్ధం చేస్తే ఆ కీర్తి అంతా నీకే దక్కుతుంది గాని నాకేం మిగులుతుంది? నాకు శాస్త్ర కీర్తి కాంక్ష ఉండటం చేత, యుద్ధం చెయ్యాని నిన్నే కోరుకున్నాను. నువ్వు నాకు ఒక్క సహాయం చెయ్యాలి — నువ్వు నాకు రథసారథిగా ఉండాలి. ఈ కోరిక నాకు చాలా కాలంగా ఉన్నది. నువ్వు సారథిగా ఉంటే, ఈ కౌరవ సైన్యాన్నేమిటి, సురాసురులు ఏకమై వచ్చినా జయించగలను. అందుచేత నా ఈ కోరిక కాదనకుండా తీర్చు." అన్నాడు.

"నీ కోరిక తప్పకుండా తీర్చుతాను," అని కృష్ణుడు మాట ఇచ్చి, అర్జునుణ్ణి పంపేశాడు.

మద్రదేశపు రాజూ, నకుల సహదేవుల మేనమామా అయిన శల్యుడికి పాండవులు పంపిన దూత ద్వారా పిలుపు అందింది. ఆయన పాండవులకు సహాయం చెయ్యటానికి ఒక అక్షౌహిణి సేననూ, మహారథులైన తన కొడుకులనూ వెంట బెట్టుకుని బయలుదేరాడు. మద్రదేశపు దుస్తులూ, అలంకారాలూ, వాహనాలూ, రథాలూ విచిత్రంగా ఉండేవి. మహా పరాక్రమవంతుడయిన శల్యుడు ఆ వింత సేనతో మజిలీలు చేసుకుంటూ పాండవులున్నచోటికి రాసాగాడు.

శల్యుడు పాండవులకు సహాయం వెళుతున్న సంగతి చారుల వల్ల తెలుసుకుని దుర్యోధనుడు, తన మనుషుల ద్వారా శల్యుడు మజిలీ చేసినప్పుడల్లా సకల సదుపాయాలూ చేయించాడు. గుడారాలు వేయించి, వాటిని అలంకరింపజేశాడు; అద్భుతమైన వంట ఏర్పాట్లూ, వినోదాలూ అమర్చాడు. శల్యుడికి ప్రయాణం అమిత సుఖంగా జరిగింది. ఇదంతా తనకోసం ధర్మరాజు చేయిస్తున్న ఏర్పాటేనని శల్యుడు అనుకుని ఒకసారి, "నాకీ సదుపాయాలు చేయిస్తున్న వాళ్ళను తీసుకు రండి. వారు కోరిన వరాలిస్తాను," అన్నాడు.

రహస్యంగా శల్యుడి వెంటనే ఉంటున్న దుర్యోధనుడు ముందుకు వచ్చాడు. శల్యుడు అతన్ని తగిన విధంగా సత్కరించి, "నాయనా, నీ కేమి కావాలో చెప్పు. తప్పక ఇస్తాను," అన్నాడు.

వెంటనే దుర్యోధనుడు, "రాజా, నా సైన్యానికి నాయకుడివిగా ఉండు," అన్నాడు.

శల్యుడు అందుకు సమ్మతించి, "దుర్యోధనా, ఇప్పుడు నువ్వు మీ నగరానికి తిరిగి వెళ్ళు. నేను ధర్మరాజును చూడవలసిన పని ఉన్నది. అతనితో మాట్లాడి నీ దగ్గిరికి వస్తాను," అన్నాడు.

"ధర్మరాజును చూసి త్వరగా వచ్చెయ్యి. మా విజయం నీ పైనే ఆధారపడి ఉన్నది," అని దుర్యోధనుడు శల్యుణ్ణి కౌగలించుకుని, హస్తినాపురానికి వెళ్ళిపోయాడు.

తరవాత శల్యుడు ఉపప్లావ్యంలోని పాండవ సైనికశిబిరాన్ని చేరుకుని, ధర్మరాజు నుంచి అతిథి సత్కారాలు పొంది, నకుల సహదేవులను కౌగలించుకుని, వారిని తన చెంత కూర్చోబెట్టుకుని, ధర్మరాజుతో, "రాజా, క్షేమంగా వున్నావా? దైవానుగ్రహం వల్ల అరణ్యవాసం నుంచి బయటపడ్డావు. అంతకన్న దారుణమైన అజ్ఞాతవాసం కూడా చేశావు. రాజ్యభ్రష్టుడికి కష్టాలు గాక సుఖాలు కలుగుతాయా? కౌరవులను యుద్ధంలో గెలిచి సుఖపడతావులే. ఇంత జరిగాక నిన్నూ, నీ తమ్ములనూ సుఖంగా ఉండగా చూశాను. అంతేచాలు," అన్నాడు.





అయన ధర్మరాజుతో, తాను వచ్చే దారిలో దుర్యోధనుడు చేసిన అతిథిమర్యాదలూ, అతడికి సహాయపడతానని ఎలా మాట ఇచ్చినదీ చెప్పాడు.

అంతా విని ధర్మరాజు, "మహారాజా, నువు చేసిన పని మంచిదే. సంతోష పెట్టిన వాడి కోరిక తీర్చటం పెద్దవాళ్ళు చెయ్యదగినదే కదా! కాని నాకు కూడా ఒక గొప్ప ఉపకారం చెయ్యాలి. నువు యుద్ధరంగంలో కృష్ణుడితో సమానుడివి. కర్ణార్జునులకు యుద్ధం జరిగినప్పుడు నువు కర్ణుడికి సారథ్యం చెయ్యవలసిన అవసరం కలుగుతుంది. అందుకు సందేహం లేదు. ఎందుకంటే అర్జునుడి సారథి అయిన కృష్ణుడితో సమానుడు కౌరవసేనలో మరొకడు ఉండడు. కర్ణుడికి సారథ్యం చేసేటప్పుడు అర్జునుణ్ణి రక్షించు. కర్ణుడికి ఉత్సాహ భంగం చెయ్యి. ఇదే నా ప్రార్థన," అన్నాడు.

దానికి శల్యుడు, "నీకేమీ విచారం వద్దు. అవకాశం వచ్చినప్పుడు దుర్మార్గుడైన కర్ణుడి సంగతి నేను చూస్తాను, అర్జునుడికి విజయం కలిగేటట్టు చేస్తాను," అన్నాడు.

ధర్మరాజు అనుభవించిన కష్టాలను గురించి ప్రస్తావించుతూ, దేవేంద్రుడంతటి వాడు అనుభవించిన కష్టాలను గురించి శల్యుడు ఈ విధంగా చెప్పాడు:

త్వష్టప్రజాపతి ఇంద్రుడికి ద్రోహం తలపెట్టి, ఇంద్రుణ్ణి జయించగల విశ్వరూపుడనే వాణ్ణి సృష్టించాడు. విశ్వరూపుడికి మూడు తలలు. ఈ మూడు తలలవాడు ఇంద్రపదవి కోసం తపస్సు ప్రారంభించాడు. వాడి తపస్సు ఫలిస్తుందని ఇంద్రుడు భయపడి, ఆ విశ్వరూపుడి తపస్సుకు భంగం కలిగించమని అందగత్తెలైన అప్సరసలను పంపాడు. కాని వాళ్ళు విశ్వరూపుడి బుద్ధిని చలింపజేయలేక పోయారు.

అప్పుడు ఇంద్రుడు తానే వెళ్ళి విశ్వరూపుణ్ణి వజ్రాయుధంతో కొట్టి చంపాడు.

అందువల్ల ఇంద్రుడికి భయం తీరిపోయింది గాని, త్వరలోనే అంతకన్న పెద్ద ప్రమాదం అతనికి దాపరించింది.

తన కొడుకును ఇంద్రుడు చంపాడని తెలిసి త్వష్ట మండిపడి, ఇంద్రుణ్ణి చంపగల వాణ్ణి, వృత్రుడు అనేవాణ్ణి సృష్టించాడు. ప్రళయకాల సూర్యుడిలాటి వృత్రుడు తండ్రి ఆజ్ఞమీద స్వర్గానికి వెళ్ళి, ఇంద్రుణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఆయుధాలు లేని వృత్రుడు ఇంద్రుడి అస్త్రాలను లక్ష్యపెట్టక, అతన్ని పట్టుకుని మింగేశాడు. కాని వృత్రుడికి ఆవలింత వచ్చేసరికి ఇంద్రుడు తిరిగి బయటపడి, వృత్రుడితో యుద్ధం మాని పారిపోయాడు.

తరవాత ఇంద్రుడు దేవతలను వెంటబెట్టుకుని విష్ణువు వద్దకు వెళ్ళి, తనకు దాపురించిన కష్టాలు తెలిపి, వృత్తుణ్ణి చంపే ఉపాయం చెప్పమన్నాడు.

"వృత్రుడు ఇప్పుడు చావడు. వాడితో ముందు సఖ్యం చేసుకో," అని విష్ణువు ఇంద్రుడికి సలహా ఇచ్చాడు. అప్పుడు మహర్షులు వెళ్ళి, వృత్రుడితో, "నువ్వు ఇంద్రుణ్ణి జయించలేవు. ఇంద్రుడు నిన్ను జయించలేడు. మీరిద్దరూ సంధి చేసుకుని సౌఖ్యంగా ఉండండి," అని చెప్పారు.

వృత్రుడు వారి మాట విని ఇంద్రుడితో సంధి చేసుకుని, ఇంద్రుడంటే చాలా ప్రేమతోనూ, గౌరవంతోనూ ఉంటూ వచ్చాడు. కాని ఇంద్రుడు సమయం కోసం కాచుకుని ఉండి, ఒక సాయంకాలం వృత్రుడు ఒంటరిగా సముద్ర తీరాన విహరిస్తున్న సమయంలో, తన వజ్రాయుధంతో చంపేశాడు.

విశ్వరూపుణ్ణి చంపిన పాపమూ, వృత్రుణ్ణి చంపిన పాపమూ చుట్టుకుని ఇంద్రుడు మతిచెడి, ఎవరికీ కనపడకుండా తిరగసాగాడు. ఇంద్రుడిలా అయిపోగానే ఇంద్రపదవికి మరొకరిని చూడవలసి వచ్చింది. మహర్షులు నహుషుడి వద్దకు వెళ్ళి, ఆయనను ఇంద్రపదవి గ్రహించమనీ, మూడు లోకాలూ ఏలమనీ వేడుకున్నారు.





# మహాభారతం

నహుషుడు మొదట మహా సజ్జనుడు, కాని ఇంద్రపదవి రాగానే భోగలాలసుడై పోయి, దేవస్త్రీలతో విహరిస్తూ ఒకనాడు ఇంద్రుడి భార్య అయిన శచీదేవిని చూసి, ఆమెను మోహించాడు. తాను ఇంద్రుడే గనక శచీదేవి ఇప్పుడు తనకు భార్యగా ఉండాలని నహుషుడు కబురు చేసేసరికి, శచీదేవి భయపడి బృహస్పతి శరణు జొచ్చింది.

ఈ సంగతి విని నహుషుడు బృహస్పతి పైన మండిపడి, ఋషులనూ దేవతలనూ తిట్టాడు.

"పరపురుషుడి భార్యను కోరటం మహా పాతకం," అని వాళ్ళు నహుషుడికి నీతి చెప్పారు.

"ఇంద్రుడు ఇలాటి పనులు చాలా చేశాడు. మీరంతా అతనికి నీతి చెప్పలేక పోయారా ?" అని నహుషుడు వారిని అడిగాడు.

అప్పుడు దేవతలు బృహస్పతి వద్దకు వెళ్ళి, "మహాత్మా, నహుషుడు చాలా కోపంగా ఉన్నాడు. శచీదేవిని అతని భార్యగా ఉండమని ఒప్పించు. లేకపోతే లోకాలకు క్షేమం లేదు," అన్నారు.

"నేను ఎన్ని బాధలైనా పడతానుగాని నహుషుడికి భార్యగా ఉండను," అన్నది శచీదేవి. బృహస్పతి కూడా, శరణుజొచ్చిన శచీదేవిని రక్షించి తీరుతానన్నాడు.

ఆ పరిస్థితిలో, నహుషుడి ఆగ్రహం చల్లారేటట్టూ, శచీదేవికి ఇబ్బంది కలగ



కుండా ఉండేటట్టూ ఒక ఉపాయం ఆలోచించవలసి వచ్చింది.

"నహుషుడు గర్వోన్మత్తుడై, పతనం కావటానికి తగిన స్థితిలో ఉన్నాడు. అందు చేత, ప్రస్తుతానికి శచీదేవి అతని వద్దకు వెళ్ళి, కొంత వ్యవధి అడిగి వస్తే, ఈ సమస్యను కాలమే తీర్చవచ్చు," అని బృహస్పతి దేవతలతో అన్నాడు.

ఆ ప్రకారమే శచీదేవి నహుషుడి వద్దకు వెళ్ళి, "ఇంద్రుణ్ణి గురించి ఏ వార్తా తెలియటం లేదు. ఏ సంగతీ తెలియగానే నీకు భార్యను అవుతాను," అన్నది.

ఈలోపల మునులు ఇంద్రుణ్ణి పట్టుకుని పాపక్షయం కొసం అశ్వమేథం చేయించారు. ఇంద్రుడు స్వర్గానికి తిరిగి వచ్చి, నహుషుడి తేజస్సు చూసి భయపడి, మళ్ళీ ఎటో పారిపోయాడు. శచీదేవి అతన్ని వెతుక్కుంటూ వెళ్ళి, "నహుషుణ్ణి చంపి నీ ఇంద్రత్వం నువు తిరిగి పొందు," అని కోరింది.

"నహుషుణ్ణి ఇప్పుడు బలంతో గెలవటం సాధ్యం కాదు. ఉపాయంతో గెలవాలి. ఆ ఉపాయం నీ చేతిలో ఉన్నది. నహుషుడు నిన్ను కోరుతున్నాడు గనక, ఋషుల చేత మోయించుకుని నీ యింటికి రమ్మని నహుషుడితో చెప్పు. దానితో నహుషుడు పతనమవుతాడు." అన్నాడు ఇంద్రుడు.

ఋషుల చేత మోయించుకుని తన వద్దకు రమ్మని శచీదేవి అడగగానే నహుషుడు పరమానంద భరితుడై, మునుల చేత పల్లకీ మోయిస్తూ బయలుదేరాడు. దారిలో మునులు అతనితో ఏదో వాదం వేసుకున్నారు. నహుషుడు ఆగ్రహించి అగస్త్యుడి తలను తన కాలితో తన్నాడు. అగస్త్యుడు కోపించి, పాము కమ్మని నహుషుణ్ణి శపించాడు. దానితో నహుషుడు స్వర్గభ్రష్టుడయాడు. ఇంద్రుడు తిరిగి తన పదవి సంపాదించుకుని, శచీదేవితో సుఖంగా ఉన్నాడు.

శల్యుడు ధర్మరాజుకు ఈ కథ చెప్పి, దుర్యోధనుడి వద్దకు వెళ్ళిపోయాడు.

ద్రుపదుడి పురోహితుడు పాండవుల దూతగా హస్తినాపురానికి చేరే లోపుగా పాండవ కౌరవ పక్షాల చేరవలసిన వారు సేనలతో సహా వచ్చి చేరారు.

పాండవుల పక్షాన యుద్ధం చెయ్యటానికి ఏడు అక్షౌహిణుల సేన ఉపప్లావ్యంలో చేరింది. మహారథుడైన యుయుధానుడు ఒక అక్షౌహిణీ సేన తెచ్చాడు. చేదిరాజైన ధృష్టకేతుడు కూడా అంత సేనతో వచ్చాడు. జరాసంధుడి కొడుకైన జయత్సేను డనేవాడు ఒక అక్షౌహిణీ సేనతో వచ్చాడు. పాండ్య దేశపురాజు పర్వతప్రాంతీయులైన యోధులతో ధర్మరాజుకు సహాయం వచ్చాడు. ద్రుపదుడు అనేక దేశాలకు చెందిన యోధులనూ, మహారథులైన తన కొడుకులనూ వెంట బెట్టుకుని పెద్ద సేనతో వచ్చాడు. మత్స్యదేశపు రాజైన విరాటుడు గిరిజన సైనికులను తన వెంట తెచ్చాడు. ఇంకా అనేక దేశాలవారు వేరు వేరు ధ్వజాలెత్తి కౌరవులతో యుద్ధం చెయ్యటానికి వచ్చారు.

అదే సమయంలో, దుర్యోధనుడి పక్షాన పాండవులతో యుద్ధం చెయ్యటానికి పదకొండు అక్షౌహిణుల సేన అయత్తమయింది. నరకాసురుడి కొడుకైన భగదత్తుడు చీన కిరాతులతో కూడిన ఒక అక్షౌహిణీ సేనను వెంట బెట్టుకుని దుర్యోధనుణ్ణి చేరాడు. అది మహా బలసంపన్నమైన సేన. అలాగే



భూరిశ్రవసుడూ, శల్యుడూ చెరొక అక్షౌహిణీ సేనా తెచ్చారు. ఆకులూ, పూలూ కలిపి కట్టిన కదంబమాలలు ధరించిన ఏనుగుగున్నల లాటి యోధులను కృతవర్మ తెచ్చాడు. సింధుసౌవీరదేశాల నుంచి జయద్రథుడు (సైంధవుడు) మొదలుకుని అనేకమంది రాజులు దుర్యోధనుడి వద్దకు వచ్చారు. వారి సేనలు ఒక అక్షౌహిణీ ప్రమాణంలో ఉన్నాయి. దక్షిణాన మాహిష్మతీపురం నుంచి నీలుడు భయంకరమైన ఆయుధాలు ధరించిన గొప్ప యోధులను వెంట బెట్టుకు వచ్చాడు. అవంతిదేశపు రాజులు రెండు అక్షౌహిణుల సేన తెచ్చారు. కేకయదేశపు రాజులు, ఒక అక్షౌహిణీ సేన



తెచ్చారు. ఇంకా ఇతర దేశాల నుంచి వచ్చిన చిల్లర సేనలన్నీ కలిసి మూడు అక్షౌహిణులు అయాయి.

దుర్యోధనుడి పక్షాన వచ్చిన రాజులకే హస్తినాపురంలో చోటు చాలలేదు. ఇక వారి సేనల మాట చెప్పనే అవసరం లేదు. ఆ సేనలను పంచనదం లోనూ, గురుజాంగలం లోనూ, రోహితకారణ్యాల లోనూ, మరుభూమి లోనూ, అహిచ్ఛత్రం లోనూ, కాలకూట, గంగాకూటాల లోనూ, వారణం లోనూ, వాటధానం లోనూ, విస్తీర్ణమైన యమునాతీరానా సర్ది, శిబిరాలు ఏర్పరచారు.

ఈ విధంగా అక్కడక్కడా విడిసి ఉన్న సేనలను చూసుకుంటూ ద్రుపదుడి పురోహితుడు హస్తినాపురం చేరి, ధృతరాష్ట్రుడి సభాభవనానికి వెళ్ళాడు. ఆ వృద్ధబ్రాహ్మణుడికి విదురుడూ, భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ మర్యాదలు జరిపి, పాండవులను గురించి కుశలప్రశ్నలు చేశారు. ఆ బ్రాహ్మణుడు కూడా దుర్యోధనాదుల కుశలం అడిగి, నిండు సభలో అందరూ వింటూండగా ఇలా అన్నాడు:

"సభాసదులారా, ధృతరాష్ట్రుడూ, పాండురాజూ ఒకరి బిడ్డలే. తండ్రి తాతల ఆస్తిలో ఇద్దరికీ సమభాగం ఉన్నది. అలాటప్పుడు ధృతరాష్ట్రుడి కొడుకులు తమ తండ్రి ఆస్తి అనుభవించుతూ ఉండటానికీ, పాండురాజు కొడుకులు తమ తండ్రి ఆస్తి అనుభవించక పోవటానికీ కారణం ఏమిటి? పాండవులు తమ ఆస్తి అనుభవించకుండా దుర్యోధనుడు వారిని ఎన్ని బాధలు పెట్టినదీ మీరు మరిచిపోలేరు. పాండవుల ఆయువు గట్టిది కాకపోతే వారు ఏనాడో చచ్చిపోయి ఉందురు. అంతేకాదు, పాండవులు తమ స్వశక్తితో గెలుచుకున్న రాజ్యాన్ని కూడా ధృతరాష్ట్రుడి కొడుకులు మాయజూదంలో కాజేశారు. పాపాల భైరవుడు శకుని వారి దుర్మార్గాలకు సహాయపడ్డాడు. పదమూడేళ్ల పాటు పాండవులు తమ భార్యతోసహా అరణ్యాలలో పడరాని పాట్లు పడ్డారు. విరాట నగరంలో వారు గడిపిన జీవితం చెప్పదగి

నదీ వినదగినదీ కాదు. ఇంత జరిగినా పాండవులు కౌరవులతో శాంతి కోరుతున్నారు. వారికి కౌరవులతో యుద్ధం చెయ్యాలన్న కోరిక లేదు. యుద్ధం వల్ల జనక్షయం కలుగుతుంది. ఎవరికీ ఏ మాత్రమూ కీడు రాకుండా తమ రాజ్యభాగాన్ని తాము తిరిగి పొందాలని వారి కోరిక. దుర్యోధనుడికి తన బలంలో తనకు అమితమైన నమ్మకం ఉన్నది. దానికి తోడు అంతులేని సైన్యాలు వచ్చి చేరాయి గనక తాను గెలుస్తానని అతను భ్రమపడుతున్నాడు. దుర్యోధనుడి సేనలో నాలుగు అక్షౌహిణులుంటే ఏమయింది? పాండవసేనలో సాత్యకీ, భీముడూ, నకుల సహదేవులూ ఒక్కొక్క అక్షౌహిణికి సమానులు. అర్జునుడు ఒక్కడే ఇన్ని అక్షౌహిణుల ఎత్తు. అలాటి వాడే కృష్ణుడు. ఇలాటి బలసంపదగల పాండవులపై బుద్ధిగల వాడెవడూ యుద్ధం తల పెట్టడు. పాండవులతో సఖ్యం చెయ్యటానికి ఈ తరుణం మించిపోతే మరి రాదు."

ద్రుపదుడి పురోహితుడు ఇలా చెప్పిన మీదట భీష్ముడు, "బ్రాహ్మణోత్తమా, నీ మాటలు కటువుగా ఉన్నా వాటిలో నిజం ఉన్నది. పాండవులు యుద్ధానికి సిద్ధం కావటమూ, శాంతిని కోరటమూ కూడా ఉచితమే. పాండవులు అష్టకష్టాలూ పడిన మాట అబద్ధం కాదు. అర్జునుడు అనేక అస్త్రాలు



తెలిసిన మహాయోధుడు. వజ్రాయుధం గల ఇంద్రుడే అతనికి ఎదురు నిలవలేడు, మిగిలిన వారి మాట చెప్పేదేమిటి?" అన్నాడు.

భీష్ముడి మాట పూర్తి కాకుండానే కర్ణుడు లేచి, "బ్రాహ్మణోత్తమా, మీరు చెప్పినదంతా అందరికీ తెలిసినదే. ధర్మరాజు తాను ఆమోదించిన నియమం ప్రకారమే, జూదంలో ఓడి అరణ్యాలకు పోయాడు. పోయినవాడు మూర్ఖుడిలాగా ఇప్పుడు మళ్ళీ రాజ్యం అడుగుతున్నాడు. పాండవుల బలానికి బెదిరి దుర్యోధనుడు వారికి ఒక్క అడుగు మోపినంత భూమి కూడా ఇయ్యడు. వారికి నిజంగా రాజ్యం



కావాలంటే తిరిగి వనవాసం చెయ్యాలి. రాజ్యం కోసం ధర్మం విడిచి వారు యుద్ధానికి తలపడ్డారు," అన్నాడు.

భీష్ముడు చిరాకుపడి, "కర్ణా, ఎందుకీ వ్యర్థపు మాటలు? అర్జునుడు ఒంటరిగా మనలనందరినీ అవలీలగా ఓడించిన సంగతి అప్పుడే మరిచావా? ఈ బ్రాహ్మణుడు చెప్పిన ప్రకారం చెయ్యకపోతే అర్జునుడి కోపాగ్నికి మనమంతా రెక్కపురుగుల్లాగా మాడిచస్తాం," అన్నాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడు కల్పించుకుని, కర్ణుణ్ణి మందలించి, భీష్ముడు అందరికీ మేలుకోరే మాట్లాడాడని అతన్ని హెచ్చరించి, ద్రుపదుడి పురోహితుడితో, "అయ్యా, నేను బాగా ఆలోచించి, నా సమాధానం పాండవులకు సంజయుడి ద్వారా అందజేస్తాను. మీరు పాండవుల వద్దకు తిరిగి వెళ్ళండి," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఆ బ్రాహ్మణుణ్ణి సగౌరవంగా సాగనంపి, సంజయుణ్ణి పిలిపించి, "సంజయా, నువు వెంటనే బయలుదేరి ఉపప్లావ్యానికి వెళ్ళి, ధర్మరాజును కలుసుకుని క్షేమం అడిగి, వాళ్ళు కష్టాల నుంచి బయటపడినందుకు అభినందించు. తరవాత కృష్ణుణ్ణీ, పాండవులకు యుద్ధంలో సహాయం వచ్చిన ముఖ్యులనూ పలకరించు. మన మూలాన పాండవులు అనేక కష్టాలు పడ్డారు. వారివల్ల ఒక్క కీడు కూడా మనకు కలిగినట్టు నాకు గుర్తురావటం లేదు. ధర్మరాజు మన మీద అలిగి యుద్ధం చేస్తాడని తలుచుకుంటేనే నాకు భయంగా ఉన్నది. భీమార్జునులు యుద్ధంలో ఎదురులేని వాళ్ళు. నువు వారితో ఏం చెబుతావో నీ యిష్టం! యుద్ధం జరగకుండా ఏదో ఒకటి చెప్పి, పాండవపక్షం వారిని ఒప్పించు," అన్నాడు.

సంజయుడు రథం మీద ఉపప్లావ్యం చేరి, ధర్మరాజును కలుసుకున్నాడు. ఇద్దరూ ఉభయపక్షాల వారి క్షేమం అడిగి తెలుసుకున్న అనంతరం సంజయుడు, అందరూ వింటూండగా ఈ విధంగా తెలిపాడు:

"ధృతరాష్ట్రుడు శాంతి కోరి నన్ను పంపాడు. పాండవులు శాంతించాలి. వారిని లోకం ఆదర్శపురుషులుగా భావిస్తున్నది. అలాటప్పుడు వారిలో ఎలాటి కల్మషం కనిపించినా అది నూరింతలు అనిపిస్తుంది. జయాపజయాలు నిర్ణయించటానికి వీలు లేని యుద్ధం ఎంత మాత్రమూ కోరదగినది కాదు. కౌరవులను చంపి రాజ్యం తీసుకుందా మనుకోవటం యోగ్యమైనది కాదు. జ్ఞాతులను చంపటం కన్న మరణం మేలు. పాండవబలం దేవతలనైనా జయించరానిది. అలాటిదే కౌరవబలం కూడా. ఈ రెండు బలాలకూ యుద్ధం జరిగితే ఎవరు జయించినా ఒకటే ననీ, కొంచెమైనా సుఖం ఉండదనీ నా నమ్మకం. పాండవుల వంటి వారు ధర్మార్థాలకు దూరమైన హీనమార్గం తొక్కరనుకుంటాను. శాంతి చేకూరేటట్టు చూడమని నేను మీ అందరినీ చేతులు మోడ్చి ప్రార్థిస్తున్నాను."

సంజయుడు ఇలా అన్న మీదట ధర్మరాజు, "సంజయా, నేను యుద్ధం కోసం తపించి పోతున్నట్టు మాట్లాడానా? శాంతి వల్ల సమకూరేదానికి యుద్ధం చేసేమూర్ఖుణ్ణి కాను. బుద్ధిమంతుడైన వాడు తన సుఖం గురించి ఆలోచించినట్టే పరుల సుఖం గురించి కూడా ఆలోచించాలి. కారడవిలో, చిచ్చురేపి కార్చిచ్చు ప్రజ్వలిస్తుంటే,



'అయ్యో నాకు అపాయం!' అనే వాడు మూఢుడు కాడా? దుర్మార్గుడైన దుర్యోధనుణ్ణి సమర్థించుతూ ధృతరాష్ట్రుడు ఎలా సుఖం పొందగలడు? కపట జూదం ఆడిన నాడే కౌరవుల వినాశనం ఆరంభమయింది. కాని కౌరవులతో శాంతంగా సహజీవనం చెయ్యటానికి నాకు అభ్యంతరం లేదు. వారు మాకు లోగడ చేసిన ద్రోహాలన్నీ మరిచిపోతాను. నాకు ఇంద్రప్రస్థం మటుకు ఏలుకోవటానికి ఇయ్యమను. దుర్యోధనుణ్ణే రాజరాజుగా ఉండనీ," అన్నాడు.

దానికి సంజయుడు, "ధర్మరాజా, నువు ఎన్నడూ ధర్మం తప్పి ఎరగవు. తుచ్ఛమైన రాజ్యభోగం కోసం నీ కీర్తిని శాశ్వతంగా

కళంక పరచుకొంటావా? యుద్ధం ఆలోచన మాను. కౌరవులు నీకు రాజ్యభాగం ఇయ్యరు. యుద్ధం చేసి రాజ్యం పొందేకన్న, నువ్వూ, నీ తమ్ములూ యాచనా వృత్తితో జీవించటం కీర్తికరమైనది,'' అన్నాడు.

సంజయుడు ధర్మాధర్మాలను గురించి చెప్పినది ధర్మరాజు ఒప్పుకోక, ఆపద్ధర్మం ఉంటుందనీ, ఆపదల నుంచి బయటపడటానికి అధర్మం చెయ్యటం కూడా ధర్మమేనన్నాడు; తనకు కృష్ణుడు ఏది చెబితే అదే ధర్మమన్నాడు.

కృష్ణుడు సంజయుడితో, ''నువు శాంతి, శాంతి అని అంటున్నావు. రాజులకు యుద్ధం చెయ్యటం ధర్మం కాదంటావా? అధర్మానికి పాల్పడిన వాళ్ళు ధృతరాష్ట్రుడి కొడుకులు. దుర్యోధనుడు పాండవుల సొత్తు అధర్మంగా హరించాడు. అందులో రాజధర్మం ఏమున్నది? దొంగకూ, దుర్యోధనుడికీ భేదమేమిటి? ఇన్నాళ్ళూ అతను పాండవుల ఆస్తి అనుభవించాడు? ఇప్పుడు వారి సొత్తు వారి కెందుకు ఇయ్యడు? పరుల రాజ్యం అనుభవించే కంటె సొంత రాజ్యం వెయ్యిరెట్లు మంచిది. దాని కోసం యుద్ధం చేసి చావటమైనా మాకు ఇష్టమే. కౌరవ సభలో ఈ మాట గట్టిగా చెప్పు,'' అన్నాడు.

సంజయుడు తనవల్ల తప్పులేవైనా ఉంటే క్షమించమని అందరినీ కోరి, అందరి వద్దా సెలవు పుచ్చుకుని బయలుదేరబోతూండగా ధర్మరాజు, ''సంజయా, మేము నిజంగా శాంతినే కోరుతున్నాము. ధృతరాష్ట్రుడు కూడా శాంతినే కోరే పక్షంలో, మాకు రాజ్యంలో కొంత భాగమైనా ఇయ్యమను. మా అయిదుగురికీ అయిదు ఊళ్ళు ఇయ్యమను. కుశస్థలమూ, వృకస్థలమూ, మాకందీ, వారణావతమూ అనే ఊళ్ళకు తన యిష్టం వచ్చిన ఊరు మరొకటి కలిపి ఇయ్యమను. అందరమూ సుఖంగా ఉండవచ్చు. నేను శాంతికి ఎంత సంసిద్ధుణ్ణో, యుద్ధానికి కూడా అంత సంసిద్ధుణ్ణే,'' అన్నాడు.

ఈ సందేశం కూడా తీసుకుని సంజయుడు హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోయాడు.





# మహాభారతం

సంజయుడు పాండవులతో తన రాయబారం ముగించుకుని హస్తినాపురానికి తిరిగి వచ్చి, ధృతరాష్ట్రుడి దర్శనం చేసుకుని, "రాజా, ధర్మరాజు అధర్మమంతా నీ పైనే ఆరోపించాడు. నువు లోకనిందకు లోనయావు. ధర్మరాజు పంపిన సందేశాన్ని రేపు సభలో అందరూ ఉండగా చెబుతాను." అని, ధృతరాష్ట్రుడి అనుమతితో ఇంటికి వెళ్ళిపోయాడు.

సంజయుడు వెళ్ళగానే ధృతరాష్ట్రుడు విదురుణ్ణి కార్యాలోచనకు పిలిపించాడు. విదురుడు రాగానే ఆయన, "పాండవుల వద్దనుంచి సంజయుడు వచ్చి వెళ్ళాడు. నాకు నిద్ర రాకుండా వున్నది. మనస్సులో తాపంగా ఉన్నది. నా తాపం పోగొట్టే మాటలు చెప్పు." అన్నాడు.

ధృతరాష్ట్రుడికి నిద్ర రాకపోవటానికి కారణం పాండవులే అని తెలుసుకుని విదురుడు ఆయనను పెట్టవలసిన చివాట్లన్నీ పెట్టి, "రాజా, నువు భూమి కోసం అబద్ధం ఆడక, వంశక్షయం కలగకుండా చూసుకో. దుర్యోధనుడి కోసం పాండవులను దూరం చేసుకున్నావు. ఇందుకు దుర్యోధనుడు భ్రష్టుడైపోవటం చూస్తావు. పాండవులను చేరదీసి, వాళ్ళు బతకటానికి కొన్ని గ్రామాలైనా ఇయ్యి. నీ కొడుకులను అదుపులో ఉంచుకో. జ్ఞాతివైరం తగదు. ఆపదలో ఆదుకునేది వాళ్ళే." అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "నేను ఎప్పుడూ పాండవులను గురించి మంచిగానే ఆలోచిస్తాను. కాని దుర్యోధనుడు జ్ఞాపకం

46. కర్ణుడి శపథం



రాగానే నా బుద్ధి మారిపోతుంది. ఇదంతా దైవయోగం. నేను ఏం చెయ్యగలను?'' అన్నాడు.

మర్నాడు ఉదయం ధృతరాష్ట్రుడి సభ కిటకిటలాడు తున్నది. దుర్యోధనుడికి యుద్ధంలో సహాయం చేయటానికి వచ్చిన రాజులందరూ, సంజయుడు పాండవుల నుంచి తెచ్చిన సందేశం వినటానికి కుతూహలపడి సభకు వచ్చారు.

ఆ సభలోకి సంజయుడు ప్రవేశించి, అందరికీ నమస్కారాలు చేసి, ''రాజన్యులారా, నేను పాండవుల దగ్గిరికి వెళ్ళి వచ్చాను. వారు మిమ్మల్నందరినీ అడిగినట్టు చెప్పమన్నారు. వారంతా క్షేమంగా ఉన్నారు. వారికి నేను ధృతరాష్ట్ర మహారాజు చెప్పమన్న మాటలు చెప్పాను,'' అన్నాడు.

అతనితో ధృతరాష్ట్రుడు, ''సంజయా, నువు వెళ్ళి పాండవులకు నా సందేశం తెలిపినందుకు చాలా సంతోషం. మిగిలిన వాళ్ళు ఏమన్నదీ తరవాత వింటాంగాని, ముందు అర్జునుడు ఏమన్నాడో చెప్పు. ఈ రాజులందరూ వింటారు,'' అన్నాడు.

సంజయుడు ఇలా చెప్పాడు:

''అందరూ వింటూండగా అర్జునుడు ఇలా చెప్పమన్నాడు: దుర్యోధనుడు మొదలైన వాళ్ళు చాలా పాపాలు చేశారుగాని వాటికి ప్రాయశ్చిత్తం అనుభవించలేదు. యుద్ధం తలపెడితే పాపఫలం అనుభవిస్తారు. ధర్మరాజు ఎంతో క్రోధాన్ని అణచుకున్నాడు; అది బయటికి వస్తే కౌరవులు భస్మమైపోతారు. భీముడు ఒక్క గద మాత్రమే తీసుకుని కౌరవసేనలను నిర్మూలించేటప్పుడు దుర్యోధనుడు తప్పక పశ్చాత్తాప పడతాడు. నకుల సహదేవులూ, విరాట ద్రుపదులూ, ఉపపాండవులూ, అభిమన్యుడూ, నేనూ విజృంభించి పోరాడుతూ ఉంటే దుర్యోధనుడికి పశ్చాత్తాపం తప్ప ఇంకేమీ మిగలదు. నేను పెద్దలందరికీ నమస్కరించి మా రాజ్యం కోసం మాత్రమే యుద్ధం చేస్తాను. పాండవులు ప్రాణాలతో

ఉండగా ధృతరాష్ట్రుడి కొడుకులు మా రాజ్యాన్ని సుఖంగా ఎలా అనుభవించ గలరు? ఒకవేళ యుద్ధంలో వారు మమ్మల్ని జయించగలిగితే లోకంలో ధర్మం నశించి నట్టే. అలా జరగదు. యుద్ధం తప్పనిసరి అయితే ధృతరాష్ట్రుడి వంశం నిర్మూలమవు తుంది. కర్ణుడితో సహా ధృతరాష్ట్రుడి కొడు కులనందరినీ నేనే చంపుతాను. అందుచేత ఏం చేస్తారో తేల్చుకోండి."

అప్పుడు భీష్ముడు దుర్యోధనుడితో, "నువు కర్ణుడి మాటలూ, శకుని మాటలూ, దుశ్శాసనుడి మాటలూ విని చెడిపోతున్నావు. కౌరవ పాండవ యుద్ధం నివారించు. లేక పోతే నాశనం తప్పదు," అన్నాడు.

ఈ మాటకు కర్ణుడు ఆగ్రహించి, "భీష్మా, నన్ను గురించి నువు అన్నమాట మరొకడు అంటే బతికి ఉండేవాడు కాడు. నేను రాజధర్మాన్ని ఏ మాత్రమూ తప్ప లేదు. దుర్యోధనాదులకు ఎన్నడూ, ఎలాటి ద్రోహమూ చెయ్యలేదు. యుద్ధంలో నేనొక్కణ్ణే పాండవులందరినీ జయించ గలను. మొదటి నుంచీ శత్రువులుగా ఉన్న వాళ్ళతో శాంతి ఏమిటి? ధృతరాష్ట్ర మహా రాజుకూ, దుర్యోధనుడికీ ఇష్టమైనదంతా నేను చేస్తాను," అన్నాడు.

అప్పుడు భీష్ముడు ధృతరాష్ట్రుడితో, "ఈ కర్ణుడు పాండవులను చంపగలనని



మాటిమాటికీ పేలుతూ ఉంటాడు. పాండ వులు చేసిన ఘన కార్యాలలో ఒక్కటి కూడా ఇతను చెయ్యలేదు. హీనుడూ, దుర్బుద్ధీ అయిన ఇతను పాండవులను గురించి అవమానకరంగా మాట్లాడతాడు. గోగ్రహణమప్పుడు తన తమ్ముణ్ణి అర్జునుడు చంపితే ఏం చేశాడు? ఘోషయాత్ర సమ యంలో గంధర్వులు దుర్యోధనుణ్ణి పట్టుకు పోతే ఏం చేశాడు? పాండవులేగదా అతన్ని విడిపించింది? కర్ణుడు మాటలవాడేగాని చేతలవాడు కాడు. ఇతని మాటలు పాటించ వద్దు," అన్నాడు.

ద్రోణుడు మాట్లాడుతూ, "భీష్ముడిచ్చిన సలహా బాగుంది. అర్జునుడు సంజయుడి



భీముడు ఒక ఎత్తూ అని ఆయన నమ్మకం. భీముడి బలం ఎలాటిదో భీష్మ ద్రోణ కృపులకూ తనకూ మాత్రమే తెలుసు. భీష్మ ద్రోణ కృపులు యుద్ధంలో తప్పనిసరిగా తమ పక్షాన పోరాడుతారు గాని, వారికి పాండవుల పట్ల వైరం లేదు. ఇవన్నీ తలచుకుంటే ధృతరాష్ట్రుడికి కౌరవనాశం కళ్ళ ఎదట కనపడ్డట్టయింది. అర్జునుడు ఎన్నడూ యుద్ధంలో ఓడి ఎరగడు. అతన్ని ఎదిరించే వాళ్ళు ఎవరున్నారు? కర్ణుణ్ణి నమ్మటానికి లేదు. ద్రోణుడు వయసు మళ్ళినవాడు; పైపెచ్చు అర్జునుడికి గురువు.

"యుద్ధం వల్ల కౌరవ వంశనాశనం తప్పదు. యుద్ధం చెయ్యకుండా ఉంటేనే అందరికీ క్షేమమని తోస్తున్నది. అందరూ ఒప్పుకుంటే శాంతి కోసం ప్రయత్నించుదాం," అన్నాడాయన.

ఆ మాటకు సంజయుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, అన్ని చిక్కులకూ మూల కారణం నువే. కురుజాంగల భూములు తప్ప మిగిలినదంతా పాండవులు నీకు జయించి ఇచ్చిన రాజ్యమే కద. అదంతా నీ సొంతం చేసుకున్నావు. అదంతా నీ దేనన్న ధోరణిలో ఉన్నావు. నీ కింద ఉండిన రాజులు అనేకులు పాండవుల శక్తి గ్రహించి వారి పక్షం అయారు. దుర్యోధనుణ్ణి అదుపులో ఉంచక పోతే చాలా ప్రమాదం ఉన్నది." అన్నాడు.

ద్వారా పంపిన సందేశంలో అబద్ధం ఏమీ లేదు. పాండవులతో సంధి చేసుకోమని నేను ఎప్పుడూ చెబుతూనే వున్నానుగదా." అన్నాడు.

భీష్మద్రోణులు చెప్పిన మాటలకు ధృతరాష్ట్రుడు ఏమీ అనక, ధర్మరాజు ఏమన్నాడని సంజయుణ్ణి అడిగాడు. ధర్మరాజుకు ఎవరెవరు యుద్ధంలో సహాయపడుతున్నారో సంజయుడు వివరించి చెప్పి, ధర్మరాజు యుద్ధానికి సిద్ధంగా ఉన్నాడని చెప్పాడు.

కాని ధృతరాష్ట్రుడికి భీముణ్ణి తలుచుకుంటేనే వణుకు పుట్టుతుంది. సంజయుడు చెప్పిన యోధులంతా ఒక ఎత్తూ,

అప్పుడు దుర్యోధనుడు తండ్రితో, "మేము ఓడిపోతామని నీకు భయం దేనికి? మేము తప్పక గెలుస్తాము. నిన్నూ, విదురుణ్ణీ తప్ప మిగిలిన మన అందరినీ చంపించాలని కృష్ణుడి ఉద్దేశం. పాండవులు నిజంగా యుద్ధంలో గెలవగలిగితే అయిదు ఊళ్ళు ఎందుకు అడుగుతున్నారు? భీముణ్ణి చూసి నీకెందుకు భయం? నా గదతో ఒక్క దెబ్బ కొట్టి భీముణ్ణి చంపగలను. భీష్ముడు ఒక్కడే పాండవసేనలను నాశనం చెయ్యగలడు. ఆయనతోబాటు ద్రోణుడూ, అశ్వత్థామా కలిసి అర్జునుణ్ణి చంపలేరా? కర్ణుడి వద్ద ఇంద్రుడిచ్చిన శక్తి ఉన్నది. పాండవసేనలో నిజమైన యోధులు పాండవులూ, ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ మాత్రమే. మన పక్షాన అలాటి యోధులు ఎందరో ఉన్నారు," అన్నాడు.

తరవాత అతను సంజయుణ్ణి, "పాండవుల యుద్ధతంత్రం ఏమిటి?" అని అడిగాడు. కౌరవసేనలలో ఏయే సేనలనూ, యోధులనూ పాండవపక్ష యోధులు తమ వంతుగా ఏర్పాటు చేసుకున్నదీ సంజయుడు వివరంగా చెప్పాడు.

ఆ వివరాలు విని ధృతరాష్ట్రుడు బెంబేలుపడి దుర్యోధనుడితో, "నాయనా, యుద్ధం ఆలోచన కట్టిపెట్టు. నిన్ను అందరూ మెచ్చుకుంటారు. నువు సుఖంగా బతకటానికి సగం రాజ్యం చాలు. పాండవులకు కొంత రాజ్యం ఇయ్యి. అజ్ఞానంచేత నాశనం తెచ్చిపెట్టుకోకు," అన్నాడు.





"నేను ఎవరి మాటలూ విననవసరం లేదు. పాండవులను జయించటానికి నాకు ఎవరి సహాయమూ అవసరంలేదు. కర్ణుడూ, దుశ్శాసనుడూ ఉంటే చాలు. పాండవులను మేము ముగ్గురమే చంపగలం. వాళ్ళూ మేమూ కూడా బతికి ఉండటానికి వీల్లేదు. నేను సూది మొన మోపినంత భూమి కూడా పాండవులకు ఇయ్యను," అని దుర్యోధనుడు అన్నాడు.

కర్ణుడు దుర్యోధనుణ్ణి సమర్థించి, యుద్ధ భారమంతా తాను ఒక్కడే వహిస్తాననీ, పాండవులను తానే జయిస్తాననీ అన్నాడు.

అతని మాటలు వింటుంటే భీష్ముడికి అసహ్యం వేసింది.

"కర్ణా, నీ బుద్ధి వికటించి ఇలా మాట్లాడుతున్నావు. అర్జునుడి పరాక్రమమూ, కృష్ణుడి శక్తీ తెలిసి కూడా ఎందుకిలా ప్రగల్భాలు పలుకుతున్నావు? ఇది నీచుడి లక్షణం కాదా?" అన్నాడు.

ఈ మాట కర్ణుడికి అవమానకరమయింది. అతను భీష్ముడితో, "కృష్ణుడు నువు చెప్పినంత గొప్పవాడే, కాని నన్ను తూలనాడటం సహించను. నేను అస్త్రసన్యాసం చేస్తున్నాను. నువు యుద్ధరంగంలో నిలిచి ఉన్నంత కాలమూ అందులోకి అడుగు పెట్టను. నీ అనంతరం నా పరాక్రమాన్ని మిగిలిన వాళ్ళు చూస్తారు," అని సభ నుంచి వెళ్ళిపోయాడు.

భీష్ముడు వెటకారంగా నవ్వుతూ దుర్యోధనుడితో, "ఒంటరిగా శత్రువును గెలవగల మహా పరాక్రముడు అస్త్రసన్యాసం చేశాడే, యుద్ధభారం ఇప్పుడెవరు వహిస్తారు? వీడు తానొక్కడే శత్రువులను జయిస్తానంటే ఎవరు నమ్ముతారు? కాకపోయినా, జయద్రథుడూ, బాహ్లికుడూ లాటి మహాయోధుల ముందు అలా ప్రగల్భాలు పలకటం తప్పు కాదా? బ్రాహ్మడినని చెప్పి వీడు పరశురాముడి వద్ద అస్త్రాలు సంపాదించి అధర్మానికి పాల్పడ్డాడు," అన్నాడు.

భీష్ముడిలా అన్నందుకు దుర్యోధనుడు ఆయనను నిందిస్తూ; "తాతా, పాండవులు

కూడా మాలాటి వాళ్ళే, మాతోపాటు పుట్టిన వాళ్ళే. మాకు కూడా అస్త్రవిద్యలూ, యుద్ధ విద్యలూ తెలుసు. అలాటప్పుడు పాండవులే గెలుస్తారని ఎలా చెప్పావు? నేను యుద్ధంలో మీ ఎవ్వరిమీదా ఆధారపడబోవటంలేదు,'' అన్నాడు.

దుర్యోధనుడి యుద్ధ కాంక్ష చూసి విదురుడు అతనికి ఒక కథ చెప్పాడు: ఒక బోయవాడు వలపన్నితే అందులో రెండు పక్షులు తగులుకున్నాయట. అయితే అవి భయపడక, వలతోపాటు జంటగా ఆకాశంలో ఎగిరిపోసాగాయి. వాటిని వెంబడిస్తూ బోయవాడు నేల మీద పరిగెత్తనారంభించాడు. అది చూసి ఒక ముని, ''వెర్రివాడా, ఆకాశంలో ఎగిరి పోయే పక్షులను నేలమీద వెంబడించి ఏమైనా ప్రయోజనం ఉందా?'' అని అడిగాడు. దానికా బోయవాడు, ''స్వామీ, ఆ పక్షులు రెండూ తమలో తాము పోట్లాడుకోనంత కాలమూ నా ప్రయత్నం వ్యర్థమే. కాని అవి పోట్లాటకు దిగగానే ఆ పక్షులూ, వాటిని కలిపి ఉన్న నా వలా కూడా నాకు దక్కుతాయి,'' అన్నాడు. చివరకు అలాగే జరిగింది. పక్షులు కీచులాడుకుని కింద పడ్డాయి. బోయవాడు రెంటినీ పట్టుకుని, తన వల తాను తీసుకున్నాడు.

విదురుడు దుర్యోధనుడికి ఈ కథ చెప్పి, ''నాయనా, జ్ఞాతులు ఆస్తికోసం కలహించటం వల్ల సర్వనాశనం కలుగుతుంది. ఇంకొక సంఘటన చెబుతాను. మేము ఒకసారి కిరాతుల వెంట గంధమాదన పర్వతానికి వెళ్ళాం. అక్కడ భయంకరమైన లోయలో ఒక పెద్ద తేనెపట్టున్నది. ఆ తేనె తాగితే జరామరణాలుండవనీ, గుడ్డివాళ్ళకు కళ్ళు వస్తాయనీ అక్కడి వాళ్ళు చెప్పారు. మా వెంట వచ్చిన కిరాతులు ఆ తేనె కోసం ఆశపడి, క్రూరసర్పాలు తిరిగే ఆ లోయలోకి దిగి చచ్చిపోయారు. వాళ్ళు తేనె కోసం ఆశపడ్డారేగాని, దాన్ని సాధించటంలో గల ప్రమాదం ఆలోచించలేదు. రేపు రాజ్యం కోసం పాండవులతో యుద్ధం చెయ్యటం కూడా ఇలాటి అవివేకమే అవుతుంది,'' అన్నాడు.






ధృతరాష్ట్రుడు కూడా యుద్ధం ప్రమాదకరమని దుర్యోధనుణ్ణి హెచ్చరించాడు. దుర్యోధనుడు ఎవరి మాటలూ వినిపించుకోలేదు. సభలో కూర్చుండి ఉన్న రాజులు యుద్ధం తప్పదని రూఢి చేసుకుని, లేచి వెళ్ళిపోయారు.

ధృతరాష్ట్రుడికి తన కొడుకులు యుద్ధం చేసి గెలవాలన్న ఆశ ఉన్నది. ఆయన సంజయుణ్ణి రహస్యంగా పిలిచి, "సంజయా, నీకు పాండవ బలమూ, మన బలమూ కూడా తెలుసు గనక, పాండవుల పక్షాన యుద్ధం చేసేవారిలో ఉత్సాహంగా ఉన్న వారెవరో, నీరసంగా ఉన్నవారెవరో, బలంగలవారూ, బలహీనులూ ఎవరో కాస్త చెప్పు," అన్నాడు.

దానికి సంజయుడు, "రాజా, నేను నీకు ఏకాంతంలో ఏమీ చెప్పను. నేను చెప్పేది విని నువు అసూయపడతావు. అందుచేత వ్యాసుణ్ణీ, గాంధారినీ ఇక్కడికి పిలిపించు, అన్నాడు.

త్వరలోనే వ్యాసుడూ, గాంధారీ వచ్చారు. అప్పుడు సంజయుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, కృష్ణార్జునులు అవతార పురుషులు, మహావీరులు. కృష్ణుణ్ణి మూడు లోకాలూ ఏకమై కూడా తేరిపార చూడలేవు. అలాటి కృష్ణుడు నీ కొడుకులను నిర్మూలించ సంకల్పించాడు," అన్నాడు.

"సంజయ్యా, ఈ రహస్యం నీకెలా తెలిసింది? నా కెందుకు తెలియలేదు?" అని ధృతరాష్ట్రుడు అడిగాడు.

47. కృష్ణరాయబారం



"రాజా, నువు విద్యా విహీనుడివి, తమస్సుతో నిండినవాడివి. నేను విద్యద్వారా కృష్ణుడి మహత్తు తెలుసుకున్నాను," అన్నాడు సంజయుడు.

వ్యాసుడు ధృతరాష్ట్రుడితో, "నువ్వంటే కృష్ణుడికి చాలా ఇష్టం. ఈ సంజయుడు కృష్ణుడి సంగతి పూర్తిగా తెలిసినవాడు. ఇతను చెప్పినట్టు చేస్తే నీకు లాభం కలుగుతుంది," అని చెప్పాడు.

ఈ లోపుగా ఉపప్లావ్యంలో, సంజయుడు తన రాయబారం ముగించి, హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోగానే, ధర్మరాజు కృష్ణుడితో, "కృష్ణా, ఇదే మాకు మిత్రులు సహాయపడదగిన సమయం. ఈ ఆపత్సమయంలో మమ్మల్ని ఆదుకోగల వాడివి నువు ఒక్కడివే. నిన్ను నమ్ముకునే మేము కౌరవులను నాశనం చేయ సంకల్పించాం. మమ్మల్ని కాపాడే భారం నీదే!" అన్నాడు.

"నువు ఏమి చెప్పదలచావో అది నిశ్శంకగా చెప్పు," అన్నాడు కృష్ణుడు.

ధర్మరాజు ఇలా అన్నాడు:

"సంజయుడు చెప్పినదంతా విన్నావు గదా. ధృతరాష్ట్రుడు చెప్పమన్న మాటలే అతను చెప్పాడు. ఆ ముసలి లోభి మాకు రాజ్యం ఇవ్వకుండానే మా నుంచి శాంతి కోరుతున్నాడు. ధృతరాష్ట్రుడి నిజాయితీని నమ్మి మేము ఘోరమైన అరణ్యవాసం అనుభవించాం. కాని ఆయన దుర్యోధనుడి ఇష్టానుసారమే పోతాడు. నేను నా తల్లికి గాని, హితులకుగాని కొంచెం కూడా సుఖం కలిగించలేకపోయాను. కనీసం మా అయిదు గురికీ అయిదు ఊళ్ళు ఇస్తే యుద్ధం మానేస్తానన్నాను. ధృతరాష్ట్రుడు అందుకు కూడా సిద్ధంగా లేడు. దారిద్ర్యం కన్న చావు మేలు. క్షత్రియధర్మం చాలా పాపిష్ఠిది. కాని క్షత్రియులమైన మేము ఆ ధర్మాన్ని విడిచి, ఇతర వృత్తులను అనుసరించలేం. అందుచేత మేము శాంతి మార్గాన్నే కోరుతున్నాం. అది పనికిరానప్పుడు యుద్ధం ఉండనే ఉన్నది. అందుచేత ఇప్పుడు మాకు ఏది కర్తవ్యమో చెప్పు."

దానికి కృష్ణుడు, "రాజా, నాకు మీరూ, వారూ ఒకటే. మీ ఉభయపక్షాల శ్రేయస్సు కోరి నేను కౌరవుల వద్దకు పోతాను. మీ ఆశయాలకు భంగం కలగకుండా కౌరవులకు శాంతి కలిగేటట్టు చేశానంటే నాకు ఎంతో పుణ్యం వస్తుంది. ఎంతో మందికి చావు రాకుండా చేసినవాణ్ణి అవుతాను," అన్నాడు.

ధర్మరాజు ఇందుకు సమ్మతించక, "దుర్మార్గుడైన దుర్యోధనుడు నీ మాట వినడు. అతని వద్ద చేరిన రాజులందరూ అతని ధోరణి గల వాళ్ళే. అలాటి వాళ్ళ మధ్యకు నువ్వు వెళ్ళటం నా కెంతమాత్రమూ ఇష్టం లేదు. నీకు లేశ మాత్రం బాధ కలిగినా నేను సహించలేను," అన్నాడు.

దానికి కృష్ణుడు, "ధర్మరాజా, దుర్యోధనుడి సంగతి నే నెరుగుదును. అక్కడి వాళ్ళకు నా సంగతీ తెలుసు. వాళ్ళు నా జోలికి రావటానికి సాహసించరు. ఒక వేళ వస్తే అందరినీ భస్మీపటలం చేస్తాను. మనం శాంతికోసం ప్రయత్నించకపోతే లోకాపవాదానికి గురిఅవుతాం. అందుచేత నేను అక్కడికి వెళ్ళటం అవసరమే," అన్నాడు.

"నీకు ఎదురు చెప్పటానికి నేనెంతవాణ్ణి? నువు క్షేమంగా వెళ్ళి, మా కార్యం చక్కబెట్టి, శాంతి సాధించి, తిరిగిరా. అవసరాన్ని బట్టి మంచిగానూ, కరుకుగానూ మాట్లాడు.



నువు ఏం చెప్పాలో నీకు నేను చెప్పాలా?" అన్నాడు ధర్మరాజు.

దానికి కృష్ణుడు, "ధర్మరాజా, నువు ధర్మాన్ని ఆశ్రయించావు. కౌరవులు వైరాన్ని ఆశ్రయించారు. క్షత్రియుడు జయించినా, మరణించినా యుద్ధం చెయ్యటమే అతని ధర్మంగాని బిచ్చమెత్తుకోవడం కాదు. వాళ్ళు చాలామంది స్నేహితులను చాలా కాలంగా సమకూర్చుకుని బలవంతులై ఉన్నారు. వారు శాంతికి ఒప్పుకుంటారనుకోకు. నువు మెత్తగా కనబడినంత కాలమూ వాళ్ళు నీ రాజ్యం అనుభవిస్తూనే ఉంటారు. నీకు చేసిన ద్రోహాలకు వాళ్ళు కొంచెమైనా పశ్చాత్తాపపడటం లేదు.



వాళ్ళను నువు దయతలచకు. నువు ధృత రాష్ట్రుణ్ణీ, భీష్మణ్ణీ తలుచుకుని భక్తి భావం చూపటం నాకు కొంచెం కూడా నచ్చలేదు. నేను వెళ్ళి, కౌరవ సభలో అందరి అపోహలూ తొలగించి, నీ ధర్మబుద్ధి అంద రికీ అర్థమయేటట్టు చేస్తాను. నేను నీకు నష్టం కలగకుండా శాంతి కోసమే ప్రయ త్నిస్తానుగాని, పరిస్థితి చూస్తే యుద్ధం తప్ప దనే నాకు అనిపిస్తున్నది. దుర్యోధనుడు బతికి ఉండగా నీ రాజ్యం నీకు దక్కదు. అందుచేత తగు ప్రయత్నంలో ఉండు," అన్నాడు.

అప్పుడు భీముడు కృష్ణుడితో, "కృష్ణా, నువు కౌరవ సభకు వెళ్ళటం చాలా ఉచితంగా ఉన్నది. అందరూ వింటూండగా నువు దుర్యోధనుడితో మంచి మాటలు చెప్పి, శాంతి సాధించు. వాడిది రాక్షస స్వభావం. వాడికి మంచిగా చెప్పటం చాలా కష్టమే. అందుచేత వాడితో మరింత స్నేహంగా మాట్లాడాలి. మా వంశానికి ఘోర ప్రమాదం రాకుండా చూడు. నాకుగాని, ధర్మరాజుకుగాని, అర్జునుడికిగాని యుద్ధ కాంక్ష లేదు. మేము శాంతినే కోరుతున్నాం," అన్నాడు.

భీముడన్న ఈ మాటలు విని కృష్ణుడు నిర్ఘాంతపోయాడు. భీముడు ఇంత సాధువుగా ఎన్నడూ మాట్లాడి ఉండలేదు. భీముడు అలా మాట్లాడటం చూస్తే నిప్పు చల్లగా ఉన్నట్టు తోచింది కృష్ణుడికి. అతను భీముణ్ణి రెచ్చగొట్టే ఉద్దేశంతో ఇలా అన్నాడు:

"భీమా, యుద్ధమంటే ఉత్సాహం గల వాడివి ఇలా నీరుగారి పోయి మాట్లాడుతున్నా వేమిటి? ధృతరాష్ట్రుడి కొడుకులను చంపే ఉద్దేశం వదులుకున్నావా? దుర్యోధనుణ్ణి ఎప్పుడు చంపుతానా అని అహోరాత్రాలు అలమటించినవాడివి. నిన్ను చూస్తే పిచ్చి ఎత్తుతుందేమో ననిపించేది. అలాటి వాడివి శాంతి కోసం దేవులాడటం ఎంత ఆశ్చర్యం! నిజం ఏమిటంటే, నువు బెదిరిపోయావు. అందుకే శాంతి కోరుతున్నావు. నీ పరాక్ర

మాన్నే నువు మరిచావు. నువు మాట్లాడు తుంటే ఇంకెవరో మాట్లాడుతున్నట్టున్నది. ఈ అధైర్యం నీకు నప్పటం లేదు. క్షత్రియుడివి, గొప్ప కార్యాలు సాధించినవాడివి. నీ వంటి వాడు తన ప్రయోజకత్వంతో సంపాదించినది తప్ప అనుభవింప గోరడు."

ఈ మాటలు విని భీముడికి చాలా రోషం వచ్చింది. అతను ఇలా అన్నాడు:

"కృష్ణా, నేను ఒకటి చెబితే, నువు మరొకటి అనుకున్నావు. నాకు యుద్ధమంటే ఇష్టం లేదని ఎలా అనుకున్నావు? ఇంత కాలం నన్ను ఎరిగి ఇదేనా నువు గ్రహించినది? నన్ను తెలిసిన వాళ్ళెవరూ నీలాగా మాట్లాడరు. చెబుతున్నాను విను. నేనే చెప్పుకోవటం తప్పు గాని, నా బలమూ, పౌరుషమూ సాటిలేనివి. నా చేతికి చిక్కిన వాడు ప్రాణాలతో బయటపడలేడు. యుద్ధం జరిగినప్పుడు నా పరాక్రమం నువే చూస్తావు. నా శరీరబలం తగ్గలేదు. నేను భయపడలేదు. మా భరతవంశం నాశనం కావటం ఇష్టం లేకనే నేను నీతో శాంతవచనాలు చెప్పాను."

ఈ మాటలకు కృష్ణుడు నవ్వి, "భీమా, నిన్ను నిందించటానికి నేను అలా అనలేదు. నీ శక్తులు నీ కన్న కూడా నాకు బాగా తెలుసు. నేను కౌరవసభలో మీ ప్రయోజనంతోబాటు శాంతి సాధించటానికే ప్రయ



త్నిస్తాను. కాని నా ప్రయత్నం నెరవేరక పోతే యుద్ధం తప్పదు. అప్పుడు భారమంతా నీ మీదనే ఉండబోతుంది. నేనై యుద్ధం కోరను. నీ మనసు తెలుసుకోగోరి అలా అన్నాను, అంతే!" అన్నాడు.

తరవాత అర్జునుడు కృష్ణుడితో, "కౌరవ సభలో నువు చెప్పదగినది ధర్మరాజు చెప్పాడు. కౌరవులు శాంతికి అంగీకరించరని నువు అనుకుంటున్నట్టు కనబడుతున్నది. అదే జరగవచ్చు కూడా. అయినా ప్రయత్నించకుండా ఉండరాదు. మాకూ మాకూ సఖ్యం కలిగేటట్టు ప్రయత్నించు. అది నీకు అసాధ్యం కాదనుకుంటాను. లేదా, నువు మరొక విధంగా నిర్ణయించినా



దానివల్ల మాకు మేలే అవుతుంది. వాళ్ళను చంపటం తప్పనిసరి అయితే అలాగే చేయవచ్చు. మాకు ఏది మేలో అది నువే నిశ్చయించు," అన్నాడు.

"అర్జునా, నేను చేయవలసిన ప్రయత్నమంతా చేస్తాను. శకుని కత్తులు ఎగదోస్తూ ఉండగా దుర్యోధనుడు మంచిగా మీకు రాజ్యం ఇవ్వడు. ధర్మరాజు శాంతి కోరుతున్నట్టు ఆ దుర్మార్గుడితో చెప్పగూడదనుకుంటున్నాను. వాడి సంగతి తెలియనట్టు మాట్లాడతా వెందుకు?" అన్నాడు కృష్ణుడు.

తరవాత నకులుడు కృష్ణుడితో, "మా అన్నలు తమ అభిప్రాయాలు చెప్పారు. నీ అభిప్రాయం నీ కున్నది. కాని ఇవేవీ అమలు కాకపోవచ్చు. పరిస్థితిని బట్టి అందరి అభిప్రాయాలూ మారుతాయి. కనక పరిస్థితిని బట్టి చెయ్యవగినది చెయ్యి. శాంతంగా మాట్లాడి లాభం లేకపోతే పరుషంగానే మాట్లాడు," అన్నాడు.

సహదేవుడు కృష్ణుడితో, "ధర్మరాజు ధర్మమే చెప్పాడు గాని, నువు మటుకు తప్పక యుద్ధం జరిగేటట్టు చూడు. వాళ్ళు శాంతి కావాలన్నా కూడా ఆ ప్రయత్నం చెడగొట్టు," అన్నాడు.

సాత్యకి సహదేవుణ్ణి బలపరిచాడు. పాండవుల పక్షాన వచ్చిన యోధులందరూ సింహనాదాలు చేశారు.

అప్పుడు ద్రౌపది దుఃఖిస్తూ కృష్ణుడితో, "ధర్మరాజు శాంతి కోరి అయిదూళ్ళు చాలునన్నా ఆ దుర్యోధనుడు ఒప్పుకోలేదు. పాండవులకు రాజ్యం ఇస్తేనే గాని నువు శాంతికి ఒప్పుకోకు. యుద్ధంలో పాండవులు కౌరవులను చంపగలరు. అదే వారికి సరిఅయిన మార్గం. నాకు తీరని అవమానం చేసిన ఆ దుర్యోధనుడు ఇంకా బతికే ఉన్నాడు. నువు సంధి మాటలు మాట్లాడేటప్పుడు నా జుట్టును మరిచిపోకు. ఇది పట్టుకునే నన్ను నిండుసభలోకి ఈడ్చుకు వచ్చారు. దుశ్శాసనుడి చెయ్యి తెగిపడటం చూస్తే గాని నాకు శాంతి కలగదు," అంటూ శరీరం అదిరేటట్టుగా ఏడ్చింది.

కృష్ణుడు ఆమెను తగిన విధంగా ఓదార్చాడు.

కృష్ణుడు పాండవుల రాయబారిగా బయలుదేరుతూ. సాత్యకితో, "సాత్యకీ, నా రథంలో శంఖమూ, చక్రమూ, గదా, ఇతర ఆయుధాలూ పెట్టు. దుర్యోధనుడు దుర్మార్గుడు. అతనికన్న దుర్మార్గులు కర్ణ శకునులు. ఎంతటి బలవంతుడైనా శత్రువు బలహీనుడని నిర్లక్ష్యం చెయ్యరాదు," అన్నాడు.

అంతా సిద్ధమయాక కృష్ణుడు తన రథంలో సాత్యకిని కూడా ఎక్కించుకుని హస్తినాపురానికి బయలుదేరాడు. పాండవులూ, చేకితానుడూ, ధృష్టకేతుడూ, ద్రుపదుడూ, కాశీరాజూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ, విరాటుడూ మొదలైన రాజులు కృష్ణుణ్ణి కొంతదూరం సాగనంపారు.

వాళ్ళు తిరిగి వెళ్ళేటప్పుడు ధర్మరాజు కృష్ణుణ్ణి కౌగలించుకుని, "కృష్ణా, మా అమ్మను, కుంతిని కుశలం అడుగు. ఆమె మమ్మల్ని ఎంతో గారాబంగా పెంచింది; మాకు ఏ ఆపదా రాకుండా వెయ్యి కళ్ళతో కాపాడింది; మా మూలాన పడరాని పాట్లుపడ్డది. మా అందరి పక్షానా నువు ఆమెను కౌగలించుకో. ఆమెను ఓదార్చు. ధృతరాష్ట్రుడూ, భీష్మ ద్రోణ కృపులూ, బాహ్లీక సోమదత్తులూ, అశ్వత్థామా మొదలైన పెద్దలందరికీ నా నమస్కారాలు చెప్పి, కుశలం అడుగు. విదురుణ్ణి నాకు బదులు కౌగలించుకో," అన్నాడు.

తరవాత సాగనంప వచ్చిన వారందరూ కృష్ణుడి వద్ద సెలవు పుచ్చుకుని వెనక్కు మరలి వెళ్ళారు.

దారుకుడు తోలుతున్న కృష్ణుడి రథం అమిత వేగంగా ప్రయాణం సాగించింది. కృష్ణుడు కౌరవుల రాజ్యం ప్రవేశించి, వృకస్థలంలో ఆ రాత్రి మజిలీ చేయ నిశ్చయించాడు. అక్కడ అతను విడిదిలో దిగగానే ఆ గ్రామంలోని పెద్దలందరూ అతన్ని చూడవచ్చి, అతన్ని తమ ఇళ్ళకు తీసుకుపోయి, సత్కరించారు. కృష్ణుడు వారికి తన విడిదిలో ఆతిథ్యం ఇచ్చి, సత్కరించాడు.






కృష్ణుడు వస్తున్నాడని హస్తినాపురంలో తెలియగానే ధృతరాష్ట్రుడు భీష్మద్రోణులనూ, సంజయ విదురులనూ, దుర్యోధనుణ్ణీ అతని మంత్రులనూ పిలిపించి, "కృష్ణుడు ఇక్కడికి వస్తున్నాడట. ఊళ్ళో అందరూ వింతగా చెప్పుకుంటున్నారు. అతనికి దారిలో అన్ని సదుపాయాలూ ఏర్పాటు చెయ్యండి. అతనికి రకరకాల సత్కారాలు చెయ్యండి," అన్నాడు.

దుర్యోధనుడు హస్తినాపురం నుంచి వృకస్థలం దాకా దారి అంతా అలంకరింపజేసి, అక్కడక్కడా సభలు నిర్మింపజేశాడు. కృష్ణుడు ఆ అలంకరణలనూ, సభలనూ చూడకుండానే హస్తినాపురం చేరాడు. దుర్యోధనుడు తప్ప మిగిలిన ధృతరాష్ట్రుడి కొడుకులూ, భీష్మద్రోణాదులైన పెద్దలూ రథాల మీద అతనికి ఎదురు వెళ్ళారు.

కృష్ణుడు ధృతరాష్ట్రుడి మందిరం ముందు రథం దిగి, కాలి నడకన మూడు కక్ష్యలు దాటి, ధృతరాష్ట్రుడి కొలువు కూటం ప్రవేశించాడు. అతను సభలోకి అడుగుపెట్టగానే ధృతరాష్ట్రుడితో సహా అందరూ లేచి నిలబడ్డారు. కృష్ణుడు ముందు భీష్ముణ్ణీ, ధృతరాష్ట్రుణ్ణీ కుశల ప్రశ్నలతో గౌరవించి, మిగిలిన రాజులందరినీ వయసువారీగా పలకరించాడు. అతను కూర్చోవటానికి ధృతరాష్ట్రుడు బంగారు ఆసనం తెప్పించి వేయించాడు. కృష్ణుడు అక్కడ అతిథిసత్కారాలన్నీ పొంది, కొంత



సేపు కబుర్లతో కాలక్షపం చేసి, అక్కడి నుండి విదురుడి ఇంటికి వెళ్ళాడు.

ఆ రోజు మధ్యాహ్నం కృష్ణుడు కుంతీదేవిని చూడటానికి ఆమె ఇంటికి వెళ్ళాడు. కుంతీదేవి కృష్ణుడి కంఠం కౌగలించుకుని, తన కొడుకులను తలుచుకుని ఏడ్చింది. ఆమె అతనికి తగిన సత్కారాలు చేసి కూర్చోబెట్టి, "కృష్ణా, నా కొడుకులు నన్నిక్కడ వదిలి, అరణ్యాలకు వెళ్ళారు. నా శరీరం ఇక్కడ ఉన్నదేగాని, నా మనసు వాళ్ళవెంటే ఉన్నది. తండ్రి లేని ఆ బిడ్డలను నేను ఎంతో గారాబంగా పెంచాను. భయంకరమైన అరణ్యాలలో వాళ్ళు ఎలా జీవించారో? ధర్మరాజు ఎవరూ, ఎన్నడూ మోయనంత ధర్మభారాన్ని మోస్తున్నాడు. అతను ఎలా ఉన్నాడు? క్షేమంగా ఉన్నాడా? భీముడు కులాసాగా ఉన్నాడా? అర్జునుడు కులాసాగా ఉన్నాడా? సహదేవుడు ఎలా ఉన్నాడు? వాడు నాకు ఎన్నివిధాల సేవలు చేసేవాడు! నకులుడు క్షేమమా? వాణ్ణి నేను మళ్ళీ చూస్తానా? నాకు కొడుకులకన్న ప్రియమైనది ద్రౌపది ఎలా ఉన్నది? అంత మంచి మనిషి కష్టాలు పడిందంటే పుణ్యాత్ములు సుఖపడతారని ఎలా నమ్మటం?" అన్నది.

కృష్ణుడు కుంతీదేవిని ఊరడించి, "నీ కొడుకులూ, కోడలూ నీకు కనిపిస్తారు. శత్రువులను జయించి వారు నీ దగ్గిరికి వస్తారు," అన్నాడు. తరవాత అతను కుంతీదేవి వద్ద సెలవు తీసుకుని దుర్యోధనుడి వద్దకు వెళ్ళాడు.

దుర్యోధనుడి ఇల్లు ఇంద్రభవనం లాగున్నది. దాని పైఅంతస్థులో దుర్యోధనుడు రత్నసింహాసనం మీద కూర్చుని ఉన్నాడు. అతని సమీపంలో దుశ్శాసన, కర్ణ, శకునులు కూర్చుని ఉన్నారు. ఇంకా అక్కడ అనేకమంది కౌరవులూ, ఇతర రాజులూ ఉన్నారు. కృష్ణుడు రాగానే అందరూ లేచి నిలబడి మర్యాదచూపారు. కృష్ణుడు అందరితోనూ కుశలప్రశ్నలు చేసి, ఎవరికి తగినట్టు వారిని పరామర్శించి, తన

కోసం ప్రత్యేకంగా వేసిన ఆసనం మీద కూర్చున్నాడు. దుర్యోధనుడు కృష్ణుణ్ణి తన ఆతిథ్యం స్వీకరించమన్నాడు. అందుకు కృష్ణుడు ఒప్పుకోలేదు.

"మా రెండు పక్షాలకూ సహాయపడ్డావు గదా, మేము ప్రేమతో ఇచ్చే ఆతిథ్యం నిరాకరించటానికి కారణ మేమిటి?" అని దుర్యోధనుడు కృష్ణుణ్ణి అడిగాడు.

"నేను దూతగా వచ్చిన వాణ్ణి. నేను వచ్చిన పని నెరవేరితే నిరభ్యంతరంగా మీరిచ్చే ఆతిథ్యాన్ని స్వీకరిస్తాను," అన్నాడు కృష్ణుడు.

"మమ్మల్ని గురించి నువు అపోహలు పెట్టుకోరాదు. నువు వచ్చిన పని నెరవేరినా, నెరవేరకపోయినా కూడా నీకు ఆతిథ్యం ఇవ్వటం మా విధి. అందుచేత నువు మా ఆతిథ్యం స్వీకరించి తీరాలి," అని దుర్యోధనుడు మళ్ళీ అన్నాడు.

కృష్ణుడు నవ్వి, "ఇష్టమున్నవారితోనూ, ఆపదలో ఉన్నప్పుడూ భోజనం చెయ్యవచ్చు. దుర్యోధనా, నీకు మా పట్ల ప్రీతి లేదు, మేము ఆపదలలోనూ లేము. మాకూ మీకూ మధ్యవైరం ఉన్నది గనక నువు నాకు ఆతిథ్యం ఇవ్వరాదు, నీ ఆతిథ్యం నేను పుచ్చుకోనూ రాదు. నీకు పాండవుల మీద అకారణవైరం ఉన్నది. వారేమో నాకు ప్రాణాలవంటివారు. వారివల్ల ఒక్క



అధర్మంగాని జరిగినట్టు ఎవరూ చెప్పలేరు. వారిని ద్వేషిస్తున్నావంటే నన్నుద్వేషిస్తున్నట్టే! అందుచేత నీ ఆతిథ్యం స్వీకరించమని నన్ను ఒత్తిడి చెయ్యకు," అని చెప్పి, అక్కడి నుండి బయలుదేరి, ద్రోణుడూ, కృపుడూ, భీష్ముడూ మొదలైనవారు వెంట రాగా, విదురుడి ఇంటికి వెళ్ళాడు.

తన వెంట వచ్చిన వారి నందరినీ వారి వారి ఇళ్ళకు పంపి, కృష్ణుడు విదురుడి ఇంట భోజనం చేశాడు. భోజనానంతరం కృష్ణుడితో విదురుడు, "కృష్ణా, నువు ఇక్కడికి రావటం అంత మంచిది కాదని నాకు తోస్తున్నది. దుర్యోధనుడు అన్ని ధర్మాలనూ అతిక్రమించాడు. అతని



మనస్సు యుద్ధం మీదే ఉన్నది గాని, శాంతి మీద లేదు. కర్ణుడు ఒక్కడే పాండవ బలాలన్నిటినీ గెలుస్తాడను కుంటున్నాడు గనక అతను శాంతికి ఒప్పుకోడు. అతనికి సైనిక బలం కూడా చాలా హెచ్చుగా ఉన్నది. అందుచేత నువు ఏమి చెప్పినా అతని తలకు ఎక్కదు. అతనికి అండగా వచ్చిన రాజులలో నీకు శత్రువులు చాలామంది ఉన్నారు. వాళ్ళమధ్యకు నువు వెళ్ళటం నా కెంత మాత్రమూ ఇష్టం లేదు. నీ మీది అభిమానంతో చెప్పానుగాని, నీ ప్రభావమూ, పౌరుషమూ తెలీక కాదు," అన్నాడు.

దానికి కృష్ణుడు విదురుడితో, "స్నేహితుడు చెప్పదగిన మాట చెప్పావు. నువ్వన్నట్టు జరుగుతుందని తెలిసే నేను వచ్చాను. అయినా శాంతి కోసం శాయశక్తులా ప్రయత్నించి, ఉభయపక్షాలకూ నాశనం కలగకుండా చూడటం నా ధర్మం, లేకపోతే, సర్వనాశనం జరుగుతూ ఉంటే కృష్ణుడు చూస్తూ ఊరుకున్నాడన్న మాట వస్తుంది. నాకు వచ్చిన భయం ఏమీ లేదు," అని చెప్పి, ఆ రాత్రి విదురుడి ఇంటనే నిద్రచేశాడు.

మర్నాడు ఉదయం కృష్ణుడు నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకుని, స్నానం చేసి, సంధ్యావందనం చేస్తూ ఉండగా దుర్యోధనుడూ, శకునీ వచ్చి, ధృతరాష్ట్రుడు సభలో ఉన్నాడనీ, కృష్ణుడి రాకకోసం ఎదురు చూస్తున్నాడనీ తెలిపారు.

ఇంతలో కృష్ణుడి సారథి అయిన దారుకుడు రథం సిద్ధంగా ఉన్నదని చెప్పాడు. కృష్ణుడు తన రథంలో విదురుణ్ణి ఎక్కించుకుని బయలుదేరాడు. దుర్యోధన, శకునులు తమ రథంలో బయలుదేరారు. వారి వెంట ఇంకా అనేకమంది రాజులు ఏనుగుల మీదా, గుర్రాల మీదా వచ్చారు. వీరితో బాటు చాలామంది పౌరులుకూడా ఊరేగింపులో చేరారు. ఇలా పెద్ద బలగంతో రాజవీధి వెంబడి ధృతరాష్ట్రుడి సభకు వెళ్ళే కృష్ణుణ్ణి వీధుల వెంబడి నిలబడి స్త్రీలూ, పిల్లలూ, వృద్ధులూ చూశారు.



సభాద్వారం దగ్గిర కృష్ణుడు తన రథం దిగి, ఒక చేత్తో విదురుణ్ణీ, మరొక చేత్తో సాత్యకిని పట్టుకుని సభలోకి ప్రవేశించాడు. కృష్ణుడికి ముందుగా కర్ణ దుర్యోధనులూ, అతని వెనకగా కృతవర్మ మొదలైన వృష్ణి వీరులూ సభా ప్రవేశం చేశారు. సభలోని వారంతా కృష్ణుడికి తగిన గౌరవమర్యాదలు చూపారు. అతను తన కోసం సిద్ధంగా ఉంచిన ఆసనం మీద కూర్చున్నాడు. అతనికి దగ్గిరలోనే కర్ణుడూ, దుర్యోధనుడూ ఒకే ఆసనం మీద కూర్చున్నారు. విదురుడు కృష్ణుడి పక్కనే మరొక ఆసనంమీద కూర్చున్నాడు. నిశ్శబ్దంగా ఉన్న సభలో కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణి ఉద్దేశించి ఇలా అన్నాడు:

"రాజా, వీరులందరూ నాశనం కాకుండా కౌరవ పాండవుల మధ్య శాంతి సాధించమని నిన్ను యాచించటానికి నేను ఇక్కడికి వచ్చాను. మేలు చేకూరే మార్గాలు నీకు ఒకరు చెప్పనవసరం లేదు. అన్ని రాజ వంశాలకూ అగ్రస్థానంలో కురుకులం ఉన్నది. కౌరవులకు నువు ముఖ్యుడివి. ఎవరు ఏ తప్పుచేసినా నువు శిక్షించగలవు. దుర్యోధనుడు మొదలైన నీ కొడుకులు ధర్మమూ, అర్థమూ విడిచిపెట్టి, మర్యాదలన్నీ మంటగలిపి అనేక దుష్కార్యాలు చేస్తున్నారు. ఇది నువు తెలుసుకోవాలి. రానున్న ఆపదకు కౌరవులే కారణభూతులు. ఈ ఆపదను నివారించకపోతే భూమి మీద గల ప్రజలందరికీ నాశనం గలుగుతుంది. ఈ ఆపదను తప్పించే శక్తి నీలో ఉన్నది. కౌరవ పాండవుల మధ్య శాంతి కలిగించటం కష్టం కాదని నా నమ్మకం. అది నీ చేతిలోనూ, నా చేతిలోనూ ఉన్నట్టిదే. నువు నీ కొడుకులను సన్మార్గానికి తిప్పు, నేను పాండవుల కోపాగ్నిని చల్లార్చుతాను. నీ కొడుకులనూ, నీ కులంవారినీ శాసించే హక్కు నీకున్నది. వారిని శాసించి, వారికీ, పాండవులకూ సంధి చెయ్యి. పాండవులను జయించటం ఎవరితరమూ కాదు. వారు నీకు అండగా ఉండగా నిన్ను జయించటం ఎవరితరమూ కాదు. నువు ప్రపంచాన్ని

అంతనూ శాసించగలుగుతావు. పాండవులతో సంధి నీకే లాభకరం. యుద్ధంలో నీ కొడుకులు ఓడినా, పాండవులు ఓడినా నీకు ఏం సుఖం ఉంటుంది? యుద్ధం జరిగితే ప్రపంచంలో గల రాజులందరూ అందులో పాల్గొని అందరూ చచ్చిపోతారు. అందుచేత ఈ ప్రపంచాన్ని కాపాడటం నీ చేతిలో ఉన్నది. ఇక్కడ చేరిన రాజులందరూ సంతోషంగా సహపంక్తి భోజనాలు చేసి, ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళిపోయేటట్టు చూడు. పాండవులకు నీ కన్న పెద్ద దిక్కెవరు? కష్ట సమయంలో నువు ఆదుకోక పోతే వారికి ఎవరున్నారు? ఆ మాటే వారు నీతో చెప్పమన్నారు. ఈ సభలో ఉన్న వారితో వారు మరొకమాట చెప్పమన్నారు: ఏ సభలో అధర్మ నిర్ణయం జరుగుతుందో ఆ అధర్మం వల్ల కలిగిన పాపం సభలోని వారి కందరికీ చుట్టుకుంటుంది. అందుచేత సభికులు ధర్మాన్నీ, న్యాయాన్నీ చెప్పటం వారి విధి. నేను బాగా ఆలోచించి చెబుతున్నాను. ఈ రాజులందరినీ మృత్యువు నుంచి కాపాడు. పాండవులకు న్యాయంగా వారి తండ్రి భాగం ఇయ్యి. ధర్మరాజు ఎలాటి వాడో నీకు తెలుసు. లక్క ఇల్లు కాల్చినా అతను తిరిగి నీ వద్దకే వచ్చాడు. నువు అతన్ని ఇంద్రప్రస్థానికి తోలితే మారు మాటాడక వెళ్ళాడు. శకుని మాయతో



నీ కొడుకు తన సర్వస్వమూ కాజేసినా ధర్మరాజు సహించాడు. నేను మీ క్షేమమూ పాండవుల క్షేమమూ కోరి చెబుతున్నాను, నీ కొడుకులను నిగ్రహించు. పాండవులు నీకు సేవ చెయ్యటానికైనా, యుద్ధం చెయ్యటానికైనా సిద్ధంగానే ఉన్నారు. కనక నీకు ఏది మంచిదని తోస్తే అది చెయ్యి."

కృష్ణుడు మాట్లాడటం పూర్తి చేసిన తరవాత అందరూ మౌనంగా ఉండిపోయారు. ఎవరుగాని అతనికి ఎలాటి సమాధానం గాని చెప్పక పోవటం అందరికీ ఆశ్చర్యంగా తోచింది.

అప్పుడు పరశురాముడు ధృతరాష్ట్రుడితో, "రాజా, నీకు ఒక నీతితో కూడిన సంగతి

చెబుతాను. అది నీకు నచ్చినట్టయితే దాని ప్రకారం నడుచుకో," అంటూ ఇలాచెప్పాడు:

పూర్వం దంభోద్భవు డనే రాజు ఉండే వాడు. అతను ప్రతి ఉదయమూ నాలుగు వర్ణాల వారినీ పిలిపించి, "మీలో ఎవరైనా నన్ను జయించగలరా?" అని అడిగేవాడు. అలాటి ఆత్మశ్లాఘం కూడదని బ్రాహ్మణులు సలహా ఇచ్చినప్పటికీ ఆ రాజు తన అల వాటు మానలేదు.

చివరకు బ్రాహ్మణులు ఆ రాజుతో విసిగి పోయి, "రాజా, నరనారాయణులని ఇద్దరు రుషులున్నారు. వారిద్దరే ఎంతమందినైనా జయించగలరు. వారు గంధమాదనపర్వతం మీద తపస్సు చేసుకుంటూ ఉంటారు. యుద్ధం చెయ్యాలని ఉత్సాహం ఉంటే వారి వద్దకు వెళ్ళు," అన్నారు.

దంభోద్భవుడు తన సేనలను వెంట బెట్టుకుని నరనారాయణులు తపస్సు చేసు కునే చోటికి వెళ్ళి, వారు ఆతిథ్యం ఇయ్య బోతే తనకు యుద్ధంతో ఆతిథ్యం కావా లన్నాడు. అది యుద్ధాలు చేసే ప్రదేశం కాదని వారు చెప్పినా అతను వినిపించు కోలేదు. అప్పుడు నరుడనే రుషి అలిగి, ఇన్ని దర్భలు మంత్రించి రాజు మీదా, అతని సేన మీదా వేశాడు. ఆ దర్భాస్త్రానికి దంభో ద్భవుడూ, అతని సేనలూ దిగ్భ్రమ చెంది పోయాయి. దంభోద్భవుడు నరుడి కాళ్ళపై బడి క్షమాపణ చెప్పుకున్నాడు.

"నువు నీ ప్రగల్భాలు మాని ప్రజారంజ కంగా రాజ్యం పాలించుకో," అని నరనారా యణులు దంభోద్భవుణ్ణి పంపేశారు.

పరశురాముడు ఈ కథ చెప్పి, "ధృత రాష్ట్రా, నరుడు మాత్రమే ఇంత పని చెయ్య గలిగాడు. నారాయణుడు నరుడి కన్న కూడా అధికుడు. ఆ నరనారాయణులే అర్జునుడూ, కృష్ణుడూనూ. అందుచేత అర్జు నుడు గాండీవం ఎక్కు పెట్టక ముందే దురభిమానం అవతల పెట్టి అతన్ని శరణు వేడుకో. కృష్ణుడు తోడైన అర్జునుణ్ణి యుద్ధ రంగంలో సహించటం అసాధ్యం. యుద్ధం మాట కట్టి పెట్టి పాండవులతో సంధి చేసుకో," అన్నాడు.






పరశురాముడు మాట్లాడటం చాలించగానే కణ్వమహాముని కౌరవసభలో దుర్యోధనుడితో, "ధర్మరాజుతో సంధిచేసు కోవటం మంచిది. కౌరవ పాండవులు భూమి నంతనూ కలిసి పాలించవచ్చు. నువే బలవంతుణ్ణనుకోకు. అవతల వాళ్లుకూడా బలవంతులే అయినప్పుడు బలం అనేదానికి అర్థంలేదు. ఈ సందర్భంలో నీకు మాతలి కథ చెబుతాను," అంటూ ఇలా చెప్పాడు:

దేవేంద్రుడి సారథి అయిన మాతలికి లేక లేక ఒక చక్కదనాల కూతురు కలిగింది. గుణకేశి అనే ఆ పిల్ల అందచందాలలో అందరు స్త్రీలనూ మించింది. ఆమెకు యుక్త వయసు వచ్చేసరికి ఆమె తల్లిదండ్రులు ఆమె వివాహం తలపెట్టారు. మాతలి ఎంత వెతికినా తన కుమార్తెకు తగిన వరుడు ఎక్కడా లభించలేదు. దేవలోకంలోనూ, మానవలోకంలోనూ చూడటం అయిన తరవాత మాతలి తన కుమార్తెతో సహా నాగలోకానికి ప్రయాణమయాడు.

దారిలో అతనికి నారదుడు తటస్థపడి, "నేను వరుణుడి వద్దకు పోతున్నాను. నీ ప్రయాణం ఎక్కడికి?" అని అడిగాడు. మాతలి తాము పోతున్న పని నారదుడికి చెప్పి, "నేను కూడా వరుణుడి దగ్గిరికే పోతున్నాను," అన్నాడు.

ఇద్దరూ కలిసి వరుణుడి దగ్గిరికి వెళ్లారు. వరుణుడు వారి కిద్దరికీ తగిన విధంగా అతిథి సత్కారాలు చేసి, మాతలి వచ్చిన పని తెలుసుకుని, నాగలోకంలో

49. విశ్వరూప సందర్శనం



తిరగటానికి అనుమతి ఇచ్చాడు. నార దుడూ, మాతలీ నాగలోకమంతా తిరిగి, అనేకమంది యువకులను చూశారు. శేషు డుండే భోగవతీపురంలో సుముఖుడు అనే నాగ్రయువకుడు మాతలికి నచ్చాడు.

"గుణకేశికి ఈ కుర్రవాడు తగిన వరుడు. అందుచేత అతన్ని వివాహానికి ఒప్పించు," అని మాతలి నారదుణ్ణి కోరాడు.

నారదుడు సుముఖుడి తాత అయిన ఆర్యకుడికి మాతలిని పరిచయంచేసి, అతని కోరిక తెలిపాడు.

ఆర్యకుడు ఈ మాటకు సంతోషించి కూడా పైకి దైన్యం కనబరుస్తూ, "నారదా, ఈ వివాహానికి ఎలా ఒప్పుకోను? ఇటీవలనే గరుత్మంతుడు నా కొడుకును చంపి తిని, వచ్చే మాసంలో నా మనమడైన సుముఖుణ్ణి తింటానని ప్రతిజ్ఞచేసి వెళ్లాడు. నా కొడుకు పోయినందుకూ, నా మనమడు పోబోతున్నం దుకూ మేము పుట్టెడు దుఃఖంలో మునిగి ఉన్నాం. గరుత్మంతుడు అన్నంత పనీ చేస్తాడు. నేనీ సంబంధానికి ఎలా ఒప్పు కోను?" అన్నాడు.

ఆ మాటవిని మాతలి కొంచెం ఆలో చించి, "మహానుభావా, నాకొక ఆలోచన తట్టింది. నీ మనమడైన సుముఖుణ్ణి నా వెంటా, నారదుడి వెంటా ఇంద్రుడి వద్దకు పంపిస్తే, నేను చెయ్యవలసినది చేసి, అతనికి పూర్ణాయువు కలిగేటట్టు చూస్తాను. గరుత్మంతుడు ఇతని జోలికి రాకుండా చూస్తాను. మీ కందరికీ సుఖం కలుగుతుంది," అన్నాడు.

ఆర్యకుడు అందుకు సమ్మతించాడు. మాతలి సుముఖుణ్ణీ, ఇతర ముఖ్యులనూ వెంట బెట్టుకుని ఇంద్రుడి వద్దకు తిరిగి వచ్చాడు. అక్కడ విష్ణువు దేవేంద్రుడితో కబుర్లాడుతూ ఉన్నాడు. మాతలి తన అభిప్రాయం చెప్పగానే విష్ణువు ఇంద్రుడితో, "సుముఖుడికి అమృతం ఇచ్చి దేవతలతో సమానుణ్ణి చెయ్యి. ఆ విధంగా మాతలి, నారదుల కోరిక తీరుతుంది," అన్నాడు.

గరుత్మంతుడికి ఆగ్రహం తెప్పించటానికి జంకి ఇంద్రుడు విష్ణువుతో, "సుముఖుడికి నువే అమృతం ఇయ్యి," అన్నాడు.

"అన్ని లోకాలనూ పాలించే వాడివి, నిన్ను ఆపగల వారెవరు? నువే సుముఖుడికి అమృతం ఇయ్యి," అన్నాడు విష్ణువు.

కాని ఇంద్రుడు సుముఖుడికి దీర్ఘాయువు ఇచ్చాడు గాని అమృతం ఇయ్యలేదు. సుముఖుడు గరుత్మంతుడి భయం తీరి, మాతలి కుమార్తెను పెళ్లాడి సుఖంగా ఉన్నాడు.

ఈ సంగతి తెలిసి గరుత్మంతుడు మండిపడి, ఇంద్రుడి వద్దకు వచ్చి, "నా నోటి ముందున్న ఆహారానికి ఏమని అడ్డం తగిలావు? ఆహారం లేక నేనూ నా వాళ్లూ చచ్చిపోమా? నేను ఎంత బలవంతుణ్ణి! నన్ను తేలికగా చూస్తావా? నేను నిన్ను ఒక చిన్న ఈకతో మోయగలను," అన్నాడు.

అప్పుడు విష్ణువు, "గరుడుడా, నా ఎదుటనే ప్రగల్భాలాడకు. నన్ను మోస్తున్నాననుకుని నీకు గర్వంగా ఉన్నది. నిజానికి నేనే నిన్ను మోస్తున్నాను. చేతనైతే నా ఎడమచెయ్యి మోయి!" అంటూ తన ఎడమ చేతిని గరుత్మంతుడి వీపు మీద పెట్టాడు. దాని బరువుకు గరుత్మంతుడు కూలబడిపోయి కళ్ళు తేలవేశాడు. అతనికి ప్రాణాలు పోతున్నట్టు అనిపించింది.



గరుత్మంతుడు క్షమాపణ చెప్పుకుని, తనను కాపాడమని విష్ణువును వేడుకున్నాడు.

కణ్వుడు దుర్యోధనుడికి ఈ కథ చెప్పి, "దుర్యోధనా, పాండవులు యుద్ధంలో నిన్ను తలపడగానే నీకుకూడా గరుత్మంతుడికి జరిగిన భంగపాటే కలుగుతుంది. మిమ్మల్ని కాపాడటానికి కృష్ణుడు వచ్చాడు. అతను చెప్పినట్టు చేసి నీ కులాన్ని కాపాడుకో," అన్నాడు.

దుర్యోధనుడు కర్ణుడి కేసి చూసి వెకిలిగా నవ్వాడు. తరవాత అతను కణ్వుడితో, "మహర్షీ, నన్ను దేవుడు ఇలా పుట్టించాడు. నాకు ఎలా జరగవలసి ఉన్నదో నా ప్రవర్తన



దానికి అనుగుణంగా ఉన్నది. నాకు వెయ్యి మాటలుచెప్పి ఏంప్రయోజనం?" అన్నాడు.

తరవాత నారదుడు దుర్యోధనుడితో, "నాయనా, హితం చెప్పేవాళ్ళు చాలా అరుదు. అలాటి వాళ్ళు మంచిమాటలు చెబితే మొండికెయ్యరాదు. దీనికి దృష్టాంతంగా నీకు గాలవుడి కథ చెబుతాను," అంటూ ఇలా చెప్పాడు:

గాలవుడు విశ్వామిత్రుడి శిష్యుడు. అతను విద్య పూర్తిచేసుకుని వెళ్ళిపోతూ విశ్వామిత్రుడికి గురుదక్షిణ ఇస్తానని మొండి పట్టు పట్టాడు; విశ్వామిత్రుడు దక్షిణ అవసరం లేదని ఎంత చెప్పినా విన్నాడు కాడు.

"అలా అయితే, ఒక్క చెవి మాత్రం నల్లగా ఉండే తెల్లని గుర్రాలు ఎనిమి వందలు పట్టుకురా!" అన్నాడు విశ్వామిత్రుడు చిరాకుతో.

గాలవుడి ప్రాణంమీదికి వచ్చింది. అతని దగ్గిర చిల్లిగవ్వలేదు. గురువుగారు కోరిన గుర్రాలు ఎక్కడ ఉంటాయో తెలీదు. అతను విష్ణుమూర్తిని ధ్యానించాడు.

అంతలో గరుత్మంతుడు వచ్చి, "నన్ను విష్ణువు పంపాడు. ఎక్కడికి కావాలంటే అక్కడికి తీసుకుపోతాను," అన్నాడు.

గాలవుడు సంతోషించి, గరుత్మంతుడి వీపుమీద ఎక్కి తూర్పుగా పొమ్మన్నాడు. గరుత్మంతుడు అతివేగంగా పోతుంటే గాలవుడికి ఏమీ కనిపించలేదు, స్పృహ తప్పిపోతున్నది.

"అయ్యో, అంతవేగంగా పోకు. నేను గుర్రాల కోసం వెతుకుతున్నాను," అన్నాడు గాలవుడు.

"ఆ మాట మొదటే ఎందుకు చెప్పలేదు?" అని గరుత్మంతుడు గాలవుడితో కూడా ఋషభం అనే పర్వతంమీద దిగాడు. శాండిలి అనే తపస్విని వారికి ఆతిథ్యం ఇచ్చింది.

తరవాత గరుత్మంతుడు, "నీకు ముందు ధనం కావాలి. దానితో గుర్రాలు సంపాదించు. ప్రతిష్ఠానపురం ఏలే యయాతి

నా మిత్రుడు, గొప్ప ధనికుడు. అతని వద్దకు పోయి ధనం అడుగు," అని గాల వుణ్ణి యయాతి దగ్గిరికి తీసుకుపోయాడు.

యయాతి గరుత్మంతుడి ద్వారా గాల వుడి వృత్తాంతం తెలుసుకుని గరుత్మంతు డితో, "మిత్రమా, పూర్వంలాగా నా దగ్గిర ఇప్పుడు ధనం లేదు. అయినా, నా కుమార్తెను మాధవిని ఈ బ్రాహ్మణుడికి ఇస్తాను. ఆమె సహాయంతో ఇతని కోరిక తీరనీ," అని గాలవుడికి మాధవిని ఇచ్చాడు.

"ఈ పిల్ల ద్వారా నీకు కావలిసిన గుర్రాలు సంపాదించుకో. నేను పోతాను," అని గరుత్మంతుడు వెళ్ళిపోయాడు.



తరవాత గాలవుడు మాధవిని వెంట బెట్టుకుని, అయోధ్యారాజైన హర్యశ్వు డనే వాడి వద్దకు వెళ్ళాడు. అతను వచ్చిన పని తెలిసి హర్యశ్వుడు, "గాలవ మహర్షీ, ఈ పిల్ల సర్వలక్షణ సంపన్నగా ఉన్నది. నా దగ్గిర గుర్రాలు అనేకంగానే ఉన్నాయి గాని నీకు కావలసిన గుర్రాలు రెండు వందలు మాత్రమే ఉన్నాయి," అన్నాడు.

"నన్ను ఈ విధంగా ఇతర రాజులకు కూడా ఇచ్చి నీకు కావలిసిన ఎనిమిది వందల గుర్రాలూ సంపాదించుకో," అని మాధవి చెప్పినమీదట గాలవుడు ఆమెను హర్యశ్వుడికి ఇచ్చి రెండు వందల గుర్రాలు తీసుకున్నాడు.

మాధవి వల్ల ఒక కొడుకును కనిన తరవాత హర్యశ్వుడు ఆమెను గాలవుడికి తిరిగి ఇచ్చేశాడు.

తరవాత గాలవుడు మాధవిని తీసుకుని దివోదాసుడు ఏలే కాశీకి వెళ్ళాడు. దివో దాసుడి వద్ద కూడా గాలవుడు కోరిన గుర్రాలు రెండువందలే ఉన్నాయి. అతను ఒక కొడుకు పుట్టినదాకా మాధవిని తన భార్యగా ఉంచుకుని, తరవాత ఆమెను గాలవుడికి తిరిగి ఇచ్చేశాడు.

అప్పుడు గాలవుడు ఆమెను ఉశీనరుడు ఏలే భోజనగరానికి తీసుకుపోయి, అతనికి కొడుకు పుట్టిన దాకా మాధవిని భార్యగా ఇచ్చి, తిరిగి ఆమెను వెంటబెట్టుకుని



ఆరువందల గుర్రాలనూ, మాధవినీ ఇచ్చాడు. విశ్వామిత్రుడు మాధవిని సంతోషంగా స్వీకరించాడు.

నారదుడు ఈ కథ చెప్పి, "దుర్యోధనా. మొండి పట్టుదల వల్ల గాలవుడు ఇన్ని పాట్లు పడవలసి వచ్చింది. అందు చేత నువు మొండితనం మాని నీ హితం కోరి చెప్పే వాళ్ళ మాటలు విను," అన్నాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడు కృష్ణుడితో, "కృష్ణా, జరుగుతున్నదేదీ నాకు సమ్మతం కాదు, కాని నేను పరాధీనుణ్ణి. ఈ దుర్యోధనుడికి బుద్ధిచెప్పటం మా కెవరికీ సాధ్యం కాలేదు, నువు చెప్పి చూడు," అన్నాడు.

కృష్ణుడు దుర్యోధనుడితో, "దుర్యోధనా, నువు తలపెట్టినది నీ వంటి వాడు చేసే పని కాదు, దుర్మార్గులు చెయ్యవలసినది. నీకు సలహా ఇస్తున్న వారి కన్న నువే జ్ఞానివి. పాండవుల సఖ్యం నీకు ధర్మార్థకామాలనిస్తుంది. యుద్ధం సర్వనాశనకారి. పాండవుల పరాక్రమాన్ని సరిగా గ్రహించు. నువు వారితో సంధి చేసుకుంటే నీ వారంతా సంతోషిస్తారు," అన్నాడు.

భీష్ముడూ, ద్రోణుడూ కూడా కృష్ణుడి మాటలను బలపరిచారు. విదురుడు దుర్యోధనుడితో, "నువు ఏమైనా నాకు చింత లేదు. నేను నీ తల్లిదండ్రులైన గాంధారీ ధృతరాష్ట్రులను గురించి విచారిస్తున్నాను.

బయలుదేరాడు. ఉశీనరుడి వద్ద కూడా రెండువందల గుర్రాలే ఉన్నాయి.

ఇంకా రెండు వందల గుర్రాలు కావాలి. అవి ఎక్కడ దొరుకుతాయో తెలీదు. అంతలో గాలవుడికి గరుత్మంతుడు ఎదురై, జరిగినదంతా విని, "గాలవా, మిగిలిన గుర్రాల కోసం శ్రమపడకు. ఒక చెవి నల్లగా ఉండే తెల్లని గుర్రాలు ప్రపంచంలో మరి లేవు. మిగిలిన రెండు వందల గుర్రాలకు బదులు ఈ మాధవినే విశ్వామిత్రుడికి ఇచ్చెయ్యి." అని సలహా ఇచ్చాడు.

గాలవుడు మాధవిని విశ్వామిత్రుడి వద్దకు తీసుకుపోయి, తన గురుదక్షిణ కింద

నీ వంటి కొడుకును కన్నందుకు వాళ్ళు దిక్కులేని వాళ్ళు కాబోతున్నారు," అన్నాడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనుడితో, "నాయనా, కృష్ణుడి స్నేహం మనకు అన్ని విధాలా మంచిది. ఈ అవకాశాన్ని జారవిడవకు," అన్నాడు.

ఎవరి మాటలూ దుర్యోధనుడికి నచ్చలేదు. అతను కృష్ణుడితో, "అందరూ నన్నే నిందిస్తున్నారు. నువు పాండవ పక్షపాతిగా మాట్లాడావుగాని ఉభయపక్షాల బలాబలాలు ఆలోచించి మాట్లాడలేదు. నేను చేసిన మహా పాపం ఏమిటో నాకు తెలియటం లేదు. పాండవులు ఇష్టపడి జూదమాడి, అరణ్యానికి పోతే అది నా తప్పా? పాండవులు మా మీదికి ఎందుకు యుద్ధానికి పూనుకున్నారు? మా అపరాధం ఏమిటి? నేను ఇంద్రుడికైనా భయపడను. వారు క్షత్రియధర్మంతో యుద్ధానికి వస్తే మేము యుద్ధంలో చావటానికైనా సిద్ధమే. నాకు ఏమీ తెలియనప్పుడు పాండవులకు రాజ్యం ఇవ్వబడింది. నేను బతికి ఉండగా ఆ రాజ్యం వారికి తిరిగి రాదు. సూది మొన మోపినంత భూమి కూడా నేను వారికి ఇయ్యను. నాతో ఇన్ని మాటలు చెప్పి ప్రయోజనం లేదు," అన్నాడు.

కృష్ణుడు దుర్యోధనుడితో, "నీ కోరిక తీరి నీకు వీరమరణం లభిస్తుందిలే! నువు



పాండవులకు అన్ని విధాలా ద్రోహం చేసి ఏ తప్పూ చెయ్యలేదంటున్నావు. నీకు పతనం తప్పదు. మంచిగా అడుగుతుంటే పాండవుల తండ్రి రాజ్యం పాండవులకియ్యవు. రేపు వారు మొత్తం రాజ్యం తీసుకుంటారు," అన్నాడు.

దుర్యోధనుడు కోపంతో సభనుంచి వెళ్ళిపోయాడు. అతని పక్షం వారంతా అతని వెంట వెళ్ళిపోయారు.

అప్పుడు కృష్ణుడు ధృతరాష్ట్రుడితో, "మహారాజా, వంశ నాశనం కాకుండా చూడాలంటే పెద్దలందరూ దుర్యోధనుడు మొదలైన వారిని బంధించి పాండవుల వశం చేసి, వారితో సంధి చేసుకోండి," అన్నాడు.



61

ధృతరాష్ట్రుడు ఈ మాటకు కంగారుపడి దుర్యోధనుడికి గాంధారి చేత చెప్పించి చూశాడు. ప్రయోజనం లేక పోయింది.

దుర్యోధనుణ్ణీ, అతని మంత్రులనూ బంధించి పాండవులకు అప్పగించ బోతున్నట్టు దుశ్శాసనుడు దుర్యోధనుడితో చెప్పాడు. "మనమే ముందుగా కృష్ణుణ్ణి బంధించి, పాండవులను కోరలు తీసిన పాముల్లాగా చేద్దాం," అన్నాడతను.

ఈ సంగతి సాత్యకి ఎలాగో పసికట్టాడు. అతను కృతవర్మతో, "నేను కృష్ణుడితో ఈ సంగతి చెప్పివస్తాను. నువ్వు ఈలోపల మన సైనికులతో సభా ద్వారం దగ్గిర సిద్ధంగా ఉండు," అని చెప్పి, సభలోకి వెళ్ళి కృష్ణుడితో అతన్ని కట్టెయ్యటానికి దుష్టచతుష్టయం ప్రయత్నించ బోతున్నట్టు చెప్పాడు. తరవాత అతను ఇదే సంగతి ధృతరాష్ట్రుడికీ, విదురుడికీ చెప్పి, సభలో ఉన్నవారందరికీ చెప్పాడు.

ధృతరాష్ట్రుడు దుర్యోధనుణ్ణి సభకు పిలిపించి చివాట్లు పెట్టాడు. విదురుడు కూడా అతన్ని మందలించాడు. కృష్ణుడు అతనితో, "నేనిక్కడ ఒంటరిగా ఉన్నాననా నీ ఉద్దేశం? నా వెంట సమస్త పాండవ సేనా, అంధక వృష్ణియోధులూ, ఆదిత్యులూ, రుద్రులూ, వసువులూ, ఋషులూ ఉన్నారు, చూడు!" అన్నాడు.

మరుక్షణం కృష్ణుడి శరీరమంతటా అందరూ అంగుళం ప్రమాణంలో, మెరుపుల్లాగా ప్రకాశిస్తూ, మంటలు కక్కుతూ కనిపించారు. కృష్ణుడి నుదుట బ్రహ్మ, వక్షస్థలాన ఏకాదశ రుద్రులూ, భుజాలలో దిక్పాలకులూ, ముఖాన అగ్నీ కనిపించారు.

ఆ ఘోరరూపాన్ని చూడలేక సభలో అందరూ కళ్ళు మూసుకున్నారు. కృష్ణుడు దివ్యదృష్టి ఇవ్వటం చేత ద్రోణుడూ, భీష్ముడూ, విదురుడూ, సంజయుడూ, ఆ విశ్వరూపాన్ని చూడగలిగారు.

"ఈ కలకలం ఏమిటి?" అని ధృతరాష్ట్రుడు అడిగాడు.

కృష్ణుడు ధృతరాష్ట్రుడికి కూడా దివ్యదృష్టి ఇచ్చాడు.





# మహాభారతం

కృష్ణుడు ప్రసాదించిన దివ్యదృష్టితో ధృతరాష్ట్రుడు విశ్వరూపాన్ని ఆశగా చూశాడు. తరవాత ఆయన కృష్ణుడితో, "భగవంతుడా, ఎంతో దయతో నువు నాకు దివ్యనేత్రాలు ఇచ్చావు. వీటిని మళ్ళీ నువే తీసుకో. నీ రూపాన్ని చూసిన కళ్ళతో మామూలు మనుషులనూ, ప్రపంచాన్నీ చూడలేను," అన్నాడు.

మరుక్షణం సభ ఎప్పటిలాగే ఉన్నది. కృష్ణుడు మామూలుగానే ఉన్నాడు. నారదుడు మొదలైన దేవర్షులు సభలో లేరు. కృష్ణుడు సభలోని ఋషులతో వస్తానని చెప్పి, ఒక చెయ్యి సాత్యకికీ, రెండో చెయ్యి విదురుడికి ఇచ్చి, సభ నుంచి బయలు దేరాడు. అతని వెంట కౌరవులూ, మిగిలిన రాజులూ బయలుదేరారు. చాలా కోపంలో ఉన్న కృష్ణుడు వారి వంక చూడనైనా లేదు.

ద్వారం వద్ద దారుకుడు రథంతోసహా సిద్ధంగా ఉన్నాడు. కృష్ణుడు రథంలో ఎక్కి కూర్చోగానే ధృతరాష్ట్రుడు అతనితో, "కృష్ణా, నన్ను నువు అపార్థం చేసుకోవద్దు. పాండవుల పట్ల నాకు ఎలాటి దురుద్దేశమూ లేదు. నేను దుర్యోధనుడికి చెప్పినహితం నువు విన్నావు, సభలో అందరూ విన్నారు గదా!" అన్నాడు.

కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణీ, భీష్మ, ద్రోణ, బాహ్లిక, కృపులలాంటి పెద్దలనూ ఉద్దేశించి, "మహాత్ములారా, సభలో జరిగిన దంతా మీరు చూశారు. దుర్యోధనుడు రోషంతో సభనుంచి లేచిపోయాడు. ధృతరాష్ట్రుడు తాను అసమర్థుణ్ణి అని అన్నాడు. నేను

## 50. యుద్ధసన్నాహం



వచ్చినపని ముగిసింది. వెళుతున్నాను. నాకు శలవు ఇప్పించండి," అన్నాడు.

పెద్దలందరూ కృష్ణుడికి వీడ్కోలు చెప్పి తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. కృష్ణుడు రథం మీద తన మేనత్త అయిన కుంతి ఇంటికి వెళ్ళాడు. అతను కుంతీ దేవికి కౌరవసభలో జరిగినదంతా చెప్పి, "దేవీ, ఎందరు ఎన్నివిధాల చెప్పినా దుర్యోధనుడు వినిపించుకో లేదు. రాజ లోకానికి కాలం మూడింది. అర్జునుడు వాళ్ళను కార్చిచ్చులాగా దహిస్తాడు. నేను పాండవుల దగ్గిరికి పోతున్నాను. వారికి ఏమన్నా సందేశం ఇస్తావా?" అని అడిగాడు.

"నాయనా, ధర్మానికి భంగం రానివ్వ వద్దని ధర్మరాజుతో చెప్పు. క్షత్రియులు బాహుబలంతో జీవించటం ధర్మం. అందు కోసం హింస చెయ్యవలసి వస్తే అది విధి నిర్ణయమన్న మాట. పూర్వం కుబేరుడు ముచికుందు డనే రాజర్షికి భూమండల మంతా ఇస్తానంటే ముచికుందుడు తీసు కోక, తన భుజబలంతో సంపాదించుకున్న రాజ్యమే తనకు కావాలన్నాడట. ధర్మ రాజు ఇప్పు డనుసరించే మార్గం నాకు నచ్చినది కాదు. అది పాండు రాజుగాని, భీష్ముడుగాని ఆమోదించేదికూడా కాదు. అతనికి నిత్యమూ యజ్ఞ దాన తపస్సులూ, శౌర్యప్రజ్ఞలూ, బలమూ, ఓజస్సు ఉండా లని నేను దీవించినట్టు చెప్పు. రాజ్యపాలన ధర్మ బద్ధంగా చెయ్యటం ఉత్తమ క్షత్రియ లక్షణం; భిక్షాటనమూ, వ్యవసాయమూ వాణిజ్యమూ పనికి రావు. పాండవులు తమ తండ్రి రాజ్యభాగాన్ని తాము రాబట్టుకోవాలి. నాకు పరుల అండన బతకటం కన్న దుఃఖం ఏమి ఉంటుంది? యుద్ధం చేసి తండ్రి తాతలకు ఉత్తమలోకాలు కలిగించ మని ధర్మరాజుతో చెప్పు," అన్నది కుంతి కృష్ణుడితో.

ఆమె కృష్ణుడికి వీడ్కోలు చెబుతూ, తాను తన కొడుకులనూ, కోడలినీ అడిగినట్టు చెప్పమన్నది.

కృష్ణుడు కుంతి మందిరం నుంచి బయలుదేరి, కౌరవ ముఖ్యులందరికీ వీడ్కోలు చెప్పి, సాత్యకితోపాటు కర్ణుణ్ణి కూడా తన రథం మీద ఎక్కించుకుని బయలుదేరాడు. రథం నగరం దాటి నిర్జనమైన ప్రదేశం చేరగానే, కృష్ణుడు కర్ణుడితో ఏకాంతంగా, "కర్ణా, నువు వేదాలూ, ధర్మశాస్త్రాలూ చదువుకున్న వాడివి. అందుచేత నువు గ్రహించ గలవు. కన్యగా ఉండగా స్త్రీకి పుట్టిన వాణ్ణి కానీనుడు అంటారు. అలాంటి కన్య ఎవరిని వివాహం చేసుకుంటే వాడే కానీనుడికి తండ్రి అవుతాడు. నువు కుంతీదేవికి కానీనుడుగా పుట్టిన వాడివి. అందుచేత పాండురాజు పెద్దకొడుకువు; ధర్మశాస్త్రాల ప్రకారం రాజు కావలిసిన వాడివి. నీకు తండ్రి పక్షాన పాండవులూ, తల్లి పక్షాన వృష్ణివంశం వాళ్ళూ బంధువులు. నా వెంట వచ్చావంటే పాండవులూ, వాళ్ళ కొడుకులూ, పాండవుల పక్షాన వచ్చిన రాజులూ నీ పాదాలకు నమస్కరించుతారు. నీకు పట్టాభిషేకం జరుగుతుంది. ద్రౌపది నిన్ను ఆరవ భర్తగా స్వీకరిస్తుంది. ధర్మరాజు నీకు యువరాజుగా ఉంటాడు," అని చెప్పాడు.



దానికి కర్ణుడు, "కృష్ణా, నా మీది ప్రేమతోనూ, స్నేహంతోనూ నువు చెప్పినదంతా విన్నాను. నేను పాండురాజు కొడుకు ననటానికి సందేహంలేదు. కుంతీదేవి నన్ను కని నదిలో పారేస్తే, అధిరథుడనే సూతుడు నన్ను చూసి తెచ్చి తన భార్య అయిన రాధకు ఇచ్చాడు. నన్ను అష్టకష్టాలు పడి పెంచిన ఆ దంపతులకు పిండాలు పెట్టటం నా ధర్మం కాదా? నాకు వాళ్ళే నామకరణం చేసి వసుషేణు డని పేరు పెట్టారు. ఇతర సంస్కారాలన్నీ చేశారు. వాళ్ళ బంధువుల పిల్లలనే నేను పెళ్ళాడాను. నాకు వారియందు కొడుకులూ, మనమలూ కూడా కలిగి పెరుగుతున్నారు. పదమూడేళ్ళుగా ధృతరాష్ట్రుడి ఇంట, దుర్యోధనుడి అండన రాజ్యభోగాలు అనుభవిస్తున్నాను. నన్ను చూసుకుని దుర్యోధనుడు



పాండవులతో యుద్ధానికి సిద్ధపడ్డాడు, అర్జునుడితో ద్వంద్వ యుద్ధం చెయ్యమని అతను నన్ను కోరాడు. భయంచేత గాని, లోభంచేత గాని నేను దుర్యోధనుడికి అన్యాయం చెయ్యను. నేను అర్జునుడితో యుద్ధం చెయ్యకపోతే మా ఇద్దరికీ అపకీర్తి తప్పదు. నీ సహాయంతో పాండవులు తప్పక జయిస్తారు. నేను తన అన్నని తెలిస్తే ధర్మరాజు రాజ్యం కోరడు. నేనేమో ప్రపంచమంతా జయించినా ఆ రాజ్యాన్ని దుర్యోధనుడికే ఇస్తాను. భూమినంతా ధర్మరాజునే ఏలుకోనియ్యి. దుర్యోధనుణ్ణి సంతోష పెట్టటానికి పాండవులను గురించి చాలా హీనంగా మాట్లాడాను. నేను చెప్పినట్టు ఎవరికీ చెప్పక, అర్జునుణ్ణి యుద్ధానికి సిద్ధుణ్ణి చెయ్యి," అన్నాడు.

కృష్ణుడు నవ్వి, "నీకు రాజ్యకాంక్ష లేదన్నమాట. సరే, ఈ మాసం యుద్ధానికి బాగున్నది. ఇంకా వారం రోజులకు అమావాస్య వస్తుంది. ఆ రోజున యుద్ధం ప్రారంభమయేటట్టు చూడమని భీష్మ, ద్రోణ, కృపులతో చెప్పు. నువు కూడా యుద్ధానికి సిద్ధంగా," అన్నాడు.

కర్ణుడు కృష్ణుణ్ణి కౌగలించుకుని, సెలవు పుచ్చుకుని, తన రథం మీద ఇంటికి వెళ్ళాడు. కృష్ణుడు సాత్యకితో సహా తన రథంలో ఉపప్లావ్యానికి బయలుదేరాడు.

కృష్ణుడు తాను చేసిన కృషి ఫలించక తిరిగి వెళ్ళగానే విదురుడు కుంతీదేవి వద్దకు వచ్చి, "నేను ఏది వద్దు అనుకున్నానో అదే జరగబోతున్నది. పాండవ కౌరవులు మహాయుద్ధంలో అనేక లక్షల ప్రాణాలను బలిపెట్ట బోతున్నారు. కృష్ణుడు సంధి కుదర్చలేక తిరిగి వెళ్ళాడు," అని దుఃఖించాడు.

కుంతీదేవికి కూడా, యుద్ధంలో భీష్మ ద్రోణుల వంటి మహాపురుషులు చావటం భయంకరంగా తోచింది; తన కొడుకులు యుద్ధంలో జ్ఞాతులను చంపి విజయం పొందటం కన్న దారిద్ర్యంతో మాడి చావటమే మేలేమో ననిపించింది.

రానున్న ఆపదకు మూలకారకుడు కర్ణుడే ననీ, అతను తన కొడుకులను ద్వేషిస్తూ, వారిని చంపటానికి నిశ్చయించు కున్నాడనీ ఆమె అనుకున్నది. అందుచేత ఆమె కర్ణుడి మనను పాండవులకు అనుకూలంగా మార్చ టానికి నిచ్చయించుకుని, గంగా తీరాన కర్ణుడు జపం చేసుకుంటున్న చోటికి వెళ్ళింది. కర్ణుడు తూర్పుగా తిరిగి, చేతు లెత్తి జపం చేసుకుంటున్నాడు. కుంతి అతని వెనకగా వచ్చి, ఎండదెబ్బకు వడలి, కర్ణుడి పై బట్టమీద కూర్చున్నది.

కర్ణుడు జపం చాలించి, కుంతిని చూసి నమస్కారం చేసి, "అమ్మా, కర్ణుణ్ణి, నమస్కారం చేస్తున్నాను. ఏ పనిమీద ఇక్కడికి వచ్చావు?" అని అడిగాడు.

"నాయనా, నువు నా కొడుకువు. రాధ కొడుకువు కావు. సూతకులం వాడివి కావు. నా మాట నమ్ము. నువు నీ తమ్ములను ఎరగక, దుర్యోధనుడి కోసం మహా పాపానికి ఒడిగట్టటం అనుచితం. అర్జునుడు స్వశక్తితో గెలుచుకున్న రాజ్యాన్ని కౌరవులు అపహ రించారు. నువు దానిని ధృతరాష్ట్రుడి కొడుకుల నుంచి తీసుకుని నువే ఏలుకో. బలరాముడూ, కృష్ణుడూలాగ నువూ, అర్జు నుడూ ప్రేమగా అన్నదమ్ములై ఉండండి. మీ రిద్దరూ ఏకమైతే మీకు అసాధ్యం ఏమీ ఉండదు," అన్నది కుంతి.



ఈ మాటలు విని కర్ణుడు ఏ మాత్రమూ చలించక, కుంతితో ఇలా అన్నాడు:

"అమ్మా, నీ మాటలు నేను వినను. నువు నాకు మహాపాపం చేశావు. ఏ శత్రువూ నాకు అంతకన్న పాపం చెయ్యలేదు. పుట్ట గానే నన్ను పారేశావు. నేను క్షత్రియుడుగా పుట్టినా సూతుడుగా పెరిగాను. నాకు క్షత్రియ సంస్కారాలు ఏవీ జరగలేదు. ఇన్నాళ్ళూ నా క్షేమం నీకు పట్టలేదు. ఇప్పుడు నువు నీ మంచికోరి నాకు హితం చెబుతున్నావు. నే నిప్పుడు పాండవుల పక్షం అయితే, భయపడి వాళ్ళ అండన చేరానని లోకం అనుకుంటుంది. యుద్ధం జరగబోతూ ఉండగా నేను పాండవులకు అన్నననని



ప్రకటిస్తే రాజులంతా నన్ను దుమ్మెత్తి పొయ్యరా? ధృతరాష్ట్రుడి కొడుకులు నన్ను ఎంతో ఆదరించి, సత్కరించారు. ఆ సత్కారాలన్నీ వ్యర్థపుచ్చనా? నా మీద ఆధారపడి వాళ్ళు యుద్ధానికి సిద్ధమయారు. నేను వారి ఋణం తీర్చుకోవటానికి ప్రాణాలైనా అర్పించాలి. దుర్యోధనాదుల కోసం నేనూ, నా కొడుకులూ ప్రాణం ఉన్నంత దాకా పోరాడతాం. అయినా నువు నీ కొడుకులను గురించి భయపడి వచ్చావు గనక నిన్ను నిరాశ చెయ్యను. నీ కొడుకులందరినీ నేను చంపను. ఒక్క అర్జునుడు మినహాగా, మిగిలిన పాండవు లెవరి ప్రాణాలూ తీయను. అర్జునుణ్ణి చంపితేనేగాని నా బల పరాక్రమాలు సార్థకం కావు. యుద్ధంలో అర్జునుడు చచ్చినా నాతోకలిసి అయిదుగురు కొడుకులు నీకుంటారు. నేనే చచ్చినా నీకు అయిదుగురు కొడుకులుంటారు. నీకు ఆరుగురు కొడుకులు ఏ పరిస్థితిలోనూ ఉండరు. నువు నిశ్చింతగా ఉండు."

కుంతి దుఃఖావేశంతో కర్ణుణ్ణి కౌగలించుకుని, "నాయనా, ఇది విధి విలాసం. కౌరవులు నాశనం కాక తప్పదు. నీ తమ్ములు నలుగురికి అభయం ఇచ్చినమాట మరవకు. నీకు శుభం కలుగుగాక!" అని దీవించింది. కర్ణుడు ఆమె పాదాలకు నమస్కారం చేసి తన ఇంటికి వెళ్ళాడు. కుంతి తన మందిరానికి తిరిగి వచ్చింది.

కృష్ణుడు ఉపప్లావ్యం చేరుతూనే పాండవులకు జరిగినదంతా చెప్పాడు. అతను చాలా సేపు వారితో మంత్రాలోచన చేసి తన విడిదికి వెళ్ళి విశ్రాంతి తీసుకున్నాడు.

ఆ రాత్రి పంచపాండవులు కృష్ణుడితో సహా యుద్ధ సన్నాహం గురించి చర్చించారు. పాండవుల పక్షాన పోరాటానికి ఏడు అక్షౌహిణుల సేన సిద్ధంగా ఉన్నది. ఒక్కొక్క అక్షౌహిణికీ ఒక్కొక్క నాయకుడు నియమించ బడ్డాడు. ఆ ఏడుగురు అక్షౌహిణీ నాయకులూ ఎవరంటే: విరాటుడూ, ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, సాత్యకీ, చేకితానుడూ,

భీముడూనూ. ఈ ఏడుగురి మీదా ఒక మహా నాయకుడుండాలి. అతను భీష్ముడికి దీటైనవాడుగా ఉండాలి. అలాంటి వాడు ఎవడని ధర్మరాజు తన తమ్ములను అడిగితే, సహదేవుడు విరాటుణ్ణీ, నకులుడు ద్రుపదుణ్ణీ, అర్జునుడు ధృష్టద్యుమ్నుణ్ణీ, భీముడు, శిఖండినీ సూచించారు. ఏ ఇద్దరూ ఒక విధంగా చెప్పకపోవటంతో ధర్మరాజు కృష్ణుడి అభిప్రాయం ప్రకారం సర్వసేనానిని నిర్ణయింతామన్నాడు. కృష్ణుడు ధృష్టద్యుమ్నుణ్ణే సూచించాడు.

పాండవ బలాలకు ధృష్టద్యుమ్నుడు సర్వసేనానిగా నిర్ణయించ బడినట్టు తెలిసి రాజులందరూ సంతోషించారు. అర్భాటంగా సైనిక సన్నాహం ఆరంభమయింది. రథాలు నడిచాయి. శంఖాలూ, దుందుభులూ మోగాయి. పాండవుల బలాలు మహా సముద్రంలాగా కదిలాయి. సేనకు ముందు భీమ, నకుల, సహదేవులు వెళ్ళారు. వాళ్ళ వెనకగా అభిమన్యుడూ, ఉపపాండవులూ, ధృష్టద్యుమ్నుడూ, ఇతర పాంచాల యోధులూ కదిలారు. సేన మధ్యలో ధర్మరాజున్నాడు. సైన్యం వెంట రకరకాల వాహనాలూ, యంత్రాయుధాలూ, వైద్యులూ, పరిచారకులూ ఉన్నారు. ద్రౌపది తన దాసదాసీజనంతో సహా ఉపప్లావ్యంలోనే ఉండిపోయింది.

పాండవులు సేనలతో బయలుదేరే ముందు బ్రాహ్మణులకు గోవులూ, బంగారమూ దానం చేసి, వారి ఆశీర్వాదాలు పొందారు.

సేన వెనక భాగంలో విరాటుడూ, కుంతిభోజుడూ, ధృష్టద్యుమ్నుడి కొడుకులూ; నలభైవేల రథాలూ, రెండు లక్షల గుర్రాలూ, అయిదు లక్షల కాల్బలమూ, అరవైవేల ఏనుగులూ వెంట బెట్టుకుని చేకితానుడూ, ధృష్టకేతుడూ, సాత్యకీ, కృష్ణుడూ అర్జునుడూ కదిలారు.

ఈ మహాసేన కురుక్షేత్రం చేరగానే శంఖాలు మోగాయి. సైనికులు పరమానంద భరితులై, దిక్కులు పిక్కటిల్లేటట్టు సింహనాదాలు చేశారు.





# మహాభారతం

పాండవుల సేనలు కురుక్షేత్రం చేరగానే సైనిక శిబిరం నిర్మించటానికి మంచి, అనుకూల ప్రదేశం చూశారు. దానికి తృణ, కాష్ఠ, జల సమృద్ధి ఉన్నది. సమీపంలో శ్మశానాలు గాని, దేవాలయాలు గాని, ఋషుల ఆశ్రమాలు గాని లేవు. కృష్ణార్జునులు అనేక మంది రాజులను వెంటబెట్టుకుని, రథం మీద శిబిరం నిర్మించే ప్రదేశమంతా కలయతిరిగి, అక్కడక్కడా గుంపులుగా చేరి ఉన్న కౌరవ సైనికులను దూరంగా తరిమేశారు.

ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ, యుయుధానుడూ, శిబిరాల నిర్మాణానికి కొలతలు పెట్టించారు. హిరణ్వతీనదీ తీరాన పాండవ శిబిరాలు లేచాయి. వాటి చుట్టూ కృష్ణుడు చాలా పెద్ద అగర్త తవ్వించాడు. పాండవ శిబిరాల వంటివే మిగిలిన రాజులందరికీ ఏర్పడ్డాయి. అన్ని శిబిరాలలోనూ సమృద్ధిగా భోజనానికీ, తాగటానికీ ఏర్పాట్లు జరిగాయి. సేన వెంట అనేక వేలమంది శిల్పులూ, వైద్యులూ ఉన్నారు. కవచాలూ, ఆయుధాలూ, తేనే, నెయ్యీ, ధూపసామగ్రి మొదలైనవి కొండలంత రాసులు పోసి ఉన్నాయి. ధర్మరాజు ప్రతి శిబిరానికీ వెళ్ళి, అన్ని సదుపాయాలూ సరిగా అమరినదీ, లేనిదీ స్వయంగా చూశాడు.

కృష్ణుడు హస్తినాపురం నుంచి బయలుదేరగానే దుర్యోధనుడు కర్ణ, శకుని, దుశ్శాసనులను పిలిపించి, "నాకూ, పాండవులకూ యుద్ధం జరగటమే కృష్ణుడు కోరేది.

51. కురుక్షేత్రం



అతను వారిని ఎలాగూ రెచ్చగొట్టుతాడు. మనం పెద్ద ఎత్తున యుద్ధ సన్నాహం చెయ్యవలసి ఉన్నది. అందుచేత మీరు చురుకుగా యుద్ధయత్నాలు చేసి, కురుక్షేత్రంలో మన శిబిరాలు నిర్మించండి. వేల కొద్దీ శిబిరాలు నిర్మాణం కావాలి. మనకు ఆహారం వచ్చే మార్గాలు శత్రువుకు స్వాధీనం కారాదు. వాటికి బలమైన రక్షలు కావాలి. శిబిరాలలో వస్తుసమృద్ధీ, ఆయుధ సమృద్ధీ ఉండాలి. లక్షల కొద్దీ పతాకాలూ, ధ్వజాలూ తయారు కావాలి. శిబిరాల మధ్య మార్గాలు చక్కగా చదును చేయించండి. రేపే సైన్యం కదలి శిబిరాలు చేరాలి," అని చెప్పాడు.

కౌరవ శిబిరాలు సిద్ధమయాయి. హస్తినాపురమంతా సైనిక సన్నాహపు సందడితో నిండి పోయింది. కౌరవ సేనలు సైనిక శిబిరాలు చేరుకున్నాయి.

తీరా తన దాయాదులను చంపటానికి ప్రయత్నాలన్నీ చేసిన మీదట ధర్మరాజును ధర్మ సందేహాలు బాధించాయి. ఆయన కృష్ణుడితో, "కృష్ణా, మనం చేయబోయేది ధర్మవిరుద్ధం కాదు గద?" అన్నాడు.

దానికి కృష్ణుడు, "మన రాజ్య భాగం ఇవ్వకపోతే మనం సంధి చేసుకోలేం గదా? అలాటప్పుడు యుద్ధం చెయ్యక గత్యంతరం ఏమున్నది?" అన్నాడు.

కృష్ణుడు ఇలా అన్నమీదట ధర్మరాజు యుద్ధ ప్రకటన చేశాడు. సేనలలో ఉత్సాహమూ, సంచలనమూ బయలుదేరింది.

తరవాత ధర్మరాజు భీమార్జునులతో, "వంశ నాశం జరగగూడదని మనం వనవాసమూ, అజ్ఞాత వాసమూ చేశాం, పడరాని కష్టాలు పడ్డాం. కాని ఆ వంశ నాశనం ఇప్పుడు దాపరించనే దాపరించింది. వంశ రక్షణ కోసం మనం చేసిన ప్రయత్నం ఫలించలేదు. కాని వంశ నాశనానికి మనం చేసే ప్రయత్నం ఫలించబోతున్నది. మన గురువులనూ, వృద్ధులనూ చంపి మనం ఎలాటి విజయం సంపాదిస్తామో నాకు అర్థం కాలేదు," అని దిగులుగా అన్నాడు.



"మన తల్లీ, విదురుడూ చెప్పిన దానికన్న మనకు వేరే ధర్మం ఏమున్నది? యుద్ధం జరిగే తీరాలి," అన్నారు భీమార్జునులు. అంతే నన్నాడు కృష్ణుడు.

మర్నాడు దుర్యోధనుడు తన పక్షాన వచ్చిన పదకొండు అక్షౌహిణుల సేననూ వాటి బలా బలాలను బట్టి విభజించాడు. ఉత్తమమైన సేనలు ముందూ, మధ్యమమైనవి మధ్యలోనూ, బలహీనమైనవి వెనుకనూ ఉండేటట్టు ఏర్పాటు చేశాడు. విరిగిపోయిన రథాలను మరమ్మతు చెయ్యటానికి కర్రలు లక్షల సంఖ్యలో సిద్ధం చేయబడ్డాయి. రథాలన్నిటిలోనూ అమ్ముల పొదులు అమర్చ బడ్డాయి. రకరకాల ఆయుధాలూ, తైలాలూ, తదితర వస్తువులూ సేకరించబడ్డాయి.

దుర్యోధనుడు తన పదకొండు అక్షౌహిణులకూ పదకొండు మంది నాయకులను నియమించాడు. వారు: కృపుడూ, ద్రోణుడూ, శల్యుడూ, సైంధవుడూ, సుదక్షిణుడూ, కృతవర్మా, అశ్వత్థామా, కర్ణుడూ, భూరిశ్రవసుడూ, శకునీ, బాహ్లికుడూనూ.

నిండు సభలో ఇలా అక్షౌహిణీపతులను నియమించిన అనంతరం దుర్యోధనుడు భీష్ముడి కేసి తిరిగి చేతులు జోడించి, "మహాత్మా, ఎంత పెద్దసేన అయినా తగిన నాయకుడు లేకపోతే చీమలపుట్ట లాగా చెదిరిపోతుంది. వేరు వేరు సేనాపతుల మధ్య పోటీ ఉంటుంది గాని సామరస్యం ఉండదు. పూర్వం హైహయ క్షత్రియుల మీద బ్రాహ్మణులు ధ్వజమెత్తి యుద్ధానికి తలపడ్డారు. వారి వెంట వైశ్య, శూద్ర వర్ణాలవారు కూడా హైహయులతో యుద్ధం చేశారు. కాని ఎన్ని యుద్ధాలు జరిగినా అల్పసంఖ్యలో ఉన్న హైహయులకే విజయం లభిస్తూ వచ్చింది. దానికి కారణం ఏమంటే హైహయులకు సమర్థుడైన నాయకుడు ఒకడే ఉన్నాడు. మూడు వర్ణాలసేన బహునాయకమైనది. ఈ రహస్యం తెలుసుకుని బ్రాహ్మణులు తమలో ఒక సమర్థుడికి నాయకత్వం ఇచ్చి, హైహయుల మీద

గెలిచారు. నువు నీతిలో శుక్రుడంత వాడివి. మా మేలు కోరినవాడివి. ధర్మం తప్పని వాడివి. ఓటమి ఎరగనివాడివి. అందుచేత నువు నా సేనలన్నిటికీ అధిపతివిగా ఉండి, ఇంద్రుడు దేవతలను కాపాడినట్టు మమ్మల్ని కాపాడు," అన్నాడు.

దుర్యోధనుడి బలాలకు సర్వసేనాపతిగా ఉండటానికి భీష్ముడు రెండు నిబంధనలు తెలిపాడు: తాను పాండవులలో ఎవరినీ చంపడు; కర్ణుడూ, తానూ ఒకేసారి యుద్ధం చెయ్యటం పొసగదు, ఎందుకంటే కర్ణుడికి తానంటే అమితమైన మత్సరం; అందుచేత ముందు కర్ణుడైనా యుద్ధరంగంలోకి రావాలి, లేదా తానైనా రావాలి.

భీష్ముడు ఇలా అనటం విని కర్ణుడు దుర్యోధనుడితో, "రాజా, భీష్ముడు జీవించి ఉండగా నేను యుద్ధరంగంలో అడుగు పెట్టను," అని మాట ఇచ్చాడు.

తరవాత దుర్యోధనుడు శాస్త్రోక్తంగా భీష్ముణ్ణి సర్వ సేనాపతిగా అభిషేకించాడు. తరవాత అతనూ, అతని తమ్ములూ, సేనలూ కురుక్షేత్రానికి తరలివెళ్ళాయి.

ఇంక యుద్ధం ఆరంభం కాబోతున్నదని విని బలరాముడు, కొందరు యాదవ వీరులను వెంట బెట్టుకుని, పాండవ శిబిరానికి వచ్చాడు. అందరు రాజులూ, పాండవులూ, కృష్ణుడూ లేచి నిలబడి ఆయనను గౌరవిం



చారు. బలరాముడు పెద్దలైన విరాట ద్రుపదులకు నమస్కారం చేసి కూర్చుని, అందరూ వింటూ ఉండగా ఇలా అన్నాడు:

"మహా భయంకరమైన యుద్ధమూ, జనక్షయమూ జరగబోతున్నది. ఇది తప్పేటట్టు లేదు. ఈ యుద్ధం నుంచి మీ రందరూ ప్రాణాలతోనూ, వికలాంగులు కాకుండానూ బయటపడగా చూస్తానని ఆశిస్తున్నాను. మనకు పాండవులవంటి బంధువులే కౌరవులూ అనీ, ఇరు పక్షాలనూ సమంగా చూడమనీ నేను కృష్ణుడికి ఎన్నో సార్లు చెప్పాను. కాని అతనికి అర్జునుడంటే ప్రాణం. పాండవు లంటే అభిమానం. నా మాట విన్నాడు కాడు. భీమ



దుర్యోధను లిద్దరూ నాకు ప్రియమైన శిష్యులే. ఇద్దరూ నా దగ్గర గదాయుద్ధంలో ఆరితేరిన వాళ్ళే. యుద్ధంలో కృష్ణుడి సహాయంతో పాండవులు గెలిచి తీరుతారు. కాని కౌరవుల వినాశం నేను చూడలేను. సరస్వతీ నదీ ప్రాంతాన గల పుణ్యక్షేత్రాలు సేవించ బోతున్నాను."

ఇలా చెప్పి బలరాముడు వెళ్ళిపోయాడు.

అదే సమయంలో రుక్మిణి అన్న అయిన రుక్మి ఒక అక్షౌహిణి సేనతో పాండవుల వద్దకు వచ్చి, ధర్మరాజు చేత అతిథి సత్కారాలు పొంది, సభలో అందరూ వింటూండగా అర్జునుడితో, "అర్జునా, ఈ యుద్ధంలో నీకు సహాయం కావాలంటే చెప్పు. నేను నీకు ఎలాటి భయమూ కలగకుండా శత్రువును మట్టుపెట్టేస్తాను. పరాక్రమంలో నాకు ఎవరూ చాలరు. ఈ రాజులందరూ ఇక్కడి నుంచి కదిలే పనిలేదు. ఆ కృపుణ్ణీ, ద్రోణుణ్ణీ నేనే చంపేసి, మీ రాజ్యం మీ కిప్పిస్తాను," అన్నాడు.

అర్జునుడు అందరి ముఖాలూ చూసి నవ్వుతూ, "వీరాగ్రేసరా, నేను భయపడే సమస్య లేదు. ఎవరి సహాయమూ లేకుండానే దుర్యోధనుణ్ణి గంధర్వుల నుంచి విడిపించాను; ఖాండవ దహనం చేయించాను; విరాటుడి గోవులను కౌరవ సేనల నుంచి మళ్ళించాను. మీరు సహాయం చేయ దలిస్తే మరెవరికైనా సహాయం చెయ్యండి. లేదా, మా వెంట ఉండి నేను ఎలా యుద్ధంచేస్తానో చూడండి," అన్నాడు.

అప్పుడు రుక్మి తన పెద్ద సేనను వెంటబెట్టుకుని దుర్యోధనుడి దగ్గిరికి వెళ్ళి, ఇలాగే ప్రగల్భాలాడాడు. దుర్యోధనుడు కూడా రుక్మి సహాయం నిరాకరించాడు. రుక్మి తన దేశానికి తిరిగి వెళ్ళాడు.

ఈ విధంగా కురుక్షేత్రంలో జరిగిన యుద్ధంలో చేరనివారు బలరాముడూ, రుక్మి మాత్రమే. మిగిలిన వారంతా ఏదో ఒక పక్షాన యుద్ధం చేశారు.

హిరణ్వతీ నదీ తీరాన శిబిరంలో ఉన్న పాండవుల వద్దకు దుర్యోధనుడు శకుని

కొడుకైన ఉలూకుణ్ణి దూతగా పంపి, ధర్మ రాజుకూ, కృష్ణుడికీ, భీమార్జునులకూ, నకుల సహదేవులకూ ఇలా పొగరుతోకూడిన సందేశం పంపాడు.

"ధర్మరాజా, నువు రుద్రాక్ష పిల్లివి. నీది పిల్లి జపం. లోకాన్ని వంచించటానికి నువు వేదాలనూ, సహనాన్నీ అవలంబించావు. ఇప్పుడైనా క్షాత్ర ధర్మం అవలంబించి యుద్ధం చెయ్యి. నువు అయిదు గ్రామాలే అడిగితే బుద్ధిపూర్వకంగానే నేను నిరాక రించి, నిన్ను యుద్ధానికి పురికొల్పాను.

"కృష్ణా, నువు మా సభలో ఏదో గారడీచేసి ఒక రూపం చూపించావు. అదేరూపంతో యుద్ధరంగంలో నా ఎదట పడు. యోధులు ఇలాటి మాయలకు ఆగ్రహిస్తారు గాని భయ పడరు. యుద్ధంలో పాండవులను గెలిపించి, వారికి రాజ్యం ఇప్పిస్తానని ప్రగల్భాలాడావు. ఆ మాటలు నిలబెట్టుకో.

"భీమా, నువు తిండిపోతువు, యుద్ధానికి పనికిరావు. నా ప్రతాపం చేత నిన్ను నేను విరాటుడికి వంటలవాణ్ణి చేశాను. ధృత రాష్ట్రుడి కొడుకుల నందరినీ యుద్ధరంగంలో గెలుస్తానని ప్రతిజ్ఞలు పలికావు. ఆ ప్రతి జ్ఞలు నిలబెట్టు."

ఇదే ధోరణిలో దుర్యోధనుడు అర్జున నకుల సహదేవులకూ, ధృష్టద్యుమ్నుడికీ సందేశాలు పంపాడు. వాటిని ఉలూకుడు



తెచ్చి పాండవ శిబిరంలో అందించాడు. దుర్యోధనుడు ఊహించినట్టే అందరూ ఆగ్రహావేశం చెందారు. వారు ఉలూకు డితో, "దుర్యోధనుడు మమ్మల్ని యుద్ధానికి రెచ్చగొట్టుతున్నాడు. అతని కోరిక తీరు తుందని చెప్పు." అన్నారు.

ఉలూకుణ్ణి పంపేసి ధర్మరాజూ, ధృష్ట ద్యుమ్నుడూ తమ సేనలను యుద్ధరంగానికి తరలించారు. ధృష్టద్యుమ్నుడు తమ వీరు లకు కౌరవవీరులను ఈ విధంగా ప్రతి యోధులని నిర్ణయించాడు:

కర్ణుడికి అర్జునుడు; దుర్యోధనుడికి భీముడు; శల్యుడికి ధృష్టకేతుడు; కృపుడికి ఉత్తమౌజుడు; అశ్వత్థామకు నకులుడు;

కృతవర్మకు శైబ్యుడు; సైంధవుడికి యుయుధానుడు; భీష్ముడికి శిఖండి; శకునికి సహదేవుడు; వృషసేనుడికి అభిమన్యుడు; త్రిగర్తులకు ఉపపాండవులు; ద్రోణుడికి తాను (ధృష్టద్యుమ్నుడు.)

ఇలా కౌరవసేనలో గల యోధులందరికీ తన సేనలోని ప్రతి యోధులను నిర్ణయించి, ధృష్టద్యుమ్నుడు పాండవసేనలను వ్యూహంగా తీర్చాడు. అతని ఉద్దేశంలో అభిమన్యుడు అర్జునుడి కన్న యుద్ధంలో ప్రతాపశాలి!

అవతల కౌరవసేనకు నాయకుడైన భీష్ముడు దుర్యోధనుడు కోరిన మీదట, రెండు పక్షాలలో గల మహావీరుల తరతమ భేదాలను ఈ విధంగా తెలిపాడు:

కౌరవసేనలో కృతవర్మా, శల్యుడూ, సైంధవుడూ, కృపుడూ, అశ్వత్థామా, ద్రోణుడూ, బాహ్లికుడూ మొదలైనవారు అతిరథులు, ఉత్తమ వీరులు. అశ్వత్థామకు ప్రాణాల మీది ఆశ అనే లోపం ఉన్నది; లేకపోతే అతనితో సమానుడైన వీరుడు రెండు సేనలలోనూ లేడు. వృషసేనుడూ, అలంబుసుడనే రాక్షసుడూ మహారథులు. సుదక్షిణుడూ, నీలుడూ, శకునీ, విందానువిందులూ మొదలైనవారు ఏకరథులు. కవచకుండలాలు పోవటం చేతా, శాపగ్రస్తుడు కావటం చేతా కర్ణుణ్ణి రథుల జాబితాలో చేర్చటానికే లేదు; అతను అర్ధరథుడు.

పాండవసేనలో, అయిదుగురు పాండవులూ అతిరథులు. వారిలో అర్జునుడు ఉభయసేనలలోకీ సాటిలేని యోధుడు; అతన్ని ఎదిరించి పోరాడే శక్తి గల భీష్మద్రోణు లిద్దరూ వయోవృద్ధులే. అభిమన్యుడూ, సాత్యకీ, ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ, అతని తమ్ముడు సత్యజిత్తూ, ఘటోత్కచుడూ అతిరథుల కిందికే వస్తారు. ఉపపాండవులు అయిదుగురినీ మహారథులన వచ్చు. అలాగే, విరాటుడూ, ద్రుపదుడూ, శిశుపాలుడి కొడుకైన ధృష్టకేతుడూ మొదలైనవారు కూడా మహారథులే!






భీష్ముడు దుర్యోధనుడికి ఉభయపక్షాల వీరులను గురించి వివరంగా చెప్పిన మీదట దుర్యోధనుడు ఆయనను, "తాతా, శిఖండి యుద్ధానికి వస్తే అతన్ని ఎందుకు చంపనంటావు? సోమకులతో సహా పాంచాలులందరినీ చంపుతానని నువ్వు ముందు చెప్పి ఉన్నావే?" అని అడిగాడు.

దానికి భీష్ముడు ఇలా సమాధానం చెప్పాడు:

"నేను శిఖండిని యుద్ధరంగంలో ఎందుకు ఎదుర్కోనో చెబుతాను, ఈ రాజులందరితోపాటు నువుకూడా విను. నా తండ్రి శంతనమహారాజు దీర్ఘకాలం రాజ్యపాలన చేసి చనిపోయిన అనంతరం, నేను చిత్రాంగదుణ్ణి రాజు గానూ, విచిత్రవీర్యుణ్ణి యువరాజుగానూ అభిషేకించాను. కొంత కాలానికి చిత్రాంగదుడు పోయాడు. అప్పుడు నేను విచిత్రవీర్యుణ్ణి రాజును చేసి, అతనికి నేను అండగా ఉంటూ రాజ్యపాలన చేశాను.

"అతనికి యుక్తవయసు వచ్చింది. అతనికి తగిన కన్యను చూసి పెళ్ళి చేయ నిశ్చయించాను. ఆ సమయంలో కాశీరాజు కూతుళ్ళు ముగ్గురు స్వయంవరం చేసుకోబోతున్నారని తెలిసింది. వాళ్ళు మంచి అందగత్తెలు. వాళ్ళ పేర్లు అంబా, అంబికా, అంబాలికా. స్వయంవరానికి రాజులందరూ ఆహ్వానించబడ్డారు. నేను ఒంటరిగా రథం మీద కాశీరాజధానికి వెళ్ళి, సాటిలేని అందగత్తెలయిన రాజకుమార్తె

52. శిఖండి కథ



లను చూశాను. స్వయంవరానికి వచ్చిన రాజులందరినీ కూడా చూశాను. నేను వారి నందరినీ నాతో యుద్ధానికి అహ్వానించి, రాజకుమార్తెలను ముగ్గురినీ నా రథంలో ఎక్కించుకున్నాను.

"'రాజులారా, నేను ఈ ముగ్గురు కన్యలనూ తీసుకు పోతున్నాను. నేను శంతనుడి కొడుకును. నా పేరు భీష్ముడు. మీకు చేతనైతే ఈ కన్యలను విడిపించు కోండి,' అని నేను రాజులతో అన్నాను. వాళ్ళకు నా మీద చాలా కోపం వచ్చి, రథాల మీదా, ఏనుగుల మీదా, గుర్రాల మీదా అయుధాలు ఎత్తి, నా మీదికి యుద్ధానికి వచ్చారు. నేను వాళ్ళను బాణవర్షంలో ముంచి, ఓడించాను. వాళ్ళు యుద్ధరంగం వదిలి పారిపోయారు.

"నేను కాశీరాజు కుమార్తెలను తీసుకు వచ్చి, సత్యవతికి చూపి, వాళ్ళను విచిత్ర వీర్యుడికి భార్యలుగా తెచ్చానని చెప్పాను. ఆమె నేను చేసిన పనికి చాలా సంతోషించింది. నేను పెళ్ళి ప్రయత్నాలు చేస్తూంటే, కాశీరాజు పెద్ద కూతురు, అంబ తాను సాళ్వరాజును ప్రేమించాననీ, అతను కూడా తనను ప్రేమించాడనీ, తాము వివాహం చేసు కోవటానికి నిశ్చయించు కున్నామనీ, ఈ సంగతి తన తండ్రికి తెలియదనీ, తనను సాళ్వరాజు వద్దకు చేర్చమనీ ప్రార్థించింది. నేను మా తల్లి సత్యవతి తోనూ, మంత్రి పురోహితులతోనూ సంప్రదించి, అంబకు దాసీలనూ, రక్షకులనూ తోడు ఇచ్చి, సాళ్వుడి వద్దకు పంపేశాను.

"కాని సాళ్వుడు ఆమెను స్వీకరించక, భీష్ముడు బలాత్కారంగా తీసుకుపోయిన కన్య తనకు అవసరం లేదన్నాడు. 'నేను భీష్ముడికి భార్యను కాలేదు. ఆయనే నన్ను సగౌరవంగా నీ వద్దకు పంపాడు,' అని అంబ అన్నది. ఆమె ఎంత బతిమాలినా, ఏడ్చినా సాళ్వుడు మనసు మార్చుకోక, 'నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళు,' అన్నాడు.

"అంబ తన దుస్థితికి ఎన్నో కారణాలు ఉన్నప్పటికీ, నా మీదనే పగపట్టి ఋషు

లుండే ఆశ్రమాలకు వెళ్ళింది. అక్కడ శైఖావత్యు డనే ముని అంబకు కలిగిన కష్టం తెలుసుకుని, 'అమ్మాయీ, ఇక్కడ తపస్సు చేసుకునే మునులు నీ కష్టాలను ఏం తీర్చగలరు?' అన్నాడు. తనకు జీవితం మీద విరక్తి కలిగిందనీ, తనకు తపస్సు చేసుకునే పద్ధతి తెలుపమనీ అంబ ఆయనను వేడుకున్నది.

"తరవాత ఆశ్రమవాసులైన మునులందరూ కలిసి ఆమెను గురించి చర్చించారు, కాని ఏ నిర్ణయమూ చెయ్యలేక పోయారు. వాళ్ళు ఆమెను ఆమె తండ్రి ఇంటికి వెళ్ళమన్నారు. అందుకు అంబ ఒప్పుకోలేదు; తపస్సు చేసుకుంటాననీ, ఆ విధానం చెప్పమనీ అన్నది.

ఆ సమయంలో అక్కడికి హొత్రవాహను డనే రాజర్షి వచ్చాడు. ఆయన అంబకు తల్లి వైపు తాత. ఆయన అంబ కథ విని చాలా విచారించి, 'అమ్మా, నువు తపస్సు చెయ్యలేవు. జమదగ్ని కొడుకైన పరశురాముడి పద్దకు వెళితే, ఆయన నిన్ను భీష్ముడి దగ్గిరికి చేర్చగలడు; అందుకు భీష్ముడు ఒప్పకోక పోతే, యుద్ధంచేసి భీష్ముణ్ణి చంపగలడు,' అన్నాడు.

"పరశురాముడు మహేంద్రపర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు. కాని ఆయన మర్నాడు ఈ ఆశ్రమానికే వస్తు



న్నట్టు వార్త తెలిసింది. మర్నాడు పరశురాముడు అక్కడికి రానే వచ్చాడు. అక్కడి మునులు, అంబతో సహా, ఆయనకు అతిథి పూజలు చేశారు. మాటల సందర్భంలో హొత్రవాహనుడు పరశురాముడికి తన కూతురి కూతురైన అంబ కథ చెప్పి, ఆమె కష్టం తీర్చుమన్నాడు.

"'అమ్మాయీ, నువు భీష్ముడి వద్దకు పోతావా? సాళ్వుడి పద్దకు పోతావా? ఏది కావాలంటే అది నేను సమకూర్చగలను,' అని పరశురాముడు అంబతో అన్నాడు. తన కష్టాలకు మూలం భీష్ముడే ననీ, అతన్ని చంపితేగాని తన పగ చల్లారదనీ అంబ పరశురాముడితో అన్నది.



"పరశురాముడు నన్ను చంపటానికి ఒప్పుకోలేదు గాని, అంబను నా వశం చెయ్యటానికీ, నేను అంగీకరించక పోతే నాతో యుద్ధం చెయ్యటానికీ ఒప్పుకున్నాడు. ఆయన అంబనూ, కొంతమంది ఋషులనూ వెంట బెట్టుకుని కురుక్షేత్రానికి వచ్చి, సరస్వతీనదీ తీరాన విడిసి, తన కోరిక నెరవేర్చమని నాకు కబురు పంపాడు. నేను ఒక గోవునూ, బ్రాహ్మణులనూ వెంట బెట్టుకుని ఆయనను చూడబోయి, ఆయనకు తగిన పూజలు చేశాను.

"పరశురాముడు నన్ను చూసి, 'భీష్మా, నువు స్త్రీని కోరని వాడివిగదా, ఈ అంబను ఎందుకు బలాత్కారంగా పట్టుకు పోయావు? పట్టుకు పోయిన వాడివి నీ దగ్గర ఉంచుకోక ఎందుకు పంపేశావు? నీ మూలంగా ఈమె జీవితం భ్రష్టమయింది గదా! నువు పట్టుకుపోయిన ఈ పిల్లను మరెవరు పెళ్ళాడతారు? సాళ్వుడు ఈమెను నిరాకరించాడు. అందుచేత ఈమెను నువే పరిగ్రహించు,'' అన్నాడు.

"ఆ మాటకు నేను, ఆమెను నా తమ్ముడి కిచ్చి పెళ్ళి చెయ్యాలనీ, తనకు సాళ్వుడి పైన మనసున్నట్టు ఆమే చెప్పిందనీ, ఆమె కోరి సాళ్వుడి వద్దకు వెళ్ళిందనీ పరశురాముడికి చెప్పాను.

"ఆ మాట విని పరశురాముడు, నేను తన మాట వినకపోతే నన్నూ, నా మంత్రులనూ చంపుతానన్నాడు. నేను ఆయనను శాంతపరచటానికి చూశాను. ఆయన నాకు అస్త్రాలిచ్చిన గురువు. ఆ మాట చెప్పాను. అయితే గురువు ఆజ్ఞ పాటించమని ఆయన పట్టుపట్టాడు. గురువు కాదు గదా, ఇంద్రుడే వచ్చి అధర్మం చెయ్యమన్నా నేను చెయ్యనన్నాను; తప్పని సరి అయితే యుద్ధం చేస్తానన్నాను.

"మా ఇద్దరికీ కురుక్షేత్రంలో మర్నాడు యుద్ధం జరిగేటట్టు ఏర్పాటు చేసుకున్నాం. నేను హస్తినాపురానికి తిరిగివచ్చి, సత్యవతికి సంగతంతా చెప్పి, ఆమె ఆశీర్వాదం పొంది, యుద్ధసన్నద్ధుడనై రథం ఎక్కి

కురుక్షేత్రానికి వెళ్ళాను. పరశురాముడు అప్పటికే అక్కడికి చేరుకుని ఉన్నాడు. మా యుద్ధం చూడటానికి మునులందరూ ఒక పక్కగా నిలిచి ఉన్నారు. నేను పరశురాముడికి నమస్కారం చేసి యుద్ధం చెయ్యటానికి సిద్ధమయాను. మేము ఒకరి నొకరం స్పృహ తప్పి పోయేటట్టు బాణాలతో కొట్టుకున్నాం. మా యుద్ధం ఇరవై నాలుగు రోజులు సాగింది. పరశురాముడు తాను ఓడిపోయినట్టు ఒప్పుకున్నాడు.

"తరవాత ఆయన అంబతో, 'చూశావు గదా, నేను భీష్ముణ్ణి జయించలేక పోయాను. అందుచేత నీకు నేనేమీ చేయలేను. కావాలంటే, నీకై నువే భీష్ముణ్ణి శరణువేడు.' అన్నాడు. అంబ అలా చేయ నిరాకరించి, నన్ను చంపటానికై తపస్సు చేసుకుంటానని వెళ్ళిపోయింది. పరశురాముడు మునులతో సహా మహేంద్రపర్వతానికి వెళ్ళిపోయాడు. నేను అంబ వెంట కొందరు మనుషులను పంపి, ఆమె ఎక్కడికి పోతుందో, ఏం చేస్తుందో కనిపెట్టి నాకు తెలియజేయమన్నాను.

"అంబ యమునా తీరాన ఉండే ఋష్యాశ్రమాలకు వెళ్ళింది. అక్కడ ఆమె ఘోరమైన తపస్సు చేసింది. అలా ఆమె పన్నెండేళ్ళపాటు తపస్సు చేసింది. బంధువులు మధ్యలో మానమని ఎంతగా చెప్పినా



వినలేదు. కొంత కాలానికి ఆమెకు శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. ఆమె నన్ను జయించేటట్టు వరం కోరుకున్నది. శివుడామెకు ఆ వరం ఇచ్చాడు; వచ్చే జన్మలో స్త్రీగాపుట్టి, పురుషుడుగా మారి, నన్ను ఆమె యుద్ధంలో చంపేటట్టు శివుడు చెప్పి, అంతర్థానమయాడు. ఆమె వెంటనే చితిపేర్చుకుని, 'భీష్ముణ్ణి చంపటానికి అగ్ని ప్రవేశం చేస్తున్నాను.' అంటూ అగ్ని ప్రవేశం చేసింది."

ఈ విషయాలు చెప్పి, భీష్ముడు దుర్యోధనుడికి శిఖండి వృత్తాంతం తెలిపాడు.

ద్రుపదుడి భార్యకు పిల్లలు కలగలేదు. ఆయన కూడా భీష్ముడి చేతిలో ఓడిన వాడే



కావటం చేత, భీష్మణ్ణి చంపే కొడుకు కోసం శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై, "భీష్మణ్ణి చంపగల స్త్రీపురుషుడు కలుగుతాడు," అని చెప్పాడు.

తరవాత ద్రుపదుడి భార్య గర్భవతి అయి, కాలక్రమాన ఒక ఆడపిల్లను కన్నది. కాని ద్రుపదుడు తనకు కొడుకు కలిగినట్టు లోకానికి చాటాడు. తరవాత ఆయన ఈ రహస్యాన్ని చాలా శ్రద్ధగా కాపాడుతూ, ఆ పిల్లకు కొడుక్కు చేయవలిసిన కర్మలన్నీ చేశాడు. కూతురి రహస్యం దాచటంలో ద్రుపదుడి భార్య కూడా చాలా శ్రద్ధవహించింది. ద్రుపదుడికి ఒకటే ధైర్యం—శివుడి మాట ప్రకారం తన కూతురు కొడుకు అవుతుందని. ఆ పిల్లకు ఆయన శిఖండి అని నామకరణం చేశాడు.

శిఖండి చిత్రకళా, శిల్పమూ చక్కగా నేర్చుకున్నది. ఆమె మగవేషంతో ద్రోణుడి వద్దకు వెళ్ళి విలువిద్య అభ్యసించింది. కాలక్రమాన ఆమె యుక్తవయస్కురాలయింది. అది చూసి ద్రుపదుడు చాలా బెంగపడ్డాడు. శివుడు చెప్పినట్టు ఆమె ఇంకా పురుషుడుగా మారనే లేదు.

"శివుడి మాట ఎన్నటికీ అబద్ధం కాదు. మనం మన పిల్లకు తగిన కన్యను చూసి వివాహం చేసేద్దాం," అని ద్రుపదుడి భార్య అన్నది.

ద్రుపదుడు ఈ ఆలోచన ఆమోదించి దశార్ణరాజు కూతురిని శిఖండికి భార్యగా ఎన్నుకుని, వివిధదేశాల రాజులకు ఆ వార్త తెలిపాడు. దశార్ణరాజు హిరణ్యరోముడు చాలా బలవంతుడు. ఆయన కుమార్తె పేరు కూడా శిఖండే. ద్రుపదుడితో వియ్యమందటానికి ఆయన సంతోషించాడు. శిఖండులిద్దరికీ వివాహం జరిగింది.

కొంత కాలానికి దశార్ణరాజు కూతురు యౌవనవతి అయింది. ఆమెకు తన భర్త మగవాడు కాడనీ, ఆడది అనీ తెలిసింది. ఆమె సిగ్గుపడుతూ ఈవార్త తన చెలికత్తెలకు చెప్పింది. వాళ్ళు ఈ రహస్యాన్ని దశార్ణరాజుకు అందజేశారు.

దశార్ణరాజు ద్రుపదుడు చేసిన వంచనకు మండిపడి తన దూతను ద్రుపదుడి వద్దకు పంపాడు. దూత వచ్చి తన రాజుమాటలుగా ఇలా చెప్పాడు: "దుర్మార్గుడా, నీ కూతురికి నా కూతురిని పెళ్ళిచేసుకుని నన్ను అవమానించావు. నేను వచ్చి, నిన్నూ, నీ బంధు మిత్రులనూ చంపబోతున్నాను."

ద్రుపదుడి నోట మాట లేదు. ఆయన దశార్ణరాజుకు, "నేను మిమ్మల్ని మోసగించలేదు," అని మాత్రం జవాబు పంపాడు. దశార్ణరాజు తృప్తిపడక, ద్రుపదుణ్ణి నిర్మూలించటానికి వస్తున్నట్టుగా, దూతద్వారా యుద్ధవార్త పంపాడు.

ద్రుపదుడు బెదిరిపోయి, ఇప్పుడు ఏం చెయ్యాలని తన భార్యను అడిగాడు. తన పరివారం వాళ్ళను మోసగించటానికి, తానే తన కూతురును కొడుకని ఇంత కాలమూ భ్రమపడినట్టు నటించాడు.

తన తల్లి దండ్రులకు కలిగిన కష్టం చూసి, శిఖండి ప్రాణత్యాగం చేయ నిశ్చయించి, ఇల్లు విడిచి కీకారణ్యాలకు వెళ్ళిపోయింది. ఆ అరణ్యం స్థూణాకర్ణు డనే యక్షుడి పాలనలో ఉన్నది. శిఖండి ఆ వనంలో కొన్ని రోజులు ఉపవాసాలు చేసిన మీదట యక్షుడు ఆమెను చూసి, "నువ్వు ఇక్కడ ఎందు కున్నావు? నీకు ఏంకావాలి? సహాయం చేస్తాను," అన్నాడు.



"నాకు సహాయం చెయ్యటం నీ తరం కాదు," అన్నది శిఖండి.

"నేను కుబేరుడి మిత్రుణ్ణి, నువు కోరిన వరం ఇవ్వగలను," అన్నాడు యక్షుడు.

తాను మగవాడుగా పెరిగి, ఆడపిల్లను పెళ్ళాడటమూ, అందువల్ల తన తండ్రికి వచ్చిన విపత్తూ గురించి శిఖండి యక్షుడికి తెలిపింది.

"నేను నీకు కొంత కాలం పాటు నా పురుషత్వం యిచ్చి, నీ స్త్రీత్వం నేను తీసుకుంటాను. మీ తండ్రికి కలిగిన ఆపద గడవగానే మళ్ళీ నా పురుషత్వం నా కిచ్చి నీ స్త్రీత్వం నువు తీసుకో," అన్నాడు యక్షుడు.

శిఖండి పరమానందం చెంది, అలాగే చేస్తానన్నది.

ఆడదిగా వెళ్ళిన శిఖండి మగవాడుగా తిరిగి వచ్చేసరికి ఆమె తల్లిదండ్రులు అపరిమితమైన ఆనందం పొందారు. "నా కొడుకు మగవాడే; కావలిస్తే వచ్చి చూసుకోవచ్చు." అని ద్రుపదుడు దశార్ణరాజుకు కబురు పంపాడు. దశార్ణరాజు ఈ మాట నిజమో కాదో తెలుసుకునేటందుకు కొందరు స్త్రీలను పంపాడు. వాళ్ళు శిఖండిని అనేక విధాల పరీక్షించి, తిరిగి వెళ్ళి, శిఖండి పురుషుడే నని దశార్ణరాజుకు తెలిపారు. దశార్ణరాజు స్వయంగా వచ్చి, ద్రుపదుడి మీదా, శిఖండి మీదా చాలా గౌరవం ప్రదర్శించి, తనకు అబద్ధం చెప్పిన కుమార్తెను కోప్పడి, తిరిగి వెళ్ళాడు.

ఈలోపల కుబేరుడు విమానం మీద తిరుగుతూ స్థూణాకర్ణుడుండే వనానికి వచ్చి, స్థూణాకర్ణుడు తనను చూడరానందుకు ఆశ్చర్యపడ్డాడు. యక్షుణ్ణి తీసుకు రావటానికి వెళ్ళిన కుబేరుడి దూతలు ఆడదిగా ఉన్న స్థూణాకర్ణుణ్ణి కుబేరుడి వద్దకు తెచ్చారు. యక్షుడు స్త్రీ అయిపోవటానికి కారణం విని, కుబేరుడు ఆగ్రహించి, "ఎప్పటికీ ఆడదిగానే ఉండిపో!" అని శపించాడు. మిగిలిన వాళ్ళంతా శాపాంతం చెప్పమని ప్రాధేయపడిన మీదట కుబేరుడు, శిఖండి చనిపోయిన అనంతరం యక్షుడికి మగతనం తిరిగివచ్చేటట్టు అనుగ్రహించాడు.

తరవాత శిఖండి యక్షుడి వద్దకు వచ్చి, "అయ్యా, మా ఆపద తప్పింది. ఇక మీ పురుషత్వం మీరు తీసుకోండి." అన్నాడు. యక్షుడు తనను కుబేరుడు శపించాడనీ, పురుషత్వాన్ని శిఖండి జీవితాంతం ఉంచుకోవచ్చుననీ చెప్పి, పంపేశాడు.

భీష్ముడు ఈ విధంగా శిఖండి వృత్తాంతం చెప్పి, "అంబ శిఖండిగా పుట్టింది. ఆడదిగా పుట్టిన వాళ్ళనూ, ఆడపేరుగల వాళ్ళనూ, ఆడవేషంలో తిరిగే వాళ్ళనూ చంపనని నా వ్రతం. అందుకే శిఖండితో యుద్ధం చెయ్యను, శిఖండిని చంపనని అన్నాను." అన్నాడు.






మర్నాడు యుద్ధం ప్రారంభమవుతుందనగా ఆ రాత్రి దుర్యోధనుడు తన సేనలోని ప్రముఖ యోధులను, "మీరు పాండవ సేనను నిర్మూలించటానికి ఎంతకాలం పట్టుతుంది?" అని అడిగాడు.

తనకు ముప్పైరోజులు పట్టుతుందని భీష్ముడు చెప్పాడు. ద్రోణుడు తాను వృద్ధుడూ, బలహీనుడూ అయాడు కనక తనకు కూడా ముప్పైరోజులు పట్టుతుందన్నాడు. కృపుడు తనకు రెండు మాసాలు పట్టుతుందన్నాడు. అశ్వత్థామ తనకు పది రోజులు పట్టుతుందన్నాడు. కర్ణుడు తనకు అయిదు రోజులు చాలునన్నాడు. అది విని భీష్ముడు నవ్వి, "కృష్ణుడి సహాయంతో అర్జునుడు ఎదురుపడనంత కాలమూ నువ్వు ఇలాగే ప్రగల్భాలు పలికి, ఇంతకన్న కూడా గొప్పలు చెప్పుకుంటావు," అన్నాడు.

ఈ సంగతి చారుల ద్వారా విని ధర్మరాజు అర్జునుడికి ఆ మాట చెప్పి, "నువ్వు కౌరవ సేనను ఎంతకాలంలో నిర్మూలించగలవు?" అని అడిగాడు.

దానికి అర్జునుడు, "నీ కెందుకు విచారం? మన యోధులు కౌరవసేనను నిస్సంశయంగా నిర్మూలించగలరు. నన్నడిగితే, మూడు లోకాలూ ఎత్తి వచ్చినా ఒక్క క్షణంలో జయించగలనంటాను. ఎందుకంటే, నా దగ్గిర పాశుపతాస్త్రం ఉన్నది. అది భీష్మ, ద్రోణ, కృప, కర్ణుల వద్ద లేదు. కాని అలాటి అస్త్రంతో అందరినీ చంపరాదు." అన్నాడు.

53. యుద్ధానికి ముందు



మర్నాడు తెల్లవారగానే కౌరవసేనలు పాండవసేనల కేసి నడిచాయి. దుర్యోధనుడి పక్షాన వున్న రాజులలో పరస్పరాభిమానమూ, విజయకాంక్షా కనిపించాయి.

కురుక్షేత్రం మధ్యలో దుర్యోధనుడు శిబిరం నిర్మించి, దాన్ని మరొక హస్తినాపురం లాగా తయారు చేయించాడు. అది నగరం లాగున్నది గాని శిబిరం లాగా లేదు.

అదే విధంగా పాండవసేనలు కూడా యుద్ధభూమికి కదలి వచ్చాయి. ఉభయ పక్షాల సేనలూ రెండు మహా సముద్రాల లాగా కురుక్షేత్రంలో కూడేసరికి, మిగిలిన ప్రపంచంలో పిల్లలూ, స్త్రీలూ, ముసలి వాళ్ళూ మాత్రమే మిగిలారు.

యుద్ధం ప్రారంభం కాబోతూ ఉండగా వ్యాసుడు ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి, "నీ కొడుకులకూ, మిగిలిన రాజులకూ కాలం మూడింది. నువు వారి కోసం దుఃఖించటం అనవసరం. నువు యుద్ధాన్ని చూడ గోరినట్టయితే నీకు దివ్యదృష్టి ఇస్తాను. దాని సహాయంతో నువు యుద్ధరంగంలో ఏమేమి జరుగుతున్నదీ చూడగలుగుతావు," అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "మహర్షీ, జ్ఞాతుల చావు కళ్ళారా ఎలా చూసేది? యుద్ధం గురించి వివరాలు వింటాను. అందుకు ఏదైనా పద్ధతి ఉంటే చెప్పు," అన్నాడు.

అప్పుడు వ్యాసుడు, "యుద్ధరంగమంతా రాత్రింబగళ్ళు ఈ సంజయుడి కళ్ల ముందు కనపడేటట్టు చేస్తాను. అతను నీకు యుద్ధ క్రమమంతా చెబుతాడు," అన్నాడు. అదే విధంగా సంజయుడు యుద్ధవార్తలను ధృతరాష్ట్రుడికి తెలుపుతూ వచ్చాడు.

యుద్ధారంభానికి ముందు కౌరవసేనకు సర్వసేనాని అయిన భీష్ముడు యుద్ధం చేయబోతున్న రాజులతో, "రాజులారా, మీ కందరికీ స్వర్గ ద్వారాలు తెరిచి ఉన్నాయి. ఆ ద్వారంకుండా ఇంద్రలోకానికీ, బ్రహ్మ లోకానికీ వెళ్ళండి. క్షత్రియులకు ఇదే సరి అయిన మార్గం. నిర్భయంగా పోరాడండి. క్షత్రియుడు వ్యాధిగ్రస్తుడై, మంచానపడి చావరాదు," అన్నాడు.

భీష్ముడు రణరంగంలో నిలిచి ఉండగా యుద్ధరంగంలోకి అడుగు పెట్టనని ప్రతిజ్ఞ చేసిన కర్ణుడు తప్ప మిగిలిన రాజులంతా యుద్ధఘోషతో కదిలారు.

ఉభయ సైన్యాలూ వ్యూహంలో తీర్చి దిద్దబడ్డాయి. పాండవసేనకు భీముడు ముందు నడిచాడు. శిఖండి సైన్యం వ్యూహ మధ్యంలో ఉన్నది. కుడి పార్శ్వాన్ని సాత్యకి రక్షిస్తున్నాడు. ధృష్టద్యుమ్నుడు వ్యూహ మంతటా సంచరిస్తున్నాడు. కృష్ణుడు సారథిగా రథం మీద కూర్చున్న అర్జునుడు, రెండు సేనల మధ్య తన రథాన్ని నిలప మని కృష్ణుణ్ణి కోరాడు. కృష్ణుడు అలాగే చేసి, "అర్జునా, భీష్మద్రోణులు మొదలు గాగల కౌరవవీరులను చూడు," అన్నాడు.



అర్జునుడికి తన ఎదట కనిపించినవారు అతనికి తండ్రులూ, తాతలూ, గురువులూ, మేనమామలూ, సోదరులూ, మనమలూ అయిన బంధుజనం. యుద్ధంలో వారి నందరినీ చంపాలనే సరికి అతనికి కంపరం పట్టుకున్నది. చేతి నుంచి గాండీవం జారి పోతున్నట్టయింది.

అతను కృష్ణుడితో, "యుద్ధంలో ఈ బంధువులను చంపటంలో గల మేలేదీ నాకు కనబడదు. నాకు రాజ్యం వద్దు, సుఖాలు వద్దు," అంటూ దుఃఖంతో రథంలో కూలబడ్డాడు.

అదిచూసి కృష్ణుడు, "అర్జునా, నీ కిదేం మనోజాడ్యం? ఇది స్వర్గానికి దారితీయదు, అపకీర్తి తెస్తుంది! వీరుడవైన నీ కిది తగదు. చావుబతుకులను గురించి బుద్ధిమంతులు శోకించరు. ఆత్మకు ఒక దేహం శాశ్వతం కాదు. దానికి దేహాలు వస్తాయి, పోతాయి. ఆత్మ చచ్చేది కాదు, చంపేదీ కాదు. అది చినిగిన బట్టలు వదిలేసి కొత్త బట్టలు వేసు కున్నట్టుగా జీర్ణమైన దేహాలను విడిచి, కొత్త దేహాలను ధరిస్తుంది. అందుచేత నువు యుద్ధానికి సిద్ధపడు. క్షత్రియుడికి యుద్ధం చెయ్యటం ఉత్తమ ధర్మం. యుద్ధం మాని కీర్తికీ, స్వర్గానికీ దూరం కాకు. అపకీర్తి కన్న మరణం మేలు.



యుద్ధంలో గెలిచావా భోగాలు అనుభవిస్తావు; చచ్చావా స్వర్గసుఖాలు అనుభవిస్తావు. సుఖదుఃఖాలనూ, లాభా లాభాలనూ, జయాపజయాలనూ సమంగా చూడటం బుద్ధిమంతుల లక్షణం," అంటూ అర్జునుడికి హితబోధ చేశాడు.

కృష్ణుడి బోధల వల్ల అర్జునుడి మనసు మారింది. అతని సంశయాలు తొలగాయి.

ఇంతలో ధర్మరాజు తన కవచం విప్పి, తన ఆయుధాన్ని ఒక పక్కన పెట్టి, రథం నుంచి దిగి, చేతులు జోడించుకుని కాలి నడకన భీష్ముడి కేసి బయలుదేరాడు. అది చూసి అర్జునుడూ, మిగిలిన పాండవులూ రథాలు దిగి, ధర్మరాజు వెనకగా బయలుదేరారు. అందరి వెనకగా కృష్ణుడు కూడా వెళ్ళాడు.

అర్జునుడు ధర్మరాజును, "రాజా, మమ్మల్ని విడిచిపెట్టి, ఇలా శత్రుసేన కేసి వెళ్ళుతున్నా వెందుకు?" అని అడిగాడు.

భీమ, నకుల, సహదేవులు కూడా ధర్మరాజును అదే ప్రశ్న వేశారు. వాళ్ళ ప్రశ్నలు వినికూడా జవాబు చెప్పకుండా ధర్మరాజు ముందుకు సాగాడు. కృష్ణుడు నవ్వుతూ వారితో, "ఆయన ముందుగా భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ, శల్యుణ్ణీ అనుమతి కోరి, తరవాత యుద్ధం ప్రారంభిస్తాడు. అలా పెద్దల అనుమతితో యుద్ధం చేస్తే విజయం లభిస్తుంది," అన్నాడు.

ఈ లోపుగా కౌరవసేనలో రకరకాల మాటలు పుట్టాయి.

"ఛీ, ఛీ! ఈ ధర్మరాజు క్షత్రియకులం చెడబుట్టాడు! యుద్ధం చెయ్యటానికి భయపడి, తన తమ్ములతో సహా భీష్ముణ్ణి శరణువేడవస్తున్నాడు. అటువంటి తమ్ములుండగా ఇతను భయపడటం ఎంత సిగ్గుచేటు! తీరా యుద్ధం చెయ్యవలిసి వచ్చేసరికి గుండెజారిపోయి ఉంటుంది," అనుకున్నారు కౌరవయోధులు. వాళ్ళకు దుర్యోధనుడి పక్షంమీద గౌరవం పెరిగింది.

రెండు సేనలలో వాళ్ళూ, భీష్ముడితో ధర్మరాజు ఏమంటాడో, భీష్ముడు ఏం సమా



ధానం చెబుతాడో, యుద్ధమంటె ఒళ్ళు పొంగే భీముడు ఏమంటాడో, కృష్ణార్జునులు ఏం మాట్లాడతారో వినాలని ఎంతో ఆసక్తిగా ఉన్నారు.

ధర్మరాజు తన తమ్ములతో భయంకరమైన శత్రుసైన్యంలోకి జొరబడి, అతి వేగంగా భీష్ముణ్ణి సమీపించి, ఆయన పాదాల మీద పడి, "తాతా, యుద్ధంలో ఎవరూ ఎదుర్కోలేని నీతో యుద్ధం చెయ్యటానికి నీ అనుమతి కోసం వచ్చాం. నువు మాకు నీ అనుమతి ఇచ్చి, ఆశీర్వదించు," అన్నాడు.

దానికి భీష్ముడు, "నువు ఇలా వచ్చినందుకు నాకు చాలా సంతోషమయింది. యుద్ధం చెయ్యి. గెలుస్తావు. నా నుంచి ఏ వరం కావాలన్నా కోరుకో. అందువల్ల నీకు అపజయం కలగదు. ధనం మనిషిని దాసుణ్ణి చేస్తుంది. అందుచేత నేను కౌరవులపక్షాన పోరాడవలిసి వచ్చింది. నువు దానికి భంగం లేకుండా ఏ వరమైనా కోరవచ్చు," అన్నాడు.

"ఓటమి ఎరగని నిన్ను ఈ యుద్ధంలో మేము ఓడించే ఉపాయం ఏది? మా శ్రేయస్సు కోరినవాడివైతే చెప్పు," అన్నాడు ధర్మరాజు.

"అదే నాకు తెలీదు. యుద్ధంలో నన్నెవడూ జయించలేడు. నాకు యుద్ధంలో చావు కూడా లేదు. మరొకసారి రా," అన్నాడు భీష్ముడు.

ధర్మరాజు భీష్ముడికి నమస్కారం చేసి, ద్రోణుడి రథం వద్దకు తమ్ములతోసహా వెళ్ళి, ద్రోణుడికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, "బ్రాహ్మణోత్తమా, యుద్ధం చెయ్యటానికి నీ అనుమతి కోరవచ్చాను. నీ అజ్ఞ లేకుండా శత్రువులను ఎలా జయించగలను?" అన్నాడు.

దానికి ద్రోణుడు, "రాజా, నువు యుద్ధం తల పెట్టగానే ముందుగా నన్ను వచ్చి చూశావు కావెందుకు? అందుకుగాను నీకు అపజయం కలిగేటట్టు శపించి ఉండవలసినదే. కాని ఇలా వచ్చావు గనక నేను సంతో

షించాను. యుద్ధం చెయ్యి. గెలుస్తావు. నీ కేదైనా కోరిక ఉంటే చెప్పు. యుద్ధ సహాయం తప్ప మరేదైనా చేస్తాను. కౌరవుల ఉప్పు తిన్నందున వారి కోసం యుద్ధం చెయ్యక తప్పదు," అన్నాడు.

"మీరు కౌరవుల తరపునే యుద్ధం చెయ్యండి. నాకు మీ విజయాశీర్వాదం చాలు," అన్నాడు ధర్మరాజు.

"నీకు కృష్ణుడు తోడుండగా విజయాని కేమి లోటు? తప్పక జయిస్తావు," అన్నాడు ద్రోణుడు.

"నిన్ను ఓడించటం ఎవరికీ సాధ్యం కాదు. అలాటి నిన్ను మేము ఎలా ఓడించ గలమో చెప్పు," అని ధర్మరాజు ద్రోణుణ్ణి అడిగాడు.

"నేను యుద్ధం చేస్తున్నంత కాలమూ నీకు విజయం కలగదు. అందుచేత, నువ్వూ నీ తమ్ములూ సాధ్యమైనంత త్వరగా నన్ను చంపెయ్యండి," అన్నాడు ద్రోణుడు.

"అందుకే నిన్ను అడిగాను. నిన్ను చంపే ఉపాయమేది?" అని ధర్మరాజు మళ్ళీ అడిగాడు.

"నేను అస్త్రం పట్టి ఉండగా నన్నెవడూ చంపలేడు. కాని అప్రియం ఏదైనా నా చెవుల బడితే, అది కూడా నమ్మదగిన వాడు చెబితే, అస్త్రసన్యాసం చేస్తాను," అన్నాడు ద్రోణుడు.



తరవాత ధర్మరాజు కృపుడి వద్దకు వెళ్ళి, "గురువర్యా, మీ అనుమతితో యుద్ధం ప్రారంభించి విజయం పొందగోరి వచ్చాను," అన్నాడు.

కృపుడు కూడా సంతోషించి, భీష్మ ద్రోణులు చెప్పినట్టే యుద్ధసహాయం తప్ప మరేదైనా కోరుకోమని అన్నాడు. "నువ్వు ఎలా చస్తావు?" అని అడగటానికి బిడియ పడి ధర్మరాజు దీనంగా నిలబడ్డాడు. అది చూసి కృపుడు, "నన్ను ఎవరూ చంప లేరు. వెళ్ళి యుద్ధం చెయ్యి. నీకు జయం కలగాలని ఆశీర్వదిస్తున్నాను," అన్నాడు.

ధర్మరాజు కృపుడి వద్ద శలవు పుచ్చుకుని శల్యుడి వద్దకు వెళ్ళి, "మామా,

యుద్ధం చెయ్యటానికి అనుజ్ఞ ఇయ్యి. నీ అనుమతితో శత్రువులను జయిస్తాను," అన్నాడు.

శల్యుడు కూడా తన అనుమతి ఇచ్చి, ధర్మరాజుకు జయం కలగాలని ఆశీర్వదించి, యుద్ధంలో సహాయం తప్ప ఇంకేదైనా కోరమన్నాడు.

అప్పుడు ధర్మరాజు, "మహారాజా, యుద్ధ ప్రయత్నాల సమయంలో కర్ణుడి వధకు తోడ్పడమని కోరాను. అదే నేనిప్పుడు మళ్ళీ కోరుతున్నాను," అన్నాడు.

"ధర్మరాజా, తప్పక సహాయం చేస్తాను. నీకు యుద్ధంలో జయం కలుగుతుందని శపథం చేస్తున్నాను. వెళ్ళి యుద్ధం చెయ్యి," అన్నాడు శల్యుడు.

ధర్మరాజు తన తమ్ములతో సహా కౌరవ సేన నుంచి వెళ్ళిపోయాడు. కృష్ణుడు కర్ణుడి వద్దకు వెళ్ళి, "కర్ణా, నువు భీష్ముడు యుద్ధరంగంలో ఉన్నంత కాలమూ దుర్యోధనుడి పక్షాన యుద్ధం చెయ్యవుగదా, అంతదాకా పాండవుల పక్షాన యుద్ధంచెయ్యకూడదా? భీష్ముడు పడిపోయినాక కౌరవ పక్షాన యుద్ధం చెయ్యవచ్చు," అన్నాడు.

"నేను దుర్యోధనుడి కోసం ప్రాణాలైనా ఇస్తాను గాని అతనికి ఎన్నడూ అపకారం చెయ్యను," అన్నాడు కర్ణుడు.

కౌరవ సేననుంచి బయటికి వచ్చిన ధర్మరాజు రెండుసేనల మధ్య నిలబడి, కౌరవసేన కేసి తిరిగి, "మీలో ఎవరైనా మాకు సహాయం చెయ్యగోరితే రండి," అని అడిగాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడి కొడుకులలో ఒకడైన యుయుత్సుడు ధర్మరాజు పట్ల అభిమానం కలవాడై, "నువు కోరితే నేను నీ పక్షానికి వచ్చి కౌరవులతో యుద్ధం చేస్తాను," అన్నాడు.

అందుకు ధర్మరాజు సంతోషంగా ఒప్పుకున్నాడు. ఆయన తన స్థానానికి తిరిగి వచ్చి కవచం ధరించాడు. అందరూ తమ తమ రథాలు ఎక్కారు. యోధులందరూ శంఖాలు పూరించారు. భేరులు మోగాయి. యుద్ధం ఆరంభమయింది.





# మహాభారతం

మొట్టమొదటగా యుద్ధానికి తలపడిన వాడు భీముడు. అతను భయంకరమైన సింహనాదం చేసి కౌరవసేన మీదికి వచ్చాడు. అతన్ని దుర్యోధన, దుశ్శాసన, దుర్ముఖ, దుస్సహాదులు అనేకమంది చుట్టుముట్టారు. వాళ్ళ సందరినీ ఉప పాండవులూ, అభిమన్యుడూ, నకుల సహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ మొదలైన వాళ్ళు ఎదుర్కొన్నారు. ఇలా ఆరంభమైన యుద్ధం అన్ని రంగాలకూ వ్యాపించింది.

మొట్ట మొదటగా ద్వంద్వ యుద్ధం భీష్ముడికీ, అర్జునుడికీ మధ్య జరిగింది. ఎవరూ ఎవరికీ తీసిపోకుండా యుద్ధం చేశారు. ఆ వెంటనే సాత్యకి కృతవర్మతోనూ, అభిమన్యుడు బృహద్బలుడి (కోసలరాజు) తోనూ, భీముడు దుర్యోధనుడితోనూ, దుశ్శాసనుడు నకులుడితోనూ, దుర్ముఖుడు సహదేవుడితోనూ, ధర్మరాజు శల్యుడితోనూ, ధృష్టద్యుమ్నుడు ద్రోణుడితోనూ, ధృష్టకేతువు బాహ్లికుడితోనూ, ఘటోత్కచుడు అలంబుసుడితోనూ, శిఖండి అశ్వత్థామతోనూ, విరాటుడు భగదత్తుడితోనూ, ద్రుపదుడు సైంధవుడితోనూ ద్వంద్వయుద్ధాలు చేశారు. ఎవరూ ఓడలేదు.

దొమ్మియుద్ధం కూడా విస్తారంగా జరిగింది. మొత్తం యుద్ధంలో భీష్ముడు వీరవిహారం చేసి, అందరికన్న ఎక్కువగా రాణించాడు. మిట్టమధ్యాన్నం కావస్తూ ఉండగా ఆయన పాండవసేనలో జొర

54. శ్వేతుడి మరణం



బద్ధాడు. ఆయన వెంట రక్షకులుగా దుర్ముఖుడూ, కృతవర్మా, కృపుడూ, శల్యుడూ, వివింశతీ ఉన్నారు. భీష్ముడు తమసేనను నాశనం చేస్తూ రావడం చూసి అభిమన్యుడు అలిగి, భీష్ముడిపై తలపడి, భీష్ముడి జండా పడగొట్టి, భీష్ముడి వెంట ఉన్న యోధులందరితోనూ భయంకరంగా యుద్ధంచేసి, అపర అర్జును డనిపించాడు. త్వరలోనే అభిమన్యుడికి అండగా భీముడూ, విరాటుడూ, అతని కొడుకులూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడు మొదలైనవారు పది మంది యోధులు వచ్చారు.

ఉత్తరుడు ఒక ఏనుగు నెక్కి శల్యుడి మీదికి వచ్చాడు. ఇద్దరికీ జరిగిన యుద్ధంలో ఉత్తరుడు దెబ్బతిని పడిపోయాడు. అది చూసి ఉత్తరుడి అన్న అయిన శ్వేతుడు ఒకేసారి ఏడుగురు కౌరవ యోధులను ఎదుర్కొని, భయంకరమైన యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో శల్యుడికి వెంట్రుకవాసిలో చావు తప్పింది. అయితే శ్వేతుణ్ణి భీష్ముడి నుంచి కాపాడటానికి పాండవ యోధులు గొప్ప ప్రయత్నం చేశారు. దీని ఫలితంగా ఉభయ పక్షాల యోధుల మధ్య తీవ్రమైన దొమ్మియుద్ధం జరిగింది. మిగిలిన కౌరవ యోధులను పారిపోగొట్టిన శ్వేతుడు భీష్ముడికి ఎదురుగా నిలిచి గొప్ప యుద్ధం చేశాడు. శ్వేతుడు ఆ సమయంలో అడ్డుపడక పోతే భీష్ముడు పాండవ సేనను విపరీతంగా ధ్వంసం చేసి ఉండేవాడు. అతను భీష్ముడితో యుద్ధం చెయ్యటమే గాక, భీష్ముడు వెనక్కు తిరిగిపోయేటట్టు కూడా చేశాడు. పాండవులు హర్షధ్వానాలు చేశారు.

భీష్ముడు వెనక్కు తగ్గగానే శ్వేతుడు ధృతరాష్ట్రుడి కొడుకులున్న చోటికి వచ్చాడు. అతను కౌరవసేనను ధ్వంసం చేస్తూ ఉండటం చూసి భీష్ముడు మళ్ళా అతన్ని ఎదుర్కొన్నాడు. భీష్ముడికి అండగా, ఎనిమిది మంది కౌరవ యోధులు వచ్చి శ్వేతుడిపై బాణవర్షం కురిపించారు. శ్వేతుడు అంత మందినీ ప్రతిఘటించి పోరాడుతూ, భీష్ముడికి చెయ్యా, కాలూ

ఆడకుండా చేశాడు. చూసేవారికి భీష్ముడు ఓడిపోతాడనే అనిపించింది. వారిద్దరి మధ్యా జరిగిన యుద్ధంలో శ్వేతుడి రథం ధ్వంసం అయింది. భీష్ముణ్ణి చంపటానికి గద తీసుకుని శ్వేతుడు అతని రథం మీదికి వచ్చాడు. అతను విసిరిన ఆ గదతో భీష్ముడి రథం చూర్ణమయింది. కాని అలా అవుతుందని తెలిసి భీష్ముడు ముందుగానే రథం దిగి, మరొక రథం మీద ఎక్కి శ్వేతుడి పైకి వచ్చాడు.

శ్వేతుడు రథం పోగొట్టుకుని నేల మీద నిలబడి ఉండటం చూసి సాత్యకీ, భీముడూ, అభిమన్యుడూ మొదలైన అనేక మంది యోధులు అతనికి అండగా వచ్చారు. అయితే భీష్ముడు వారినందరినీ దూరానే నిలవగొట్టాడు. తరవాత భీష్ముడు ప్రయోగించిన ఒక్క బాణం శ్వేతుడి ప్రాణాలు లాగేసింది. మహారథుడూ, పాండవ సేనాపతులలో ఒకడూ అయిన శ్వేతుడి మరణం పాండవులకు తీరని దుఃఖమూ, కౌరవులకు అమితానందం కలిగించింది.

శ్వేతుడు చావగానే అతని తమ్ముడు శంఖుడనే వాడు మండిపడి, కృతవర్మ వెంట ఉన్న శల్యుడి పైకి యుద్ధానికి వచ్చాడు. ఏడుగురు కౌరవ యోధులు శల్యుడికి అండగా వచ్చారు. శంఖుడి పైకి భీష్ముడు మృత్యు దేవతలాగా వచ్చిపడ్డాడు. అర్జునుడు శంఖుడికి తోడువచ్చాడు. శల్యుడు శంఖుడి రథాన్ని విరగగొట్టేసరికి శంఖుడు అర్జునుడి రథం ఎక్కాడు.





భీష్ముడు అర్జునుణ్ణి విడిచిపెట్టి ద్రుపదుడి పైకి వెళ్ళి, ద్రుపదుడి సేనను కార్చిచ్చులాగా తన బాణాలతో నాశనం చేయసాగాడు. ఆ సమయంలో భీష్ముణ్ణి చూసి పాండవ వీరులు వణికిపోయారు. ఆయనను నిరోధించటం వారికి సాధ్యం కాలేదు.

అంతలో సూర్యాస్తమానమయింది. ఉభయపక్షాల వారూ యుద్ధం చాలించి తమ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు. భీష్ముడు చేసిన దారుణ యుద్ధానికి దుర్యోధనుడు పరమానందం చెందాడు. కాని ధర్మరాజు మొదటి రోజు తమకు కలిగిన నష్టానికి విచారిస్తూ కృష్ణుడి వద్దకు వెళ్ళి,

"భీష్ముడెంత యుద్ధం చేశాడు! మన సేనను ఎండుగడ్డిని దహించినట్టు ధ్వంసం చేశాడు గదా! భీష్ముణ్ణి జయించటం ఎవరివల్ల అవుతుంది? ఆయనను ఎదిరించటం నాదే బుద్ధి తక్కువ. కృష్ణా, అరణ్యాలకు పోయి సుఖంగా బతుకుతాను. ఈ రాజులందరికీ చావు తప్పించిన వాణ్ణి అవుతాను. రాజ్యకాంక్ష నన్ను దుస్థితికి తెచ్చింది. నా తమ్ములందరూ గాయపడ్డారు. బతికి ఉన్నంత కాలమూ తపస్సు చేసుకుంటాను. నాకు కర్తవ్యం ఏమిటో వెంటనే చెప్పు. యుద్ధంలో అర్జునుడు తటస్థంగా ఉంటున్నాడు. భీముడొక్కడే తెగబడి యుద్ధం చేస్తున్నాడు. భీష్ముడి చేతిలో మా కందరికీ చావు రాసిపెట్టి ఉన్నది," అని శోకంలో మతి చెడి మాట్లాడాడు.

కృష్ణుడు ధర్మరాజును ఓదార్చుతూ, "నువు ఇలా దిగులు పడటం భావ్యం కాదు. నీ తమ్ములు త్రిలోక శూరులు. సాత్యకీ, విరాటుడూ, ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ లాంటి మహారథులు అనేక మంది నీకు అండగా ఉన్నారు. నీకు విచారం దేనికి? శిఖండి భీష్ముణ్ణి చంపటానికి పుట్టినవాడే గద!" అన్నాడు.

అప్పుడు ధర్మరాజు ధృష్టద్యుమ్నుడితో, "నిన్ను సేనాపతిగా చేయమని కృష్ణుడు



మమ్మల్ని ఆదేశించాడు. అందుచేత నువ్వు కౌరవ సేనలను సంహరించాలి. నీ వెనక మేమంతా ఉంటాము," అన్నాడు.

దానికి ధృష్టద్యుమ్నుడు, "రాజా, నేను ద్రోణుణ్ణి చంపటానికి పుట్టిన వాణ్ణి. భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ, శల్యుణ్ణీ, మిగిలిన అందరు యోధులనూ నేను ఎదుర్కొంటాను," అన్నాడు.

"క్రౌంచవ్యూహం శత్రువులను నాశనం చేస్తుందట. దేవాసుర యుద్ధమప్పుడు ఇంద్రుడికి బృహస్పతి ఆ వ్యూహం చెప్పాడట. అది అందరికీ తెలియదు. రేపు మన సేనను క్రౌంచవ్యూహంలో నిలబెట్టు," అన్నాడు ధర్మరాజు.

మర్నాడు తెల్లవారింది. రెండో రోజు యుద్ధానికి పాండవసేన క్రౌంచవ్యూహంలో నిర్మించబడింది. దానికి ముందు ఈ రోజు అర్జునుడు నిలిచాడు. ఈ వ్యూహానికి తల వద్ద ద్రుపదుడు తన సేనలతో నిలిచాడు. ధర్మరాజు తోకవద్దా భీమ ధృష్టద్యుమ్నులు రెక్కల స్థానంలోనూ ఉన్నారు. సూర్యోదయం కాక పూర్వమే వ్యూహం తయారై, యుద్ధానికి సిద్ధమయింది.

పాండవ సేన క్రౌంచవ్యూహంలో ఉండటం చూసి, భీష్మ ద్రోణులూ, దుర్యోధనాదులూ కలిసి తమ సేనకు ప్రతివ్యూహం పన్నారు. అందులో వివిధ యోధులు వేరు వేరు స్థానాలలో ఉన్నారు. ఉభయసేనలూ పెళ్ళికి పోతున్నట్టుగా మహోత్సాహంతో శంఖాలూ, భేరీలూ మోగించి, యుద్ధానికి తలపడ్డాయి.

యుద్ధం ఆరంభమవుతూనే భీష్ముడు, అభిమన్యుడూ, భీముడూ, అర్జునుడూ, విరాటుడూ, ధృష్టద్యుమ్నుడూ మొదలైన పాండవ పక్ష యోధుల మీద బాణ వర్షం కురిపించాడు. పాండవవ్యూహం చెదిరిపోసాగింది. అర్జునుడు మండిపడి, తన రథాన్ని భీష్ముడి కేసి నడపమని కృష్ణుడితో చెప్పాడు. అతను భీష్ముణ్ణి చంప నిశ్చయించాడు. కపిధ్వజమూ, అనేక పతాకలూ కలిగిన అర్జునుడి రథం భీష్ముడి కేసి

పోతూంటే, దారిలో అంతులేని కౌరవ సేనను అర్జునుడు చంపాడు.

అది చూసి భీష్ముడు అర్జునుడికి ఎదురు వచ్చాడు. ఆయన వెంట రక్షకులుగా సైంధవుడు మొదలైన వీరులు అనేక మంది వచ్చారు. అర్జునుడి మీద భీష్ముడితో పాటు ద్రోణుడూ, కృపుడూ, దుర్యోధనుడూ, శల్యుడూ, అశ్వత్థామా, వికర్ణుడూ కూడా బాణాలు వేశారు. బాణాల దెబ్బలు తిని కూడా చలించక అర్జునుడు తిరిగి అందరినీ తన బాణాలతో నొప్పించాడు. అర్జునుడికి సహాయంగా సాత్యకీ, విరాటుడూ, ధృష్ట ద్యుమ్నుడూ, ఉప పాండవులూ, అభి మన్యుడూ యుద్ధంలోకి వచ్చారు. ద్రోణుణ్ణి అర్జునుడి నుంచి తప్పించటానికి ద్రుప దుడు ఆయన మీదికి వెళ్ళాడు.

అప్పుడు దుర్యోధనుడు భీష్ముడి వద్దకు వెళ్ళి, "తాతా, అర్జునుడు మన సేనలను ధ్వంసం చేస్తున్నాడు. నీ మూలంగా కర్ణుడు అస్త్రం పట్టనని శపథం చేశాడు గద! అతను ఉంటే బాగుండేది, కాని లేడు గనక ఈ అర్జునుణ్ణి చంపే మార్గం నువే చూడు," అన్నాడు.

దుర్యోధనుడు ఇలా అనగానే భీష్ముడు రోతపడుతూ, "ఛీ, ఛీ! ఏం క్షత్రియ ధర్మం!" అని అర్జునుడి రథాన్ని సమీ పించాడు. వెంటనే భీష్ముడికి అండగా



కౌరవ వీరులూ, అర్జునుడికి అండగా పాండవ వీరులూ కూడారు. భీష్మార్జునుల మధ్య యుద్ధం ఆరంభమయింది. ఇద్దరూ మంచి యుద్ధోత్సాహంలో ఉన్నారు; ఒకరి బాణాల నుంచి మరొకరు తనను తాను కాపాడు కుంటూ ఇద్దరూ సమంగా యుద్ధం చేశారు. ఈ యుద్ధంలో ఇద్దరి రథాలూ, గుర్రాలూ, సారథులూ గాయపడ్డారు. కృష్ణుడికి మూడు బాణాలు తగిలి రక్తం కారసాగింది. భీష్ముడు చేసిన ఈ పనికి ఆగ్రహించి అర్జుడు భీష్ముడి సారథిని కూడా మూడు బాణాలతో కొట్టాడు. ఆ యుద్ధంలో భీష్ముడు అర్జునుణ్ణిగాని, అర్జునుడు భీష్ముణ్ణిగాని జయించ లేదు.

ఈ సమయంలో ఇతర ద్వంద్వ యుద్ధాలు సాగాయి. ద్రోణుడికీ, ధృష్టద్యుమ్నుడికీ ఘోరమైన యుద్ధం జరిగింది. ధృష్ట ద్యుమ్నుడి విజృంభణ చూసి పాండవ వీరులు ఉత్సాహంతో సింహనాదాలు చేశారు. కాని చివరకు ధృష్టద్యుమ్నుడు తన బాణాన్నీ, రథాన్నీ పోగొట్టుకుని, కవచం తూట్లుపడి, ద్రోణుడి బాణాల తాకిడికి గురి అవుతూ ఉన్నస్థితిలో భీముడు సింహనాదం చేస్తూ వచ్చి అతన్ని కాపాడి, ద్రోణుడితో యుద్ధం ఆరంభించాడు.

దుర్యోధనుడు భీముడి పైకి కాళింగుణ్ణీ, అతని సేననూ పంపాడు. ద్రోణుడు భీముణ్ణి వదిలి, విరాట ద్రుపదులతో యుద్ధం చేయ బోయాడు. ధృష్టద్యుమ్నుడు ధర్మరాజు వద్దకు మరొక రథంలో వెళ్ళాడు. భీముడు తనపైకి వచ్చిన కాళింగుడి సేనలతో పోరాడి, కాళింగుడి కొడుకులైన శక్రదేవుణ్ణీ, భాను మంతుణ్ణీ, శ్రుతాయుష డనే కాళింగుణ్ణీ చంపి, కాళింగుడి సేనమధ్యపడి భీభత్సంగా చంపసాగాడు. అది చూసి ధృష్ట ద్యుమ్నుడు ఉత్సాహం పొంది, సింహ నాదం చేసి, భీముడికి సహాయంగా వచ్చాడు. ఆ సమయంలో భీముడు యముడి లాగా ఉన్నాడు గాని మనిషిలాగా లేడు.

సేనలలో కోలాహలం విని భీష్ముడు వేగంగా అక్కడికి వచ్చాడు. ఆయన మీద సాత్యకీ, భీముడూ, ధృష్టద్యుమ్నుడూ కలియబడ్డారు. భీష్ముడు ముగ్గురితోనూ తీవ్రంగా యుద్ధం చేశాడు, భీముడి రథాశ్వాలు చచ్చాయి. భీముణ్ణి ధృష్ట ద్యుమ్నుడు తన రథం మీద ఎక్కించు కుని అవతలికి తీసుకు పోవలసి వచ్చింది. భీముడికి సంతోషం కలగ గలందులకు సాత్యకి భీష్ముడి సారథిని తన బాణాలతో చంపేశాడు. గుర్రాలు భీష్ముడి రథాన్ని ఎటో ఈడ్చుకుపోయాయి. తరవాత సాత్యకి భీముడి వద్దకు వచ్చి, అతని భుజం తట్టి, "ఆహా, భీమసేనా! ఏమి నీ ప్రతాపం! కాళింగుణ్ణీ, అతని కొడుకులనూ నువు ఒక్కడివే చంపావు గద!" అంటూ కౌగలించుకుని ప్రోత్సహించాడు.






యుద్ధం రెండో రోజు, మధ్యాన్నం దాటినాక, కౌరవ యోధులైన అశ్వత్థామా, కృపుడూ, శల్యుడూ పాండవ యోధులైన ధృష్టద్యుమ్న, అభిమన్యులతో యుద్ధం చేశారు. తరవాత, దుర్యోధనుడి కొడుకైన లక్ష్మణుడికీ, అభిమన్యుడికీ మధ్య తీవ్రమైన ద్వంద్వయుద్ధం జరిగింది. అందులో లక్ష్మణుడు ఓడిపోతూ ఉండటం చూసి దుర్యోధనుడూ, ఇంకా అనేక మంది కౌరవయోధులూ వెళ్ళి అభిమన్యుణ్ణి చుట్టుముట్టారు.

అభిమన్యుడు నిర్భయంగా అందరితోనూ పోరుతూ ఉండగా, అతనికి అండగా అర్జునుడు వచ్చాడు. అది చూసి భీష్మద్రోణులు మొదలైన మహారథులు అటునుంచి వచ్చారు. అర్జునుణ్ణి ఆ సమయంలో ఎదుర్కోవటం ఎవరి వల్లా కాలేదు. అతను ప్రళయకాల రుద్రుడిలాగా కౌరవసేనలను చించి చెండాడుతుంటే, చచ్చినవారు చావగా, మిగిలినవారు పారిపోసాగారు.

భీష్ముడు ద్రోణుడితో, "అర్జునుడు ఇలా యుద్ధం చేసేటప్పుడు అతని ముందు ఎవరూ నిలవలేరు. పారిపోయే మన సైన్యాన్ని వెనక్కు తిప్పటం సాధ్యంకాదు. అదీగాక సూర్యుడు అస్తమించబోతున్నాడు. ఇవాళకు యుద్ధం ముగించటం మేలని పిస్తుంది," అన్నాడు.

మూడో రోజు ఉదయం కౌరవసేనలు గరుడవ్యూహంలోనూ, పాండవ సేనలు అర్ధచంద్రవ్యూహంలోనూ యుద్ధానికి సిద్ధ

55. పాండవుల విజృంభణ



మయాయి. యుద్ధం ఆరంభ మవుతూనే దుర్యోధనుడు రథబలాలను వెంట బెట్టుకుని ఘటోత్కచుణ్ణి ఎదుర్కొన్నాడు. పాండవులు భీష్మ ద్రోణులను ఎదుర్కొన్నారు. అభిమన్యుడూ, సాత్యకీ శకునిని ఎదుర్కొన్నారు. అర్జునుడు రథ యోధులను విపరీతంగా వధచెయ్య సాగాడు. అదే విధంగా భీష్మ ద్రోణులు పాండవ సేనలను నిర్మూలించ సాగారు. అయితే భీముడూ, ఘటోత్కచుడూ కలిసి కౌరవ సేనను తరమసాగారు. ఆ సేనను మళ్ళించటం భీష్మ ద్రోణుల తరం కాలేదు. ఆ పని దుర్యోధనుడు చెయ్యగలిగాడు. దుర్యోధనుడి సేనలు మరలటం చూసి, పారిపోయే ఇతర సేనలు సిగ్గుపడి తాముకూడా మరలి యుద్ధానికి వచ్చాయి.

దుర్యోధనుడు భీష్ముడి వద్దకు వచ్చి నిష్ఠురంగా, "తాతా, నువు యుద్ధరంగంలో ఉండగానే మన సేనలు చెదరి పారిపోవటం నీ కెంత అవమానం? నీకు పాండవుల పట్ల అంత దయ ఉన్నట్టయితే, యుద్ధానికి ముందే, 'నేను పాండవులతోనూ, సాత్యకితోనూ, ధృష్టద్యుమ్నుడితోనూ యుద్ధం చెయ్యను,' అని చెప్పి ఉండవలిసింది. మీ రందరూ మీ పరాక్రమాలకు తగినట్టుగా యుద్ధం చెయ్యకపోతే నేనేమయిపోతాను?" అన్నాడు.

భీష్ముడు కోపంతోనే నవ్వుతూ, "ఏమోయ్, నీకు ఎన్నిసార్లు చెప్పాను? పాండవులను జయించటం దేవేంద్రుడికీ, దేవతలకూ కూడా సాధ్యం కాదని నేను నీతో అనలేదా? ముసలివాణ్ణి. నా శక్తికొద్దీ పోరాడుతూనే ఉన్నాను. నేను ఎలా పోరాడేదీ నువ్వూ, నీ వాళ్ళూ చూడండి," అన్నాడు.

పాండవులది యుద్ధంలో పై చెయ్యి అవుతూ ఉండటం చూసి భీష్ముడు మహా భీభత్సమైన యుద్ధానికి పూనుకున్నాడు. దుర్యోధనుడి సేన అంతా ఆయన వెంట ఉన్నది. ఆ పూట భీష్ముడి ఎదటపడి దెబ్బ తిననివాడు లేదు. పాండవ సైన్యం వెయ్యి చీలికలయింది. కృష్ణార్జునులు

చూస్తూ ఉండిపోయారే గాని భీష్ముణ్ణి నిరోధించలేకపోయారు.

బెదిరిన గొర్లలాగా పారిపోయే సైనికులను చూసి కృష్ణుడు అర్జునుడితో, "అర్జునా, నీ ప్రతాపం ఇప్పుడు చూపించు. ఎదట పడిన కౌరవుల నందరినీ చంపేస్తానని మొదట మాట ఇచ్చావు. భీష్ముణ్ణి చూసి యోధులందరూ మృత్యువును చూసినట్టు బెదిరిపోతున్నారు," అన్నాడు.

"కృష్ణా. రథాన్ని భీష్ముడి కెదురు నడిపించు. ఆ ముసలివాడి అంతు తేల్చుతాను," అన్నాడు అర్జునుడు. కృష్ణుడు అలాగే చేశాడు.

భీష్ముడు ఎదురుకాగానే అర్జునుడు ఆయన చేతి విల్లును తన బాణంతో విరగగొట్టేశాడు. భీష్ముడు అర్జునుణ్ణి మెచ్చుకుంటూ, మరొక విల్లు తీసుకుని, తనతో యుద్ధం చెయ్యమన్నాడు. ఇద్దరూ యుద్ధం చేస్తుంటే కృష్ణుడికి అర్జునుడు పట్టుదలగా యుద్ధం చేస్తున్నట్టు తోచలేదు. "ఈ అర్జునుడు భీష్ముడి పట్ల ఇంత గౌరవం చూపితే ధర్మరాజు సేన నశించటానికి ఎంతో కాలం పట్టదు. నేనే కవచం ధరించి, భీష్ముణ్ణి చంపి, పాండవుల కార్యం నెరవేర్చాలి," అనుకున్నాడతను.

ఈ లోపల అర్జునుడి మీదికి కొన్ని వందల మంది కౌరవ వీరులు వచ్చి, అతన్ని చుట్టు ముట్టారు. ఆ స్థితిలో సాత్యకి అర్జునుడికి అండగా వచ్చాడు. అతను పారిపోయే వారిని నిలవమని హెచ్చ





రించాడు. కృష్ణుడు సాత్యకితో, ''సాత్యకీ, పొయ్యేవాళ్ళను పోనీ, మిగిలినవారిని కూడా పారిపోనీ. ఈ భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, మిగిలిన కౌరవ యోధులనూ నా చక్రాయుధంతో చంపి, ధర్మరాజుకు పట్టం గట్టుతాను,'' అన్నాడు.

ఇలా అని కృష్ణుడు తన చక్రాయుధాన్ని భుజాన పెట్టుకుని, పగ్గాలను విడిచిపెట్టి, నేలమీదికి దూకాడు. చక్రం పట్టుకుని తన పైకి వచ్చే కృష్ణుడితో భీష్ముడు శాంతంగా, ''రా, నీ చేతిలో చావటం వల్ల నాకు కీర్తీ, గౌరవమూ లభిస్తాయి,'' అన్నాడు.

కృష్ణుడు భీష్ముడి వద్దకు వచ్చి, ''ఈ ప్రజాక్షయానికి మూలకారణం నువే! మాయజూదం ఆడేటప్పుడు దుర్యోధనుణ్ణి నివారించలేకపోయావు గాని, ఇప్పుడు అతణ్ణి రక్షించటానికి బయలుదేరావు! ఆ కులద్రోహి నీ మాట ఒకవేళ విని ఉండకపోతే వాణ్ణి ఎందుకు వదిలిపెట్టావు కావు?'' అని అడిగాడు.

''రాజు పరమ దైవం కదా?'' అన్నాడు భీష్ముడు.

''యాదవులు కంసుణ్ణి వదిలిపెట్టలేదా? విపరీత బుద్ధి గలవాడు వినాశనం చెందక తప్పుతుందా?'' అన్నాడు కృష్ణుడు.

ఇంతలో అర్జునుడు తన రథం నుంచి దిగి వచ్చి, కృష్ణుణ్ణి గట్టిగా పట్టుకున్నాడు. అతను కృష్ణుణ్ణి వేడుకుంటూ, ''శాంతించు. పాండవులకు నీ కన్న వేరే గతి ఏది? నేను చేసిన ప్రతిజ్ఞ నిలబెట్టుకుంటాను. కౌరవులనందరినీ యుద్ధంలో చంపుతానని నా బంధుమిత్రుల మీద ఒట్టు పెట్టుకుంటున్నాను,'' అన్నాడు.

ఆ మాటకు తృప్తిపడి కృష్ణుడు తిరిగి వచ్చి రథం మీద కూర్చుని, పగ్గాలు చేతబట్టి, శంఖం పూరించాడు. వెంటనే అర్జునుడు మహా దారుణమైన యుద్ధం ప్రారంభించాడు. అతనితో భీష్ముడితోబాటు భూరిశ్రవుడూ, శకునీ మొదలైన కౌరవ యోధులు యుద్ధం చేశారు. అర్జునుడి బాణాలు రథాలనూ, ఏనుగులనూ, గుర్రా

లనూ ఛేదించాయి. యోధులు తీవ్రంగా దెబ్బతిన్నారు.

త్వరలోనే విరాటుడూ, ద్రుపదుడూ మొదలైన వారు అర్జునుడికి సహాయం వచ్చారు. యుద్ధరంగమంతా పీనుగుపెంట అయింది. రక్తం ఏర్లుకట్టి పారింది. పాండవులు విజయధ్వానాలు చేశారు. అర్జునుడు ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. దానితో భీష్మ, ద్రోణులూ, దుర్యోధనుడూ మొదలైన వారు వెనక్కు తిరిగారు. కౌరవ సేనలు చెల్లాచెదురుగా పారిపోసాగాయి. ఆ రోజు అర్జునుడు కౌరవయోధులకు గొప్ప అపకీర్తి కలిగించాడు. ధర్మరాజు యుద్ధం ముగించి తమ శిబిరానికి వెళ్ళిపోయాడు.

నాలుగో రోజు తెల్లవారగానే కౌరవ సర్వసేనాధిపతి అయిన భీష్ముడు చాలా కోపంతో యుద్ధానికి సిద్ధమయాడు. ఆయన వెంట ద్రోణ, దుర్యోధన, బాహ్లికులు మొదలైన వీరులు బయలుదేరారు. ఆ రోజు పాండవసేనకు ముందు అర్జునుడు నిలబడ్డాడు.

యుద్ధం ఆరంభమవుతూనే భీష్ముడూ, అర్జునుడూ ఒకరినొకరు ఎదుర్కొన్నారు. ద్రోణుడూ, కృపుడూ, శల్యుడూ, వివింశతి, దుర్యోధనుడూ, మరికొందరు కూడా అర్జునుడి పైకి వచ్చారు. అలా వచ్చిన కౌరవ వీరులను అభిమన్యుడు ఎదుర్కొన్నాడు.



అర్జున, అభిమన్యులకు ధృష్టద్యుమ్నుడు తోడు వచ్చి, అనంతరం జరిగిన యుద్ధంలో సాంయమని అనే యోధుడి కొడుకును చంపాడు.

అప్పుడు ధృష్టద్యుమ్నుడి మీదికి శల్యుడు వచ్చాడు. ఇద్దరూ రెండు గడియల పాటు సమ యుద్ధం చేశారు. ఇంతలో శల్యుడి పైకి అభిమన్యుడు వచ్చిపడ్డాడు. శల్యుణ్ణి రక్షించటానికి వచ్చిన దుర్యోధన, దుశ్శాసన, దుర్మర్షణ, దుస్సహ, దుర్ముఖ, చిత్రసేనాదులు అభిమన్యుణ్ణి చుట్టుముట్టారు. అప్పుడు భీముడూ, ధృష్టద్యుమ్నుడూ, ఉప పాండవులూ, నకుల సహదేవులూ, అభిమన్యుడూ,



వీళ్ళు పదిమందీ దుర్యోధనాదులు పది మందితో యుద్ధం చేశారు.

ఆ యుద్ధంలో భీముడు గద పట్టుకుని శల్యుడి మీదికి బయలుదేరాడు. అది చూసి దుర్యోధనుడు ఏనుగుల సేనను ముందుంచుకుని భీముణ్ణి ఎదుర్కొన్నాడు. భీముడు గర్జిస్తూ, గదతో సహా రథం నుంచి దిగి, ఏనుగులను ఎడాపెడా చంపనారంభించాడు. మిగిలిన తొమ్మిదిమంది పాండవ యోధులూ వెనకనుంచి అతన్ని కాపాడారు. ఆ యుద్ధంలో అనేక ఏనుగులూ, గజ యోధులూ చావటం జరిగింది. ఆ సేన మాగధుడిది. అందుచేత మాగధుడు ఐరావతం లాటి గొప్ప ఏనుగును ఎక్కి, దాన్ని అభిమన్యుడి రథం మీదికి పురిగొల్పాడు. అభిమన్యుడు ఆ ఏనుగునూ, మాగధుణ్ణీ కూడా బాణాలతో కొట్టి చంపేశాడు. ఆ తరవాత భీముడి పీడనకు తట్టుకోలేక అనేక ఏనుగులు వెనక్కు తిరిగి కౌరవ సైనికులనే తొక్కుతూ పారిపోయాయి. భీముణ్ణి చంపటానికి వచ్చిన కౌరవ వీరులకూ, భీముణ్ణి కాపాడుతున్న పాండవ వీరులకూ మధ్య తీవ్రంగా యుద్ధం జరిగింది.

పాండవ వీరులలో విజృంభించి యుద్ధం చేసి అందరినీ పీడించినవాడు సాత్యకి. అతని దెబ్బకు ఎవరూ తట్టుకోలేకుండా ఉన్న స్థితిలో భూరిశ్రవుడు అతనితో యుద్ధానికి తలపడ్డాడు. కాని సాత్యకి ఆయనను పారదోలాడు.

అప్పుడు ఉభయ పక్షాల యోధులకూ జరిగిన యుద్ధంలో భీముడు ప్రముఖంగా పోరాడుతూ ధృతరాష్ట్రుడి కొడుకులను, సుషేణుడూ, జలసంధుడూ, వీరబాహుడూ, భీమరథుడూ, సులోచనుడూ అనేవారిని వరసగా చంపాడు.

భీష్ముడిది చూసి, భీముణ్ణి ముట్టడించమని తన మహారథులను ఆదేశించాడు. వారిలో భగదత్తుడు, నరకాసురుడి కొడుకు, ఒక మదగజాన్ని ఎక్కి, భీముడి పైకి వచ్చాడు. అభిమన్యుడు మొదలైనవాళ్ళు భగదత్తుడి మీదా, అతని ఏనుగు మీదా

బాణవర్షం కురిపించి, బాధించారు. భగదత్తుడు ఆ గాయపడిన ఏనుగును పాండవ సేనలపైకి పురికొల్పాడు. ఇంతేగాక భగదత్తుడు భీముణ్ణి ఒక బాణంతో మూర్ఛపోగొట్టి సింహనాదం చేశాడు.

అది చూసి ఘటోత్కచుడు కోపావేశం చెంది, మరొక మదగజం మీద వచ్చి, భగదత్తుడిపై కలియబడ్డాడు. వాళ్ళ యుద్ధం దారుణంగా పరిణమించింది. అందులో భగదత్తుడు చస్తాడని శంకించి, మహారథుడూ, సేనాపతీ అయిన భగదత్తుణ్ణి కాపాడుకోవటానికి ద్రోణుడూ, దుర్యోధనుడు మొదలైన వారు సహాయం వెళ్ళారు. వెంటనే ఘటోత్కచుడికి సహాయంగా పాండవయోధులు వచ్చారు.

ఘటోత్కచుడి యుద్ధం చూసి భీష్ముడికి అసహ్యం వేసింది. ఆయన ద్రోణుడితో, "ఈ ఘటోత్కచుడు విజృంభించి ఉన్నాడు. వాడికి సహాయం కూడా బలంగా ఉన్నది. మనం అలసి ఉన్నాం. అందుచేత ఇవాళకు యుద్ధం చాలింతాం," అన్నాడు.

ఈ మాట అందరికీ నచ్చింది. అందరూ ఉపాయంగా ఘటోత్కచుడి యుద్ధం నుంచి బయటపడి, యుద్ధరంగం నుంచి వెళ్ళిపోసాగారు. అప్పుడు పాండవులు శంఖాలు పూరించి, సింహనాదాలు చేసి, భీముణ్ణీ, ఘటోత్కచుణ్ణీ పొగడుతూ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు. ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళిన అనంతరం దుర్యోధనుడు తన తమ్ములు పోయినందుకు కొంతసేపు దుఃఖించి, తరవాత తన శిబిర కృత్యాలు నిర్వర్తించి, ఆలోచనలో పడ్డాడు.

ఈ వార్తలన్నీ సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు, "సంజయా, పాండవులను తలుచుకుంటే నాకు భయంగా ఉన్నది. ఏం జరుగుతుందో తెలియటం లేదు. విదురుడు చెప్పినట్టే జరుగుతుందో ఏమో? ఎలాగైనా పాండవులు చచ్చేటందుకూ, నా కొడుకులు బతికేటందుకూ మార్గం ఉంటే చెప్పు. పాండవులు ఏదో వరం పొంది ఉంటారు. దేవుడు నన్ను క్రూరంగా శిక్షిస్తున్నాడు," అన్నాడు.






# మహాభారతం

పాండవులను గురించి ధృతరాష్ట్రుడు అన్న మాటకు సంజయుడు, "రాజా, పాండవుల వద్ద మంత్రాలూ, మాయలూ ఏమీ లేవు. వాళ్ళు యుద్ధంలో తమ శక్తి చూపుతున్నారు. వాళ్ళ ధర్మమే వాళ్ళకు యుద్ధంలో జయం కలిగిస్తున్నది. నీ కొడుకులు చేసిన దుష్కర్మలు విషవృక్షమై వారిని నాశనం చేస్తున్నాయి. నీకు ఎంత మంది హితం చెప్పలేదు? నువు మాత్రం విన్నావా? విదురుడూ, భీష్మ ద్రోణులూ, నేనూ ఎంతో చెప్పాం. నీ కవి ఏ మాత్రమూ రుచించలేదు. ఇప్పుడు నువు నన్నడిగినట్టే, శిబిరంలో రాత్రివేళ దుర్యోధనుడు భీష్ముణ్ణి కూడా అడిగాడు," అంటూ జరిగినదంతా తెలిపాడు.

"తాతా, నువ్వూ, ద్రోణుడూ, కృపుడూ, ఇతర మహారథులూ నా కోసం ప్రాణాలొడ్డి పోరుతున్నా కూడా పాండవుల ముందు నిలవలేకుండా ఉన్నారు. అందుకు కారణం ఏమిటి?" అని దుర్యోధనుడు భీష్ముణ్ణి అడిగాడు.

దానికి భీష్ముడు, "నాయనా, నీకు చాలా సార్లు చెప్పాను, మళ్ళా చెబుతున్నాను. పాండవులతో సంధి చేసుకో. నువ్వూ, నీ తమ్ములూ సుఖంగా ఉండండి. కృష్ణుడు పాండవులకు అండగా ఉండగా వారి నెవరూ చంపలేరు," అని అతనికి విశ్వోపాఖ్యానం ఇలా చెప్పాడు:

ఒకసారి బ్రహ్మదేవుడు గంధమాదన పర్వతం మీద కూర్చుని ఉండగా దేవ

56. భీముడి విజృంభణ



తలూ, ఋషులూ వచ్చి ఆయన చుట్టూ చేరారు. ఆ సమయంలో ఆకాశంలో కాంతి వంతమైన విమానం ఒకటి వారికి కనిపించింది. బ్రహ్మ దాన్ని చూసి చేతులు జోడించి ధ్యానించాడు. అది చూసి దేవతలూ, ఋషులూ లేచి నిలబడి నమస్కారాలు చేశారు.

బ్రహ్మ ఆ విమానాన్ని స్తుతించి, "దేవదేవా, నీ అంశను పంపి, యదువంశంలో జన్మింపజెయ్యి," అని అడిగాడు.

"నీ కోరిక గ్రహించాను. అలాగే చేస్తాను," అన్న జవాబు వినిపించింది. దేవతలూ, ఋషులూ ఆశ్చర్యపోయి చూస్తూన్నంతలో విమానం అంతర్ధానమయింది.

అప్పుడు దేవతలూ, ఋషులూ బ్రహ్మను, "పితామహా, నువు ప్రార్థించినది ఎవరిని? దేనికి ప్రార్థించావు?" అని అడిగారు.

దానికి బ్రహ్మ, "ఆయన మహావిష్ణువు. పూర్వం చచ్చిపోయిన దైత్యులూ, దానవులూ, రాక్షసులూ తిరిగి భూమి మీద జన్మించారు. వారిని చంపటానికి నరుడితో బాటు నారాయణుడు కూడా మానవుడుగా పుట్టాలి. వారివెంట దేపతులు కూడా పుట్టుతారు. వారిని ఎవరూ జయించలేరు. మూఢులు ఈ సంగతి తెలుసుకో లేరు," అన్నాడు.

భీష్ముడీ కథ చెప్పి దుర్యోధనుడితో, "నువు ఒక క్రూరరాక్షసుడివై ఉండాలి. అందుకే కృష్ణార్జునులతో వైరం పెట్టుకున్నావు." అన్నాడు. తరవాత ఎవరి శిబిరాలకు వారు వెళ్ళి నిద్రపోయారు.

యుద్ధం అయిదో రోజు తెల్లవారింది. ఉభయ సేనలూ వ్యూహాలుపన్ని యుద్ధానికి సిద్ధమయ్యాయి. కౌరవులది మకరవ్యూహం, పాండవులది డేగవ్యూహం. ఆ వ్యూహానికి ముందు భీముడూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ నిలబడ్డారు. వారికి వెనకగా సాత్యకీ, అర్జునుడూ ఉన్నారు.

దుర్యోధనుడు ద్రోణుడితో, "ఇవాళ పాండవులు చచ్చిపోయేటట్టు చూడు," అని చెప్పాడు. ఈ మాట వింటూనే ద్రోణుడు సాత్యకిని ఎదుర్కొన్నాడు. సాత్యకికి

తోడుగా భీముడూ, ద్రోణుడికి తోడుగా భీష్మ, శల్యులూ వచ్చి యుద్ధం చేశారు. భీష్మ, ద్రోణులు చేసే దారుణయుద్ధాన్ని ఎదుర్కొనేటందుకు అభిమన్యుడూ, ఉప పాండవులూ, శిఖండీ వచ్చారు. శిఖండితో భీష్ముడు యుద్ధం చెయ్యలేదు. ద్రోణుడు శిఖండిని భయంకరంగా ఎదుర్కొనే సరికి, శిఖండి నిలవలేక తప్పుకుని వెళ్ళాడు. అప్పుడు పాండవుల వెంట అర్జునుడు వచ్చి భీష్ముడి పై తలపడ్డాడు. ఇద్దరూ పట్టుదలతో యుద్ధం చేశారు. అదే సమయంలో ఉభయ పక్షాల వీరులూ విజృంభించి యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో సేనలు అపారంగా నష్టమయాయి.



ఈ అయిదో రోజు యుద్ధంలో ముఖ్యంగా చెప్పుకోదగిన ఘట్టాలేవంటే: అశ్వత్థామకూ అర్జునుడికీ జరిగిన యుద్ధంలో అర్జునుడు అశ్వత్థామ ధరించిన కవచాన్ని తన బాణాలతో ఛేదించాడు. దాన్ని అశ్వత్థామ లక్ష్యపెట్టక సాహసంతో పోరసాగాడు, కాని అర్జునుడు అశ్వత్థామ గురుపుత్రుడని అతన్ని వదిలేసి ఇతర శత్రువులను వెతుక్కుంటూ వెళ్లాడు. దుర్యోధనుడికీ భీముడికీ ఈ రోజు గొప్ప యుద్ధం జరిగింది. అభిమన్యుడు లక్ష్మణ కుమారుడితో చేసిన యుద్ధంలో కృపుడు లక్ష్మణకుమారుణ్ణి రక్షించి, అవతలికి తీసుకుపోయాడు.

ఆ రోజు సాత్యకి విజృంభించి కౌరవ సేనలను భీభత్సం చేస్తూ ఉండటం చూసి దుర్యోధనుడు అతని పైకి అనేక రథాలను పంపాడు. సాత్యకి అస్త్రాలతో ఆ రథికులం దరినీ నానా తిప్పలూ పెట్టుతూ, ఆ సేనకు నాయకుడైన భూరిశ్రవుడి పైకి వచ్చాడు. భూరిశ్రవుడు గొప్పయోధుడు. ఆయన చేసే యుద్ధానికి తట్టుకోలేక, సాత్యకికి అండగా ఉన్న యోధులందరూ చెల్లా చెదరుగా పారిపోయారు. అప్పుడు సాత్యకి కొడుకులు వచ్చి, భూరిశ్రవుణ్ణి చుట్టుముట్టి, భూరిశ్రవుడి చేతిలో చావుదెబ్బలు తిన్నారు. వారు పడిపోవటం చూసి సాత్యకి కోపోద్రేకంతో భూరిశ్రవుడితో ద్వంద్వయుద్ధం



సాగించాడు. ఇద్దరి రథాలూ ధ్వంసమయాయి. వారు కత్తులు తీసుకుని నేలపై నిలబడ్డారు. ఆ సమయంలో భీముడు వచ్చి సాత్యకిని తన రథంలోకి తీసుకున్నాడు. అలాగే భూరిశ్రవుణ్ణి దుర్యోధనుడు తన రథంలో తీసుకుపోయాడు.

సూర్యాస్తమయం అయే సమయానికి రెండుపక్షాల సేనలూ అలిసిపోయి, యుద్ధం సాగించలేక, తమ తమ శిబిరాలకు వెళ్ళిపోయాయి.

ఆరో రోజు తెల్లవారగానే మళ్ళీ యుద్ధం ప్రారంభమయింది. పాండవ సేనలు మకర వ్యూహమూ, కౌరవ సేనలు క్రౌంచ వ్యూహమూ ధరించాయి. కాని ఈ వ్యూహాలు భగ్నం కావటానికి ఎంతోసేపు పట్టలేదు. ఆరంభంలోనే భీముడికీ, ద్రోణుడికీ పడింది. ద్రోణుడు భీముణ్ణి బాణాలతో తీవ్రంగా కొట్టాడు. భీముడు మండిపడి ద్రోణుడి సారథిని చంపాడు. ద్రోణుడు తన రథాన్ని తానే నడుపుకుంటూ యుద్ధం చేసి, పాండవ సేనలను చిందరవందర చేసేశాడు. ఇందులో భీష్ముడు ద్రోణుడికి తోడయాడు. అదే విధంగా భీమార్జునులు కౌరవసేనా వ్యూహాన్ని ఛిన్నాభిన్నం చేశారు. యుద్ధం దొమ్మి యుద్ధంగా పరిణమించింది.

భీముడు భీష్ముణ్ణి లెక్కచెయ్యక, ధృతరాష్ట్రుడి కొడుకులను చంపే నిశ్చయంతో కౌరవసేన ప్రవేశించాడు. వాళ్ళు అతన్ని ప్రాణాలతో పట్టుకోవాలనుకుని చుట్టుముట్టారు. భీము డది గమనించి, గద తీసుకుని రథం నుంచి కిందికి దూకి తన చుట్టూ ఉన్న కౌరవసేనను నిర్మూలించసాగాడు.

ద్రోణుడితో యుద్ధం చేస్తున్న ధృష్టద్యుమ్నుడు దూరంగా ఉన్న భీముడి రథం చూసి, ద్రోణుణ్ణి విడిచి భీముడి రథాన్ని చేరవచ్చి, రథం ఖాళీగా ఉండటం చూసి, సారథిని, "భీముడేమయాడు?" అని అడిగాడు.

దానికి సారథి విశోకుడు, "రాజా, నన్ను రెండు గడియలు ఇక్కడే ఉండమని

భీముడు కౌరవసైన్యంలో జొరబడ్డాడు," అన్నాడు. భీముడికి అపాయం కలుగుతుందని శంకించి ధృష్టద్యుమ్నుడు తాను కూడా అతని మార్గానే బయలుదేరాడు. కొంత దూరం వెళ్ళేసరికి, భీముడు దారిలో అడ్డమైన ఏనుగులనూ, సైనికులనూ చంపుతూ ధృష్టద్యుమ్నుడికి కనిపించాడు. అంతలోనే కౌరవయోధులు భీముణ్ణి చుట్టుముట్టి, అతని మీద బాణవర్షం కురిపించారు. ధృష్టద్యుమ్నుడు వచ్చి చేరేసరికి, భీముడు ఒళ్ళంతా నెత్తుర్లు కారుతూ కూడా మృత్యుదేవతలాగా కనిపించాడు. ధృష్టద్యుమ్నుడు అతన్ని తన రథం మీద ఎక్కించుకుని, అతని శరీరంలో గుచ్చుకున్న బాణాలన్నీ పెరికి, కౌగలించుకున్నాడు.

ఈ లోపల ధృతరాష్ట్రుడి కొడుకులు భీముణ్ణీ, ధృష్టద్యుమ్నుణ్ణీ కూడా ఒకే దెబ్బతో చంపెయ్యాలని వచ్చిపడ్డారు. వారి బాణాల వర్షంలో మునిగి కూడా ధృష్టద్యుమ్నుడు చలించక, వారినందరినీ సమ్మోహనాస్త్రంతో మూర్ఛపోగొట్టాడు. అంతలో ద్రోణుడు వచ్చి ప్రజ్ఞాస్త్రం ప్రయోగించి, మూర్ఛపోయిన వారందరినీ లేపగొట్టాడు.

ఇంతలో ధర్మరాజు, భీమ, ధృష్టద్యుమ్నులు ఏమైనదీ తెలియక, అభిమన్యుడు మొదలైన పన్నెండు మంది యోధులను పంపాడు. వారిని చూడగానే భీమ, ధృష్టద్యుమ్నులు మరింత ఉత్సాహంగా యుద్ధం చెయ్యసాగారు. అంతలో





ధృష్టద్యుమ్నుడికి, తన తండ్రి ద్రుపదుడు ద్రోణుడి దెబ్బకు తట్టుకోలేక పారిపోవటం కనిపించింది. అతను ద్రోణుడితో తలపడి, తన రథాన్నీ, సారథినీ కోల్పోయి, వేగంగా అభిమన్యుడి రథం ఎక్కాడు. ద్రోణుడు పాండవ సేనలను అల్లకల్లోలం చేస్తుంటే భీముడూ, ధృష్టద్యుమ్నుడూ ఏమీ చేయ లేక పోయారు. ద్రోణుడి పరాక్రమాన్ని ఉభయ సేనలూ మెచ్చుకున్నాయి.

భీముణ్ణి పట్టుకునే ఆలోచన దుర్యోధ నాదులకు మళ్ళీవచ్చింది. కాని, ధర్మరాజు పంపిన అభిమన్యుడు మొదలైనవారు వాళ్ళను తరిమేశారు. భీముడు మాత్రం ఆ దుర్యోధనాదులు తనకు అందుబాటు లోకి వచ్చి కూడా, ప్రాణాలతో తప్పించుకు పోయినందుకు కలతపడ్డాడు.

యుద్ధరంగందక్షిణపార్శ్వంలో అర్జునుడు విజృభించి అంతులేని శత్రుసేనలను నిర్మూ లించాడు.

సూర్యుడు పడమటికి దిగుతూ ఉండగా దుర్యోధనుడికి భీముణ్ణి చంపాలని తీవ్ర మైన కోరిక పుట్టింది. అతను భీముణ్ణి ఎదుర్కొని, భీముడి చేత తన గొడుగూ, ధ్వజమూ విరగ గొట్టించుకుని, చివరకు చావుదెబ్బలు తిని, కృపుడి రథంలో విశ్రాంతి తీసుకున్నాడు. అప్పుడు ధృష్ట కేతువూ, అభిమన్యుడూ, ఉపపాండవులూ, కేకయులూ ధృతరాష్ట్రుడి కొడుకుల మీద యుద్ధం సాగించారు. ఉభయపక్ష వీరుల మధ్య జరిగిన యుద్ధంలో దుష్కర్ణుడు అనేవాడు చచ్చాడు.

కొంత సేపటికి సూర్యుడు అస్త మించాడు. రెండు సేనలూ శాంతించాయి. యుద్ధం చాలించి దుర్యోధనుడు తమ శిబి రానికి తిరిగి వెళ్ళాడు. ధర్మరాజు భీముణ్ణీ, ధృష్టద్యుమ్నుణ్ణీ సంతోషంతో కౌగలించుకుని తానుకూడా తమ శిబిరానికి తిరిగి వెళ్ళాడు.

కొంత విశ్రాంతి తీసుకున్న తరవాత దుర్యోధనుడు భీష్ముడితో, "తాతా, మనం ఎంత అభేద్యమైన వ్యూహాలను పన్నినా

పాండవులు వాటిని భగ్నంచేసి, విజృంభిస్తున్నారు. భీముడు ఇవాళ మన క్రౌంచ వ్యూహంలో చొరబడి, నన్ను చాలా పీడించాడు. వాడి భయంకరాకారం చూసి నేను మూర్ఛపోయాను. నా మనసు అందోళన పడుతున్నది. నీ అనుగ్రహంతో పాండవులను చంపి, జయం పొందుదామని నా ఆశ," అన్నాడు.

దానికి భీష్ముడు, "నాయనా, నీకు జయం కలగాలని నేను శాయశక్తులా పాటుపడుతున్నాను. ఏ మాత్రమూ ఒళ్ళు దాచుకోవటం లేదు. పాండవుల పక్షాన పోరుతున్నవాళ్ళు శూరులూ, మహారథులూ, అస్త్రవేత్తలూనూ. అన్నిటికీ తెగించి పోరాడుతున్న ఆ వీరులను సులభంగా జయించటం సాధ్యపడదు. నేను నా ప్రాణాలను లక్ష్యపెట్టకుండా నీ కోసం యుద్ధం చేస్తున్నాను. నీ కోసం అవసరమైతే మూడు లోకాలనూ భస్మం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను. ఎలాంటి విచారమూ పెట్టుకోకు," అన్నాడు.

ఈ మాట విని దుర్యోధనుడు చాలా సంతోషించాడు.

భీష్ముడు కొంచెం ఆలోచించి, దుర్యోధనుడితో మళ్ళీ ఇలా అన్నాడు:

"నీ కోసం పోరాడటానికి ఉత్సాహపడుతున్నవారిలో నేనుగాక, ద్రోణుడూ, శల్యుడూ, కృతవర్మా, అశ్వత్థామా, సోమదత్తుడూ, సైంధవుడూ, విందానువిందులూ, బాహ్లికుడూ, బృహద్బలుడూ, చిత్రసేనుడూ, వివింశతి మొదలైన మహావీరులూ, అనేక వేల రథయోధులూ, గజ, అశ్వ బలాలూ సిద్ధంగా ఉన్నాయి. వీరందరూ దేవతలనైనా జయించ గలవాళ్ళే. అయితే, నీ హితం కోరి ఒకమాట చెప్పాలి; ఇంద్రుడితో దేవతలంతా కదిలివచ్చినా పాండవులను జయించలేరు. అందుచేత పాండవులే నన్ను జయిస్తారో, నేనే పాండవులను జయిస్తానో చెప్పటం నాకు సాధ్యంకాదు."

ఈ మాటచెప్పి భీష్ముడు, దుర్యోధనుడి శరీరానికి తగిలిన గాయాలు మానటానికి విశల్యకరణి అనే మందు ఇచ్చాడు.





# మహాభారతం

యుద్ధం ఏడోరోజు తెల్లవారింది. కౌరవ సేనలను భీష్ముడు మండల వ్యూహంలో నిలబెట్టాడు. ధృతరాష్ట్రుడి కొడుకులు అనేక వేల రథాలూ, ఏనుగులూ గల సేనతో భీష్ముడికి రక్షకులుగా ఉన్నారు.

కౌరవవ్యూహాన్ని చూసి ధర్మరాజు తన సేనలను వజ్రం అనే వ్యూహంలో అమర్చాడు. యుద్ధం ఆరంభం కాగానే యోధులు ఒకరి వ్యూహాన్ని ఒకరు ఛేదించ నారంభించారు. ద్రోణుడు విరాటుడితోనూ, అశ్వత్థామ శిఖండితోనూ, దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడితోనూ, నకుల సహదేవులు తమ మేనమామ అయిన శల్యుడితోనూ, విందాను విందులు ఇరావంతుడితోనూ, అనేక మంది కౌరవ వీరులు అర్జునుడితోనూ, భీముడు కృతవర్మతోనూ, అభిమన్యుడు ధృతరాష్ట్రుడి కొడుకులైన చిత్రసేన, వికర్ణ, దుర్మర్షణులతోనూ, ఘటోత్కచుడు భగదత్తుడితోనూ, అలంబుసుడు సాత్యకితోనూ, భూరిశ్రవుడు ధృష్టకేతుడితోనూ, ధర్మరాజు శ్రుతాయువుతోనూ యుద్ధంచేశారు.

అర్జునుడితో యుద్ధం చేస్తున్న వీరులు అతని పైన బాణవర్షం కురిపించారు. అర్జునుడు మండిపడి ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్రంతో అతనికి ఎదురుగా పోరాడుతున్న వారందరూ గాయపడ్డారు. అతని బాణాలు అంతటా పడుతున్నాయి. వాటి తాకిడికి తట్టుకో లేక కౌరవవీరులు భీష్ముణ్ణి శరణుజొచ్చారు.

---

## 57. ఇరావంతుడి మరణం

---



అలా వచ్చిన వారిలో ముఖ్యుడైన సుశర్మతో దుర్యోధనుడు, "భీష్ముడు అర్జునుడితో ప్రాణాలొడ్డి పోరాడ బోతున్నాడు. మీ రందరూ ఆయనకు అండగా ఉండండి," అన్నాడు.

త్వరలోనే, కౌరవ వీరులను వెంట బెట్టుకుని భీష్ముడు అర్జునుడి మీద యుద్ధానికి వచ్చాడు.

ఈ లోపల విరాటుడితో యుద్ధం చేసిన ద్రోణుడు ముందు విరాటుడి సారథిని, గుర్రాలను చంపాడు. తరవాత విరాటుడు తన కొడుకైన శంఖుడి రథం ఎక్కి, తండ్రి కొడుకు లిద్దరూ యుద్ధం చేసేటప్పుడు, ద్రోణుడు ఒక్క బాణంతో శంఖుణ్ణి చంపేశాడు. అది చూసి విరాటుడు పారిపోయాడు.

అలాగే శిఖండితో యుద్ధం చేస్తూ అశ్వత్థామ అతని సారథినీ, గుర్రాలనూ చంపాడు. అప్పుడు శిఖండి కత్తి తీసుకుని, ఎంతో నేర్పుగా, అశ్వత్థామ తనపై ప్రయోగించే బాణాలన్నిటినీ ధ్వంసం చెయ్య సాగాడు. చివరకు శిఖండి చేతిలోని కత్తి విరిగిపోయింది. అతను దాన్ని అశ్వత్థామ పైకి విసిరి, తప్పించుకుపోయాడు.

అలంబుసుడితో సాత్యకి అద్భుతంగా పోరాడాడు. రాక్షసుడైన అలంబుసుడు మాయాయుద్ధం ఆరంభించే సరికి, సాత్యకి, అర్జునుడు తనకిచ్చిన ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. అలంబుసుడు తీవ్రంగా గాయపడి పారిపోయాడు.

ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుడితో యుద్ధం చేస్తూ, అతన్ని బాణవర్షంలో ముంచాడు; తరవాత దుర్యోధనుణ్ణి గాయపరిచి, అతని గుర్రాలను చంపాడు. దుర్యోధనుడు కత్తి తీసుకుని, రథంనుంచి దిగి, ధృష్టద్యుమ్నుడి మీదికి వచ్చాడు. ఇంతలో శకుని వచ్చి, దుర్యోధనుణ్ణి తన రథంలో ఎక్కించుకుని తీసుకుపోయాడు.

భీముడితో యుద్ధం చేసిన కృతవర్మ భీముణ్ణి గాయపరిచి, తాను గాయపడి, తన గుర్రాలను పోగొట్టుకుని, తన బావ

అయిన వృషకుడి రథం ఎక్కాడు. ఇది దుర్యోధనుడి కళ్ళ ఎదటే జరిగింది.

ఉలూపికీ, అర్జునుడికీ పుట్టిన కొడుకు, తనతో యుద్ధం చేసిన విందాను విందులను పారిపోయే దాకా బాణాలతో కొట్టాడు.

ఘటోత్కచుడికీ, భగదత్తుడికీ మధ్య యుద్ధం చిత్రంగా జరిగింది. భగదదత్తుడు పెద్ద ఏనుగు నెక్కి పాండవ సైన్యాన్ని చిందర వందర చేశాడు. తమను కాపాడే వాడెవడూ లేక పాండవ సేనలు పారిపో సాగాయి. ఘటోత్కచుడు అకస్మాత్తుగా మాయమయాడు. ఇంతలో కౌరవ సేనలో హాహాకారాలు చెలరేగాయి. ఘటోత్కచుడు మళ్ళీ కనిపించి, భగదత్తుడి మీద బాణవర్షం కురిపించాడు. భగదత్తుడు ఘటోత్కచుణ్ణి బాణాలతోనూ, తోమరాల తోనూ కొట్టాడు. చివరకు ఘటోత్కచుడు యుద్ధం చెయ్యలేక పారిపోయాడు.

నకుల సహదేవులు తమ మేనమామ అయిన శల్యుడితో యుద్ధం చేసి, మహా వీరుడైన ఆయనను మూర్ఛపోగొట్టారు. శల్యుడి రథాన్ని సారథి దూరంగా తీసుకు పోయాడు. నకుల సహదేవులు గెలిచి సింహ నాదాలు చేస్తూంటే కౌరవులు నిరుత్సాహం చెందారు. అప్పటికి మధ్యాహ్నమయింది.

అభిమన్యుడికీ, ధృతరాష్ట్రుడి కొడుకులకూ జరిగిన యుద్ధంలో అభిమన్యుడు



చిత్రసేన, వికర్ణ, దుర్మర్షణులు ముగ్గురి రథాలూ ధ్వంసం చేశాడు. అది చూసి అభిమన్యుడి పైకి కౌరవయోధులు వచ్చి పడ్డారు. అప్పుడు అభిమన్యుడికి సహాయంగా అర్జునుడు వేగంగా వచ్చాడు. రెండు పక్షాలకూ సంకుల యుద్ధం జరిగింది. అర్జునుడి బాణాలు అందరినీ బాధించాయి. సుశర్మ బంధువులు చాలామంది అర్జునుడి చేతిలో చచ్చారు. సుశర్మ కొంత మంది యోధులను వెంట బెట్టుకుని అర్జునుడి పైకి వచ్చాడు.

అర్జునుడు వారినందరినీ ఓడించి, భీష్ముణ్ణి ఎదిరించటానికి ముందుకు సాగాడు. మధ్యదారిలో అతను రెండు



ధర్మరాజు శిఖండి వద్దకు వెళ్ళి, "నువు భీష్మణ్ణి చంపుతానన్నావు. భీష్ముడు చూడు, ఎలాటి దారుణయుద్ధం చేస్తున్నాడో! నాకు చూడగా నువు భీష్ముడంటే బెదిరి నట్టు కనిపిస్తున్నది. వచ్చి భీష్మణ్ణి చంపు," అన్నాడు.

ఈ మాటలు విని శిఖండి భీష్ముడితో యుద్ధం చెయ్యటానికి బయలుదేరాడు. దారిలో శల్యుడు శిఖండి మీద దారుణమైన ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. శిఖండి బెదరక, దానికి ప్రతిగా వారుణాస్త్రం ప్రయోగించాడు.

ఈ లోపల భీష్ముడు ధర్మరాజు విల్లునూ, ధ్వజాన్నీ విరగగొట్టి, సింహనాదం చేశాడు. ధర్మరాజు బెదిరిపోయాడు.

గడియలసేపు దుర్యోధన, సైంధవులు మొద లైన వారితో యుద్ధం చెయ్యవలిసి వచ్చింది.

అర్జునుడు భీష్మణ్ణి చేరవచ్చే సరికి అక్కడికి ధర్మరాజూ, భీమ నకుల సహ దేవులు కూడా వచ్చారు. ఆ విధంగా పాండవులు అయిదుగురూ భీష్ముడితో ఒకే సారి తలపడటం జరిగింది.

అంతమందీ కలిసి కూడా భీష్మణ్ణి పీడించలేక పోయారు. ఇంతలో సైంధవుడు వచ్చి, పాండవుల విల్లులన్నీ ఖండించాడు. దుర్యోధనుడు ధర్మరాజునూ, నకుల సహదేవులనూ బాణాలతో కొట్టి బాధించాడు. శల్యుడు మొదలైన కౌరవ పక్షయోధులు పాండవులను తీవ్రంగా బాణాలతోకొట్టారు.

భీముడు గద తీసుకుని సైంధవుడి మీదికి వెళ్ళాడు. సైంధవుడు తనపై వేసే బాణాలను లక్ష్యపెట్టక, అతని గుర్రాలను గదతో మోది చంపాడు. అప్పుడు దుర్యో ధనుడు భీముడి మీదికి వచ్చాడు. భీముడు గద తీసుకుని అతని మీదికి కూడా వెళ్ళాడు. ఆ గదను తప్పించుకోవటానికి దుర్యోధనుడి మనుషులు, దుర్యోధనుణ్ణి ఒంటరిగా విడిచి, బెదిరి పారిపోయారు. అలా భీముడి గద దెబ్బనుండి తప్పించుకుని, నేలమీద దూకి, రథం ధ్వంస్వం కాగా, ప్రాణాలతో బయట పడిన చిత్రసేనుణ్ణి అందరూ అభినం

దించారు. ధృతరాష్ట్రుడి కొడుకైన వికర్ణుడు చిత్రసేనుణ్ణి తన రథం మీద ఎక్కించుకున్నాడు. కొంత సేపటికి శిఖండి భీష్ముడికి ఎదురుగా వచ్చి, "నిలు, నిలు!" అని కేక పెట్టాడు. కాని భీష్ముడు అతనితో యుద్ధం చెయ్యలేదు.

సూర్యాస్తమయం కావచ్చేవేళకు ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ కౌరవ బలాలను విపరీతంగా ధ్వంసం చేయనారంభించారు. అప్పుడు విందానువిందులు ధృష్టద్యుమ్నుణ్ణి ఎదిరించి, అతని రథాన్ని భగ్నం చేశారు. అతను సాత్యకి రథం ఎక్కాడు.

ఆ రోజు యుద్ధం ముగిసేలోపల అర్జునుడు సుశర్మ మొదలైనవారిని ఓడించాడు; భీముడు దుర్యోధనుడు మొదలైన వారిని జయించాడు. ఉభయ పక్షాలవారూ తమ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు. శిబిరాలు చేరగానే వాళ్ళు తమ శరీరాలలో గుచ్చుకున్న బాణాలు మొదలైనవి తీయించుకుని, చక్కగా స్నానాలు చేసి, యుద్ధం గురించి ఆలోచించటం మాని, కొంత సేపు గీత వాద్యాలను సుఖంగా అనుభవించారు.

మర్నాడు ఉదయం మళ్ళీ ఉభయ సేనలూ యుద్ధానికి ఉపక్రమించాయి. వ్యూహాలూ, ప్రతివ్యూహాలు పన్నిన అనంతరం యుద్ధం ఆరంభమయింది. ఆరంభం నుంచీ భీష్ముడు రుద్రుడు లాగా తయా



రయాడు. అది చూసి ధర్మరాజు ముఖ్య యోధులందరినీ భీష్ముడి మీదికే పంపాడు.

భీష్ముడు సోమకులనూ, సృంజయులనూ, పాంచాలులనూ వధించసాగాడు. ఆయనకు ఎదురుగా నిలబడి యుద్ధం చేసినవాడు భీముడు ఒకడే. అతను కూడా భీష్ముడంత భయంకరంగానూ ఉండటమే కాక, భీష్ముడి సారథిని చంపి, భీష్ముడి రథం తొలగిపోయేటట్టు చేసి, భీష్ముడికి అండగా యుద్ధం చేస్తున్నవారిలో ధృతరాష్ట్రుడి కొడుకులైన సునాభుడు అనే వాణ్ణి ఒక్క తీవ్రమైనబాణంతో తల నరికాడు.

అది చూసి ధృతరాష్ట్రుడి కొడుకులు మరి ఏడుగురు—ఆదిత్యకేతువూ, బహ్వాశీ,



చెప్పలేదా? నీ తమ్ములు ఎవరు దొరికినా భీముడు చంపక విడవడు. నన్నూ, ద్రోణుణ్ణీ ఈ యుద్ధంలో ఇరికించకుండా ఉండవలిసింది. నువే నీ పరాక్రమంతో పాండవులను చంపు," అన్నాడు.

మధ్యాన్నం వేళకు యుద్ధం చాలా తీవ్రస్థాయికి వచ్చింది. మహాదారుణమైన యుద్ధం చేస్తున్న భీష్ముడి మీదికి ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ, శిఖండీ తమ సేనలతో సహా వచ్చారు. అలాగే విరాటుడూ, ద్రుపదుడూ సోమకులను వెంటబెట్టుకుని వచ్చారు. ఇంకా కైకయులూ, ధృష్టకేతువూ, కుంతిభోజుడూ తమ సేనలతో భీష్ముడి పైకి వచ్చారు. అర్జునుడూ, ఉపపాండవులూ, చేకితానుడూ ఇతర కౌరవ యోధులతో యుద్ధం చేశారు. అభిమన్యుడూ, భీముడూ, ఘటోత్కచుడూ మరొక పక్కనుంచి కౌరవ సైన్యాన్ని ధ్వంసం చెయ్యసాగారు.

కుండధారుడూ, మహోదరుడూ, పండితకుడూ, అపరాజితుడూ, విశాలాక్షుడూ అనే వారు—భీముడి పైకి వచ్చారు. భీముడు ఆ ఏడుగురినీ బాణాలతో కొట్టి చంపాడు.

ఇది చూసి దుర్యోధనుడి మిగిలిన తమ్ములకు దడపుట్టింది. దుర్యోధనుడు దుఃఖిస్తూ భీష్ముడి వద్దకు వెళ్ళి, "తాతా, నా తమ్ములందరినీ భీముడు చంపేస్తున్నాడు. ధైర్యంగా నిలబడి పోరాడేవాళ్ళందరినీ భీముడు చంపుతున్నాడు. నువు మా పట్ల శ్రద్ధవహించటం లేదు," అన్నాడు.

భీష్ముడికి కోపం వచ్చింది. ఆయన ఏడుస్తున్న దుర్యోధనుడితో, "ఈ సంగతి ముందు నీకు తెలీదా? మేమంతా ముందే

కౌరవయోధులు అదే విధంగా పాండవ సేనను నాశనం చేశారు. ద్రోణుడు సోమక సృంజయులను వధచేశాడు. భీముడి చేత చచ్చే కౌరవసేనలూ, ద్రోణుడి చేత చచ్చే పాండవసేనలూ హాహా కారాలు చెయ్యటం వినిపించింది. ముమ్మరంగా సాగే ఆ యుద్ధంలో అర్జునుడి కొడుకైన ఇరావంతుడు కౌరవసేనపై విరుచుకు పడ్డాడు.

ఇరావంతుడి తల్లి, నాగరాజైన ఐరావతుడి కూతురు. ఆమె భర్తను గరుత్మంతుడు చంపేసిన మీదట, ఐరావతుడు ఆమెను అర్జునుడి వద్దకు పంపాడు. ఆమె అర్జునుణ్ణి మోహించి, అతని వల్ల ఈ ఇరావంతుణ్ణి కన్నది. ఇరావంతుడు నాగలోకంలోనే తల్లి వద్ద పెరుగుతూ వచ్చాడు. కాని ఇతని పినతండ్రి అయిన అశ్వసేనుడికి అర్జునుడిపై ద్వేషం ఉండేది. అందుచేత అశ్వసేనుడు ఇరావంతుణ్ణి నాగలోకం నుంచి వెళ్ళగొట్టాడు.

ఆ సమయంలో అర్జునుడు ఇంద్రలోకంలో ఉన్నాడు. ఆ సంగతి తెలిసి ఇరావంతుడు అక్కడికి వెళ్ళి, అర్జునుణ్ణి కలుసుకుని, తన పుట్టుపూర్వోత్తరాలు తెలిపాడు. అన్ని విధాలా తన అంతవాడైన ఇరావంతుణ్ణి చూసి అర్జునుడు చాలా సంతోషపడి, "యుద్ధం వచ్చినప్పుడు నువ్వు మాకు సహాయం రావాలి," అన్నాడు. ఆ మాట గుర్తుంచుకుని ఇరావంతుడు పాండవులకు యుద్ధ సహాయం చెయ్యటానికి మేలు జాతి యవనాశ్వాలను వెంటబెట్టుకుని వచ్చాడు.

ఇరావంతుడు తన అశ్వసేనతో విజృంభించి కౌరవ సేన మీదికి వచ్చేసరికి, శకుని తమ్ములైన గజుడూ, గవాక్షుడూ, వృషభుడూ, చర్మవంతుడూ, ఆర్జవుడూ, శుకుడూ అనే ఆరుగురు, శకుని వద్దంటున్నా వినకుండా సాహసించి, ఇరావంతుడి అశ్వసేనతో యుద్ధానికి వచ్చారు. వాళ్ళు తనతో యుద్ధం చేసి తనను బాణాలతో హింసిస్తుంటే, ఇరావంతుడు కత్తి తీసుకుని ఆత్మరక్షణ చేసుకుంటూ, వృషభుడనే వాణ్ణి తప్ప మిగిలిన అయిదుగురినీ చంపేశాడు.

ఇది చూసి దుర్యోధనుడు ఇరావంతుడిపైకి ఆర్ష్యశృంగుడనే రాక్షసుణ్ణి యుద్ధానికి పంపాడు. ఇద్దరూ మహా దారుణంగా పోరాడిన మీదట, ఇరావంతుడు మూర్ఛపోయి ఉన్నప్పుడు ఆ రాక్షసుడు అతన్ని కత్తితో నరికి చంపాడు. కౌరవ సేనలు హర్షించాయి.






యుద్ధం చాలా తీవ్రంగా ఉన్నది. తన కొడుకైన ఇరావంతుడు చనిపోయినట్టు అర్జునుడికి ఇంకా తెలియదు. అతను కౌరవ పక్ష వీరులను చంపటంలో నిమగ్నుడై ఉన్నాడు. రెండో వైపునుంచి భీష్ముడు పాండవసేనలను హడలగొట్టేస్తున్నాడు. భీముడూ, ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ తమ పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్నారు. ఈ అందరినీ మించి ద్రోణుడు యుద్ధం చేస్తున్నాడు.

ఇరావంతుడు చావటం చూసి, భీముడి కొడుకైన ఘటోత్కచుడు భయంకరమైన పెడబొబ్బ పెట్టి, భయంకరాకారంతో, చేతిలో ఒక మెరిసే శూలాన్ని పట్టుకుని, రాక్షసగణాలను వెంటబెట్టుకుని బయలు దేరాడు. అతన్ని చూసి, కౌరవసేనలు దడుచుకున్నాయి. అదిచూసి దుర్యోధనుడు యుద్ధసన్నద్ధుడై, ఘటోత్కచుడికి ఎదురు వచ్చి, సింహనాదం చేశాడు. దుర్యోధనుడి వెనకగా వంగదేశపురాజు పదివేల ఏనుగులతో వచ్చాడు. ఆ ఏనుగుల సేనను చూసేసరికి ఘటోత్కచుడికి మండిపోయింది. అతని రాక్షసులు ఏనుగులసేన మీద పడి ధ్వంసం చెయ్యసాగారు. గజయోధులు చస్తూ ఉండటం చూసి దుర్యోధనుడు బాణాలతో ఆ రాక్షసులను చంపనారంభించాడు. అప్పుడు ఘటోత్కచుడు దుర్యోధనుణ్ణి తానే ఎదుర్కొన్నాడు.

ఆ యుద్ధంలో బాగా గాయపడి రక్తం ఓడుతున్న ఘటోత్కచుడు దుర్యోధనుణ్ణి

58. ఘటోత్కచ భగదత్తుల పోరాటం



చంపటానికి ఒక గొప్ప శక్తిని చేతబట్టాడు. ఆ సమయంలో వంగదేశపురాజు తాను ఎక్కిన గొప్ప ఏనుగును దుర్యోధనుడి రథానికి అడ్డంగా తోలాడు. ఘటోత్కచుడు విసిరిన శక్తి తగిలి ఆ ఏనుగు కూలిపోయింది. వంగరాజు దాని మీదినుంచి దూకి, ఎటో పారిపోయాడు. తరవాత ఘటోత్కచుడు విజృంభించి, భయంకరంగా అరుస్తూ దుర్యోధనుణ్ణి పీడించసాగాడు.

ఘటోత్కచుడి పెడబొబ్బలు విని భీష్ముడు ద్రోణుడితో, "దుర్యోధనుణ్ణి ఘటోత్కచుడు పీడిస్తున్నట్టున్నాడు. వాణ్ణి చంపటం ఎవరికీ సాధ్యంకాదు. మీరంతా వెళ్ళి దుర్యోధనుణ్ణి రక్షించండి." అన్నాడు.

ఆ మాట వింటూనే, ద్రోణుడూ, సోమదత్తుడూ, బాహ్లికుడూ, సైంధవుడూ, కృపుడూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, బృహద్బలుడూ, అశ్వత్థామా, వికర్ణుడూ, చిత్రసేనుడూ, వివింశతీ మొదలైన మహా యోధులు అనేక రథాలను వెంట బెట్టుకుని వెళ్ళేసరికి, ఘటోత్కచుడిచే తరమబడుతున్న దుర్యోధనుడు కనిపించాడు. వాళ్ళు ఘటోత్కచుడికి అడ్డుపడి యుద్ధం సాగించారు. ఘటోత్కచుడు తన వారితో ఆ యోధులందరినీ ఎదుర్కొని పోరాడాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో మహా వీరులందరూ దెబ్బతిన్నారు. కొందరికి కవచాలు తూట్లు పడ్డాయి. కొందరు గాయపడ్డారు. కొందరి సారధులు చచ్చారు. మొత్తం మీద అందరూ యుద్ధవిముఖులయారు.

వెంటనే ఘటోత్కచుడు మళ్ళీ దుర్యోధనుడి పైకి వెళ్ళాడు. అప్పుడు మరికొందరు కౌరవపక్ష వీరులు ఘటోత్కచుడి పైన తలపడ్డారు. అతను వారితో యుద్ధంసాగించాడు.

ధర్మరాజు భీముడితో, "నీ కొడుకు ఘటోత్కచుడు తనకు మించిన యుద్ధం చేస్తున్నాడు. పాంచాలులను నిర్మూలించే ప్రయత్నంలో ఉన్న భీష్ముణ్ణి అర్జునుడు ఎదిరించి పోరాడుతున్నాడు," అన్నాడు. అర్జునుడికి సహాయంగా వెళ్ళటం కన్న ఘటోత్కచుడికి సహాయం చెయ్యటం

ఎక్కువ అవసరమని గ్రహించి భీముడు అతివేగంగా ఘటోత్కచుడి వద్దకు బయలు దేరాడు. అతని వెంట అభిమన్యుడూ, ఉప పాండవులూ, నీలుడూ, సత్యధృతీ, సాచిత్తి, శ్రేణిమంతుడూ, వసుతాసుడూ మొదలైనవారు వెళ్ళారు. ఉభయపక్ష వీరులకూ తీవ్రమైన యుద్ధం జరిగింది. యుద్ధంలో పాండవ పక్షానిదే పై చెయ్యి అయింది.



అది చూసి దుర్యోధనుడు భీముణ్ణి ఎదుర్కొన్నాడు. యుద్ధంలో భీముడు దెబ్బతిని, రథంలో కూలబడ్డాడు. అంతలో ఘటోత్కచుడూ, అభిమన్యుడూ మొదలైన పాండవవీరులు దుర్యోధనుణ్ణి చుట్టు ముట్టారు. దుర్యోధనుడు ప్రమాదంలో ఉండటం తెలిసి ద్రోణుడు అతనికి సహాయంగా కొందరు కౌరవవీరులను వెంట బెట్టుకుని వచ్చాడు. మళ్ళీ సాగిన యుద్ధంలో ఘటోత్కచుడు రాక్షసమాయలు ప్రయోగించి, శత్రువులకు దిగ్భ్రమ కలిగించాడు. ఘటోత్కచుడి దెబ్బకు తట్టుకోలేక కౌరవసైన్యాలు చెల్లాచెదరై, శిబిరాలకేసి పరిగెత్తసాగాయి.

అప్పుడు దుర్యోధనుడు భీష్ముడి వద్దకు వచ్చి, "తాతా, పాండవులు కృష్ణుణ్ణి నమ్ముకున్నట్టే మేము నిన్ను నమ్ముకుని యుద్ధం ప్రారంభించాం. ఘటోత్కచుడూ, భీముడూ చేరి నాకు గొప్ప అపజయం కలిగించారు. ఈ అవమానం నన్ను నిలువునా దహిస్తున్నది. ఎలాగైనా ఈ రాక్షసాధముడు చావాలి. ఈ ఉపకారం చేసిపెట్టు," అన్నాడు.

అప్పుడు భీష్ముడు దుర్యోధనుడితో, "నాయనా, నువు ధర్మరాజుతోగాని, భీముడితోగాని, అర్జునుడితోగాని, నకుల సహదేవులతోగాని యుద్ధం చెయ్యి. రాజు రాజుతో పోరాడటం రాజధర్మం. రాక్షసుడైన ఘటోత్కచుడితో పోరాడాలంటే మేమంతా ఉన్నాం. వాడితో యుద్ధం చెయ్యటానికి భగదత్తుణ్ణి పంపు. అతను ఇంద్రుడంతటి వాడు," అని భగదత్తుడితో, "నువు అనేక మంది రాక్షసులతో పోరాడిన



వాడివి. ఘటోత్కచుణ్ణి ప్రతిఘటించటానికి నువ్వే సరి అయినవాడివి. నువు ఇప్పుడే వెళ్ళి మేమంతా చూస్తూండగా వాణ్ణి చంపెయ్యి." అన్నాడు.

భీష్ముడు ఈ మాట అనేసరికి భగదత్తుడు సుప్రతీక మనే తన గొప్ప ఏనుగు నెక్కి, పాండవయోధుల మీద యుద్ధానికి వెళ్ళాడు. గొప్ప యుద్ధం జరిగింది. భగదత్తుడు భీముడితో తలపడ్డాడు. సుప్రతీకం అతివేగంగా భీముడి రథం మీదికి రావటం చూసి, కేకయులూ, ఉపపాండవులూ, అభిమన్యుడూ, దశార్ణరాజైన క్షత్రదేవుడూ, చేదిరాజైన చిత్రకేతుడూ ఆ ఏనుగుపై బాణాలవర్షం కురిపించారు. కాని సుప్రతీకం పాండవ సైన్యాన్ని ధ్వంసం చేయసాగింది. అది చూసి ఘటోత్కచుడు భగదత్తుడి మీదికి వచ్చాడు. భగదత్తుడు అందరినీ వరసగా చితకగొట్టేశాడు. భీముడి సారథి రథంలోనే మూర్ఛపోయాడు.

ఇంతలో అర్జునుడు భీమఘటోత్కచు లున్న చోటికి వచ్చి యుద్ధం చేశాడు. భగదత్తుడు తన ఏనుగు చేత పాండవసైన్యాన్ని తొక్కుస్తూ వెళ్ళి, ధర్మరాజుతో యుద్ధం ప్రారంభించాడు.

ఆ సమయంలో, ఇరావంతుడు చనిపోయిన సంగతి భీముడికీ, అర్జునుడికీ తెలిసింది. అర్జునుడు చాలా బాధపడి, కృష్ణుడితో తన రథాన్ని కౌరవసేన మీదికి నడపమన్నాడు. మళ్ళీ ఉభయపక్షాల వీరుల మధ్య యుద్ధం ప్రజ్వలించింది. ఈ యుద్ధంలో భీముడు వ్యూఢోరస్కుణ్ణీ, కుండలి అనే వాణ్ణీ, అనాధృష్టీ, కుండభేదీ, వైరాటుడూ, దీర్ఘనేత్రుడూ, దీర్ఘబాహువూ, సుబాహువూ, కనకధ్వజుడూ అనే వాళ్ళను, ధృతరాష్ట్రుడి కొడుకులను వరసగా చంపాడు. అతను అలా వారిని చంపేటప్పుడు ద్రోణుడు అతని పైన శరపరంపరలు ప్రయోగించి కూడా అతన్ని ఆపలేకపోయాడు. చీకట్లు ముంచుకు వస్తూండగా, అలసిపోయిన ఉభయపక్షాల వారూ యుద్ధం చాలించి, శిబిరాలకు వెళ్ళిపోయారు.

అనంతరం దుర్యోధన, శకుని, దుశ్శాసనులు కర్ణుడితో కలిసి మంత్రాలోచన చేశారు. అప్పుడు దుర్యోధనుడు కర్ణుడితో, "భీష్ముడూ, ద్రోణుడూ, శల్యుడూ ఎందు చేతనో పాండవులను బాధించలేక పోతున్నారు. పాండవులు అపజయమన్నది లేక మన సైన్యాన్ని నాశనం చేస్తున్నారు. రోజు రోజుకూ నా సేన తరిగిపోతున్నది. దేవుడూ, పాండవులూ కూడా నాకు పరాభవం కలిగిస్తున్నారు. నేను పాండవులను ఎలా జయిస్తానో తెలియకుండా ఉన్నది." అన్నాడు.



దానికి కర్ణుడు, "మహారాజా, భీష్ముడు యుద్ధం విరమించనీ. నేను వచ్చి పాండవులను సోమకులతో సహా చంపేస్తాను. నా పరాక్రమం ఎలాటిదో భీష్ముడికి చూపుతాను. భీష్ముడికి పాండవుల మీద ప్రేమ, చూస్తూ చూస్తూ వారిని చంపడు, చంపలేడు కూడా. అందుచేత నువు వెంటనే భీష్ముడి శిబిరానికి వెళ్ళి, ఆయనను అస్త్ర సన్యాసం చెయ్యమని చెప్పు. ఆయన ఆ పని చేసిన మరుక్షణం పాండవులు చచ్చారే అనుకో!" అన్నాడు.

దుర్యోధనుడు తన తమ్ములనూ, ఇతరులనూ వెంటబెట్టుకుని భీష్ముడి వద్దకు వెళ్ళి, "తాతా, నీకు నా మీద కోపమో, లేక నా దురదృష్టమోగాని, నువు పాండవులను రక్షిస్తున్నావు. నీ ఉద్దేశం వారిని రక్షించటమే అయితే, యుద్ధం విరమించి, యుద్ధ భారం కర్ణుడి మీద ఉంచు. అతనూ, అతని బంధువులూ పాండవులను జయిస్తారు," అన్నాడు.

ఈ మాటలు భీష్ముడికి ములుకులలాగా తగిలాయి. ఆయన కళ్ళు ఎర్రబడ్డాయి. ఆయన మూడు లోకాలనూ దహించే వాడిలాగా అయిపోయి, "దుర్యోధనా, ఇలాంటి మాటలు ఎందుకు అంటున్నావు? నా ప్రయత్నంలో లోపం ఏమిటి? శత్రువులను అపారంగా నాశనం చేస్తున్నాను. అర్జునుడు మహా వీరుడని నీకు తెలియదా? నిన్ను గంధర్వులు పట్టుకు పోయినప్పుడు కర్ణుడు



ఏం చేశాడు? ఉత్తర గోగ్రహణ మప్పుడు అర్జునుడు మననందరినీ ఒంటిగా జయించలేదా? అతను ఇంద్రుడికి లొంగని నివాతకవచులను జయించాడే! ఈ యుద్ధం నువు కోరి తెచ్చుకున్నది. నీ శత్రువును నువే చంపు, మేం చూసి ఆనందిస్తాం. నా మాటకు వస్తే, నేను శిఖండిని తప్ప మిగిలిన సోమకులనూ, పాంచాలులనూ అందరినీ చంపుతాను, లేదా చచ్చిపోతాను. ఇంతకన్న నేను చెప్పేదేమీ లేదు. రేపు మహా యుద్ధం చెయ్యబోతున్నాను. ఇక నువు వెళ్ళి పడుకో," అన్నాడు.

దుర్యోధనుడు ఈ మాటతో తృప్తి పడి, మర్నాడు నిద్ర లేస్తూనే తన పక్షాన పోరాడే రాజులతో, "ఇవాళ భీష్ముడు గొప్ప యుద్ధం చెయ్యబోతున్నాడు," అని చెప్పి, దుశ్శాసనుడితో, "ఇవాళ మనకు విజయం కలగబోతున్నది. భీష్ముణ్ణి మనం రక్షించుకోవాలి. అందుకు శకునీ, శల్యుడూ, కృపుడూ, ద్రోణుడూ, వివింశతీ సహాయపడాలి," అన్నాడు.

తొమ్మిదో రోజు యుద్ధం ఆరంభమయింది. భీష్ముడు సర్వతోభద్ర మనే వ్యూహంలో కౌరవ సేనలను నిలిపాడు. పాండవులు దానికి ప్రతి వ్యూహం పన్నారు. యుద్ధం ఆరంభమవుతూనే అభిమన్యుడు రెచ్చిపోయి, రెండో అర్జునుడిలాగా కౌరవసేనలనూ, సైంధవుడూ, కృపుడూ, ద్రోణుడూ, అశ్వత్థామా లాటి మహా వీరులనూ చెదరగొట్టేశాడు. అప్పుడు దుర్యోధనుడు రాక్షసుడైన అలంబుసుణ్ణి అభిమన్యుడి మీదికి పురికొల్పాడు.

అభిమన్యుడికీ, అలంబుసుడికీ యుద్ధం జరిగింది. అలంబుసుడు గొప్ప యుద్ధమే చేశాడు గాని, అతను అభిమన్యుడి ధాటికి తట్టుకోలేక మాయా యుద్ధానికి దిగి, అందులోనూ నెగ్గలేక, చివరకు ఓడి పారిపోయాడు. తరవాత అభిమన్యుడు కౌరవ సేనను ధ్వంసం చేస్తూపోయాడు.

ఆ సమయంలో భీష్ముడు అభిమన్యుణ్ణి ఎదిరించాడు. అదే సమయంలో అర్జునుడు

కూడా అభిమన్యుడి వద్దకు వచ్చాడు. భీష్ముడి వెంట ఇంకా అనేక మంది మహా వీరులున్నారు. అలాగే అర్జునుడి వెంట కూడా ఉన్నారు. ఉభయ పక్షాలకూ గొప్ప యుద్ధం జరిగింది.

మరొక పక్క భీముడి పైకి భగదత్తుడూ, శ్రుతాయువూ ఏనుగుల సేనలతో వచ్చారు. భీముడు గద పట్టుకుని రథం నుంచి దిగి, తన చుట్టూ మూగిన ఏనుగులనూ, వాటి మీద ఉన్న యోధులనూ తన గదతో చావ బాదసాగాడు.

ఆ రోజు భీష్ముడు మహా దారుణమైన యుద్ధం చేశాడు. పాండవ సైన్యం విప రీతంగా నాశనమయింది. పాండవ సైనికులు అస్త్రాలు కూడా వదిలేసి పారిపోయారు. సూర్యాస్తమయం అయి యుద్ధం నిలిచి పోయింది.

భీష్ముడు విజృంభిస్తే ఎలా యుద్ధం చేయగలడో చూసిన పాండవులకు గుండెల్లో రాయి పడినట్టయింది. ధర్మరాజుకు యుద్ధం మీద విరక్తి కూడా కలిగింది. ఆయన కృష్ణుణ్ణి, ఏం చెయ్యాలని అడిగాడు. కృష్ణుడు ధర్మరాజును ఓదార్చుతూ, "నువు దిగులుపడకు. భీష్ముణ్ణి అర్జునుడు చంపక పోతే, నేను చంపుతాను. భీష్ముడు చచ్చి పోతే నువు గెలవటానికి అడ్డు ఏదీ ఉండదు. నీ శత్రువు నా శత్రువే కద! తలుచుకుంటే అర్జునుడు భీష్ముణ్ణి తప్పక చంపగలడు. అది అతని కర్తవ్యం కూడా," అన్నాడు.

ఈ మాట విని ధర్మరాజు కృష్ణుడితో, "భీష్ముడు మా క్షేమం కోరినవాడు, మనం గెలవాలన్న కాంక్ష కలవాడు; మన పక్షాన యుద్ధం చెయ్యకపోయినా మనకు హితం చెబుతానన్నాడు. మనం ఆయన దగ్గిరికి పోయి, ఆయన ఎలా చస్తాడో అడుగుదాం. అటువంటి మహా పురుషుణ్ణి చంపుదామను కుంటున్నాం గదా, క్షత్రియధర్మం ఎంత పాపిష్ఠిది!" అన్నాడు.

కృష్ణుడు ఈ మాటకు సంతోషించి, "భీష్ముడి వంటి మహా వీరుడు ఎలా చస్తాడో ఆయనే చెప్పాలి. మనం ఆయన వద్దకు పోదాం," అన్నాడు.






పది రోజులు యుద్ధం చేసి భీష్ముడు యుద్ధరంగంలో పడిపోయాడు. ఆయన శిఖండితో యుద్ధం చెయ్యడు గనక అర్జునుడు శిఖండిని ముందు పెట్టుకుని, వెనక నుంచి తాను బాణాలు వేస్తూ భీష్ముణ్ణి పడగొట్టాడు.

భీష్ముడు పడిపోయాడు గాని వెంటనే చావలేదు. ఆయన శరీరం నిండా బాణాలు గుచ్చుకుని ఉండటం చేత, ఆయన పడిపోయినప్పుడు ఆయన శరీరం నేలకు తగలలేదు. ఆ స్థితిలో ఆయనకు దాహం వేస్తే, అర్జునుడు భూమిని బాణంతో కొట్టి, పాతాళగంగను పైకి తెప్పించాడు. ఉత్తరాయణం వచ్చినదాకా భీష్ముడు అంపశయ్య మీద ప్రాణాలతో ఉన్నాడు.

భీష్ముడి అనంతరం కౌరవసేనలకు ద్రోణుడు సర్వసేనాధిపత్యం వహించి, అయిదు రోజులపాటు యుద్ధం చేశాడు. ఆయన పన్నిన పద్మవ్యూహంలోకి ప్రవేశించి అర్జునుడి కొడుకైన అభిమన్యుడు శత్రుయోధుల మధ్య చిక్కి చనిపోయాడు. ఇది జరిగినప్పుడు అర్జునుడు దూరాన మరొక రంగంలో యుద్ధం చేస్తున్నాడు. అభిమన్యుడి వెనకగా మిగిలిన పాండవులు పద్మవ్యూహంలో ప్రవేశించబోతే, సైంధవుడు వారికి అడ్డుపడ్డాడు. ఆ కారణంగా అభిమన్యుడికి ఎవరూ సహాయం లేకపోయారు.

ఈ సంగతి విని అర్జునుడు మర్నాడు సైంధవుణ్ణి చంపుతానని ప్రతిజ్ఞ చేసి,

**59. యుద్ధంలో పాండవుల విజయం**



అంత పనీ చేశాడు. తరవాత ద్రోణుడూ, ధృష్టద్యుమ్నుడూ యుద్ధం చేస్తూండగా ధర్మరాజు అశ్వత్థామ చచ్చినట్టు అబద్ధం చెప్పాడు. తన కొడుకు చచ్చాడని ధర్మరాజు నోట విని ద్రోణుడు అస్త్రసన్యాసం చేసి, ప్రాయోపవేశం చేశాడు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు ఆయనను చంపాడు.

ద్రోణుడు చనిపోయిన అనంతరం కౌరవ బలాలకు కర్ణుడు సర్వసేనాని అయాడు. కర్ణుడు శల్యుణ్ణి తనకు సారథిగా ఇప్పించమని దుర్యోధనుణ్ణి కోరాడు. శల్యుడు కర్ణుడికి సారథి కావటానికి ఒప్పుకున్నాడు, గాని అతను యుద్ధం చేసిన రెండు రోజులూ శల్యుడు అతన్ని అవమానిస్తూ, నిరుత్సాహపరుస్తూ వచ్చాడు. రెండవ రోజు కర్ణుడు అర్జునుడితో యుద్ధం చేస్తూండగా అతని రథచక్రం బురదలో కూరుకుపోయింది. కర్ణుడు దాన్ని ఎత్తుతూండగా అర్జునుడు అతన్ని చంపేశాడు.

కర్ణుడి అనంతరం శల్యుడు కౌరవ సేనాని అయినాడు. ఆయన ఆ రోజే ధర్మరాజుతో యుద్ధం చేస్తూ చచ్చిపోయాడు.

పద్దెనిమిదో రోజున యుద్ధం ముగిసింది. ఆ యుద్ధంలో పద్దెనిమిది అక్షౌహిణుల సేన పోయింది. దుర్యోధనుడు తప్ప అతని తమ్ములందరూ పోయారు. దుశ్శాసనుణ్ణి భీముడు భయంకరంగా చంపి, అతని నెత్తురు తాగాడు.

యుద్ధంలో ఉభయపక్షాల యోధులూ అనేకవేలమంది చనిపోయారు. పాండవుల పక్షాన పాండవులూ, ఉపపాండవులూ, యుయుత్సుడూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ మిగిలారు.

యుయుత్సుడు ధృతరాష్ట్రుడికి పుట్టినవాడు. యుద్ధం ముగియగానే అతను హస్తినాపురానికి వెళ్ళిపోయాడు.

కౌరవుల పక్షాన అశ్వత్థామా, కృపుడూ, కృతవర్మా, దుర్యోధనుడూ మిగిలారు. యుద్ధం ఆఖరు దశలో కృపాశ్వత్థామలూ,



కృతవర్మ్మ దుర్యోధనుడి కోసం చూస్తే అతను ఎక్కడా కనిపించలేదు. అతను గద ఒకటి భుజాన పెట్టుకుని ఒక పెద్ద మడుగు వద్దకు వెళ్ళాడు. కృతవర్మ్మ, కృపుడూ, అశ్వత్థామా ప్రాణాలతో మిగిలారన్నది కూడా అతనికి తెలియదు.

మడుగు వద్ద కూర్చుని ఉన్న దుర్యోధనుడి వద్దకు సంజయుడు వచ్చాడు. తనకు అపజయం కలిగినందుకూ, తన వారంతా పోయినందుకూ విచారిస్తున్న దుర్యోధనుడు సంజయుణ్ణి చూసి, "మన వాళ్ళలో నువు తప్ప ఇంకెవరూ మిగలలేదా? నేను ఈ మడుగులో ఇంకా ప్రాణాలతో ఉన్నానని నా తండ్రికి చెప్పు," అని మడుగులో ప్రవేశించాడు.

సంజయుడు అక్కడి నుంచి వచ్చేస్తుండగా అతనికి కృతవర్మ్మ, కృపుడూ, అశ్వత్థామా కనబడి, "సంజయా, దుర్యోధనుడు ఎక్కడ?" అని అడిగారు.

సంజయుడు వాళ్ళకు మడుగును చూపించి, దుర్యోధనుడు జల స్తంభన చేసి అందులో ఉన్నట్టు చెప్పాడు.

అశ్వత్థామ పెద్దగా ఏడుస్తూ, "అయ్యో, మేము బతికి ఉన్న సంగతి అతనికి తెలీదు కాబోలు. మేము నలుగురమూ కలిసి శత్రువులను జయించలేమా?" అన్నాడు. వాళ్ళు ముగ్గురూ పాండవులతో యుద్ధం చేస్తామని బయలుదేరారు. కాని వాళ్ళు రణరంగానికి చేరేసరికి చీకటి పడింది. కౌరవ శిబిరానికి చెందిన స్త్రీలను సేవకులు హస్తినాపురానికి తీసుకుపోతున్నారు.

యుద్ధం అయిపోగానే పాండవులు కృష్ణుడితో సహా దుర్యోధనుడి కోసం వెతకసాగారు. దుర్యోధనుడు మడుగులో దాగి ఉన్న సంగతి వారికి తెలిసింది. వాళ్ళు అక్కడికి వచ్చారు.

ధర్మరాజు దుర్యోధనుడితో, "నీ వంశమంతా నాశనమయాక నీ ప్రాణాలు దక్కించుకోవటానికి మడుగులో దాక్కున్నావా? ఇది అక్రమం. బయటికి వచ్చి



మాతో యుద్ధం చెయ్యి. నీ వంటి గర్విష్ఠికి ఈ పిరికితనం తగదు. మమ్మల్ని ఓడించకుండా నీ రాజరికం నిలవదు. వచ్చి, మమ్మల్ని ఓడించు," అన్నాడు.

"నాకు రాజ్యం అక్కర్లేదు. నువే అంతా ఏలుకో," అన్నాడు దుర్యోధనుడు.

"నీ నుంచి నాకు రాజ్యదానం అవసరం లేదు. అదీగాక, దానం చెయ్యటానికి నీకు ఇప్పుడు రాజ్యమూ లేదు. మమ్మల్ని జయించి రాజ్యం పొందు, లేదా మా చేతిలో ఓడిపో," అన్నాడు ధర్మరాజు.

ఇలాటి సూటి పోటి మాటలతో పాండవులు రెచ్చగొట్టే సరికి, దుర్యోధనుడు మడుగు నుంచి బయటికి వచ్చి, భీముడితో గదాయుద్ధం చేశాడు. భీముడు దుర్యోధనుడి తొడలు విరగ గొట్టాడు.

తొడలు విరిగి పడిపోయి ప్రాణాలతో ఉన్న దుర్యోధనుడి వద్దకు కృపాశ్వత్థామ కృతవర్మలు వచ్చి, అతని దుస్థితికి విచారించారు. అశ్వత్థామ ఆ రాత్రే పాండవులనూ, బతికి ఉన్న ఇతర పాంచాలులనూ చంపేస్తానని దుర్యోధనుడి దగ్గిర ప్రతిజ్ఞ చేశాడు. ఈ మాటకు దుర్యోధనుడు సంతోషించి, అశ్వత్థామను తన సర్వసేనానిగా నియమించాడు.

తరవాత ఆ యోధులు ముగ్గురూ బయలుదేరి, పాండవ శిబిరాలకు సమీపంగా ఒక చోట దాక్కున్నారు. అక్కడ అరణ్యం ఉన్నది. అందులో ఒక వెయ్యికొమ్మల మర్రిచెట్టు కింద వాళ్ళు విశ్రమించారు. అశ్వత్థామ శత్రువులను అన్యాయంగా, నిద్రపోతున్నప్పుడే చంప నిశ్చయించాడు. ఎందు కంటే, పాండవులు అలాంటి అన్యాయాలు యుద్ధంలో చాలా చేశారు. అతను కృపుణ్ణీ, కృతవర్మనూ ఇందుకు ఒప్పించి, వారితో బయలుదేరి పాండవ శిబిరానికి వచ్చాడు. కృపుణ్ణీ, కృతవర్మనూ అతను శిబిర ద్వారం వద్ద నిలబెట్టి, తాను కత్తి దూసి లోపల ప్రవేశించి, ముందుగా ధృష్టద్యుమ్నుణ్ణి నిద్ర

లేపి, అతన్ని చంపాడు. ఈ అలికిడికి కొందరు లేచి, అతని మీదికి వచ్చారు. అశ్వత్థామ అందరినీ చంపాడు. తరవాత అతను ఉపపాండవు లందరినీ చంపాడు. శిబిరంలో వాళ్ళు మేలుకుని, వారిలో కొందరు అశ్వత్థామతో యుద్ధం చేసి చచ్చారు; బయటికి పారిపోతున్న వారిని కృపుడూ, కృతవర్మా చంపారు. తరవాత ముగ్గురూ చేరి శిబిరానికి మూడు వైపులా అగ్గి పెట్టారు. తరవాత వాళ్ళు ఈ వార్తను దుర్యోధనుడికి చెప్పటానికి బయలు దేరారు.




ఆ రాత్రి పాండవులు ఆ శిబిరంలో లేరు. ఉన్నట్టయితే వాళ్ళు అశ్వత్థామ చేతిలో చావటమో, లేక వాళ్ళు అశ్వత్థామకు ఈ దారుణ హత్యాకాండ చెయ్యకుండా అడ్డుపడటమో జరిగేది.

కృపాశ్వత్థామ కృతవర్మలు వచ్చేసరికి దుర్యోధనుడు మరణవేదన పడుతున్నాడు. అతను వాళ్ళు చేసినదంతా విని, సంతోషిస్తూ ప్రాణాలు వదిలాడు.

తమ కొడుకులూ, బంధువులూ యుద్ధంలో గెలిచి కూడా హత్యకు గురి అయినట్టు తెలిసి, పాండవులూ, ద్రౌపదీ మొదలైన వాళ్ళు ఎంతో శోకించారు. ఇంత పని చేసిన అశ్వత్థామను చంపే స్తానని భీముడు బయలు దేరాడు.

అప్పుడు ద్రౌపది, "ఆ అశ్వత్థామ తలలో మణి ఉంటుందట. వాణ్ణి చంపి, ఆ మణి తెస్తే నేను కళ్ళారా చూస్తాను," అన్నది.

భీముడు ధనుర్బాణాలు తీసుకుని రథం మీద బయలుదేరాడు. అది చూసి కృష్ణుడు భీముడికి తోడుగా అర్జునుణ్ణి కూడా వెళ్ళమన్నాడు. కృష్ణుడితో బాటు ధర్మరాజూ, అర్జునుడూ కూడా మరొక రథం ఎక్కి బయలు దేరారు. వాళ్ళు త్వరలోనే భీముణ్ణి చేరుకున్నారు, కాని భీముణ్ణి వెనక్కు మళ్ళించ లేక పోయారు.

వాళ్ళు గంగాతీరాన్ని చేరేసరికి, వ్యాసుడూ, అతని అనుచరులైన



ఋషులూ, వారి వెంట అశ్వత్థామా కనిపించారు. అశ్వత్థామ మట్టిగొట్టుకుని, నారబట్టలు కట్టుకుని ఉన్నాడు. అశ్వత్థామను చూస్తూనే భీముడు భయంకరంగా కేక పెట్టాడు. అశ్వత్థామ భీముణ్ణీ, అతని వెనకగా వచ్చే కృష్ణుడి వెంట ధర్మరాజునూ, అర్జునుణ్ణీ చూసి ఏమీ తోచక, తన తండ్రి తనకిచ్చిన బ్రహ్మశిరోనామకాస్త్రం అనే భయంకరమైన అస్త్రాన్ని ఆవాహన చేసి, "అపాండవం అగుగాక" అని దాన్ని ప్రయోగించాడు. కృష్ణుడు ప్రేరేపించగా అర్జునుడు కూడా అదే అస్త్రాన్ని ప్రయోగించాడు. రెండు అస్త్రాలూ భయంకరంగా మంటలు కక్కుతూ ఒక దాని నొకటి ఎదుర్కొన్నాయి.

అప్పుడు వ్యాసుడూ, నారదుడూ ముందుకు వచ్చి, ఇద్దరినీ అస్త్రాలు ఉపసంహరించమన్నారు. అర్జునుడు తన అస్త్రాన్ని ఉపసంహరించాడు. అశ్వత్థామకు ఆ పని చేతకాలేదు. అతను వ్యాసుడితో, "నేను భీముణ్ణి చూసి ఈ అస్త్రాన్ని ప్రయోగించాను. ఉపసంహరించటం నా వల్లకాదు. ఇది పాండవులను నిర్మూలించక విడవదు," అన్నాడు.

కృష్ణుడు ఆ మాట విని, "సరే, పాండవుల అంకురం ఇప్పుడు ఉత్తర గర్భంలో ఉన్నది. దాని మీద నీ అస్త్రం ప్రయోగించు," అన్నాడు.

అశ్వత్థామ తన తలలో ఉన్న మణిని అర్జునుడి కిచ్చేటట్టూ, అర్జునుడు అతన్ని ప్రాణాలతో వదిలేటట్టూ ఋషులు రాజీ పరిచారు. అశ్వత్థామ తన తలలోని మణి తీసి అర్జునుడి కిచ్చి, అడవులు పట్టి పోయాడు. భీముడు ఆ మణిని తీసుకుపోయి ద్రౌపది కిచ్చి, "ఇక విచారించకు," అన్నాడు. ద్రౌపది ఆ మణిని ధర్మరాజు తలలో ధరించటానికి ఇచ్చింది.

హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు తన నూరుగురు కొడుకులూ యుద్ధంలో

పోయినందుకు అంతులేని విచారంలో మునిగిపోయాడు. సంజయుడు ఆయనతో, "నీ కొడుకులే ఏమిటి? పద్దెనిమిది అక్షౌహిణుల సేన నాశనమయింది. ప్రపంచంలో ఉన్న రాజు లందరూ చచ్చారు. చచ్చిన వారి కందరికీ ప్రేత కార్యాలు చేయించు," అన్నాడు.

ధృతరాష్ట్రుడి వెంట గాంధారీ, కుంతీ, ఇతర అంతఃపుర స్త్రీలూ ఏడుస్తూ యుద్ధ భూమికి వచ్చారు. ఈ సంగతి తెలిసి పాండవులు కృష్ణుణ్ణీ, సాత్యకినీ, యుయుత్సుణ్ణీ వెంటబెట్టుకుని అక్కడికి వచ్చారు.

ధర్మరాజు ధృతరాష్ట్రుడికి నమస్కరించి, ఆయనను చూడటానికి వచ్చిన వారందరి పేర్లూ చెప్పాడు. ధృతరాష్ట్రుడికి లోపల మండిపోతున్నది. ఆయన ధర్మరాజును కౌగలించుకుని, తరవాత భీముణ్ణి కౌగలించుకోబోయాడు. కృష్ణుడు భీముణ్ణి వెనక్కులాగి, ఇనప భీమ విగ్రహాన్ని ముందుకు తోశాడు. ధృతరాష్ట్రుడు ఆ విగ్రహాన్ని బలంగా కౌగలించుకునేసరికి, అది కాస్తా పిండి అయిపోయింది. అదే నిజంగా భీముడైతే చచ్చే ఉండేవాడు. ధృతరాష్ట్రుడి బలం వెయ్యి ఏనుగుల బలం! కాని ఇనప విగ్రహాన్ని నుగ్గు చేసి ధృతరాష్ట్రుడు ముక్కులా, నోటా నెత్తురు కక్కుతూ కింద పడిపోయాడు. తరవాత ఆయన, "అయ్యో, భీమా!" అంటూ దొంగ ఏడుపు సాగించాడు.

కృష్ణుడు ఆయనతో, "రాజా, విచారించకు. నువు నుగ్గు చేసినది భీముణ్ణి కాదు. ఇనప విగ్రహాన్ని," అన్నాడు. ఆ విగ్రహం దుర్యోధనుడు తన గదా యుద్ధాభ్యాసం కోసం చేయించినది.

తరవాత కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణి ఊరడించాడు.

"నా కిప్పుడు పాండవులు తప్ప కొడుకు లెవరున్నారు?" అంటూ ధృతరాష్ట్రుడు భీమార్జున నకుల సహదేవుల శరీరాలు నిమిరాడు.






యుద్ధం అయిపోయిన తరవాత పాండవులు గంగా తీరాన చచ్చిపోయిన బంధువులకు తిలోదకాలూ, దశదానాలూ మొదలయినవి చేసి, ఒక నెల రోజులు మైలపట్టి, ధృతరాష్ట్రుడితోనూ, విదురుడితోనూ, స్త్రీజనంతోనూ నగరం వెలపల ఒక పర్ణశాలలో నివసించారు.

తరవాత ధర్మరాజును చూడటానికి వ్యాసుడు మొదలైన మునులూ, వారి శిష్యులూ, బ్రాహ్మణులూ, గృహస్థులూ వచ్చారు.

ధర్మరాజు వారితో, "కృష్ణుడూ, భీమార్జునులూ నాకు విజయం కలిగించారు. కాని నాకు ఇది విజయంగా తోచటం లేదు. జ్ఞాతులను చంపుకున్నాను. అభిమన్యుణ్ణీ, ద్రౌపది కొడుకులనూ పోగొట్టుకున్నాను. నాకు ఈ రాజ్యభోగం ఏమి రుచిస్తుంది? ఇది ఇలా ఉండగా, మహాదాతా, మహావీరుడూ అయిన కర్ణుడు మాకు అన్న అని మా తల్లి తిలోదకాలప్పుడు బయటపెట్టింది. అలాటి మహారథుడు ఎందుకు చచ్చాడో తెలియరాదు," అన్నాడు.

అది విని నారదుడు కర్ణుడికి గల శాపాలను గురించి ధర్మరాజుకు తెలిపాడు.

కర్ణుడు ద్రోణుడి దగ్గిర విద్య నేర్చుకునేటప్పుడు అర్జునుడి విలువిద్యను చూసి అసూయపడేవాడు. అలాగే అతనికి ధర్మరాజు తెలివితేటలూ, భీముడి బాహు బలమూ, నకుల సహదేవుల

**60. చార్వాకవధ**



సౌజన్యమూ, కృష్ణార్జునుల మధ్య స్నేహమూ చూసి అసూయగా ఉండేది. ఆ కారణం చేతనే అతను దుర్యోధనుడి స్నేహం సంపాదించాడు.

ద్రోణుడికి శిష్యుడుగా ఉంటూ కర్ణుడు ఒకనాడు రహస్యంగా ద్రోణుడి వద్దకు వెళ్ళి, "గురువర్యా, మీకు శిష్యుల పట్ల పక్షపాత బుద్ధి లేదుగదా, యుద్ధంలో ఎలాగైనా అర్జునుణ్ణి జయించాలని నాకు తీవ్రమైన కోరిక ఉన్నది. నాకు బ్రహ్మాస్త్రం ప్రయోగ ఉపసంహారాలతో ఉపదేశించండి," అని కోరాడు.

ద్రోణుడు అర్జున పక్షపాతి. అందు చేత కర్ణుడితో, "నువు సూతుడి కొడుకువు. బ్రాహ్మణులకూ, క్షత్రియులకూ తప్ప బ్రహ్మాస్త్రం ఇవ్వరాదు," అన్నాడు.

ఈ మాట విని కర్ణుడు, మహేంద్రగిరి సమీపంలో తపస్సు చేసుకుంటున్న పరశురాముడి వద్దకు వెళ్ళి, సాష్టాంగ వందనం చేసి, "మహాత్మా, నేను భృగువంశానికి చెందిన బ్రాహ్మణ్ణి. నన్ను నీ శిష్యుడుగా స్వీకరించు," అన్నాడు. పరశురాముడు అందుకు సమ్మతించాడు. పరశురాముడు అతనికి అనేక శస్త్రాలూ, అస్త్రాలూ ఎలా ప్రయోగించాలో, ఎలా ఉపసంహరించాలో తెలిపాడు.

ఇలా ఉండగా ఒకనాడు కర్ణుడు తన ధనుర్బాణాలతో తన గురువు ఆశ్రమానికి సమీపంగా సముద్ర తీరాన తిరుగుతూ ఒక ఆవును చూసి, దాన్ని బాణంతో కొట్టి చంపాడు. అది ఒక బ్రాహ్మణుడి హోమధేనువని అతనికి తెలిసింది. వెంటనే కర్ణుడు ఆ బ్రాహ్మణుడికి క్షమాపణ చెప్పుకున్నాడు. కాని ఆ బ్రాహ్మణుడు శాంతించక, "యుద్ధంలో నీ రథచక్రం భూమిలో కుంగి, శత్రువు చేత దెబ్బతిని, నా ఆవు చచ్చినట్టు చావు," అని శాపం పెట్టాడు.

కర్ణుడు పరశురాముణ్ణి తన నిరంతర సేవలతోనూ, విద్యా కౌశలంతోనూ మెప్పించి, ఆయన వద్ద ధనుర్వేద మంతా



నేర్చుకుని, బ్రహ్మాస్త్రం ఉపదేశం పొందాడు. కాని ఒకనాడు ఒక వింత జరిగింది. పరశురాముడు కర్ణుడి తొడ మీద తల పెట్టుకుని నిద్రపోతున్నాడు. ఇంతలో ఏదో కీటకం కర్ణుడి తొడను తొలచసాగింది. కర్ణుడు బలవంతాన బాధ సహించుకుని, గురువుకు నిద్రా భంగం కలగకుండా ఉండగలందులకు నిశ్చలంగా కూర్చున్నాడు. అతని రక్తం కాలువలు కట్టింది.

తరవాత పరశురాముడు లేచి, రక్తం చూసి, కర్ణుడి తొడను కొరుకుతున్న పురుగును కళ్ళారా చూసిన మీదట, "ఓరీ, బ్రాహ్మణుడికి ఇంత సహనం ఉండదు. నువు నిజంగా ఎవరు?" అని అడిగాడు.

నిజం చెప్పకపోతే పరశురాముడు శపిస్తాడని భయపడి కర్ణుడు తాను సూత కులం వాణ్ణని చెప్పాడు. బ్రహ్మాస్త్రం కర్ణుడికి యుద్ధంలో స్ఫురించకుండా పరశురాముడు శాపం పెట్టాడు.

ఇన్ని శాపాలకు గురి అయి కూడా కర్ణుడు గొప్ప యోధుడనిపించుకున్నాడు. కళింగదేశంలోని రాజపురానికి రాజైన చిత్రాంగదుడి కుమార్తెకు స్వయంవరం జరిగినప్పుడు దుర్యోధనుడు ఆమెను బలాత్కారంగా ఎత్తుకుపోతూంటే మిగిలిన రాజులు అతనిపై యుద్ధానికి వచ్చారు. అప్పుడు కర్ణుడు అతనికి విజయం చేకూర్చిపెట్టాడు.

మరొకసారి కర్ణుడు ఎవరికీ జయించరాని జరాసంధుణ్ణే జయించి, అతని నుంచి మాలిని అనే గొప్ప నగరాన్ని కానుకగా పుచ్చుకున్నాడు. అతని పరాక్రమం చూసి ఇంద్రుడు అర్జునుడి క్షేమం కోసం అతని కవచకుండలాలు పట్టుకుపోయాడు. కర్ణుడు యుద్ధంలో చావటానికి ఇవన్నీ తోడ్పడ్డాయి.

నారదుడి నుంచి కర్ణుడి విషయాలు ఈ విధంగా తెలుసుకుని, యుద్ధంలో చచ్చిన వారినందరినీ తలుచుకుని ధర్మ

రాజు, "పిల్లల కోసం తల్లిదండ్రులు పడరాని పాట్లు పడతారు. వాళ్ళు భోగాలు అనుభవించటం కోసమే గదా తల్లులు తొమ్మిది నెలలు మోసి, ప్రసవవేదన అనుభవిస్తారు! భోగాలు అనుభవించకుండా ఎంతమంది యువకులు ఈ యుద్ధంలో దుర్మరణం పొందారు! ఛీ, క్షత్రియ ధర్మం! రాజ్యం కోసం ఎంత పాపానికి ఒడిగట్టాను! నాకీ రాజ్యం అక్కర్లేదు. అర్జునా, దీన్ని నువే ఏలుకో. నేను తీర్థయాత్రలు చేస్తాను," అన్నాడు.

ఈ మాటలలో అర్జునుడికి ఏదో అవమానం తోచి, కొంచెం కోపం కూడా వచ్చింది. అతను ధర్మరాజుతో, "అన్నా, మనం మన రాజ్యం తిరిగి సంపాదించుకునేటందుకు క్షత్రియధర్మాన్ని అవలంబించాం. తీరా రాజ్యం వచ్చాక బిచ్చం ఎత్తుకుంటాననటం అసందర్భంగా ఉన్నది. బిచ్చమే ఎత్తుకోదలిస్తే ఇంత మందినీ ఎందుకు చావనిచ్చినట్టు? ఇప్పుడు నువు బిచ్చమెత్తుతానంటే అందరూ నిన్ను చూసి నవ్వరా? దారిద్ర్యం కోరదగినది కాదని నహుషుడు చెప్పాడు. అన్ని ధర్మాలకూ మూలం ధనమే కదా! అందుచేత రాజ్యం స్వీకరించు. అశ్వమేధయాగం చేసి, అన్ని పాపాలూ పోగొట్టుకో," అని చెప్పాడు.



భీముడు అర్జునుడికి తోడై, "రాజధర్మాన్ని తిట్టటంలో అర్థమేమిటి? శత్రువులను చంపటంలో దయ ఏమిటి? హింస ఏమిటి? పని పెట్టుకుని దుర్యోధనుడు మొదలైన వాళ్ళను చంపినది బిచ్చం ఎత్తుకోవటానికా? ఈ సంగతి ముందే తెలిస్తే మేం ఆయుధాలు పట్టుతామా? ఇంతమందిని చంపుతామా? శక్తి కొద్దీ మేమూ బిచ్చమే ఎత్తుకునే వాళ్ళం. నుయ్యి తవ్వి నీరు ఉపయోగించననే వాడిలాగా మాట్లాడుతున్నావు. నిన్ను అనవలసిన పనిలేదు. నీ మాటకు కట్టుబడి బలవంతులమై కూడా అసమర్థులలాగా తిరగటం మాదే తప్పు.



ఈ మాటలు కట్టిపెట్టి రాజ్యం ఏలుకో,'' అన్నాడు. నకుల సహదేవులు కూడాధర్మ రాజును ఈ విధంగానే హెచ్చరించారు.

తరవాత ద్రౌపది ఇలా చెప్పింది:

''నీ తమ్ములు చెప్పినట్టు చెయ్యి. వాళ్లు అరణ్యవాసంలో పడరాని కష్టాలు పడుతున్నప్పుడు, ఈ కష్టాలు ఎల్లకాలం ఉండవనీ, త్వరలోనే దుర్యోధనుణ్ణి జయించి రాజ్యం సంపాదించుకొంటామనీ నువు వారిని ఓదార్చిన మాట గుర్తు తెచ్చుకో. అప్పుడు అలా అని ఇప్పుడు ఈ మాటలంటే వీరికి నిరుత్సాహం కలుగుతున్నది. పూర్వం నువు అనేక రాజ్యాలు జయించినది యుద్ధం చేసి కాదా? రాజ్యం సంపాదించటానికి మరో మార్గం ఏదైనా ఉన్నదా? ఇలాగే మాట్లాడితే, 'ధర్మరాజుకు మతిపోయింది,' అంటారు. అంబరీషుడూ, మాంధాతా లాటి మహామహులు రాజ్యాలు ఏలారు.''

ఇంకా అనేకమంది ఋషులు ధర్మరాజుకు హితోపదేశం చేశారు. వ్యాసుడు ధర్మరాజుతో, ''తనను చంపవచ్చిన వాడు వేద వేదాంగపారగుడైనా చంపవచ్చును. అందువల్ల బ్రహ్మహత్యా దోషం కలగదు,'' అని చెప్పాడు.

తన తమ్ములేగాక, దేవస్థానుడూ, వ్యాసుడూ, కృష్ణుడూ కూడా చెప్పిన మీదట ధర్మరాజు తన విచారానికీ, అనుమానాలకూ స్వస్తి చెప్పి, రాజ్యం ఏల నిశ్చయించాడు.

ధర్మరాజు కోసం రథం సిద్ధమయింది. దానికి పదహారు తెల్లని ఎద్దులు కట్టి, తెల్లని స్తంభాలు అమర్చారు. పగ్గాలు పట్టుకుని భీముడు సారథి స్థానంలో కూర్చున్నాడు. అర్జునుడు ధర్మరాజుకు తెల్లని గొడుగు పట్టాడు. నకుల సహదేవులు ఆయనకు వింజామరలు పట్టారు. ధర్మరాజు ఎక్కిన రథం వెనకగా యుయుత్సుడి రథం కదిలింది. దాని వెనక కృష్ణ సాత్యకులు రెండు గుర్రాలు లాగే రథంలో వెళ్ళారు. ఈ ఊరేగింపుకు



ముందుగా ఒక పల్లకిలో గాంధారీ, ధృత రాష్ట్రులూ, కౌరవ స్త్రీలూ, కుంతీ, ద్రౌపదీ వేరు వేరు వాహనాలలో విదురుడి వెంట బయలుదేరారు. వెనకగా చతురంగ బలాల సేన వచ్చింది. వందిమాగధులు స్తోత్రపాఠాలు చదువుతూండగా ధర్మ రాజు హస్తినాపురానికి చేరుకున్నాడు. నగరం అంతా చక్కగా అలంకరించి ఉన్నది. అంతటా తెల్లని పూల తోర ణాలూ, తెల్లని జెండాలూ ఉన్నాయి.

వైభవంగా ధర్మరాజు పుర ప్రవేశం చేసేటప్పుడు వేలకొద్దీ పౌరులూ, పౌర కాంతలూ చూడటానికి వచ్చి వీధుల నిండా నిలబడి, హర్షం వెలిబుచ్చారు. మంత్రులూ, తదితర ప్రముఖులూ వచ్చి, "రాజేంద్రా, మా భాగ్యం చేత నువు శత్రువులను జయించి, ధర్మంగా తిరిగి రాజ్యం పొందావు," అన్నారు. బ్రాహ్మ ణులు ధర్మరాజును ఆశీర్వదించారు.

ధర్మరాజు రాజమందిరం ప్రవేశించి, ధౌమ్యుడికీ, ధృతరాష్ట్రుడికీ నమస్క రించి, దేవతారాధన చేశాడు. ఇంతలో పెద్ద కలకలం పుట్టింది. దుర్యోధనుడికి మిత్రుడైన చార్వాకుడు అనే వాడు ధర్మరాజును సమీపించి, "జ్ఞాతులను చంపి నువు ఏమి అనుభవిస్తావు? నువు ఇలా బతకక పోతేనేం?" అన్నాడు.

ఈ మాట విని ధర్మరాజు సిగ్గు పడుతూ, బ్రాహ్మల కేసి తిరిగి, "నన్ను అనుగ్రహించండి. అసలే విచారంలో ఉన్న నన్ను నిందించ వద్దు," అన్నాడు.

దానికి బ్రాహ్మణులు, "రాజా, ఈ చార్వాకుడి అభిప్రాయం మా అభి ప్రాయం కాదు. వీడు దుర్యోధనుడి స్నేహితుడు. అందుకని ఇలా అంటు న్నాడు. నీకూ, నీ తమ్ములకూ అశుభం గలగబోదు," అని, అందరూ కలిసి ఆ చార్వాకుణ్ణి చంపేశారు. ధర్మరాజుకు మనశ్శాంతి కలగటానికి కృష్ణుడు, చార్వాకుడు కృతయుగంలో ఒక రాక్షసు డనీ, వాడు బదరీవనంలో తపస్సు చేసి

బ్రహ్మను ప్రత్యక్షం చేసుకుని, బ్రాహ్మల నుంచి తప్ప ఇతరుల వల్ల చావు లేకుండా వరంకోరాడనీ యుక్తిగా ఒక కథ చెప్పాడు.

తరవాత ధర్మరాజు యథావిధిగా రాజ్యాభిషిక్తుడయాడు. ధౌమ్యుడు ఒక వేదిక నిర్మింపజేసి, దాని పైన పులి చర్మం పరిపించి, దాని పైన ధర్మ రాజునూ, ద్రౌపదినీ కూర్చోబెట్టాడు. ధౌమ్యుడు అగ్ని చేసి, ధర్మరాజు చేత అందులో హోమం చేయించాడు. తర వాత కృష్ణుడు ఒక శంఖంతో ధర్మ రాజును అభిషేకించి, భూమి కంతటికీ రాజువు కమ్మన్నాడు. ఇందుకు ధృత రాష్ట్రుడూ, ప్రజలూ ఆమోదించారు. మంగళ ధ్వనులు మోగాయి. ధర్మరాజు బ్రాహ్మణ సత్కారం చేశాడు.

ఆయన ప్రజలతో, "మహాజనులారా. మహారాజు ధృతరాష్ట్రుడే మాకు దైవం. మాపై అభిమానం గల వారందరూ ఆయన శాసనాన్నే శిరసావహించాలి. మేము జీవించి ఉన్నది ఆయనకు సేవ చెయ్యటానికే. నాకూ, మీకూ కూడా ఆయనే ప్రభువు!" అన్నాడు.

తరవాత ధర్మరాజు భీముణ్ణి యువ రాజుగా ప్రకటించి, విదురుణ్ణి మంత్రిగా నియమించాడు. సంజయుడు కోశాధి కారీ, సలహాదారూ అయాడు. నకులుడు భృత్యుల వేతనాలు నిర్ణయించటానికీ, అర్జునుడు రాజ్యక్షేమం చూడటానికీ, ధౌమ్యుడు దేవబ్రాహ్మణ కార్యాలకూ నియుక్తులైనారు. సహదేవుడి పని అన్ని వేళలా ధర్మరాజు వెంట ఉండటం.

తరవాత, యుద్ధంలో చచ్చిన వారంద రికీ శ్రాద్ధాలు పెట్టారు, భూదానాలిచ్చారు. ధృతరాష్ట్రుడు తన కొడుకులకూ, ధర్మ రాజు ద్రోణుడికీ, కర్ణుడికీ, ధృష్టద్యుమ్ను డికీ, ఘటోత్కచుడికీ, అభిమన్యుడికీ, విడి విడిగా శ్రాద్ధాలు పెట్టారు. చచ్చిపోయిన వారి జ్ఞాపకార్థం ధర్మ సత్రాలూ, చలిపందిర్లూ, చెరువులూ నిర్మించారు. తరవాత ప్రజల క్షేమం పాటిస్తూ ధర్మరాజు రాజ్యం చేయసాగాడు.






తనకు రాజ్యం తిరిగి సంప్రాప్తం కావటానికి ముఖ్య కారకుడైన కృష్ణుడికి ధర్మరాజు తన కృతజ్ఞత తెలుపుకుని, అతన్ని స్తుతించాడు. తరవాత ఆయన తన తమ్ములతో, "నా మూలాన మీరు అరణ్యాలలో చెప్ప నలవిగాని కష్టాలు పడ్డారు. ఒక మాదిరివాళ్ళు ఆ కష్టాలకు తట్టుకుని ఉండరు. ఇప్పుడు మనం జయించాం. మీరు కొంతకాలం విశ్రాంతి తీసుకోండి. తరవాత మళ్ళీ కలుసుకుందాం," అన్నాడు.

ఆయన ధృతరాష్ట్రుడి అనుమతితో దుర్యోధనుడి భవనాన్ని దాసదాసీ జనంతో సహా భీముడికి నివాసంగా ఇచ్చాడు; అలాగే దుశ్శాసనుడి భవనాలు అర్జునుడికీ, దుర్మర్షణ దుర్ముఖుల ఎత్తయిన మేడలు నకుల సహదేవులకూ ఇచ్చాడు. వాళ్ళు తమ కొత్త ఇళ్ళలో ప్రవేశించారు. కృష్ణుడూ, సాత్యకీ అర్జునుడి ఇంటనే బసచేశారు.

కొద్ది రోజుల అనంతరం ధర్మరాజు కృష్ణుణ్ణి చూడబోయి, "మాకు రాజ్యమూ, ప్రతిష్ఠా లభించాయి గాని, మేం ధర్మహాని చేశామన్న అనుమానం ఇంకా బాధిస్తూనే ఉన్నది. ఈ అనుమానాన్ని దయచేసి రహితం చెయ్యి," అన్నాడు.

కృష్ణుడు కొంచెం సేపు ఆలోచించి, "నేను భీష్ముణ్ణి గురించి ఆలోచిస్తున్నాను, ఆయనకు తెలియని ధర్మం లేదు. అంపశయ్య మీద పడుకుని ఉన్న

61 భీష్ముడి మరణం



అ భీష్ముడు చచ్చిపోతే ఎంతో జ్ఞానం ఆయనతో నశించిపోతుంది. అందుచేత నువు త్వరగా అయన వద్దకు వెళ్ళి ధర్మ సందేహాలు అడిగి, ఆయన నుంచి అనేక విషయాలు నేర్చుకో." అన్నాడు.

దానికి ధర్మరాజు, "ఆయనను గురించి నీ కున్న అభిప్రాయమే నాకూ ఉన్నది. నువే మమ్మల్ని ఆ మహాను భావుడి వద్దకు తీసుకుపో. నిన్ను చూడాలని ఆయన కూడా కోరుతూ ఉండ వచ్చు." అన్నాడు.

కృష్ణుడు తన వెంట ఉన్న సాత్యకితో, "మనం ఇప్పుడే భీష్మణ్ణి చూడబోతున్నాం. రథం సిద్ధం చేయించు." అన్నాడు. తరవాత కృష్ణుడూ, సాత్యకి ఒక రథం మీదా, ధర్మరాజూ, అర్జునుడూ మరొక రథం మీదా, భీముడూ, నకుల సహదేవులూ ఇంకొక రథం మీదా ఎక్కి, భీష్ముడు పడి ఉన్న చోటికి వెళ్ళారు. కృపుడూ, యుయుత్సుడూ, సంజయుడూ వేరు వేరు రథాల మీద వెళ్ళారు.

దారిలో వారికి అయిదు మడుగులు కనిపించాయి. అవి పరశురాముడివి అని కృష్ణుడు ధర్మరాజుకు చెప్పాడు. ఇరవై ఒక్క సార్లు పరశురాముడు క్షత్రియులను వెతికి వెతికి చంపి, ఈ మడుగులు వారి రక్తంతో నిండితే, పరశురాముడు ఆ రక్తంతో పితృతర్పణాలు చేశాడట.

ధర్మరాజు కోరిన మీదట కృష్ణుడు పరశురాముడి కథ ఇలా చెప్పాడు:

జహ్నుడు అనే రాజర్షి వంశంలో పుట్టిన గాధి అనే వాడికి సత్యవతి అనే కూతురు కలిగింది, కాని కొడుకులు లేరు. సత్యవతిని భృగుడి కొడుకైన ఋచీకుడికి ఇచ్చి పెళ్ళిచేశారు. ఋచీకుడు తనకూ, తన మామగారికీ కొడుకులు కలగాలనే ఉద్దేశంతో హవిస్సు తయారుచేసి, దాన్ని రెండు భాగాలు చేసి, సత్యవతితో. "ఈ భాగం మీ అమ్మ

కిచ్చి, రెండో భాగం నువ్వు తిను. అలా చేస్తే మీ అమ్మకు మంచి పరాక్రమ వంతుడైన కొడుకు పుట్టి, క్షత్రియుల నందరినీ చెండాడి, రాజు అవుతాడు. నీకు పరమ శాంతుడైన బ్రాహ్మణోత్త ముడు పుట్టుతాడు,'' అని చెప్పాడు.

ఇది జరిగిన ఒకటి రెండు రోజులకే సత్యవతి తల్లి దండ్రులు ఋచీకుడి ఆశ్రమానికి, తీర్థ యాత్రలు చేస్తూ వచ్చారు. సత్యవతి తన తల్లితో తన భర్త చెప్పిన మాట చెప్పి, రెండు భాగా లుగా ఉన్న హవిస్సును ఆమె చేతికి ఇచ్చింది. సత్యవతి తల్లి తొందరపడి తన కూతురు తినవలసిన భాగాన్ని తాను తిని, తాను తినవలసిన భాగాన్ని తన కూతురికి పెట్టింది. ఆ సమయంలో అరణ్యానికి వెళ్ళి ఉండిన ఋచీకుడు ఇంటికి తిరిగివచ్చి, జరిగిన సంగతి తెలుసుకుని, ''మీ అమ్మ చేసిన పొర పాటు చేత నీ కడుపున మహా క్రూరు డైన క్షత్రియుడూ, మీ అమ్మ కడుపున బ్రాహ్మణుడూ పుడతారు,'' అన్నాడు.

సత్యవతి ఈ మాటకు ఎంతో విచా రించి, ''నీ తపశ్శక్తి చేత నా కడుపున క్రూరుడు పుట్టకుండా చూడాలి. వాడి కొడుకు కావలిస్తే క్రూరుడు కానీ.'' అన్నది. అలాగే చేస్తానన్నాడు ఋచీ



కుడు. సత్యవతికి శాంతుడైన జమదగ్ని, గాధి భార్యకు విశ్వామిత్రుడూ కలిగారు. జమదగ్నికి పరశురాముడు పుట్టాడు. పరశురాముడు పెరిగి పెద్దవాడై, గంధ మాదనంలో మహాదేవుణ్ణి ఆరాధించి, ఆ దేవుడి దయవల్ల అనేక అస్త్రాలూ, ఒక గండ్రగొడ్డలీ సంపాదించాడు.

ఇలా ఉండగా, హైహయ వంశానికి చెందిన కృతవీర్యుడి కొడుకు అర్జునుడు అనేవాడు దత్తాత్రేయుడి అనుగ్రహం వల్ల వెయ్యి చేతులు గలవాడై, రాజులందరినీ జయించి, అశ్వమేధ యాగం చేసి, బ్రాహ్మణులకు అంతులేని దానాలు చేస్తూ అగ్నిదేవుడికి పర్వతారణ్య



ప్రాంతాలు దానంచేశాడు. ఆ ప్రాంతాలను అగ్నిదేవుడు తగలబెట్టినప్పుడు వసిష్ఠుడి ఆశ్రమం కూడా కాలిపోయింది. అందుకు వసిష్ఠుడు అలిగి, "నా ఆశ్రమాన్ని అగ్ని ఎలా ధ్వంసం చేశాడో, ని చేతులను పరశురాముడు అలా ధ్వంసం చేస్తాడు." అని శాపం పెట్టాశాడు. ఈ శాపానికి అర్జునుడు ఏమాత్రమూ జంకలేదు.

పరశురాముడికీ, కార్తవీర్యార్జునుడికీ వైరం ఏర్పడటానికి కారకులు ఆ అర్జునుడి కొడుకులు. పొగరుబోతులైన వాళ్ళు పరశురాముడి ఆశ్రమానికి వెళ్ళి, పరశురాముడు లేని సమయంలో అతని హోమధేనువునూ, దాని దూడనూ బలాత్కారంగా తోలుకు పోయారు. అందువల్ల కలిగిన కోపంతో పరశురాముడు కార్తవీర్యార్జునుడి వెయ్యి చేతులూ నరికి, తన గోవునూ, దూడనూ తెచ్చుకున్నాడు.

హైహయులు ఆ పోట్లాటను అంతతో పోనివ్వక, పరశురాముడు ఆశ్రమంలో లేని సమయంలో మరొకసారి వచ్చి, జమదగ్ని తల నరికారు. పరశురాముడు మండిపడి, భూమి మీద క్షత్రియుడన్నవాడు లేకుండా చేస్తానని ప్రతిజ్ఞ చేసి, అర్జునుడి కొడుకులనూ, మనమలనూ మాత్రమే కాక, భూమిపైన క్షత్రియుడు అనేవాడు ఎక్కడ ఉన్నా, వెళ్ళి చంపేశాడు.

అంతటితో శాంతుడై పరశురాముడు వనానికి వెళ్ళి తపస్సు చేసుకుంటూ ఉండగా, ఒకసారి విశ్వామిత్రుడి కొడుకు పరావసువు అనేవాడు ఆయన వద్దకు వెళ్ళి, "క్షత్రియులనందరినీ చంపుతానని ప్రతిజ్ఞ చేశావు గాని, నెరవేర్చుకోలేదు. ప్రతర్దనుడు మొదలైన వాళ్ళు జీవించే ఉన్నారు." అన్నాడు.

పరశురాముడు మళ్ళీ ఆయుధాలు ధరించి బయలుదేరి, వృద్ధులనీ, పిల్లలనీ, కడుపులో ఉన్న పిండాలనీ కూడా



పాటించకుండా క్షత్రియులనందరినీ చంపాడు. ఇలా ఇరవైఒక్క సార్లు ప్రపంచంలో ఉన్న క్షత్రియులను హతమార్చి, పరశురాముడు అశ్వమేధయాగం చేసి, భూమినంతా కశ్యపుడికి దానం చేశాడు.

కశ్యపుడు భూమిని దానంగా పుచ్చుకుంటూ, "రామా, నీకు కూర్చునే మేర మాత్రం చోటు ఇస్తాను. అక్కడే కూర్చుని తపస్సు చేసుకో," అన్నాడు. ఆయన ఆ భూమి కంతటికీ బ్రాహ్మణులను రాజులుగా చేసి, తాను తపోవనానికి వెళ్లాడు. బ్రాహ్మణుల పరిపాలనలో అరాజకం ప్రబలి, బలవంతులు బలహీనులను పీడించసాగారు.

కశ్యపుడు ఈ సంగతి తెలిసి, భూమిని పాలించటానికి క్షత్రియుల కోసం వెతికితే చాలామంది దొరికారు. కొందరు హైహయులను వారి తల్లులు రహస్యంగా కాపాడారు. పురువంశానికి చెందిన విదూరథుడనేవాడు ఋక్షపర్వతం మీద పెరిగాడు. సౌదాసుడు అనేవాణ్ణి పరాశరుడు కాపాడాడు. శిబి కొడుకును గోవులు రక్షించాయి. అతనికి గోపతి అన్న పేరు వచ్చింది. ప్రతర్దనుడి కొడుకు వత్సుడనేవాడు బతికాడు. గౌతముడు గుప్తుడు అనేవాణ్ణి కాపాడాడు. బృహద్రథుణ్ణి కోతులు కాపాడాయి. మరుత్తవంశ క్షత్రియ కుమారులను సముద్రం రక్షించింది. ఇలా బతికిన వారంతా శిల్పకారుల జాతులలోనూ, సువర్ణకారుల జాతులలోనూ జీవిస్తూవచ్చారు.

కశ్యపుడు ఆ క్షత్రియులనందరినీ పిలిపించి, వారికి భూమి ఇచ్చి పాలించుకోమనిచెప్పాడు. త్వరలోనే భూమి మీద ఎక్కడ చూసినా కొత్త రాజవంశాలు వెలిశాయి.

కృష్ణుడు ఇలా చెప్పిన పరశురాముడి కథ విని ధర్మరాజు భీష్ముణ్ణి చూడబోయాడు. అప్పటికి ఉత్తరాయణం ఇంకా యాభైఆరురోజులున్నది. భీష్ముడు ధర్మరాజును ఊరడిస్తూ, యుద్ధంలో

శత్రువులను చంపటం ధర్మవిరుద్ధం కాదనీ, అది క్షత్రియ ధర్మమనీ చెప్పాడు. ఆయన తాను ప్రాణాలతో ఉన్నంత కాలమూ ధర్మరాజుకు అనేక ధర్మాలూ, ధర్మ సూక్ష్మాలూ, నీతులూ చెప్పి, చివరకు ప్రాణాలు వదిలాడు. అప్పుడొక చిత్రం జరిగింది! భీష్ముడి శరీరంలో ఏయే అంగాల నుంచి ప్రాణం పోతున్నదో ఆ అంగాల నుంచి బాణాలు వాటంతట అవే రాలి పడిపోయాయి. చూస్తూండగానే ఆయన శరీరంలో బాణాలన్నీ ఊడిపోయాయి. ఇది చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు.



దారుకర్రలూ, గంధద్రవ్యాలూ తెచ్చి పాండవులూ, విదురుడూ చితిపేర్చారు, భీష్ముడికి తెల్లబట్టలు కప్పి, పూలు చల్లారు. భీష్ముడి తెల్లగొడుగును యుయుత్సుడూ, ఆయన చామరాలను భీమార్జునులూ, ఆయన తలపాగాను నకుల సహదేవులూ పట్టుకున్నారు. ధర్మరాజూ, ధృతరాష్ట్రుడూ ఆయన పాదాలు పట్టుకున్నారు. భీష్ముడికి దహనసంస్కారం జరిగింది. అందరూ గంగాతీరం చేరారు. ధర్మరాజు జలతర్పణాలు విడిచాడు.

ఆయన కుప్పకూలిపోయి ఏడుస్తూంటే, కృష్ణుడి ప్రేరేపణతో భీముడు ఓదార్చాడు. అయితే అన్న దుఃఖం చూసి మిగిలిన పాండవులు కూడా ఏడ్చారు. అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజును ఊరడిస్తూ, ''నూరుమంది కొడుకులనూ, సమస్తాన్నీ పోగొట్టుకున్నందుకు నేనూ, గాంధారీ ఏడవాలిగాని నీకు విచారం దేనికి? రాజ్యం గెలుచుకున్నావు. నీకు బాధ్యతలు చాలా ఉన్నాయి. ఏడుస్తూ కూచోకు,'' అన్నాడు.

వ్యాసుడు ధర్మరాజుతో అశ్వమేధ యాగం చెయ్యమన్నాడు.

దానికి ధర్మరాజు, ''మహాత్మా, అశ్వమేధయాగం చేసి ఘనంగా దానాలు చెయ్యాలి. అల్పదానాలు నాకిష్టం లేదు.

గొప్ప దానాలు చెయ్యటానికి నా వద్ద ధనం లేదు. ప్రజలు చూడబోతే దీనులూ, పిల్లలూనూ. వారిని యాచించటం నాకు ఇష్టం లేదు. ఆత్మీయులను కోల్పోయి ఏడ్చేవాళ్ళ మీద పన్నులు ఏమని వెయ్యను ?'' అన్నాడు.

ధర్మరాజుకు పుష్కలంగా ధనం దొరికేమార్గం వ్యాసుడు చెప్పాడు. పూర్వం మరుత్తమహారాజు యాగం చేసి బ్రాహ్మణులకు దక్షిణ లిచ్చాడు. ఆ బ్రాహ్మణులు ఆ ధనమంతా హిమాలయం మీద వదిలేశారు. దాన్ని తెచ్చుకుంటే ధర్మరాజుకు చాలుతుందని వ్యాసుడు చెప్పాడు.

ధర్మరాజు మరుత్తుడి కథ వినగోరితే, వ్యాసుడు ఇలా చెప్పాడు:

త్రేతాయుగారంభంలో మనువు వంశాన కరంధముడు అనే రాజు బృహస్పతినే యాజకుడుగా పెట్టుకుని, నూరు అశ్వమేధాలు చేసి, ఇంద్రుడితో సమానుడనిపించుకున్నాడు.

అతని కొడుకు మరుత్తు తండ్రిని మించినవాడు. అతను యాగాలు చెయ్య సంకల్పించి, వేలకొద్దీ బంగారు పాత్రలు చేయించాడు. ఆ యజ్ఞంలో పాత్రలే కాక సమస్త ఉపకరణాలూ బంగారంతో చేసినవే. మరుత్తు అనేకమంది రాజులతో కలిసి, హిమాలయానికి ఉత్తరంగా, మేరుపర్వతానికి సమీపాన ఒక చిన్న కొండమీద యాగాలు చేశాడు.

ఈ యాగాలకు బృహస్పతి యాజకుడు కావలిసింది. కాని ఇంద్రుడు మరుత్తు పట్ల ఈర్ష్యగలవాడై బృహస్పతిని వారించాడు. అప్పుడు మరుత్తుడు బృహస్పతి తమ్ముడైన సంవర్తుణ్ణి యాజకుడుగా పెట్టుకున్నాడు. యజ్ఞం మహా వైభవంగా జరిగింది. తరవాత మరుత్తు బంగారం రాసులుగా పోసి, బ్రాహ్మణులకు దానాలు చేశాడు. అయినప్పటికీ ఇంకా ఎంతో మిగిలిపోయింది. ఆ బంగారాన్ని తెచ్చుకోమని వ్యాసుడు ధర్మరాజుకు చెప్పాడు.






ధర్మరాజు రాజ్యాభిషిక్తుడైన తరవాత కృష్ణుడు చాలాకాలం హస్తినాపురంలో ఉండి, తన తండ్రి అయిన వసుదేవుణ్ణి చూడాలనిపించి, సాత్యకినీ, సుభద్రనూ వెంటబెట్టుకుని ద్వారకకు తిరిగి వచ్చాడు.

వసుదేవుడు కృష్ణుడి ద్వారా యుద్ధ వార్తలన్నీ తెలుసుకుని, తన మనమడైన అభిమన్యుడి చావు విని చాలా బాధపడ్డాడు.

ఈ లోపల, ధర్మరాజు అశ్వమేధానికి అవసరమైన ధనాన్ని హిమవత్పర్వతం నుంచి తీసుకు రావటానికి సంకల్పించాడు. పాండవులు సేనలను కూర్చుకుని, ధృతరాష్ట్రుడి వద్దా, కుంతీ గాంధారీల వద్దా అనుమతి తీసుకుని, హిమవత్పర్వతానికి బయలుదేరారు. వాళ్ళు నదులూ, అరణ్యాలూ, పర్వతాలూ దాటి హిమాలయం చేరి, మరుత్తుడి ధనం దాచి ఉంచిన చోట విడిశారు. వాళ్ళు ఒక రాత్రి అంతా ఉపవాసమూ, జాగరమూ చేస్తూ దర్భచాపల మీద కూర్చుని ఉండి, మర్నాడు శివుడికీ, కుబేరుడికీ, మణిభద్రుడికీ అర్చనలు చేసి, భూతబలులు ఇచ్చి, నిధిని తవ్వారు. అందులో అనేకమైన చెంబులూ, గిన్నెలూ, బిందెలూ, మూకుళ్ళూ, పళ్ళాలూ ఉన్నాయి. అన్నీ బంగారంతో చేసినవి. వాటిని తీసుకుపోవటానికి అంతులేని ఒంటెలూ, గుర్రాలూ, వాహనాలూ, మనుషులూ అవసరమయింది. వాటితో పాండవులు హస్తినాపురానికి తిరిగి వచ్చారు.

**62: అశ్వమేధ యాగం**



అశ్వమేధానికి ప్రయత్నాలు ప్రారంభ మయినట్టు తెలిసి కృష్ణుడు, ప్రద్యుమ్నుణ్ణీ, సాత్యకి మొదలైన వారినీ వెంట బెట్టుకుని హస్తినాపురానికి బయలు దేరాడు. అతనితోబాటు సాంబుడూ, చారుదేష్ణుడూ, గదుడూ, కృతవర్మా, సుభద్రతో సహా బలరాముడూ కూడా బయలుదేరారు.

ధృతరాష్ట్రుడు విదురుడితో సహా ఎదురు వచ్చి, వారికి స్వాగతం చెప్పి, ఆహ్వానించాడు. కృష్ణుడు యుయుత్సుడి ఇంట బస చేశాడు.

ఈ సమయంలోనే ఉత్తర ప్రసవించింది. పుట్టిన పిల్లవాడు ఏడవలేదు, శవం లాగా ఉన్నాడు. అందరి సంతోషమూ అంతలోనే చల్లారి పోయింది. కృష్ణుణ్ణి పిలుచుకు రావటానికి కుంతి బయలుదేరేసరికి, సాత్యకితో సహా కృష్ణుడే వచ్చాడు. సుభద్రా, ద్రౌపదీ మొదలైన స్త్రీలు ఏడుస్తున్నారు.

కుంతి కృష్ణుణ్ణి చూసి గద్గద కంఠంతో, "కృష్ణా, నువే కాపాడాలి. ఆ అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రం మూలాన నీ మేనల్లుడి కొడుకు చచ్చి పుట్టాడు! వీణ్ణి బతికించు," అన్నది.

అదే విధంగా సుభద్రా, ఉత్తరా, ద్రౌపదీ కృష్ణుణ్ణి వేడుకున్నారు. ఉత్తర బొత్తిగా పిచ్చిపట్టిన దానిలాగా అయిపోయి, మూర్ఛపోయింది.

కృష్ణుడు తన పాదంతో ఆ పిల్లవాణ్ణి నిలువునా నిమిరాడు. అప్పుడా పిల్లవాడిలో చైతన్యం వచ్చింది. వెంటనే అందరికీ ఆనందం కలిగింది. బ్రాహ్మణులు బిడ్డను ఆశీర్వదించారు. పాండవ వంశం పరిక్షీణం కాకుండా కలిగాడు గనక ఆ పిల్లవాడికి పరీక్షిత్తు అని కృష్ణుడు పేరు పెట్టాడు. ఆ పిల్లవాడు దిన దిన ప్రవర్ధమానుడు కాసాగాడు.

పరీక్షిత్తుకు నెల నిండే సరికి పాండవులు ధనంతో తిరిగి వచ్చారు. వారు వస్తున్నారని తెలియగానే హస్తినాపురాన్ని

చక్కగా అలంకరించారు. యాదవులు పాండవులకు ఎదురు వెళ్ళారు. ఎక్కడ చూసినా నృత్యాలూ, గానాలూ జరుగు తూండగా పాండవులు హస్తినాపురం ప్రవేశించారు. వాళ్ళు తమకు మనమడు కలిగాడనీ, చచ్చి పుట్టిన ఆ శిశువును కృష్ణుడు బతికించాడనీ విని, కృష్ణుణ్ణి అభినందించారు.

తరవాత ధర్మరాజు, వ్యాసుడి అను మతీ, కృష్ణుడి అనుమతీ పొంది, అశ్వ మేధ యాగం చెయ్యటానికి ఉపక్ర మించి, చైత్రపౌర్ణమి నాడు యజ్ఞదీక్ష పూనాడు. యాగాశ్వాన్ని అశ్వలక్షణాలు తెలిసిన సూతులూ, బ్రాహ్మణులూ ఎన్నిక చెయ్యాలి. తరవాత దాన్ని దేశాల మీద వదలాలి. అది ప్రపంచమంతా తిరిగి రావాలి.

అశ్వమేధయాగం జరిగేకాలంలో ధర్మ రాజు దీక్షలో ఉంటాడు గనక, భీముడు నకులుడి సహాయంతో రాజ్యం చూడ టానికీ, అర్జునుడు యాగాశ్వం వెంట వెళ్ళి, దానికి రక్షకుడుగా ఉండటానికీ, సహదేవుడు కుటుంబ విషయాలు చూడ టానికీ ఏర్పాటయింది.

అశ్వరక్షకుడుగా పోబోతున్న అర్జు నుడితో ధర్మరాజు, "అర్జునా, గుర్రాన్ని రక్షిస్తూ దాని వెంట వెళ్ళేటప్పుడు ఏ క్షత్రియులైనా నిన్ను ఎదిరిస్తే వారితో వైరం రాకుండా మసులుకోవాలి. మనం చేయనున్న ఈ యాగానికి





వాళ్ళనందరినీ ఆహ్వానించు." అని చెప్పాడు.

ధర్మరాజు యజ్ఞదీక్ష వహించి స్వయంగా విడిచిన గుర్రం వెనకగా గాండీవం ధరించి అర్జునుడు బయలుదేరితే పురజనులు గుంపులు గుంపులుగా చూసి, ఆనందించారు. అర్జునుడి వెంట అశ్వపోషణ బాగా ఎరిగినవాడు, యజ్ఞవల్క్యుడి శిష్యుడు ఒకడూ, వేదపారగులైన కొందరు బ్రాహ్మణులూ, కొందరు క్షత్రియులూ కూడా బయలుదేరారు. యుద్ధంలో పాండవులు జయించిన భూమి అంతటా ఆ అశ్వం సంచారం చేసింది.

ఎవరితోనూ యుద్ధం చెయ్యవద్దని ధర్మరాజు చెప్పినప్పటికీ అర్జునుడు దారిలో అనేక యుద్ధాలు చెయ్యవలసి వచ్చింది. అతన్ని అనేక చోట్ల కిరాతులూ, యవనులూ ఎదుర్కొన్నారు. అనేక మంది ఆర్యక్షత్రియులు కూడా అతన్ని ప్రతిఘటించారు. అన్ని యుద్ధాలలోనూ అర్జునుడు గెలిచాడు.

భారతయుద్ధంలో అర్జునుడి చేత చచ్చిన త్రిగర్తుల కొడుకులూ, మనమలూ అరునుడు యాగాశ్వం వెంట రక్షకుడుగా వస్తున్నట్టు విని, స్పర్ధతో యుద్ధసన్నద్ధులై వచ్చి, అశ్వాన్ని పట్టుకోవటానికి వచ్చారు.

అర్జునుడు వాళ్ళతో మంచిగా మాట్లాడబోతే వాళ్ళు అతన్ని తమ బాణాలతో కొట్టారు. త్రిగర్తుల నాయకుడైన సూర్యవర్మతో అర్జునుడు యుద్ధం చెయ్యవలిసి వచ్చింది. అతను సూర్యవర్మనూ, కేతుధర్ముడు అనే వాణ్ణీ, ధృతవర్మ అనే వాణ్ణీ, ఇంకా పద్దెనిమిది మంది త్రిగర్తులనూ చంపిన మీదట మిగిలిన వాళ్ళు అతనికి లోబడ్డారు.

అలాగే ప్రాగ్జ్యోతిష పురంలో భగదత్తుడి కొడుకు వజ్రదత్తుడు అర్జునుడిపై యుద్ధం చేశాడు. అర్జునుడు అతన్ని ఓడించి కూడా, చంపక విడిచిపెట్టుతూ,

అతన్ని అశ్వమేధ యాగానికి ఆహ్వానించాడు.

తరవాత అతనికి సైంధవులతో యుద్ధం జరిగింది. అర్జునుడు ఆ సైంధవుల నందరినీ ఓడించాడు. భారతయుద్ధంలో అర్జునుడి చేత చచ్చిన సైంధవుడి భార్య దుశ్శల ధృతరాష్ట్రుడి కూతురు. ఆమె కొడుకు సురథుడు అర్జునుడు గుర్రం వెంట వస్తున్నాడని వింటూనే భయంతో ప్రాణాలు విడిచాడు.

ఇప్పుడు దుశ్శల తన మనమణ్ణి, పసివాణ్ణి, ఒక రథంలో పెట్టి అర్జునుడి వద్దకు తెచ్చి, "వీడు కూడా నీ మనమడు పరీక్షిత్తులాటి వాడే. వీణ్ణి చూసి, ఈ సైంధవులందరినీ క్షమించు. వీడి తాత మీకు చాలా ద్రోహం చేశాడు, అది మరిచిపో," అన్నది.

అర్జునుడు తనకు చెల్లెలైన దుశ్శలను కౌగలించుకుని, ఆమెనూ, ఆమె మనమణ్ణీ ఇంటికి పంపేసి, తాను గుర్రంతో బాటు ముందుకు సాగాడు.

కాలక్రమాన అశ్వం మణిపురం చేరింది. అప్పుడు మణిపురాన్ని ఏలుతున్నవాడు బభ్రువాహనుడు. అతను అర్జునుడికీ, చిత్రాంగదకూ పుట్టినవాడు. తన తండ్రి తన దేశంలోకి వచ్చాడని విని బభ్రువాహనుడు కొంతమంది బ్రాహ్మణులను వెంటబెట్టుకుని అర్జునుణ్ణి చూడటానికి వచ్చాడు.



అర్జునుడికి అతని ప్రవర్తన చూసి కోపం వచ్చి, "నువు క్షత్రియుడివి కావా? నేను చుట్టపు చూపుగా రాలేదు. అస్త్రాలు ధరించి యాగాశ్వాన్ని రక్షిస్తూ వచ్చాను. వీరుడవైతే అశ్వాన్ని పట్టి, నాతో యుద్ధం చెయ్యాలి గాని, తియ్యగా మాట్లాడటానికి వస్తావా?" అన్నాడు.

అప్పుడు ఉలూచి అక్కడికి వచ్చి, బభ్రువాహనుడితో, "నాయనా, నేను ఒక నాగస్త్రీని. నీకు తల్లిని. నీ తండ్రి యుద్ధ దుర్మదంతో ఉన్నాడు. యుద్ధం చేసి అతన్ని మెప్పించు," అన్నది.



బభ్రువాహనుడికి పౌరుషం వచ్చింది. అతను యుద్ధ వేషం ధరించి, రథం ఎక్కి అర్జునుడి పైకి యుద్ధానికి వచ్చాడు. మహా దారుణంగా యుద్ధం చేసి, ఇద్దరూ మూర్ఛపోయారు. చిత్రాంగద వచ్చి, తన భర్తా, కొడుకూ కూడా పడి పోవటం చూసి ఏడవసాగింది. కొంతసేప టికి బభ్రువాహనుడు తేరుకుని, అర్జునుడి కోసం ఏడుస్తున్న తన తల్లిని చూసి, తాను చేసిన పనికి పశ్చాత్తాప పడి, ప్రాయోపవేశం చేశాడు.

అప్పుడు ఉలూచి అతన్ని సమీపించి, "పిచ్చివాడా, నీ తండ్రి నీ చేతిలో చచ్చా డనుకుంటున్నావా? అతన్ని ఎవరూ జయించలేరు. నేను నా మాయచేత నీకు అలాటి భ్రమ కలిగించాను. ఈ మణిని తీసుకుపోయి అతనికి తాకించు. అతను వెంటనే లేస్తాడు," అన్నది. బభ్రువాహ నుడు మణిని తగిలించగానే అర్జునుడు నిద్ర లేచినట్టు లేచి కూర్చున్నాడు.

అర్జునుడు బభ్రువాహనుణ్ణి కౌగలించు కుంటూ ఉలూచి, చిత్రాంగదలు అక్కడే ఉండటం చూసి చాలా ఆనందించాడు. అతను వాళ్ళను, "ఈ యుద్ధరంగానికి మీరెందుకు వచ్చారు?" అని అడిగాడు.

దానికి ఉలూచి, "అర్జునా, నువు భీష్ముణ్ణి అక్రమంగా చంపటం చేత నీకు పాపం చుట్టుకున్నది. అది పరిహారం కావటానికి నేను నిన్ను నీ కొడుకు చేత చంపించాను," అన్నది.

అర్జునుడు ఈ మాట విని సంతోషించి, బభ్రువాహనుణ్ణి అశ్వమేధయాగానికి ఆహ్వానించాడు. బభ్రువాహనుడు ఒక రాత్రి తనతో తన యింట అతిథిగా ఉండ మని అర్జునుణ్ణి ఆహ్వానించాడు. కాని అర్జునుడు తాను గుర్రం వెంట తిరగక తప్పదన్నాడు.

యాగాశ్వం సముద్రం దాకా వెళ్ళి, ఇంద్రప్రస్థానికి తిరిగి రాసాగింది. అది మగధ రాజధాని అయిన రాజగృహం చేరింది. అక్కడ రాజుగా ఉన్న మేఘ

సంధి అనేవాడు అర్జునుడి మీదికి యుద్ధానికి వచ్చి, యుద్ధం చేసి, అర్జునుడి చేతిలో ఓడిపోయాడు.

అర్జునుడు అతనితో, "చిన్నవాడివైనా చక్కగా యుద్ధం చేశావు. నిన్ను చంపటం నా కిష్టం లేదు. వచ్చే చైత్రపౌర్ణమికి మా అన్న ధర్మరాజు అశ్వమేధయాగం చేయబోతున్నాడు. దానికి నువు రావాలి," అన్నాడు.

ఈ విధంగా అర్జునుడు గుర్రం వెంబడి పోతూ మ్లేచ్ఛులతోనూ, ఏకలవ్యుడి నిషాదులతోనూ, శకుని కొడుకైన గాంధార రాజుతోనూ, ద్రావిడులతోనూ, ఆంధ్రులతోనూ, ఓఢ్రులతోనూ యుద్ధాలు చేసి అందరినీ గెలిచి, హస్తినాపురానికి తిరిగి వచ్చాడు.

చైత్రపౌర్ణమి తిరిగి రాబోతున్నది. ఒక మాసం ముందు నుంచీ యాగప్రయత్నాలు జరిగాయి.

యాగానికి అంతులేని జనం వచ్చారు. వారిలో అనేకమంది వేదవేత్తలూ, రాజులూ ఉన్నారు. కృష్ణ బలరాములు తమ వెంట సాత్యకినీ, ప్రద్యుమ్నుణ్ణీ, సాంబుణ్ణీ, గదుణ్ణీ, కృతవర్మనూ, ఇతర ప్రముఖ యాదవులనూ తెచ్చారు. చిత్రాంగదనూ, ఉలూచినీ వెంట బెట్టుకుని బభ్రువాహనుడు వచ్చాడు.

అశ్వమేధయాగం చాలా వైభవంగా జరిగింది. ధర్మరాజు వచ్చిన వారి కందరికీ గొప్పగా దానాలు చేశాడు. అందరూ యజ్ఞాన్ని మెచ్చుకుని, ధర్మరాజు చేసిన దానాలను కీర్తిస్తున్నారు. ఆ సమయంలో ఒక ముంగిస అక్కడికి వచ్చి, "మీరంతా ఈ యజ్ఞాన్ని మెచ్చుకుంటున్నారు గాని, ఉంఛవృత్తితో జీవిస్తూ కురుక్షేత్రంలో నివసించిన ఒక ముని చేసిన పేలపిండి దానం ఇంతకన్న ఎంతో గొప్పది," అన్నది.

ముంగిస అన్న ఈ మాటలకు అందరూ ఆశ్చర్యపోయి, "నువు ఎవరు? ఎక్కడి నుంచి వస్తున్నావు? ఇంత శాస్త్రోక్తంగా జరిగిన యాగంలో నువు ఏం వంక కని పెట్టావు? నిజం చెప్పు," అని అడిగారు.





# మహాభారతం

ధర్మరాజూ, యాజ్ఞికులూ అడిగిన దానికి ముంగిస ఇలా చెప్పింది:

"నేను అబద్ధం చెప్పలేదు. ఈ యాగం పేలపిండి దానంతో సమం కాదు. ఇది నేను స్వయంగా చూసిన సంగతి. రాలిన గింజలు ఏరుకుని కురుక్షేత్రంలో నివసించిన మునీ, ఆయన భార్యా, కొడుకూ, కోడలూ కూడా స్వర్గానికి వెళ్లారు. ఆయన వల్లనే నా శరీరంలో సగం భాగం బంగారంగా మారిపోయింది.

"నేను చెప్పిన బ్రాహ్మణుడు తన భార్యతోనూ, కొడుకుతోనూ, కోడలితోనూ ఉంఛవృత్తితో, పక్షులు జీవించినట్టుగా, జీవిస్తూ ఉండేవాడు. రోజుకు ఒక్కసారి వాళ్ళు ఆహారం తీసుకునేవారు.

"కరువు వచ్చింది. చెట్లూ చేమలూ మాడిపోయాయి. ఆ కుటుంబానికి రోజుకు ఒకసారి తినే అవకాశం కూడా పోయింది. ఒకనాటి మధ్యాన్నం తీక్ష్ణమైన ఎండలో కాలుతూ వాళ్ళు కొంత యవధాన్యం సంపాదించారు. దాన్ని వాళ్ళు పిండికొట్టి, నాలుగు ముద్దలు చేసి, నలుగురూ పంచుకుని తినబోతూండగా వాళ్ళ కుటీరానికి ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చాడు.

"ఆకలి మీద వున్న ఆ బ్రాహ్మణుణ్ణి వాళ్ళు లోపలికి ఆహ్వానించి, అర్ఘ్యపాద్యాలిచ్చి, దర్భాసనం మీద కూర్చోబెట్టారు. గృహస్థు తన అతిథికి తనవంతు పేలపిండి ముద్ద ఇచ్చాడు. అతిథి దాన్ని ఆరగించి ఇంకా ఆకలి తీరనట్టు

63. ధృతరాష్ట్రుడి వానప్రస్థం



కనబడ్డాడు. అప్పుడు బ్రాహ్మణుడి భార్య తనవంతు ఆహారం కూడా అతిథికి ఇచ్చింది. ఆ అతిథి బ్రాహ్మణుడి కొడుకు వంతూ, కోడలివంతూ ఆహారం కూడా తిని, సంతోషించి, తాను యమధర్మ రాజునని తెలుపుకుని, అందరికీ స్వర్గ ప్రాప్తి కలిగినట్టు చెప్పాడు.

''అయ్యలారా, అప్పుడు నేను నా బిలంలో నుంచి పైకి వచ్చాను. ఆ పేలపిండి వాసన సోకటం చేతా, అక్కడి నీటిలో తడవటం చేతా నా తలా, సగం శరీరమూ బంగారంగా మారి పోయాయి. ఇక్కడ గొప్ప యాగం జరుగుతున్నదని తెలిసి, నా మిగిలిన శరీరం కూడా బంగారం చేసుకుందామని ఎంతో ఆశతో వచ్చాను. కాని నా ఆశ ఫలించలేదు.''

ఇలా చెప్పి ఆ ముంగిస అక్కడే అదృశ్యమయింది.

ధర్మరాజు తన తమ్ములతో సహా రాజ్య పాలన చేస్తున్నాడు. ధృతరాష్ట్రుణ్ణి విదురుడూ, సంజయుడూ, యుయుత్సుడూ, కృపుడూ కనిపెట్టుకుని ఉండేవారు. కుంతి ఎప్పుడూ గాంధారి వెంట ఉండేది. ద్రౌపదీ, సుభద్రా, పాండవుల ఇతర భార్యలూ వారిద్దరినీ కనిపెట్టుకుని ఉండేవారు. వ్యాసుడు తరచుగా వచ్చి, కథలు చెప్పి పోతూండేవాడు. ఏ విషయంలో గాని ధర్మరాజు ధృతరాష్ట్రుడి మాటకు ఎదురు చెప్పేవాడు కాడు; ఆయన ఏది కోరినా సమకూర్చేవాడు. గాంధారీ, ధృతరాష్ట్రులకు పుత్రవియోగం జ్ఞాపకం రాకుండా ఉండే విధంగా పాండవులు మసలుకునేవారు. భీముడు మాత్రం ధృతరాష్ట్రుడంటే కసిగా ఉండేవాడు.

ధృతరాష్ట్రుడు దాన ధర్మాలు చేసేవాడు, బ్రాహ్మణులకు అగ్రహారాలిచ్చేవాడు. ఆయనకు అయిష్టంగా ప్రవర్తించిన వారిని శిక్షిస్తానని ధర్మరాజు తన కొలువు చేసేవారికి స్పష్టం చేశాడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే ధృత

రాష్ట్రుడి కొడుకులు బతికి ఉంటే ఎలా జరిగిపోయేదో, అలాగే జరుగుతూ వచ్చింది. గాంధారీ ధృతరాష్ట్రులు కూడా పాండవులను తమ కొడుకులలాగే చూసుకునేవారు.

ఇలా పదిహేనేళ్ళు గడిచింది. ధృతరాష్ట్రుడికి గాని, గాంధారికి గాని ఏలోటూ లేకపోయినా, భీముడు అవకాశం దొరికినప్పుడల్లా అనే శూలాల లాటి మాటలు అప్పుడప్పుడూ వారి చెవిన పడి, బాధ కలిగేది. ఈ సంగతి ధర్మరాజుకు తెలియదు.

ఒకనాడు ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో, ''నాయనా, ఇంతకాలమూ నన్ను ఎంతో బాగా చూశావు. ఎన్నో దానధర్మాలు చేశాను. క్షత్రియ ధర్మం అవలంబించి చనిపోయిన నా కొడుకులు ఉత్తమ లోకాలు పొందారు. వారికి నేను శ్రాద్ధాలు పెట్టాను. ఇక నా వల్ల వారికి జరగదగిన మేలు ఏమీలేదు. నాకు లాభించే పుణ్యం సంపాదించుకోవాలి. నువు సరేనంటే, వానప్రస్థం పోదామనుకుంటున్నాను. గాంధారి కూడా నా వెంట ఉంటుంది. నేను వనంలో ఉండే నిన్ను ఆశీర్వదిస్తూ ఉంటాను,'' అన్నాడు.

అందుకు ధర్మరాజు ఒప్పుకోక, ''నువు వనంలో కష్టాలు పడుతుంటే నేను



సుఖంగా రాజ్యం చెయ్యలేను. నువు ఉపవాసాలు చేస్తూ, కటిక నేల మీద పడుకుంటే నన్నూ, నా తమ్ములనూ లోకం నిందించదా? నాకీ రాజ్యం వద్దు, భోగాలు వద్దు. రాజ్యం యుయుత్సుడికిస్తాను,'' అన్నాడు.

''నాకు తపస్సు చేసుకోవాలని ఉన్నది. మన వంశం వారికి వనవాసం పరిపాటే. నేను నీ దగ్గిర చాలాకాలం ఉన్నాను. ముసలివాణ్ణి, నా వనవాసానికి నువు ఒప్పుకోవచ్చు,'' అన్నాడు ధృతరాష్ట్రుడు. ఆయన వానప్రస్థం వెళ్ళాలని పట్టుబట్టటమే గాక, ధర్మరాజు అందుకు ఒప్పుకోకపోతే భోజనం చెయ్యనన్నాడు.



ఆ సమయంలో వ్యాసుడు వచ్చి ధర్మ
రాజుతో ధృతరాష్ట్రుణ్ణి వనానికి వెళ్ళ
నియ్యమన్నాడు. అప్పుడు ధర్మరాజు
సరేనని, ధృతరాష్ట్రుడి చేత భోజనం
చేయించాడు.

ధృతరాష్ట్రుడు వనవాసం వెళ్ళుతున్నట్టు
తెలిసి, హస్తినాపురంలోని అన్ని వర్ణాల
వారు ఆయనను చూడ వచ్చారు. ధృత
రాష్ట్రుడు ప్రజలతో, ''నేనూ, గాంధారీ
కలిసి వనవాసం పోబోతున్నాం. అందుకు
మీరు అనుమతించాలి. దుర్యోధనుడి
కంటె ధర్మరాజు బాగా పరిపాలిస్తున్నా
డని నా నమ్మకం. ఈ భూమిని మొదట
శంతనుడూ, తరవాత భీష్ముడూ, విచిత్ర
వీర్యుడూ పాలించారు. నేను కూడా మీకు
కొంత సేవ చేశాను. ఎలా చేశానో నాకు
తెలియదు. అందులో ఏవైనా లోపా
లుంటే క్షమించండి. మా దుర్యోధనుడు
దుర్బుద్ధి అయి క్షత్రియ వినాశం తెచ్చి
పెట్టాడు. అందులో నా దోషం కూడా లేక
పోదు. అదంతా మరిచి పొమ్మని నేను
మీకు చేతులు మోడ్చి వేడుకుంటున్నాను.
ఇక నుంచీ ధర్మరాజు మిమ్మల్ని పరిపా
లిస్తాడు.'' అన్నాడు.

ఈ మాట విని పౌరజానపదుల ప్రతి
నిధిగా ఒక బ్రాహ్మణుడు ధృతరాష్ట్రుడితో,
''రాజా, నువు మా ఎడల ఎంతో మైత్రితో
ప్రవర్తించావు. మీ వంశం వారెవరూ
మాకు ఎలాటి లోపమూ చెయ్యలేదు.
దుర్యోధనుడు కూడా మాకు ఎలాటి
ద్రోహమూ చెయ్యలేదు. నువు వనవాసం
వెళితే మేం చిరకాలం సంతాపం
పొందుతాం. యుద్ధం తెచ్చి పెట్టినందుకు
మేం దుర్యోధనుణ్ణి తప్పుపట్టం. కురు
క్షయానికి దేవుడు తప్ప మరెవరూ కార
కులు కారు. ధర్మరాజు సత్పురుషుడు.
ఆయన మమ్మల్ని వెయ్యేళ్ళు పాలిం
చాలని కోరుకుంటున్నాం.'' అన్నాడు.

మర్నాడు ఉదయం విదురుడు ధర్మ
రాజు వద్దకు వచ్చి, ''ధృతరాష్ట్రుడు
కార్తీకమాసంలో వనవాసం పోతాడు.

పోయేముందు ఆయన భీష్ముడికీ, సోమదత్తుడికీ, బాహ్లికుడికీ, తన కొడుకులకూ, ద్రోణుడికీ, సైంధవుడికీ, మిత్రులకూ శ్రాద్ధాలు పెడతాడు. అందుకు కొంత ధనం కోరుతున్నాడు,'' అని చెప్పాడు.

ధనం ఇయ్యటానికి ధర్మరాజూ, అర్జునుడూ సంతోషంగా ఒప్పుకున్నారు. కాని భీముడు మాటాడలేదు. అర్జునుడు అతనితో, ''నువు కూడా కొంత ధనం ఇయ్యి. ధృతరాష్ట్రుడు వానప్రస్థం వెళ్ళిపోతూ, శ్రాద్ధాలకని మనని ధనం యాచిస్తున్నాడు. మనం ఒకప్పుడు ఆయనను రాజ్యం కోసం యాచించిన వాళ్ళమే కదా?'' అన్నాడు.

దానికి భీముడు, ''భీష్ముడికీ, సోమదత్తుడికీ, బాహ్లికుడికీ, భూరిశ్రవుడికీ, ద్రోణుడికీ, ఇతరులకూ శ్రాద్ధాలు చెయ్యటానికి డబ్బు ఇయ్యవచ్చు. కర్ణుడి కోసం కుంతి డబ్బు ఇస్తుంది. దుర్యోధనాదులకు దేనికి? వాళ్ళు ఉత్తమ లోకాలకు పోకపోతేనేం? మనని పడరాని కష్టాలు పెట్టారే!'' అన్నాడు.

ధర్మరాజు భీముడితో, ''ఇక చాలించు!'' అని, విదురుడితో, ''ఈ భీముడు బాధపడనవసరం లేదు. ధృతరాష్ట్రుడు కోరిన ధనమంతా నేనే ఇస్తాను,'' అన్నాడు.



తరవాత ధృతరాష్ట్రుడు పెద్ద ఎత్తున శ్రాద్ధయజ్ఞం చేసి, ధర్మరాజు చేత అంతులేని దానాలు చేయించాడు. ఈ పని ముగిసిన మర్నాడు ధృతరాష్ట్రుడు గాంధారితో సహా కార్తీకపూజ చేసి, నారబట్టలు ధరించి వానప్రస్థం బయలుదేరాడు. ఆయనకు ముందుగా అగ్నిహోత్రాలు నడిచాయి. ఆయన వెంట కౌరవ, పాండవ స్త్రీలు బయలుదేరారు. ఆయన వెళ్ళిపోతున్నందుకు పాండవులు ఏడ్చారు. కుంతి గాంధారిని చెయ్యి పట్టుకుని నడిపించింది. ద్రౌపదీ, సుభద్రా, పరీక్షిత్తుతో సహా ఉత్తరా, నగరంలోని స్త్రీలూ వెంట నడిచారు. విదురుడూ,



సంజయుడూ ధృతరాష్ట్రుడితో బాటు వెళ్ళటానికి అనుమతి పొందారు.

ధృతరాష్ట్రుడు నగర ద్వారం దాటి, యుయుత్సుణ్ణీ, కృపుణ్ణీ వెనక్కు తిరిగి వెళ్ళమన్నాడు. ఒకరొకరే వెనక్కు తగ్గారు. చివరకు ధర్మరాజు మాత్రమే మిగిలాడు. అతను కుంతితో, "అమ్మా, నువు తిరిగి వెళ్ళు. నేను ఈ మహారాజు వెంట వెళతాను," అన్నాడు.

కాని కుంతి గాంధారీ ధృతరాష్ట్రుల వెంట వెళ్ళ నిశ్చయించుకున్నది. ఆమె ధర్మరాజుతో, "నాయనా. ఈ గాంధారీ ధృతరాష్ట్రులు నా అత్తమామల లాటి వాళ్ళు. వీళ్ళను సేవిస్తూ, నేను కూడా తపస్సు చేసుకుంటాను," అన్నది. పాండవులందరూ ఆమెను వారించ జూశారు. కాని ఆమె వారి మాట వినలేదు. చేసేదిలేక పాండవులు ద్రౌపదితో సహా హస్తినాపురానికి తిరిగి వచ్చారు.

ధృతరాష్ట్రుడు సాయంకాలం దాకా నడిచి గంగాతీరాన ఒక చోట నిలిచాడు. బ్రాహ్మణులు అగ్నిహోత్రాలు చేశారు. తరవాత విదురుడూ, సంజయుడూ ఆయనకూ, గాంధారికీ దర్భలతో పడకలు ఏర్పాటు చేశారు.

విదురుడి సలహాపై ఆ గంగా తీరంలోనే ధృతరాష్ట్రుడికి పర్ణశాల ఏర్పాటయింది. అక్కడ కొద్దికాలం ఉండి, ధృతరాష్ట్రుడు కురుక్షేత్రంలోని ఒక ఆశ్రమం చేరాడు. అక్కడ శతయూపుడనే రాజర్షి ఉంటున్నాడు; ఆయన తన కొడుక్కు రాజ్యం అప్పగించి, వానప్రస్థం వచ్చేశాడు. ధృతరాష్ట్రుడు తపశ్చర్యలు సాగించాడు. ఆయనను చూడటానికి ఎవరైనా వచ్చినప్పుడు వారికి కుంతి సపర్యలు చేసేది. ధృతరాష్ట్రుడు తపస్సు చేసుకుంటూ, మధ్య మధ్య అనేక కథలు వింటూ ఉండేవాడు.

ధృతరాష్ట్రుడు వెళ్ళిపోవటంతో హస్తినాపుర వాసులకు నగరం చిన్నబోయినట్టు తోచింది. వాళ్ళు ఎప్పుడూ ఆ ముసలి

రాజును గురించే మాట్లాడుకోసాగారు. ఇక పాండవుల సంగతి వేరే చెప్పనవసరం లేదు. ధృతరాష్ట్రుడే గాక, తమ తల్లి అయిన కుంతి కూడా వెళ్ళి పోవటంతో వాళ్ళు జీవచ్ఛవాలలాగా తయారయారు.

అందరికన్నా ముందు బయటపడిన వాడు సహదేవుడు. అతను కుంతిని చూడాలని తహతహలాడసాగాడు. ద్రౌపది కూడా ధర్మరాజుతో, "ఆడవాళ్ళందరూ గాంధారీ ధృతరాష్ట్రులనూ, కుంతీదేవినీ చూడాలని కోరుతున్నారు," అన్నది.

వెంటనే ధర్మరాజు ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి ప్రయాణం ఏర్పాటు చేశాడు. పౌరులు రాదలచుకుంటే రావచ్చునని ఆయన ప్రకటించాడు.

ఒక మహాసేన బయలుదేరింది. రథాల మీదా, గుర్రాల మీదా, ఒంటెల మీదా, కాలినడకనా జనం బయలుదేరారు. ఆడవాళ్ళు పల్లకిలలో ఎక్కి వెళ్లారు. యుయుత్సుడూ, ధౌమ్యుడూ మాత్రం రాజభవనంలో ఉండిపోయారు.

పాండవుల రాక తెలిసి కొందరు ఆశ్రమవాసులు వారిని చూడ వచ్చారు. ధర్మరాజు వారిని, "మా పెద్ద తండ్రి ధృతరాష్ట్రుడు ఎక్కడ?" అని అడిగాడు.

ధృతరాష్ట్రుడు స్నానం చెయ్యటానికీ, పుష్పోదకాలు తీసుకురావటానికీ



యమునానదికి వెళ్లినట్టు వాళ్లు చెప్పారు. పాండవులు వాళ్ళు చెప్పిన మార్గంగా వెళ్ళి దూరాన ధృతరాష్ట్రుణ్ణీ, గాంధారినీ, కుంతినీ చూశారు. సహదేవుడు వేగంగా పరిగెత్తివెళ్ళి, తల్లి కాళ్ళు పట్టుకుని ఏడవ నారంభించాడు. ఆమె కూడా కన్నీరు కార్చుతూ, అతన్ని లేవనెత్తి, కౌగలించుకుని, సహదేవుడు వచ్చాడని గాంధారికి చెప్పింది. ఇంతలో ఆమెకు మిగిలిన పాండవులు కూడా కనిపించారు.

తరవాత పాండవులూ, వారి భార్యలూ తన చుట్టూ కూచుని ఉంటే ధృతరాష్ట్రుడికి తాను మళ్ళీ హస్తినాపురంలో ఉన్నట్టే అనిపించింది. ఆశ్రమంలో ఉండే

మునులందరూ పాండవులను చూడ వచ్చారు. సంజయుడు వారిని విడి విడిగా ఆ మునులకు పరిచయంచేశాడు. ధర్మరాజు ధృతరాష్ట్రుణ్ణి కుశలప్రశ్నలు వేసి, ''విదురుడు కనపడటం లేదేం? ఆయన ఎక్కడ?'' అని అడిగాడు.

''విదురుడు తిండి మాని, ఘోర తపస్సు చేసి కృశించాడు. అతను దిగంబరుడుగా వనంలో సంచారం చేస్తూ, అప్పుడప్పుడూ కనిపిస్తున్నట్టు బ్రాహ్మ ణులు చెబుతున్నారు.'' అన్నాడు ధృతరాష్ట్రుడు.

ఆయన ఇలా అంటూండగానే దూరాన విదురుడు ఆశ్రమానికి తిరిగివస్తూ కని పించాడు. ధర్మరాజు ఒంటరిగా విదు రుడి కేసి వెళ్ళాడు. విదురుడు కీకా రణ్యం మధ్య కనబడుతూ, కనపడ కుండా పోతూ ఉండటం గమనించి ధర్మరాజు, "అయ్యా, విదురా! నీ కోసమే వస్తున్నాను.'' అని కేకపెట్టి ముందుకు పరిగెత్తాడు.

విదురుడు అరణ్యం మధ్య ఒక శూన్య ప్రదేశంలో నిలిచాడు. ''నేను ధర్మరాజును,'' అంటూ ధర్మరాజు ఆయనకు ఎదురుగా నిలబడ్డాడు. విదురుడు దాదాపు గుర్తించ రానంతగా క్షీణించిపోయాడు. విదురుడు రెప్పవేయ కుండా ధర్మరాజు కేసి చూడసాగాడు. విదురుడి అవయవాలు తన అవ యవాలతో చేరిపోతున్నట్టూ, విదురుడి ప్రాణాలు తన ప్రాణాలతో ఐక్యమవు తున్నట్టూ ధర్మరాజుకు అనుభూతి కలిగింది.

తరవాత కొద్దిసేపటికి విదురుడి శవం ఒక చెట్టుకు చేరగిలబడి ధర్మరాజుకు కనిపించింది. ధర్మరాజు విదురుడి కళే బరానికి దహనసంస్కారం చేద్దామను కున్నాడు, కాని యతులకు దహన సంస్కారం లేదు. అందుచేత ఆ ప్రయ త్నంమాని, ఆశ్రమానికి తిరిగివచ్చి, జరిగిన సంగతి అందరికీ తెలిపాడు. అందరూ అమితంగా ఆశ్చర్యపడ్డారు.





# మహాభారతం

ధృతరాష్ట్రుడు తన అతిథులకు తాను తినే దుంపలూ, పళ్ళూ పెట్టాడు. ఆ రాత్రి పాండవులు తమ తల్లికి నాలుగు వైపులా పడుకున్నారు. మర్నాడు వాళ్ళు స్త్రీలనూ, పురోహితులనూ వెంటబెట్టుకుని చుట్టుపట్ల ప్రదేశాలు చూడబోయారు. ఒక చోట అగ్నివేదికలు కనిపించాయి. అగ్నులు మండుతున్నాయి. వాటిలో మునులు హోమాలు చేస్తున్నారు. అక్కడ మృగాలు గుంపులు గుంపులుగా, ఎలాటి భయమూ లేకుండా సంచరిస్తున్నాయి. అలాగే రకరకాల పక్షులు కూడా స్వేచ్ఛగా సంచరిస్తున్నాయి. పాండవులు ఆ ఆశ్రమం పర్యటించి, అక్కడి మునులకు వివిధ చర్మాలూ, కంబళాలూ ఇచ్చి, ధృతరాష్ట్రుడి వద్దకు తిరిగి వచ్చారు.

ఆ సమయంలో వ్యాసుడు తన శిష్యులతో సహా అక్కడికి వచ్చాడు. ఆయన ధృతరాష్ట్రుడితో, "వనవాసం నీకు సుఖంగా ఉంటున్నదా? పుత్రశోకం నిన్నిప్పుడు బాధించటం లేదు గదా? గాంధారి నీ మూలాన కష్టాలు పడటం లేదు గద? కుంతి మిమ్మల్ని చక్కగా కనిపెట్టి ఉంటున్నది గద?" అని కుశలం అడిగాడు.

తరవాత ఆయన విదురుణ్ణి గురించి చెబుతూ, "విదురుడే ధర్మరాజు. మాండవ్యమహాముని శాపం చేత యమ ధర్మరాజు విదురుడుగా నీకు తమ్ముడై

64. ధృతరాష్ట్రుని మరణం



పుట్టాడు. ఆ యమధర్మరాజే తన యోగ బలంతో ధర్మరాజు కూడా అయాడు. అందుకే విదురుడు ధర్మరాజులో ఐక్యమయాడు. అందుకోసం అతను తన యోగ బలాన్ని ఉపయోగించుకున్నాడు." అన్నాడు.

పాండవులు తమ పరివారంతో సహా ఆ ఆశ్రమంలో నెల రోజులు గడిపారు. ఆ తరవాత మళ్ళీ వ్యాసుడు అక్కడికి వచ్చాడు. కథలతో అందరికీ మంచి కాలక్షేపం జరిగింది. అంతలో అక్కడికి నారదుడూ, పర్వతుడూ, దేవలుడూ, విశ్వావసుడూ, తుంబురుడూ, చిత్రసేనుడూ వచ్చారు. ధృతరాష్ట్రుడి అనుమతితో ధర్మరాజు వారినందరినీ సత్కరించాడు. వ్యాసుడూ, ఇతర అతిథులూ, పాండవులూ, ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ, ద్రౌపదీ, సుభద్రా మొదలైన స్త్రీలూ కూర్చున్నారు. ప్రాచీన మహర్షుల కథలూ, దేవాసురుల కథలూ చెప్పుకున్నారు.

ఒకసారి ధృతరాష్ట్రుడు వ్యాసుడితో, "మీరు రావటం వల్ల నా జన్మ సఫలమయింది. నాకు పరలోక భయంలేదు. కాని, నన్ను వేధిస్తున్న దేమిటంటే, నా కొడుకుల పాపబుద్ధి మూలంగా పుణ్యాత్ములైన పాండవులు అవమానం పొందారు. ఎందరో యువకులు యుద్ధంలో ప్రాణాలు పోగొట్టు కున్నారు. యుద్ధంలో చచ్చిన నా కొడుకులకూ, వారి కొడుకులకూ ఏం గతి కలుగుతుందో? రాత్రింబవళ్ళు నా కిదే మనోవేదన. అందు చేత నాకు శాంతి లేకుండా ఉన్నది." అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఇలా అనే సరికి గాంధారికి దుఃఖం పొంగి వచ్చింది. ఆమెతో బాటు కుంతీ, ద్రౌపదీ, సుభద్రా, ఇతర స్త్రీలూ ఏడవసాగారు. గాంధారి చేతులు జోడించి వ్యాసుడికి నమస్కారం చేసి, "మా కొడుకులు పోయి పదహారేళ్ళయింది. ఇంత కాలమూ నా భర్త వారి కోసం దుఃఖిస్తూనే ఉన్నాడు. ద్రౌపది

తన కొడుకుల కోసమూ, అన్నల కోసమూ ఏడుస్తున్నది. సుభద్ర అభిమన్యుడి కోసం ఏడుస్తున్నది. ఈ భూరిశ్రవుడి భార్య తన మామగారినీ, భర్తనూ, కొడుకునూ పోగొట్టుకుని ఏడుస్తున్నది. మా కొడుకుల భార్యలు నూరుగురూ ఏడుస్తున్నారు. ఇంత మంది దుఃఖమూ పోగొట్టే ఉపాయం ఉంటే చూడండి." అన్నది.



వ్యాసుడు కుంతిని, "నీ మనసులో ఏదో ఉన్నది. ఏమిటది?" అని అడిగాడు. తాను కర్ణుడి కోసం దుఃఖిస్తున్నట్టు కుంతి చెప్పింది.

వ్యాసుడు గాంధారితో, "నువు నీ కొడుకులనూ, బంధువుల నందరినీ చూస్తావు. కుంతి కర్ణుణ్ణి, సుభద్ర అభిమన్యుణ్ణి, ద్రౌపది తన కొడుకులనూ, తండ్రినీ, అన్నలనూ చూస్తారు. ఈ ఆలోచన నాకు ముందే ఉన్నది. దాన్ని నువూ, కుంతీ బయటికి లాగారు. మీరు ఎవరి కోసమూ దుఃఖించే అవసరం లేదు. భారత యుద్ధంలో చనిపోయిన వారందరూ వేరు వేరు అంశలతో పుట్టిన దేవతలూ, రాక్షసులూనూ. ధృతరాష్ట్రుడు ఒక గంధర్వ రాజు. పాండురాజు మరుత్తుల గణానికి చెందినవాడు. విదురుడూ, ధర్మరాజూ యముడి అంశన పుట్టిన వాళ్ళు. దుర్యోధనుడు కలి, శకుని ద్వాపరం. దుశ్శాసనుడు మొదలైన వారందరిదీ రాక్షసాంశ. భీముడు వాయువు అంశనా, అర్జునుడు నరు డనే మహర్షి అంశనా, నకుల సహదేవులు అశ్వినుల అంశనా, అభిమన్యుడు చంద్రుడి అంశనా, ద్రౌపదీ ధృష్టద్యుమ్నులు అగ్ని అంశనా పుట్టారు. శిఖండిది రాక్షసాంశ. బృహస్పతి అంశన ద్రోణుడూ, శంకరుడి అంశన అశ్వత్థామా పుట్టారు. భీష్ముడు వసువులలో ఒకడు. మీరందరూ భాగీరథీ తీరానికి వెళ్ళండి. యుద్ధంలో చనిపోయిన వారి నందరినీ అక్కడ మీకు చూపించి, మీ దుఃఖం పోగొట్టుతాను." అన్నాడు.



ఈ మాటలు వినే సరికి అందరికీ గొప్ప ఉత్సాహం పుట్టుకొచ్చింది. అందరూ గంగాతీరానికి బయలుదేరారు. ధృతరాష్ట్రుడు పాండవులనూ, మునులనూ, ఇతరులనూ వెంట తీసుకుపోయాడు. అందరూ గంగా తీరం చేరి, తగిన ప్రదేశంలో పగలంతా విశ్రమించారు. సూర్యుడు అస్తమించాడు. అందరూ స్నానాలు చేసి, కాలకృత్యాలు నిర్వర్తించారు.

అనంతరం అందరూ వ్యాసుడి వద్ద చేరారు. అప్పుడు వ్యాసుడు గంగా జలంలో మునిగి, పాండవ, కౌరవ యోధులనూ, భారత యుద్ధంలో చనిపోయిన నానా రాజులనూ రమ్మని పిలిచాడు.

వెంటనే నదీతీరం వెంబడి పెద్ద కలకలం వినిపించింది. పూర్వంలాగే కౌరవ పాండవ సేనలు కనిపించాయి. భీష్ముడూ, ద్రోణుడూ మొదలైన వారు ఒక్కరొక్కరే నదిలో నుంచి రాసాగారు. విరాటుడూ, ద్రుపదుడూ, ఉప పాండవులూ, అభిమన్యుడూ, ఘటోత్కచుడూ, కర్ణుడూ, దుర్యోధనుడూ మొదలైన వారందరూ పూర్వం ఏయే వేషాలలో యుద్ధానికి వెళ్ళారో ఆ వేషాలతో, అవే వాహనాలపైన గంగ నుంచి వెలువడి వచ్చారు. వారి మధ్య ఇప్పుడు వైరాలేమీ లేవు. వ్యాసుడు తన తపశ్శక్తితో ధృతరాష్ట్రుడికి దివ్యదృష్టి ఇచ్చాడు. గాంధారీ ధృతరాష్ట్రు లిద్దరూ తమ వారినందరినీ చూడగలిగారు. మిగిలిన వాళ్ళకు కూడా, చచ్చిపోయిన వారంతా ఇలా తిరిగి రావటం మహాద్భుతమనిపించి, గగుర్పాటు కలిగింది.

బతికున్న వారు చచ్చిపోయిన వారిని కలుసుకుని ఎంతో ఆనందించారు. పాండవులు కర్ణుణ్ణీ, అభిమన్యుణ్ణీ, ఉప పాండవులనూ కలుసుకున్నారు. ఆ రాత్రి అందరికీ ఎంతో సంతోషంగా గడిచింది. తరవాత చచ్చిన వారంతా ఎలా వచ్చారో



అలాగే గంగలో ప్రవేశించి అదృశ్యమై పోయారు. ఎవరెవరు ఏయే లోకాల నుంచి వచ్చారో ఆ లోకాలకు తిరిగి వెళ్ళిపోయారు.

వ్యాసుడు బతికున్న కౌరవ కాంతలతో, "మీలో ఎవరైనా భర్తల వెంట వారుండే లోకాలకు పోదలిస్తే నదిలో ప్రవేశించండి," అన్నాడు. ధృతరాష్ట్రుడి కోడళ్ళు తమ అత్తమామల అనుమతితో గంగలో ప్రవేశించారు.

ఈ సంఘటన జరిగిన అనంతరం ధృతరాష్ట్రుడి దుఃఖం పూర్తిగాపోయింది. ఆయన తన ఆశ్రమానికి తిరిగి వెళ్ళాడు. నెల రోజులకు పైగా తన వెంట ఉన్న పాండవులను ఆయన హస్తినాపురానికి తిరిగి వెళ్ళమనీ, రాజ్యం చూసుకోమనీ హెచ్చరించాడు. ధర్మరాజుకు వెళ్ళిపోవాలని లేదు, రాజ్యం చెయ్యాలనీ లేదు. రాజ్యం శూన్యంగా ఉన్నది. ధర్మరాజు లాగే సహదేవుడికి కూడా కుంతిని వదిలిపెట్టి పోవటం ఇష్టం లేదు. కాని కుంతి వాళ్ళను హస్తినాపురానికి తిరిగి పొండి అని గట్టిగా చెప్పింది. వాళ్ళు వెళ్ళక తప్పలేదు. ధృతరాష్ట్రుడు పాండవులను అయిదుగురినీ కౌగలించుకుని, వీడ్కోలు చెప్పాడు. ధర్మరాజు సపరివారంగా హస్తినాపురానికి బయలుదేరాడు.

తరవాత కొంతకాలానికి ధర్మరాజును చూడటానికి నారదుడు వచ్చాడు. ధర్మరాజు ఆయనకు సకలమర్యాదలూ చేసి, కుశల ప్రశ్నలు చేశాడు. తాను గంగా తీరాన తపోవనాలు చూసి వస్తున్నానని నారదుడు చెప్పేసరికి, ధర్మరాజు, "మా పెత్తండ్రి కనిపించాడా? కులాసాగా ఉన్నాడా? గాంధారీ, కుంతీ, సంజయుడూ ఎలా ఉన్నారు?" అంటూ అడిగాడు.

దానికి నారదుడు ఇలా చెప్పాడు:

"ధర్మరాజా, మీ అన్నదమ్ములు వచ్చేసిన అనంతరం ధృతరాష్ట్రుడు గాంధారీ, కుంతీలతో కురుక్షేత్రం నుంచి గంగా

ద్వారం వెళ్ళాడు. సంజయుడూ, యాజకులైన బ్రాహ్మణులూ అగ్నిహోత్రాలు తీసుకుపోయారు. గంగాద్వారం వద్ద నీ పెత్తండ్రి వాయుభక్షణ అవలంబించి ఆరుమాసాల పాటు కఠోరమైన తపస్సు చేశాడు. గాంధారి జలాహారం తీసుకున్నది. కుంతి మాసోపవాస వ్రతం పట్టింది. సంజయుడు రోజుకు ఒక్క భోజనం చేశాడు. యాజకులు మాత్రం విడవకుండా అగ్నిహోత్రాలు వ్రేల్చారు. తరవాత ధృతరాష్ట్రుడు ఎవరినీ పాటించకుండా వనాలలో తిరగసాగాడు. సంజయుడు ఆయనకు తోడు వెళ్ళాడు. గాంధారీ, కుంతీ ఆయన వెనకనే తిరిగారు. కుంతి గాంధారిని కనిపెట్టుకుని ఉండేది. ఇంతలో ఒకనాడు ధృతరాష్ట్రుడు గంగలో స్నానం చేసి, తన ఆశ్రమం కేసి వస్తూండగా, అరణ్యం అంతా అంటుకున్నది.

కార్చిచ్చు తమకు సమీపంలోకి వచ్చిందని తెలిసి ధృతరాష్ట్రుడు సంజయుడితో, "నువు అగ్నిలేని దిక్కుగా వెళ్ళిపో. మేం ఈ అగ్నిలో కాలి ఉత్తమ గతికి పోతాం," అన్నాడు.

సంజయుడు ఆదుర్దాగా, "రాజా, నువు అగ్నిలో మరణించటం నాకిష్టం లేదు. అగ్ని చూడబోతే చుట్టుముట్టింది. ఏం చెయ్యాలి?" అన్నాడు.



"సంజయా, తపస్వులు గాలీ, నీరూ, నిప్పూ—దేనితోనైనా చావటానికి ఇష్టపడతారు. నువు తాత్సారం చెయ్యక వెళ్ళిపో," అన్నాడు ధృతరాష్ట్రుడు.

సంజయుడు ధృతరాష్ట్రుడికీ, కుంతీ గాంధారీలకూ ప్రదక్షిణం చేసి, వారిని యోగ సమాధిలోకి పొమ్మని చెప్పాడు. ముగ్గురూ అలాగే చేశారు. సంజయుడు కార్చిచ్చులో నుంచి బయట పడి గంగా తీరాన ఆశ్రమాలకు చేరుకుని నారదుణ్ణి చూశాడు. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ కార్చిచ్చులో కాలిపోయారు. ఈ సంగతి నారదుడికి చెప్పి, సంజయుడు హిమాలయానికి వెళ్ళాడు.

ఈ వార్త తెలియగానే పాండవులతో బాటు నగరంలో అందరూ శోకించారు. కార్చిచ్చుకు కారణమైన అగ్ని ధృతరాష్ట్రుడి దేననీ, తన అగ్నితోనే తాను మరణించి ధృతరాష్ట్రుడు ఉత్తమ గతి పొందాడనీ నారదుడు ధర్మరాజును ఊరడించాడు.

ధర్మరాజు గంగను చేరి చనిపోయిన వారికి జలతర్పణాలు విడిచాడు. తరవాత శ్రాద్ధం పెట్టి, పన్నెండో నాడు దానాలు చేశాడు. భారత యుద్ధం ముగిసిన పద్దెనిమి దేళ్ళకు ధృతరాష్ట్రుడు పోయాడు. అందులో చివరి మూడేళ్ళు ఆయనకు వనవాసంలో గడిచాయి.

ధృతరాష్ట్రుడు పోయిన అనంతరం మరో పద్దెనిమిదేళ్ళు ధర్మరాజు రాజ్యం చేశాడు. ఆ సమయంలో ఆయనకు ఒక దారుణవార్త చేరింది; ముసలం (రోకలి) మూలాన యాదవు లందరూ చచ్చిపోయారట; కృష్ణుడూ, బలరాముడూ మాత్రమే మిగిలారట!

ధర్మరాజు తన తమ్ములను పిలిపించి, "యాదవు లందరూ తమలో తాము కొట్టుకుని చచ్చారట. ఇప్పుడేం చెయ్యాలి?" అని అడిగాడు.

యాదవ వినాశం ఎలా జరిగిందంటే:

ఒక సారి విశ్వామిత్రుడూ, కణ్వుడూ, నారదుడూ ద్వారకకు వెళ్ళారు. వాళ్ళు రావటం చూసి సారణుడు మొదలైన యాదవులు కొందరు సాంబుడికి ఆడవేషం వేసి ఆ మునులకు చూపించి, "ఈవిడ గర్భిణి. ఈవిడ భర్త కొడుకు కావాలం టున్నాడు. ఈమెకు ఏ బిడ్డ పుట్టేదీ చెప్పండి," అని అడిగారు.

దానికి మునులు, "వృష్ణి, అంధక కులను నాశనం చేసే ముసలం ఒకటి సాంబుడికి పుట్టుతుంది," అని జవాబు చెప్పారు.

తరవాత ఆ మునులు కృష్ణుణ్ణి కలుసుకుని, జరిగినది చెప్పారు. కృష్ణుడు అది తెలుసుకుని మునులు శపించినట్టే జరుగుతుందని నిశ్చయం చేసుకున్నాడు.





# మహాభారతం

మర్నాడే సాంబుడికి ముసలం పుట్టింది. ఆ ముసలాన్ని చూర్ణం చేసి, ఆ చూర్ణాన్ని సముద్రంలో పారేయించమని కృష్ణుడు ఉత్తరు విచ్చాడు. తరవాత అతను ఎవరూ తాగరాదనీ, తాగినవాళ్ళను కొరత వేయిస్తాననీ ప్రకటన చేశాడు.

వృష్ణి అంధకులు ఎంత జాగ్రత్తగా ఉన్నప్పటికీ, దుశ్శకునాలు కనిపించాయి. ఎక్కడ చూసినా ఎలుకలు చెలరేగాయి. యాదవులలోనే అవలక్షణాలు తలఎత్తాయి. పెద్దలంటే ఆదరం పోయింది. భార్యాభర్తలు పరస్పరం తిట్టుకో సాగారు. భోజనంలో పురుగులు కనిపించసాగాయి. ఇలాంటి శకునాలే భారతయుద్ధం జరగబోయే ముందు కూడా కనిపించి, ప్రజాక్షయం సూచించాయి. ఇది గుర్తుతెచ్చుకుని కృష్ణుడు, యాదవుల నందరినీ సముద్ర తీరానికి తీర్థయాత్రకు బయలుదేరదీశాడు.

తీర్థయాత్రకు సన్నాహాలు జరిగాయి. పెద్ద ఎత్తున మద్య మాంసాలు తయారు చేశారు. ఏనుగుల మీదా, గుర్రాలమీదా, రథాల మీదా యాదవులు సకుటుంబంగా బయలుదేరి, సముద్ర తీరానికి వచ్చి చేరి, అక్కడ విడుదులు ఏర్పాటు చేసుకున్నారు. అక్కడ ప్రభాస తీర్థం ఉన్నది.

వృష్ణి వంశం వాడూ, కృష్ణుడికి ఆప్తుడూ అయిన ఉద్ధవుడు యాదవ

65. యాదవనాశనం

వీరులను సముద్రం ఒడ్డుకు తీసుకు పోయాడు. అక్కడ వాళ్ళు ఆకాశం బద్దలయేటట్టు ఆర్భాటం చేస్తూ తాగటం ప్రారంభించారు. కృష్ణ, బలరాములతో సహా అందరూ తెగతాగారు.

తాగిన ఆవేశంలో యుయుధానుడు కృతవర్మతో, "నిద్రపోతున్న ఉపపాండవులు మొదలైన వాళ్ళను చంపావు గదా. యాదవుడైన వాడు ఎన్నడూ అలా చేయడు," అన్నాడు. మాట మీద మాట పెరిగింది. యాదవులు తాము తాగే పాత్రలతో ఒకరి నొకరు కొట్టుకో సాగారు. వంశ కలహం ప్రారంభమయింది. ప్రద్యుమ్నుడు భోజుల మీదికి వెళ్ళాడు. భోజులు సాత్యకినీ, ప్రద్యుమ్నుణ్ణీ చంపారు. కృష్ణుడికి కోపం వచ్చింది. అతను ఇంత గడ్డి పీకి దానితోనే అనేక మందిని చంపాడు. ఆ గడ్డి ముసలం లాగా పనిచేసింది. అందరూ ఆ గడ్డినే పీకి ఒకరి నొకరు చంపుకున్నారు. ఈ కొట్టుకోవటంలో ఒక క్రమం కూడా లేకుండా పోయింది. తండ్రి కొడుకునూ, కొడుకు తండ్రినీ కూడా చంపుకోవటం జరిగింది.

తన కొడుకులూ, మనమలూ చావటం చూసి కృష్ణుడు, ప్రాణాలతో మిగిలి ఉన్న వారినందరినీ చంపేశాడు. అప్పుడు కృష్ణుడి సారథి అయిన దారుకుడూ, బభ్రువు అనే వాడూ కృష్ణుడితో, "అందరూ చచ్చారు. మనం యిక్క



డెందుకు; పోయి బలరాముణ్ణి వెతుకుదాం,'' అన్నారు.

ఆ ముగ్గురూ వెతుకుతూ పోగా, వారికి బలరాముడు ఒక చెట్టు కింద కనిపించాడు. కృష్ణుడు దారుకుడితో, ''నువు వెంటనే హస్తినాపురానికి పోయి యాదవులంతా మునుల శాపం తగిలి చచ్చారని చెప్పు. అర్జునుడు తప్పక వస్తాడు,'' అన్నాడు.

దారుకుడు రథం మీద బయులుదేరాడు. కృష్ణుడు బభ్రువుతో, ''నువు ఆడవాళ్ళను కాపాడు. బంగారం కోసం దొంగలు వాళ్ళను ఎత్తుకుపోవచ్చు,'' అన్నాడు. కాని బభ్రువు కూడా కృష్ణుడు చూస్తూండగానే, ఒక బోయవాడు వదిలిన బాణం తగిలి చచ్చాడు. అందు చేత కృష్ణుడు బలరాముడితో, ''నేను ఆడవాళ్ళను ద్వారకలో చేర్చి వస్తాను. నువు ఇక్కడే ఉండు,'' అని స్త్రీలను వెంటబెట్టుకుని నగరానికి వెళ్ళి, స్త్రీలను తన తండ్రికి అప్పగించి, "నేను ఈ నగరంలో ఉండలేను. బలరాముడూ, నేనూ తపస్సు చేసుకుంటాం,'' అని తండ్రికి నమస్కారంచేసి, బలరాముడి వద్దకు తిరిగివచ్చాడు.

బలరాముడు నిర్జన ప్రాంతంలో యోగసమాధిలో ఉన్నాడు. కృష్ణుడు చూస్తూండగానే ఒక తెల్లని సర్పం బలరాముడి ముఖం నుంచి వచ్చి, సముద్రంలో ప్రవేశించింది. ఆ సర్పానికి





స్వాగతం చెప్పటానికి వరుణుడూ, ఇతర సర్పాలూ ఎదురు వచ్చాయి.

తరవాత కృష్ణుడు దారీ తెన్నూ లేకుండా తెగతిరిగి, ఒక చోట పడుకున్నాడు. ఇంతలో జరుడు అనే బోయవాడు వేటాడుతూ అటుగా వచ్చి, కృష్ణుణ్ణి దూరం నుంచి చూసి ఏదో మృగమనుకుని, కృష్ణుడి పాదాన్ని బాణంతో కొట్టాడు. అప్పుడు కృష్ణుడు తన శరీరాన్ని విడిచిపెట్టి, తన తేజస్సుతో భూమ్యాకాశాలు నిండగా ఆకాశంలోకి వెళ్ళిపోయాడు. ఇంద్రుడూ, సమస్త దేవతలూ అతనికి ఎదురు వచ్చి తీసుకుపోయారు.

కృష్ణుడు పంపిన దారుకుడు కురుదేశాలు చేరి, పాండవులను కలుసుకుని, యాదవ వంశాలు నాశనమైన సంగతి చెప్పాడు. పాండవులు అది విని మహా దుఃఖించారు. అర్జునుడు దారుకుడి వెంట ద్వారకకు వెళ్ళి, అనాథలైన యాదవ స్త్రీలను చూశాడు. వాళ్ళు అర్జునుణ్ణి చూసి గొల్లున ఏడ్చారు. ఆ స్థితిలో వాళ్ళను అర్జునుడు చూడలేక పోయాడు. అర్జునుడు సత్యభామనూ, రుక్మిణినీ ఊరడించి, వసుదేవుడి వద్దకు వెళ్ళాడు.

వసుదేవుడు అర్జునుణ్ణి కౌగలించుకుని, ''నాయనా, మేటి రాక్షసులను చంపిన నా కొడుకులు పోయారు. నేనింకా జీవించే ఉన్నాను. నీ శిష్యులైన ప్రద్యుమ్నుడూ, సాత్యకీ మూలంగా యాదవ వంశం నాశన మయింది. ఎవరినీ తప్పు పట్టే పనిలేదు. మునుల శాపం తగిలింది. కృష్ణుడు ఉపేక్షించాడు. నువు వస్తావనీ, నువు చెప్పినట్టు చెయ్యమనీ కృష్ణుడు నాతో చెప్పి వెళ్ళాడు.'' అన్నాడు.

తరవాత అర్జునుడు దారుకుడి వెంట యాదవ సభకు వెళ్ళి, మంత్రులతో, "ద్వారక సముద్రంలో మునిగిపోతుంది. నేను అందరినీ ఇంద్రప్రస్థానికి తీసుకుపోతాను. వాహనాలు సిద్ధం చెయ్యండి. ధనరాసులు పోగుచెయ్యండి. మీకు రాజు

కాబోయే వజ్రుడు ఇంద్రప్రస్థంలో ఉంటాడు. అందరూ ప్రయాణ సన్నాహం చెయ్యండి. అలస్యం వద్దు,'' అని చెప్పాడు.

ఆ మర్నాడే వసుదేవుడు యోగ సమాధిలోకి పోయి, ప్రాణాలు వదిలాడు. వసుదేవుడి భార్యలు దేవకి, రోహిణీ, భద్రా, మదిరా ఆయనతో సహగమనం చేశారు. వసుదేవుడికి ఇష్టమైన ప్రదేశం లోనే ఆయనను దహనం చేశారు. తరవాత వజ్రుడు మొదలైన వృష్ణి, అంధక కుమారులు జలతర్పణాలు విడిచారు.

తరవాత అర్జునుడు యాదవులందరూ చచ్చిపోయిన చోటికి వెళ్ళి, వారికి ఉత్తర క్రియలు చేశాడు. ఏడవ రోజున అతను ప్రయాణ మయాడు. స్త్రీలూ, చావగా మిగిలిన వారూ అతని వెంట బయలు దేరారు. రథాల మీదా, ఏనుగుల మీదా, కాలినడకనా వీరంతా పోతూ ఉంటే వీరి వెనకగా సముద్రం ద్వారకను ముంచుతూ వచ్చింది.

అర్జునుడు అక్కడక్కడా మజిలీలు చేస్తూ పంచనదం చేరాడు. అంత మంది నిస్సహాయులైన ఆడవాళ్ళ వెంట అర్జునుడు ఒక్కడే యోధుడు ఉండటం చూసి కొందరు దొంగలు కర్రలు తీసుకుని, రాళ్ళు రువ్వుతూ ఆడవాళ్ళ పైన పడ్డారు. అర్జునుడు వాళ్ళను భయ పెట్టాడు, కాని వాళ్ళు అతని మాటలు లక్ష్య పెట్టలేదు. అర్జునుడు తన గాండీ





వాన్ని ఎక్కుపెట్టటమే ఎంతో కష్టమయింది. తరవాత అతనికి అస్త్రాలేవీ జ్ఞాపకం రాలేదు. అతను దొంగలను ఏమీ చెయ్యలేక సిగ్గు పడవలసి వచ్చింది. అతను చూస్తూండగానే దొంగలు యాదవ స్త్రీలను నాలుగు దిక్కులకూ తీసుకుపోయారు. దొంగలు ఎత్తుకుపోగా మిగిలిన స్త్రీలనూ, ధనాన్నీ తీసుకుని అర్జునుడు కురుక్షేత్రం ప్రవేశించాడు.

ధర్మరాజు నిర్ణయించిన మీదట కృతవర్మ భార్యనూ, కొడుకునూ మార్తికావతం లోనూ, చిన్న పిల్లలనూ, స్త్రీలనూ, ముసలి వాళ్ళనూ, ఇంద్రప్రస్థంలోనూ, సాత్యకి కొడుకును సరస్వతిలోనూ ఉంచి వజ్రుణ్ణి ఇంద్రప్రస్థానికి రాజుగా చేశారు. అక్రూరుడి భార్యలను వజ్రుడి రక్షణలో ఉంచారు.

కృష్ణుడి భార్యలలో రుక్మిణి మొదలైన వారు అగ్నిప్రవేశం చేయగా, సత్యభామ మొదలైన వారు అడవికి వెళ్ళి తపస్సు చేసుకున్నారు.

తరవాత అర్జునుడు వ్యాసుడి ఆశ్రమానికి వెళ్ళాడు. అతన్ని చూడగానే వ్యాసుడు, "అర్జునా, ఇంత దీనంగా కనబడుతున్నావు, ఏం జరిగింది?" అని అడిగాడు.

దానికి అర్జునుడు, "మహాత్మా, నాకు విచారం ఎందుకు ఉండదు? కృష్ణుడూ, బలరాముడూ చనిపోయారు. మునుల శాపం తగిలి యాదవులందరూ నశించారు. ఎలాటి శస్త్రాల దెబ్బలకైనా తట్టుకోగల మహావీరులు తుంగగడ్డితో కొట్టుకుని చచ్చిపోయారు. ఇదంతా నాకు చాలా బాధ కలిగించింది. కృష్ణుడు లేని ఈ లోకంలో నేను ఎలా ఉంటానో తెలియటం లేదు. ఇది ఇలా ఉండగా ఇంతకన్న దారుణం జరిగింది. నా పరాక్రమం అంతా పోయింది. దొంగలు యాదవ స్త్రీలను ఎత్తుకు పోతూ వుంటే నేను వాళ్ళను వారించలేకపోయాను. నా మనసు వికలంగా ఉన్నది. శాంతి కలగటం

లేదు. నేను కాలుకాలిన పిల్లిలాగా తిరుగుతున్నాను. నేను ఏం చెయ్యాలి?'' అని అడిగాడు.

''అర్జునా, వృష్ణి, అంధకులు శాపం తగిలి నశించారు. వారి కోసం విచారించకు. కృష్ణుడు దాన్ని ఆపగలిగి ఉండి కూడా చూస్తూ ఊరుకున్నాడు. శాపం తప్పించటం అతనికి మాత్రం సాధ్యమా? కృష్ణుడు అవతరించిన పని పూర్తి అయింది. అతను తన స్వస్థానానికి వెళ్ళిపోయాడు. నువు కూడా భీమనకులసహ దేవులతో కలిసి అనేక మహత్కార్యాలు చేశావు. మీరు కృతార్థులైనారనే నా నమ్మకం. మీరు కూడా త్వరలోనే ఉత్తమగతికి పోతారు. కాలం మారుతూ, అన్నిటినీ మార్చుతుంది. ప్రపంచమే కాలానికి అధీనమై ఉన్నది. కాలం ఒకప్పుడు మనని శాసిస్తుంది, మరొకప్పుడు మనం చెప్పినట్టు వింటుంది. నీ అస్త్రాలకు పని తీరిపోయింది. అవి పోయాయి,'' అన్నాడు వ్యాసుడు.

అర్జునుడు హస్తినాపురానికి తిరిగి వెళ్ళి, ధర్మరాజుతో తాను ద్వారకలో చేసినదంతా చెప్పాడు.

అంతా విన్నమీదట ధర్మరాజుకు మహాప్రస్థానం చెయ్యాలన్న ఆలోచన కలిగింది. ఆయన అర్జునుడితో, ''తమ్ముడా, కాలం అన్ని ప్రాణులను బంధిస్తుంది,'' అన్నాడు.

పాండవులందరికీ రాజ్యత్యాగం చేసి, మహాప్రస్థానం పోవాలన్న కోరిక కలిగింది. ధర్మరాజు యుయుత్సుణ్ణి పిలిచి అతనికి రాజ్యం ఇచ్చాడు. తన రాజ్యానికి పరీక్షిత్తును రాజుగా చేశాడు. హస్తినాపురానికి పరీక్షిత్తూ, ఇంద్రప్రస్థానికి వజ్రుడూ రాజుగా ఉండేటట్టు ఏర్పాటు జరిగింది. ఇద్దరినీ కనిపెట్టుకుని ఉండమని ధర్మరాజు సుభద్రకు చెప్పి, ద్వారకలో చనిపోయిన కృష్ణుడూ, బలరాముడూ, వసుదేవుడూ, సాత్యకీ, ప్రద్యుమ్నుడూ మొదలైన వారికందరికీ శాస్త్రోక్తంగా శ్రాద్ధక్రియలు జరిపాడు.





# మహాభారతం

తరవాత ధర్మరాజు విందుభోజనాలతో ఋషులను తృప్తిపరచి, కృష్ణుడి తరఫున గొప్ప దానాలు చేశాడు; పరీక్షిత్తును కృపుడికి శిష్యుడుగా ఇచ్చేశాడు; తన మంత్రులను పిలిచి తాను మహాప్రస్థానం చెయ్యబోతున్నట్టు చెప్పాడు; వాళ్ళు అభ్యంతరాలు చెబితే, వారిని ఎలాగో ఒప్పించాడు.

తరవాత పంచపాండవులూ ద్రౌపదీ తమ అభరణాలన్నీ తీసేసి, నారబట్టలు ధరించారు; తమ అగ్నులన్నిటినీ నీట గలిపి, బయలుదేరారు. ఆ స్థితిలో వాళ్ళను చూస్తూ ఉంటే, జూదంలో ఓడి వారు వనవాసం బయలుదేరటం గుర్తుకు వచ్చి, పౌరస్త్రీలు దుఃఖించారు. కాని పాండవులు మాత్రం ఏ మాత్రమూ చింతించలేదు.

వాళ్లు నగరం దాటి పోతూంటే కుక్క ఒకటి వారి వెంట బయలుదేరింది. కుక్కతో సహా ఏడుగురూ మహాప్రస్థానం బయలుదేరారు. వాళ్ళ ఉద్దేశాన్ని మార్చే ఉద్దేశంతో కొందరు పౌరులు వారి వెంట కొంతదూరం వెళ్ళి, వెనక్కు తిరిగారు. ద్రౌపదితో సహా పాండవులు వెళ్ళిపోయే సరికి ఉలూపి గంగానదిలోకి, చిత్రాంగద మణిపురానికి వెళ్ళిపోయారు. పాండవుల మిగిలిన భార్యలు పరీక్షిత్తు వెంట ఉండి పోయారు.

ముందుగా పాండవులు తూర్పు దిక్కుగా, ఒకరి వెనక ఒకరు నడుస్తూ,

66. స్వర్గా హణ



ప్రయాణించారు. వాళ్ళు అనేక దేశాలూ, నదులూ దాటి కాలక్రమాన లౌహిత్యం అనే సముద్రాన్ని చేరారు.

అర్జునుడు యీ మహాప్రస్థానంలో ఇంకా తన గాండీవాన్నీ, అక్షయతూణీరాలనూ తన వెంటనే ఉంచుకుని ఉన్నాడు.

వారి దారిలో అగ్నిదేవుడు కొండలాటి శరీరంతో ఎదురు తగిలి, ''పాండవులారా, నేను అగ్నిదేవుణ్ణి. అర్జునుడికి ఇక గాండీవంతో పనిలేదు. దాన్ని అతను వదలిపెట్టాలి. ఇది వరుణుడిది. దీన్ని వరుణుడికి తిరిగి ఇచ్చెయ్యాలి,'' అన్నాడు.

అర్జునుడు మిగిలిన వాళ్ళు చెప్పిన మీదట తన గాండీవాన్నీ, అక్షయతూణీరాలనూ సముద్రంలో పడేశాడు.

తరవాత పాండవులు దక్షిణంగా తిరిగి, సముద్ర తీరం వెంబడి నైరృతీ దిశగా నడిచి, పడమరకు తిరిగారు. సముద్రంలో మునిగిన ద్వారక వారికి కానవచ్చింది. అక్కడి నుంచి వారు ఉత్తరంగా నడిచారు. వారికి హిమాలయాలు తగిలాయి; వాటిని దాటి వెళ్ళగా వారికి మేరు పర్వతం కనిపించింది.

ఇలా వారు నడుస్తూ ఉండగా, దారిలో ద్రౌపది చచ్చిపడిపోయింది. భీముడు ఆ సంగతి ధర్మరాజుకు చెప్పేసరికి, ధర్మరాజు వెనక్కు తిరిగి అయినా చూడకుండా ముందుకు సాగాడు.

తరవాత కొంతసేపటికి సహదేవుడు పడిపోయాడు. ఇలా వరసగా నకులుడూ, అర్జునుడూ కూడా పడిపోయిన సంగతి భీముడు ధర్మరాజుకు తెలిపాడు. తరవాత భీముడు కూడా తాను పడిపోతున్నానని చెప్పి, పడిపోయాడు. ధర్మరాజు మాత్రం వెనక్కు తిరిగి చూడకుండా ముందుకు సాగాడు. కుక్క మాత్రం ధర్మరాజు వెనకగా నడుస్తూనే ఉన్నది.

కొంతసేపటికి పెద్ద మోతతో ఇంద్రుడు తన రథంలో వచ్చి, ధర్మరాజును

ఆ రథంలో ఎక్కమన్నాడు. ధర్మరాజు ఇంద్రుడితో, "నా తమ్ములంతా చని పోయారు గదా! వారు కూడా నాతో రావాలి. ద్రౌపది కూడా మా వెంట ఉండాలి. ఇందుకు సమ్మతించు. వాళ్లు లేకుండా నేను స్వర్గానికి పోగోరను." అన్నాడు.

దానికి ఇంద్రుడు, "వాళ్ళందరూ తమ శరీరాలను వదిలిపెట్టి ఇదివరకే స్వర్గానికి చేరారు. నీకు బొందితో స్వర్గం లభిస్తున్నది." అన్నాడు.

"అయితే, ఈ కుక్క ఎంతో విశ్వాసంతో నా వెంట వస్తున్నది. దాన్ని కూడా స్వర్గానికి తీసుకు పోవాలి." అన్నాడు ధర్మరాజు.

"నా అంత వాడివై స్వర్గానికి పోతున్న నీకు ఇంకా ఈ కుక్కతో ఏం పని? దీన్ని విడిచిపెట్టు." అన్నాడు ఇంద్రుడు.

ధర్మరాజు అందుకు ఒప్పుకోలేదు. కుక్కలకు స్వర్గంలో చోటు లేదని ఇంద్రుడు ఎన్నివిధాలుగా చెప్పినా ఆయన వినిపించుకోలేదు.

అప్పుడు కుక్క రూపంలో ఉన్న యముడు ధర్మరాజు ముందు ప్రత్యక్షమై, "నిన్ను వనవాసమప్పుడు యక్షుడి రూపంలో ఒకసారి పరీక్షించాను. ఇప్పుడు మళ్ళీ కుక్క రూపంలో పరీక్షించాను. నీతో సమానుడు స్వర్గంలో కూడా లేడు. శరీరంతో నువు ఉత్తమ లోకాలకు పోగలవు." అన్నాడు.





సంబంధాలను విడిచిపెట్ట వేమిటి? నీ తమ్ములు ఉత్తమలోకాలకు పోలేదు. ఈ స్వర్గాన్నీ, దేవతలనూ, సిద్ధులనూ, దేవఋషులనూ చూడు!'' అన్నాడు.

''నా తమ్ములను విడిచి ఉండలేను. వాళ్ళూ, ద్రౌపదీ, మా కొడుకులూ ఎక్కడ ఉంటే నేను అక్కడికే పోతాను,'' అన్నాడు ధర్మరాజు.

స్వర్గానికి చేరుకున్న ధర్మరాజు అక్కడ ఉత్తమాసనం మీద కూర్చుని, దేవతల మధ్య వెలిగిపోతున్న దుర్యోధనుణ్ణి చూశాడు. ఆయనకు వెంటనే అసూయపుట్టి, అక్కడి నుంచి వెనక్కు తిరిగి, ''లోభి అయిన ఈ దుర్యోధనుడితో బాటు నాకు స్వర్గసుఖాలు వద్దు,'' అన్నాడు.

నారదుడు నవ్వి, ''రాజా, స్వర్గంలో పాతపగలు విడిచిపెట్టాలి. ఈ దుర్యోధనుడు వీరమరణం పొంది, స్వర్గం సాధించుకున్నాడు,'' అన్నాడు.

దానికి ధర్మరాజు, ''సమస్త పాపాలకూ ఒడిగట్టిన ఈ దుర్యోధనుడికి స్వర్గం లభిస్తే, మహాపుణ్యాత్ములైన నా తమ్ములకు ఏ ఉత్తమ లోకాలు లభించాయో నేను తెలుసుకోవాలి. ధృష్టద్యుమ్నుడూ, అభిమన్యుడూ, ఉపపాండవులూ మొదలైనవారు ఎక్కడ

ఇంద్రుడూ, యముడూ, మరుత్తులూ, అశ్వినీదేవతలూ, ఇతర దేవతలూ ధర్మరాజును రథంలో కూర్చొబెట్టి, తమ విమానాలలో ఆయన వెంట బయలుదేరారు.

''ఎందరో రాజర్షులు ఉత్తమ లోకాలకు వచ్చారు గాని, బొందితో ఇలా వస్తున్న ధర్మరాజుకు ఎవరూ సాటి కారు,'' అని నారదుడు అన్నాడు.

"సుఖమైనా, దుఃఖమైనా నా తమ్ములు లేని స్థానం నాకు అవసరం లేదు,'' అన్నాడు ధర్మరాజు.

ఇంద్రుడు ఆయనతో, "రాజా, ఉత్తమలోకాలకు పోతున్నా నువు మానవ

ఉన్నారో నేను చూడాలి,'' అని నారదుడితో అన్నాడు.

కర్ణుడూ, తన కోసం యుద్ధంలో ప్రాణా లర్పించిన రాజులూ స్వర్గంలో కనిపించక పోవటం చూసి ధర్మరాజు ఆశ్చర్య పోయాడు. ఆయన అలా అనటం విని, '' వారున్న చోటికే పద. నీ యిష్టప్రకారం జరపమని ఇంద్రుడు మాకు అజ్ఞ ఇచ్చాడు,'' అన్నారు దేవతలు. వాళ్ళు ఒక దూతను పిలిచి, ధర్మరాజుకు ఆయన కోరిన వారందరినీ చూపమన్నారు. ఆ దూత ధర్మరాజుతో, భీముడు మొదలైన వారున్న చోటికి బయలుదేరాడు.

వాళ్ళు వెళ్ళే దారిలో పాపులున్నారు. మార్గం నడవడానికి ఏమీ సుఖంగాలేదు. దారినిండా నెత్తురూ, మాంసమూ ఉన్నాయి. ఈగలూ, దోమలూ ముసురుతున్నాయి. ఎటు చూసినా జుట్టూ, ఎముకలూ, క్రిమికీటకాలూ, మంటలూ ఉండి భయంకరంగా కనబడుతున్నాయి. దారిలో సెగలు కక్కుతున్న వేడినీరు గల నది కనిపించింది.

ధర్మరాజు తన ముందు నడిచే దేవదూతతో, '' ఇలా మనం ఇంకా ఎంత దూరం వెళ్ళాలి ? '' అన్నాడు.

'' నీకు శ్రమగా ఉన్నట్టున్నది. తిరిగి పోదాం. ఇక ముందు నడవ దగిన దారి కూడా లేదు,'' అన్నాడు దేవదూత.

ధర్మరాజుకు నిరాశతో బాటు, దుర్గంధం మూలంగా తల తిరిగిపోయింది.





స్వర్గసుఖాలు అనుభవిస్తున్నాడు? ఇదంతా ఏమిటి? నేను నిద్రపోతున్నానా? మేలుకుని ఉన్నానా? నాకు పిచ్చిగాని పట్టిందా?'' అని రకరకాలుగా బాధపడ్డాడు. ఆయనకు దేవతల మీదా ధర్మం మీదా అమితమైన కోపం వచ్చి తిట్టి పోశాడు. తరవాత ఆయన దేవదూత కేసి తిరిగి, ''నువు ఎవరి దూతవో వారి దగ్గిరికిపో. నేను వారి వద్దకు రానని చెప్పు. నేను నా సోదరులను విడిచి రాను. నా రాకతో వాళ్ళు కాస్త సుఖపడుతున్నారు,'' అన్నాడు.

దేవదూత ఇంద్రుడి వద్దకు తిరిగి వెళ్ళి జరిగిన సంగతి చెప్పాడు.

ఇంతలో కొన్ని గొంతులు దీనంగా, ''ధర్మరాజా, నువు రావటం వల్ల మాకు కాస్త సుఖంగా ఉన్నది. రెండు ఘడియలు ఆగు,'' అనటం వినిపించింది.

''మీరంతా ఎవరు?, ఎందుకిక్కడ ఉన్నారు?'' అని ధర్మరాజు ఆ కంఠాలను అడిగాడు.

''నేను కర్ణుణ్ణి! నేను భీముణ్ణి! నేను అర్జునుణ్ణి! నేను నకులుణ్ణి! నేను సహదేవుణ్ణి! నేను ద్రౌపదిని!'' అని ఆ గొంతులు సమాధానమిచ్చాయి.

ఇది విని ధర్మరాజు తనలో, ''ఈ పుణ్యాత్ములంతా ఏ పాపాలు చేశారు? ఏ పుణ్యం చేసి దుర్యోధనుడు

ధర్మరాజు రెండు ఘడియలపాటు అక్కడే ఉండి పోయాడు. ఇంతలో ఇంద్రుడు మొదలైన దేవతలు అక్కడికి వచ్చారు. వారు రాగానే అక్కడి చీకటి అంతా పోయింది. పాపుల ఆక్రందనలు పోయాయి. వైతరణి అదృశ్యమయింది. సుఖమైన వాయువులు వీచి, సువాసనలు వచ్చాయి.

ఇంద్రుడు ధర్మరాజుతో, ''ధర్మరాజా, నీ ప్రవర్తనను దేవతలు మెచ్చారు. ఇక చాలు, వచ్చెయ్యి. నువు సిద్ధి పొందావు. నీకూ, నీ తమ్ములకూ ఉత్తమ లోకాలు కలుగుతున్నాయి. కోప్పడవద్దు.

రాజైనవాడు నరకం చూడక తప్పదు. ప్రతి వ్యక్తీ తాను చేసిన పుణ్యపాపాలలో ముందు పుణ్యం అనుభవిస్తే తరవాత పాపం అనుభవించక తప్పదు. అలాగే ముందు పాపం అనుభవించిన వాడు తరవాత పుణ్యం ఫలితం పొందుతాడు. తక్కువ పాపం చేసినవాడు ముందుగా నరకం అనుభవిస్తాడు. అందుకే నిన్ను ముందు నరకానికి పంపాను. నీ తమ్ములూ, ద్రౌపదీ కూడా తాము చేసుకున్న కొద్ది పాపానికి నరకం అనుభవించారు. వారికి పాపవిముక్తి కలిగింది. ఇప్పుడు నీ వారంతా స్వర్గంలో ఉంటారు. వచ్చి చూడు. నీవు కర్ణుణ్ణి గురించి కూడా అదుర్దాపడుతున్నావు. అతనికి కూడా స్వర్గప్రాప్తి కలిగింది. నువు రాజులు సంపాదించే కన్న ఎక్కువ పుణ్యం సంపాదించావు. హరిశ్చంద్రుడూ, మాంధాతా, భగీరథుడూ, దుష్యంతుడి కొడుకైన భరతుడూ పొందిన స్థానాలు నీకు లభిస్తున్నాయి. ఇదుగో ఆకాశగంగ. ఇందులో స్నానం చేశావంటే నీ మానవ భావాలన్నీ పోతాయి,'' అన్నాడు.

ధర్మరాజు ఆకాశగంగలో తన మానవ శరీరాన్ని విడిచిపెట్టి, తిన్నగా తనవా రున్న చోటికి వెళ్ళాడు. అక్కడ ఆయ నకు కృష్ణుడు కనిపించాడు. అతను ఇప్పుడు కూడా గుర్తించదగిన రూపం లోనే ఉన్నాడు. అర్జునుడు కృష్ణుడి వెంటనే ఉన్నాడు. ధర్మరాజును చూసి వాళ్లు గౌరవంగా ఆయనను సమీపించారు.

ఇంకొకచోట ఆదిత్యులలాగా ప్రకాశిస్తూ కర్ణుడు కనిపించాడు. భీముడు పూర్వపు రూపంలోనే మరుద్గణాల మధ్య కాన వచ్చాడు. అలాగే నకులసహదేవులు అశ్వినీదేవతల స్థానంలో కనిపించారు.

ఇంద్రుడు ధర్మరాజుకు ద్రౌపదినీ, ఆమె కొడుకులనూ, ధృతరాష్ట్రుణ్ణీ, అభి మన్యుణ్ణీ, పాండురాజునూ, కుంతీమా ద్రులనూ, భీష్మద్రోణులనూ, ఇతర యోధులనూ చూపించి, వారిని గురించి వివరాలుచెప్పాడు. —(అయిపోయింది)

